తెలుగు అకాడమి ప్రచురణ (బి.ఎ.) - 143



# భారతదేశ కళలు - శిల్పకళలు

(ART AND ARCHITECTURE OF INDIA)

రచయితలు

శ్రీ డి. సుబ్రహ్మణ్య రెడ్డి

చరిత్ర శాఖ, జవహర్ భారతి, కావలి.

Dr. DEVIREDDY SUBRAMANYAM REDDY
M.A., M.Phil., Ph.D.
Associate Professor
Department of History
Sri Venkateswara University
TIRUPATI - 517 502 (A.P.) INDIA



సంపాదకులు

ప్రొ. వి. కామేశ్వర రావు

చరిత్ర శాఖాధ్యక్షులు, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి



తెలుగు అకాడమి

హైదరాబాదు

1992



B.A., Bharathadesa Kalalu - Silpa Kalalu ; Author : Sri D. Subrahmanya Reddi
First Edition, 1992 pp viii + 198.



*First Published, 1992*
*Copies : 3000*

Published by Telugu Akademi, Hyderabad - 500 029 (Andhra Pradesh) under the centrally sponsored scheme of production of Books and Literature in Regional Languages at the University level of the Government of India in the Ministry of Human Resource Development, New Delhi.



[redacted]

Printed in India
Lasertypeset at M/s. Frontier Information Technologies, Hyderabad
Printed at M/s. Tirumala Comprints Pvt. Ltd., Hyderabad
Andhra Pradesh

# భూమిక

1968లో స్థాపన జరిగిన నాటి నుంచి ఉన్నత స్థాయిలో బోధన భాషగా తెలుగు స్థిరపడటంలో తెలుగు అకాడమి నిర్వహిస్తున్న పాత్ర అందరికీ విశదమైందే. ఎన్నో రకాల ఇబ్బందులను అధిగమిస్తూ అత్యంత స్వల్ప వ్యవధానంలో విస్తృతంగా పాఠ్య, పఠనీయ, అనువాద, పరామర్శ గ్రంథాలను శాస్త్ర నిఘంటువులను, జనరంజక గ్రంథావళిని ప్రచురించి అకాడమి విద్యారంగానికి సముచితమైన సేవ చేయగల్గింది. అకాడమి ప్రచురణలు ఎన్నో పునర్ముద్రణ కూడ పొందాయి. పునరభ్యసన గోష్ఠుల ద్వారాను, విద్యార్థులు, అధ్యాపకులు మిగుల ఆసక్తితో చేస్తున్న సూచనల ద్వారాను, ఎప్పటికప్పుడు ఈ గ్రంథాలను మెరుగు పరచడంలో గూడ కృషి జరుగుతూనే వచ్చింది. వీటితో పాటు నూతన రంగాలకు సంబంధించి కొత్త గ్రంథాలను ప్రచురించే కార్యక్రమం కూడ అకాడమి తన సామాజిక బాధ్యతగా గుర్తించి చేపట్టడం జరిగింది.

1987లో రాష్ట్రంలోని అనేక విశ్వవిద్యాలయాలు డిగ్రీ స్థాయిలో ఉమ్మడి పాఠ్య ప్రణాళికను రూపొందించుకొని, ఉమ్మడి పాఠ్య ప్రణాళిక ప్రకారం బి.ఎ. మొదటి సంవత్సరం నుంచి పాఠ్యాంశాల బోధనను అమలు చేసాయి. అందువల్ల ఉమ్మడి పాఠ్య ప్రణాళికను అనుసరించి వివిధ శాస్త్రాలలో పాఠ్య గ్రంథాలను అనుభవజ్ఞులైన కళాశాల ఉపాధ్యాయులతో రచించగా, విశ్వవిద్యాలయాచార్యులు, ఇతర నిపుణులు సంపాదకత్వం వహించి రూపుదిద్దే కార్యక్రమం ఆరంభమయింది.

ఈ కార్యక్రమంలో భాగంగా ఉమ్మడి పాఠ్య ప్రణాళిక ప్రకారం చరిత్రలో బి.ఎ. (ఆర్కియాలజి) విద్యార్థుల ఉపయోగార్థం భారతదేశ కళలు - శిల్పకళలు పుస్తకం రాయించడం జరిగింది. ప్రస్తుత గ్రంథ ప్రచురణలో మాకు తోడ్పడిన రచయితలకు, సంపాదకులకు, నిపుణులకు, ముద్రాపకులకు మేము కృతజ్ఞులం.

ఈ గ్రంథం కూడ మా పూర్వ ప్రచురణ వలెనే అందరి ఆదరాభిమానాలు సంపాదించ గలదని విశ్వసిస్తున్నాం. ఈ పుస్తకాన్ని ఇంతకన్నా సమగ్రంగాను, సుందరంగాను తీర్చిదిద్దడానికి సహృదయంతో సూచనలిస్తే కృతజ్ఞతతో స్వీకరించగలం.

# ప్రవేశిక

చరిత్రలో భారత దేశపు కళలకు ఒక విశిష్టత ఉంది. మన ప్రాచీన వాస్తుశిల్ప కళకు ప్రధానమైంది హరప్ప శిల్పకళ. ప్రాచీన కాలం నుండి మధ్య యుగం వరకు చెందిన శిల్ప కళల్లో ఆకాలపు సంపూర్ణమైన, సచేతనమైన జీవం ప్రతిబింబిస్తుంది. బౌద్ధ, జైన, వాస్తు శిల్ప కళల్లో ముఖ్యమైనవి స్తూపాలు, చైత్యాలు, విహారాలు, గుహాలయాలు.

క్రీ.శ. 7వ శతాబ్ది నుండి క్రీ.శ. 15వ శతాబ్దం వరకు (మధ్య యుగానికి) చెందిన వాస్తు శిల్పాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. రాజపుత్రులు, చాళుక్యులు, చోళులు, పల్లవులు, కాకతీయులు, విజయనగర రాజుల వాస్తు శిల్పకళ వాటిల్లో చెప్పుకోదగ్గవి.

ముస్లింల రాకతో భారత వాస్తు శిల్పకళలో మార్పులు సంభవించాయి. భారతీయ, విదేశీయమైన రీతులతో కూడిన మిశ్రమ రీతిని మొఘలులు అనుసరించారు. వారి కాలంలో శిల్పకళలు తారస్థాయికి చేరుకొన్నాయి. మొఘలుల తర్వాత అధికార స్థాపన చేసిన ఆంగ్లేయులు కళలపై శ్రద్ధ కనపరచలేదు. ఆంగ్లేయుల కాలంలో రూపొందిన కళలో సాంకేతిక లోపం, కల్పనాశక్తి లోపం, పతన దశ పాశ్చాత్య ప్రభావాలు కనబడతాయి.

ఈ విధంగా ప్రాచీన కాలం నుండి ఆధునిక కాలం వరకు వాస్తు శిల్పకళల సాంప్రదాయాల గురించి ఈ గ్రంథంలో ప్రస్తావించడం జరిగింది.

# విషయసూచిక

# తప్పొప్పుల పట్టిక

| పేజీ | | పేరా | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|
| 1 | – | 1 | 7 | జోడ్రోషియా | గెడ్రోషియా |
| 16 | – | 1 | 2 | 'కుస' | 'కుశ' |
| 37 | – | 1 | 2 | uper | upper |
| 37 | – | 1 | 6 | faes | faces |
| 43 | – | 3 | 7 | వస్రం | వస్త్రం |
| 70 | – | 2 | 7 | ballustrade | balustrade |
| 83 | – | 8 | 4 | word not clear | వేదిక |
| 93 | – | 1 | 11 | అంఆరు | అంటారు |
| 105 | – | 2 | 1 | word not clear | కపోత |
| 140 | – | | | హూ | హో |
| 141 | – | 1 | 6 | dark talacose | dark terracose |

# సింధూ నాగరికతా కాలపు వాస్తు, శిల్ప కళ

భారతదేశ చరిత్రలో తొల్లి విశిష్ట నాగరకత సింధూ నది ప్రాంతంలో వెలసింది. ప్రాచీన భారత గ్రంథాలైన వేదాలు, రామాయణ మహాభారత మహాకావ్యాలు, పురాణాలు చూసాయగా సింధూ నాగరకతా వైభవాన్ని గూర్చి తెలుపుతున్నాయి. ఆర్యుల యుద్ధ దేవుడైన ఇంద్రుడు తన వజ్రాయుధంతో సింధూనదీ ప్రాంతంలోని దాస (స్వదేశీ ద్రవిడ జాతి) జాతి వారి నగరమైన 'హరియూపీయం'ను సర్వనాశనం చేసినట్లు తెలుస్తూంది. మన దేశంపై దండెత్తి వచ్చిన ప్రాచీన గ్రీకుల రచనల్లో ఈ నాగరకతా శిథిలాల గురించి తొలుత ప్రస్తావన చేసి ఉంది. సెమిరామిస్, సైరస్ అనే వారు జ్రోదేషియా ఎడారి ప్రాంతంలో తమ సైన్యాలను కోల్పోయారని అలెగ్జాండర్ కాలానికే ఒక కథ ప్రచారంలో ఉండేది. అలెగ్జాండర్ కాలం, ఆ తరవాతి కాలాలకు చెందిన గ్రీకు రచయితలు కూడా ఈ నాగరకతా శిథిలాల గురించి ప్రస్తావించి ఉన్నారు. "జనాలతో నిండి ఉన్న వేల కొద్ది నగరాలు, గ్రామాల శిథిలాలతో" ఈ ప్రాంతం నిండి ఉందని వారు తెలిపారు. కానీ వీటిని గురించి అనేక శతాబ్దాలు ఎవరూ పట్టించుకోలేదు.

రావి నది దగ్గర 1856 లో బ్రిటిష్‌వారు రైల్వే నిర్మాణాన్ని చేపట్టారు. ఈ సమయంలో దగ్గరలోని ఈ నాగరకతా శిథిలాల ఇటుకలను కంకర కోసం వాడినట్లు తెలుస్తుంది. ఇదే కాలంలో చిత్రరూపలిపి, జంతువుల బొమ్మల చెక్కడాలు గల సబ్బురాయి (steatile or soap stone) ముద్రణలు కనుక్కోవటం జరిగింది. తరవాత కొంతకాలానికి భారతదేశ పురావస్తు శాస్త్ర పితామహుడైన సర్ అలెగ్జాండర్ కన్నింగ్‌హాం ఈ హరప్పా ప్రాంత్నాన్ని సందర్శించి ఇక్కడ శిథిలాల ప్రాచీనతను గుర్తించారు. కాని ఎందువల్లనో దీనిపై కృషి కొనసాగలేదు.

చివరకు 1921-22 మధ్య భారత పురావస్తు శాఖకు చెందిన ఆర్. డి. బెనర్జీ సింధూ నాగరకతా కాలానికి చెందిన, 'మొహంజొదారో' ప్రాంతాన్ని, ఆర్.బి. దయారాంసాహ్ని 'హరప్పా' ప్రాంతాన్ని పరిశీలించిన తరవాత నాటి భారత పురావస్తుశాఖ అధికారైన సర్‌జాన్ మార్షల్ అధ్వర్యంలో ఈ ప్రపంచ ప్రసిద్ధి పొందిన ప్రాచీన వ్యాపార నగర నాగరకతా శిథిలాల తవ్వకం ప్రారంభమైంది. ఈ నగరాల 'తవ్వకం (ఉత్ఖాతనం)లో ఏడు పొరలు (layers or stratas) బయల్పడ్డాయి. అంటే ఏడు కాలాలకు చెందిన నాగరకత ఇక్కడ వెలసి ఉందని అర్థం. వీటిలో మొదటిది (కిందిపొర) సుమారు క్రీ.పూ. 3500 /3000 సంవత్సరానికి చెందినట్లు, ఆఖరిది

(పైపొర) క్రీ.పూ. 1వ శతాబ్దానికి చెందినట్లు పురావస్తు శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. ఈ ఏడు కాలాల్లో ఒక్కొక్క నాగరకతా కాలానికి మధ్య సుమారు 500 సంవత్సరాలు వ్యవధి ఉన్నట్లు తెలుస్తుంది. కింది పొర కింద కూడా ఇంకా ప్రాచీనమైన నాగరికత నిక్షిప్తమై ఉండవచ్చని కూడా ఒక అభిప్రాయం ఉంది. కానీ నీటి ఊటల వల్ల ఈ పొర తవ్వకం వీలుపడటం లేదు.

మొహంజొదారో, హరప్పా నగరాలు సింధూ నాగరికతా ముఖ్య కేంద్రాలైనట్లు తోస్తుంది. ఇవి ఆనాటి పాలనా వ్యవస్థకు కేంద్రాలై ఉండవచ్చని ఒక అభిప్రాయం ఉంది. నేటి పాకిస్తాన్‌లోని (స్వతంత్ర పూర్వ భారత దేశంలో) సింధూ రాష్ట్రంలో లార్ఖానా జిల్లాలో సింధూనది కుడివైపు ఒడ్డున మొహంజొదారో ఉంది. మొహంజొదారో అంటే మృతుల దిబ్బయని అర్థం. పశ్చిమ పంజాబు రాష్ట్రంలోని మాంట్‌గోమరి జిల్లాలో రావీ నది ఎడమవైపు ఒడ్డున 'హరప్పా' నగరం ఉంది. ఈ మహానగరాలు రెండూ దాదాపు 300 మైళ్ళ దూరంలో ఉన్నాయి. ఇవేగాక నేటి భారతదేశపు ఉత్తరప్రదేశ్‌లోని రూపార్, వారణాసి, గుజరాత్‌లోని సౌరాష్ట్రమండలి లోథాల్, రంగపూర్, పాకిస్తాన్‌లో మొహంజొదారో మొదలైన ప్రాంతాల్లోని శిథిల నగరాలు, గ్రామాలు ఈ నాగరకతా వ్యాప్తిని తెలుపుతున్నాయి. వీటిలో లోథాల్ ఆనాటి ఓడరేవు పట్టణం.

సింధూ నాగరకతా శిథిలాల తవ్వకాల బట్టి ఇది పశ్చిమాన మక్రాన్ తీరం నుంచి తూర్పు యమునానది ప్రాంతమండలి అలంఘీర్‌పురం, కాశి, వారణాసి, గంగానది లోయ ప్రాంతాల వరకు, ఉత్తరాన హిమాలయాల పాదాల నుంచి దక్షిణాన దిగువ నర్మదా నదీ లోయ ప్రాంతాలు, సౌరాష్ట్ర కచ్‌తీరం, కాండే గల్ఫ్ ప్రాంతాలవరకు వ్యాప్తి చెంది ఈజిప్టు, సుమర్ నాగరకతల కన్నా విశాలమైన ఉత్తర వాయవ్య భారతదేశ ప్రాంతాలకు వ్యాపించి ఉన్నట్లు తెలుస్తుంది. ఈ నాగరకతా శిథిలాల్లో నగరాలే ప్రధానంగా అగుపడతాయి. కాబట్టి దీన్ని నగర నాగరకత అని అంటారు. అంతమాత్రాన ఆనాడు గ్రామాలు లేవని అర్థం కాదు. ప్రజాజీవనానికి పట్టణాలు ముఖ్య కేంద్రాలై పట్టణావసరాలను పల్లెలు తీర్చేవి అని చెప్పవచ్చు. పల్లెలు కేవలం మట్టితో నిర్మించినందున పూర్తిగా రూపులేకుండా పోయాయి. కానీ సింధూనదికి, కీర్తార్ పర్వతాలకు మధ్య ప్రాంతాల్లో ఆనాటి నిర్మాణాల పునాదులు కొన్ని కనిపించాయి.

ఈ నాగరకతా కాలం నాటి తొలి మానవుడు పర్వత ప్రాంతాలను వదలి పల్లపు ప్రాంతాలకు చేరినట్లు తోస్తుంది. గ్రామీణ జీవన వ్యవస్థను కొంతవరకు వదలి నగర జీవన విధానాలను ఈ కాలపు నాటి మానవుడు చేపట్టాడు. వ్యవసాయ ఆర్థిక విధానం నుండి కొంత ఆధునికమైన వ్యవసాయ వ్యాపార వ్యవస్థలోనికి మార్పు చెందాడు.

సింధూనది, దాని దగ్గర ప్రాంతాల్లో ఈ నాగరకత అధికంగా కేంద్రీకృతమై ఉన్నందువల్ల దీన్ని సింధూనాగరకత అంటారు. దీని విశిష్టమైన శిథిలాలు హరప్పా ప్రాంతంలో లభించినందువల్ల దీన్ని హరప్పా నాగరకత (లేదా సంస్కృతి) అని కూడా పిలుస్తున్నారు. ఈ నాగరకతా కాలం వారికి పరిపూర్ణమైన రాత (లిపి) తెలియనందువల్ల వారికి చిత్రాలతో కూడిన చిహ్నాల లిపి లేదా చిత్ర రూప లిపి మాత్రమే తెలియటం వల్లను, ఇది ప్రాచీన యుగానికి గాని, చారిత్రకయుగానికి గాని చెందక

మధ్యస్థ యుగానికి చెందింది. కాబట్టి దీన్ని చారిత్రక ఆరంభ కాలం లేక మూలచారిత్రక యుగం (Proto-historic) నాగరకత అని కూడ పిలుస్తారు. దీనికే తామ్రశిలాయుగ(Chalcolithic) నాగరకత అని కూడా పేరు. దీని శిథిలాలను బట్టి ఇది క్రీ.పూ. 3000-1500 సంవత్సరాల మధ్య కాలంలో ఉజ్జ్వల దశలో ఉన్నట్లు తెలుస్తుంది.

ప్రపంచ ప్రాచీన నాగరకతలన్నింటికన్నా దీర్ఘకాలము వెలసింది మాత్రమే కాక, ఈజిప్టు, సుమర్ నాగరకతల కన్నా సువిశాల ప్రాంతాలకు వ్యాపించిన ఈ నాగరకత సుమారు క్రీ.పూ. 1500 ప్రాంతంలో పతనమైనట్లు తెలుస్తుంది. దీని పతనానికి పూర్తిగా స్పష్టమైన ఆధారాలు లేకున్నప్పటికీ, కొన్ని ముఖ్యకారణాలు కనపడతాయి. వీటిలో పశ్చిమం నుంచి భారతదేశంపై క్రీ.పూ. 1500 ప్రాంతాన జరిగిన ఆర్యుల దండయాత్ర ఒకటి. నేటి హరప్పా అయిన ఆర్య దండయాత్రా కాలం నాడు 'హరియూపీయం' గా పిలిచిన నగరాన్నే ఆర్యుల యుద్ధదైవమైన ఇంద్రుడు తన వజ్రాయుధంతో నాశనం చేసి అక్కడి స్వదేశీ జాతి 'వృచీ వంతులను (దాసులు లేక ద్రవిడులు) ఓడించినట్లు ఋగ్వేదం బట్టి తెలుస్తుంది. రెండో కారణం, సింధూనది వరదలై ఉండవచ్చు. వీటివల్ల ఇక్కడి నగరాలు భూమట్టమయి ఉండవచ్చు లేదా ఏదైనా ఇతర ప్రకృతి వైపరీత్యాలు ఏర్పడి ఈ నాగరకత పతనమై ఉండవచ్చు.

## సింధూ నాగరికతా కాలపు వాస్తుకళ

### వాస్తు సూత్రాలు

సింధూ నాగరకతా కాలం నాటి ప్రజలు నిర్దుష్టమైన వాస్తు సూత్రాలను అనుసరించినట్లు తెలుస్తుంది. వీరి నిర్మాణాలను పరిశీలిస్తే అవి శిల్పరహితమైనవిగా, ఉపయోగార్థ (utility) లౌకిక నిర్మాణాలుగా అగుపడతాయి. వీరు నిరంతరం వ్యాపార, నగరక్షణ విషయాల్లో మునిగి ఉన్నందువల్ల శిల్పకళలపై మనుస్సు కేంద్రీకరించలేకపోయారు. భౌతిక జీవనానికే(life of materialism) ప్రాధాన్యమిచ్చారు. అంటే వీరికి ఆధ్యాత్మిక చింతన లేదు (aesthetic aspirations or intution or convictions). కళపై శ్రద్ధ లేదు. వీరి నిర్మాణాలు అతి సాదాగా ఉండటం బట్టి ఇది తెలుస్తుంది. (వీరు బహుశా కొయ్య లేదా రంగు చిత్రాలను (mural decorations) రూపొందించి ఉండవచ్చు). కానీ అంతమాత్రాన వీరికి కళలు తెలియవని కాదు. ఆనాటి ముద్రణలు, శిల్పాలు, మట్టిపాత్రలు, బొమ్మలు వీరి కళా కౌశలాన్ని తెలుపుతున్నాయి. వీరి నిర్మాణాలన్నీ ఉపయోగాన్ని దృష్టిలో ఉంచుకొని నిర్మించినవే. మత సంబంధమైనవి కాదు. దేవాలయాలు వంటి నిర్మాణాలు లేకపోవటమే ఈ అభిప్రాయానికి కారణం.

### నిర్మాణాలకు వాడిన వస్తువు (Material used)

వీరు తమ నిర్మాణాలకు కాల్చిన ఇటుకలను వాడారు. ఇవి పెద్ద పరిమాణంలో దీర్ఘచతురస్రాకారం, అర్ధ వలయాకారం, వెడ్జ్‌షేప్‌డ్, లను ఆకారాల్లో ఉండేవి. వీటితో బాటు సున్నం,

రాతి పూత, లేదా జిప్సం వాడేవారు. స్నానఘట్టం వంటి వాటికి బిటుమెన్‌ను ఉపయోగించారు. వీరు లోహాన్ని, రాయిని నిర్మాణాలకు వాడలేదు. కిటికీలు, తలుపులు, పై అంతస్తుల నిర్మాణాలకు కొయ్యవాడారు. కానీ ఈ వస్తువుల వాడుక గాని, నిర్మాణ సూత్రాల ప్రభావం గాని సింధూ నాగరికత అనంతర కాల నిర్మాణాలపై పడలేదు. ఆనాడు వెదురు, కొయ్య, ఆకులు, గడ్డి మట్టితోనే నిర్మాణాలు దాదాపు పూర్తిగా జరిగినట్లు తెలుస్తుంది.

**నిర్మాణాల సాంకేతిక వివరాలు** (Techniques of Building)

ఇటుకతో కింద లావుగాను పోనుపోను పైన సన్నగా (tapering shape) కట్టడం చేయటం, "ఇంగ్లీష్ బాండ్" పద్ధతిలో ఇటుకలను కట్టడంలో అతికించటం, అర్ధచంద్రాకారతోరణం (corbelled arch), మురికి నీటి కాలువల (corbelled drain) నిర్మాణ విధానం, అంతస్తుల భవన నిర్మాణాల విధానాలు కూడా వీరికి తెలుసు.

**నగరాల రూపం**

ఉన్నత స్థాయి నగర నిర్మాణ విధానాన్ని (Advanvanced Urban (Town)Planning) తెలిపే మొహంజొదారో, హరప్పా వంటి సింధూ నాగరికతా కాలం నాటి నగరాలు ఎత్తైన కోటగోడలు, అగడ్తల మధ్య నిర్మితమయి ఉండేవి. ఈ నగరాలు విశాలమైన రహదార్లను కలిగి ఉన్నాయి. ప్రధాన వీధులు ఉత్తర దక్షిణాలుగాను, ఉప వీధులు తూర్పు పడమరలుగా ఉన్నాయి. వీటిలో తూర్పు వీధి విశాలంగా ఉన్నందున దీనికి చరిత్రకారులు రాజవీధి అని పేరు పెట్టారు. తూర్పు దక్షిణ వీధులు కలిసే కూడలిని "ఆక్స్‌ఫర్డ్ సర్కస్" అని కూడా పిలిచారు. ఈ వీధులు సుమారు 33 అడుగుల వెడల్పు (2.7 నుంచి 10.2 మీ) ఉన్నాయి. వీటిలో ఒకే సారి అనేక వాహనాలు, పాదచారులు పోవటానికి అనువుగా ఉన్నంత వెడల్పున్నది. ఈ వీధుల నిర్మాణ విధానం నగరాన్ని సుమారు 600×1200 అడుగులు గల పెద్దపెద్ద వ్యూహాలుగా విభజిస్తుంది. ఈ వ్యూహాల్లోను, ముఖ్య వీధుల నుంచి వచ్చి పోవటానికి సుమారు 5 నుంచి 10 అడుగుల వెడల్పు గల చిన్న వీధులున్నాయి. వీధులన్నీ మట్టితో నిర్మితమయ్యాయి. గచ్చు వేసే విధానం లేదు. వీధులకు ఇరువైపులా అంగళ్ళు, ఆఫీసులు లేదా వస్తు (ధాన్య) భద్రతా గదులు మొదలైనవి ఉన్నాయి. వ్యూహాల్లో నివాస భవనాలు మొదలైనవి ఉన్నాయి.

**నిర్మాణాల రకాలు**

సింధూ నాగరికతా కాలం నాటి మొహంజొదారో, హరప్పా వంటి నగరాల్లో నిర్మాణాలు భౌగోళికంగా రెండు రకాలుగా ఉన్నాయి. నగర పశ్చిమాన గల మిట్ట ప్రాంతాల్లో దుర్గం, అగడ్తలు, నగర తూర్పు విభాగపు పల్లపు ప్రాంతాల్లో నివాస భవనాలు ఉన్నాయి. ఈ కాలపు నిర్మాణాలను వాస్తు రీత్యా, మూడు భాగాలు చేయవచ్చు. అవి : (1) కోట, అగడ్త (కందకం), (2) నివాస భవనాలు, మురుగు నీటి కాలువలు, (3) ప్రజోపయోగ లేదా పౌర నిర్మాణాలు.

### కోట, అగడ్త (కందకం)

మొహంజొదారో, హరప్పా నగరాల చుట్టూ ఎత్తైన దీర్ఘచతురస్రాకార కోట నిర్మాణం ఉండేది. నగర తూర్పు భాగానికన్నా ఇది 43 అడుగుల ఎత్తులో ఉన్నట్లు తెలుస్తుంది. కోటకు 45 అడుగుల లావుపాటి మట్టి బేస్‌మెంట్ ఉంది. దీనిపైన గల గోడ కాల్చిన ఇటుకలతో నిర్మితమయి ఉంది. కోట వెలుపల భాగంలో కోట చుట్టూ అగడ్త ఉంది. దీనికి సింధు, రావి నదుల నుంచి నీరు వచ్చే ఏర్పాటు చేసి ఉంది. కోటగోడలకు అక్కడక్కడా ప్రవేశమార్గాలు కలిగి ఉన్నాయి. తవ్వకాల్లో బయల్పడిన కోట గోడ ఉత్తర దక్షిణాలుగా సుమారు 400 నుంచి 500 గజాలుతూర్పు పడమరలుగా 200 నుంచి 300 గజాలు ఉంది. కోటగోడ కింది భాగంలో లావుగాను పైకి పోనుపోను సన్నగాను ఉంది. కోటపైన అక్కడక్కడా బురుజులు ఉన్నాయి. కోట, అగడ్తలు నగర ప్రజలను శత్రువుల నుంచి, భయంకర జంతువుల నుంచి రక్షించేవి.

### నివాస భవనాలు

మొహంజొదారో, హరప్పా నగరాల వీధుల కిరువైపులా వరసగా ఒకే పద్ధతిలో ఒక దానినానుకొని మరొకటి ఉండేట్లు ఇండ్లు నిర్మించారు. కొన్ని ఇండ్ల మధ్య మాత్రం ఒక అడుగు స్థలం ఉంది. ప్రతి ఇల్లు శిల్పరహితంగా ఉంది. ఇండ్లన్నీ మృణ్మయ వేదికలపై నిర్మించి ఉన్నాయి. ఇండ్లు రెండు రకాలుగా ఉన్నాయి. కొన్ని సంపన్నుల ఇండ్లుగా మరికొన్ని కూలీల ఇండ్లుగా అగుపిస్తాయి. సామాన్యులవి రెండు గదులతోనే ఉన్నాయి. ఇవి హరప్పాలో కూడా ఉన్నాయి. సంపన్నులవి 4 నుంచి 8 గదులతో ఉన్నాయి. ఇవి 27×29 అడుగులు నుంచి 54×58 అడుగులు కొలతలను కలిగి ఉన్నాయి. వీటి ముఖద్వారాలు రహదారుల్లో గాక, సన్నటి వీధుల్లోకి ఉన్నాయి. ఈ పద్ధతి భద్రత, మరుగు కోసం అనుసరించినట్లు తెలుస్తుంది. ఇళ్ల పునాదులు ఎండిన ఇటుకలతోను, గోడలు కాల్చిన ఇటుకలతోను నిర్మించారు. వీటి మందం కింది భాగాన 13 1/2 మీటర్లు ఉండి పైకి పోను పోను సన్నగా ఉండి పై అంతస్తు భాగంలో 7 అడుగుల మందముంది. గోడలకు మట్టిపూత పూసే వారు. పై కప్పు చెక్కలు, కొయ్యదూలాలలతో రూపొందించారు. ఇంటి లోపలి, నేల భాగం మట్టితో చదును చేసి గట్టిపరచారు. తలుపులు కొయ్యతో చేశారు. ఇవి సుమారు 3 అ. 4 అం. వెడల్పు, దానికి రెండు రెట్లు ఎత్తు తో ఉన్నాయి. పెద్ద ఇండ్ల తలుపులు 7 అ. 10 అం. ఎత్తు ఉన్నాయి. ఇండ్లకు చిన్న గ్రిల్స్ వెలుతురు, గాలి కోసం ఏర్పరచారు. కిటికీలు అలబాస్టర్, మట్టి (pottery) తో రూపొందించారు. వీరి ఇండ్లకు స్తంభాలు తక్కువ.. ఉన్నవి కూడా చతురస్రం దీర్ఘచతురస్రంగా ఉన్నాయి. గుండ్రంగా ఉండవు. వీరు నిర్మాణాలకు రాతిని ఉపయోగించలేదు. పై అంతస్తులకు మెట్లు నిర్మితమయి ఉన్నాయి. పై అంతస్తు నుంచి కిందికి నీరు పోవడానికి గోడల మధ్యనే లావు పాటి నిలువు గొట్టాలను అమర్చారు. వీటి ద్వారా పైన ఉన్న మురికి నీరు కిందికి వచ్చి వీధిలోని మురికి కాలువలోకి పోవటానికి ఏర్పాటు ఉంది. ప్రతి ఇంట్లో వంట గది, స్నానపు గది, ధాన్యపు నిల్వ గదులు మొదలైనవి ఉన్నవి. స్నానపు గది ముందు భాగంలో ఉండేది. దీని నేల భాగపు మూలల్లో 'L' ఆకారం ఇటుకలు వాడారు. నీరు సులభంగా బయటికి వెళ్ళటానికి వీటి నేల భాగం ఏటవాలుగా రూపొందించి, గోడభాగంలో రంధ్రం ఏర్పరచి ఉంది. ఈ

విధానం సింధూ ప్రజల శుభ్రతా గుణాన్ని తెలుపుతుంది. పెద్ద ఇళ్ళు ముందువా లోగిళ్ల వలె మధ్యలో పెరడు గలిగి దాని చుట్టూ అయిదారు గదులుండేవి. పెద్దలోగిళ్లలో మరుగు దొడ్లుండేవి. ప్రతి ఇంటి చుట్టూ ప్రహరీ ఉండేది. దీని లోపలి భాగంలో ప్రతి ఇంటికీ ఒక బావి ఉండేది.

సామాన్యులు లేదా కూలీల ఇండ్లు రెండు గదులను కలిగి ఉండేవి. వెనకగది చిన్నది. ముందు గదిలో స్నానానికి వీలుగా ఇటుక వేదిక, నీటి గొట్టాలు ఉన్నాయి. కూలీల ఇండ్లన్నింటికీ కలిపి ఒకే బావి ఉండేది.

ఈకాలంనాటి బావులను వెడ్జ్‌షేప్‌డ్ ఇటుకలతో నిర్మించారు. బావిపైన బండమూత ఉండేది. బావులు సాధారణంగా రెండు మూడు అడుగులు మొదలుకొని ఏడు అడుగుల కొలత కలిగి ఉండేది.

లోథాల్ ప్రాంతంలో 3.6×2.7 మీటర్ల కొలతలున్న గదుల వరస బయల్పడింది. ఇవి దుకాణాలై ఉండవచ్చు.

## మురుగు నీటికాలువలు

వీరు నగరాల్లో ప్రతి వీధి, ఉపవీధులకు ఇరువైపులా ఇటుకలతో భూగర్భ మురికి కాలువలు నిర్మించారు. ప్రతి ఇంటిలో వాడిన నీరు మురికి కాలువల ద్వారా వీధుల్లోని మురికి కాలువల లోకి చేరేది. ఇది తిరిగి పెద్ద వీధుల మధ్యలో గల పెద్ద మురికి కాలువలోకి, చేరి చివరకు, నగరం వెలుపల నదిలో కలిసేది. ఈ కాలువల అడుగు భాగం గారతో గట్టిపరచారు. చిన్న కాలువలపై ఇటుకలు కప్పేవారు. పెద్ద కాలువలు రాతి పలకలు లేదా చెక్క దాలతో కప్పబడేవి. కాలువల్లోని చెత్త తీసి వేయటం కోసం అక్కడక్కడా కాలువలకు రంధ్రాలు (manholes) ఏర్పరచి ఉండేవి. చిన్న కాలువలు 2 1/2 అడుగుల వెడల్పు, 4 లేదా 5 అడుగుల లోతు ఉండేవి. పెద్దవి 18 అడుగులు వెడల్పు ఉండేవి. అర్ధ చంద్రాకార మురికి కాలవలను (Corbelled drain) కూడా వీరు నిర్మించే వారు. విశిష్టమైన వీరి మురికి కాలువల నిర్మాణం సమకాలీన నాగరకతా ప్రపంచంలో మనకు కనిపించదు. ఇవి వీరి శుభ్రతా గుణాన్ని తెలుపుతున్నాయి.

## ప్రజోపయోగ లేదా పౌర నిర్మాణాలు

స్నానవాటిక: మొహంజొదారో, హరప్పా నగరాల కోటల్లోని స్నానవాటిక నాటి వాస్తుకళా నైపుణ్యాన్ని తెలుపుతుంది. దీన్నే స్నాన ఘట్టం లేదా పుష్కరిణి అని కూడా పిలుస్తారు. మొహంజొదారో లోని స్నాన ఘట్టం ఉత్తర దక్షిణాలుగా 39 అ. పొడవు, తూర్పు పడమరలుగా 23 అ. వెడల్పు 8 అ. లోతు ఉంది. దీని రెండు కొసళ్లు మెట్లు కట్టి ఉన్నాయి. దీని అడుగు భాగాన 4 అ.ల మందంతో కాల్చిన ఇటుకల గచ్చు వేసి బిటుమెన్‌తో నీళ్లు భూమిలోకి ఇంకిపోకుండా వాటర్‌టైట్ చేసి ఉంది. దీని నాలుగు పక్క భాగాల్లో ఇటుకతో మూడు గోడలు ఒకదాని పక్క

మరొకటిగా నిలువుగా నిర్మించబడి ఉన్నాయి. దీని వల్ల నీరు భూమిలోనికి ఇంకిపోవుటానికి వీలు పడదు. రెండే మూడో గోడల మధ్య గల భాగంలో మట్టి కూర్చారు. ఈ స్నాన-వాటికలోని మురికి నీరు మురికి కాలువలో కలవడానికీ దీని నైరుతి మూల నుంచి మురికి కాలువ వరకు అర్థ చంద్రాకారంలో భూగర్భంలో మురికి కాలువ నిర్మించారు. స్నానఘట్టంలోకి మంచి నీరు రావటానికి ధగ్గరలోని బావితో దీన్ని కలిపి నీరు వచ్చే ఏర్పాటు ఉంది. దీనిలోకి వేడినీటిని పంపే ఏర్పాట్లు కూడా ఉండేవని పురావస్తు శాస్త్రజ్ఞుల అభిప్రాయం. పండగలు, శుభదినాలు, మత ఉత్సవాల కాలాల్లో ఈ కొలనులో స్త్రీ పురుషులు స్నానం చేసేవారు. కొలనుచుట్టూ రెండు అంతస్తుల వసారా ఉంది. దీని వెనుకగా మూడు వైపులా అనేక గదులు వరసగా ఉన్నాయి. ఇవి 9 1/2 అ. పొడవు 6 అ. వెడల్పు ఉండేవి. కొలనులో స్నానం చేయడానికి వచ్చిన వారు వస్తువులు భద్రపరచుకోడానికి, దుస్తులు మార్చుకోవడానికి, విడిగా స్నానం చేయటానికి ఇవి ఉపయోగపడేవి. ఈ గదుల్లో ప్రతి దాని లోపల నుంచి పై గదిలోకి మెట్లు ఉన్నవి. మరుగు కోసం గదులన్నింటికీ తలుపులుండేవి. ఇక్కడి స్నానఘట్టం మత సంబంధమైంది కూడా అయి ఉండవచ్చు. హరప్పా ప్రాంతంలో కూడా ఈ కొలనే కొద్ది తేడాతో ఉంది. ఇది 39 అ. పొడవు, 13 అ వెడల్పు, 8 అ. లోతు ఉంది. దీని గోడలు కూడా కాల్చిన ఇటుకలు, జిప్సం, సున్నం పూతలతో ఉన్నాయి. ఇది ప్రకృతి వైపరీత్యాలకు తట్టుకొని ఈనాటికీ 19 వ శతాబ్దపు నిర్మాణం వలె భ్రాంతి కలిగిస్తుంది. "సింధూ నగర నిర్మాణంలో స్నాన వాటిక అద్భుతమైన సాంకేతిక పరిజ్ఞానంతో నిర్మితమైన కళాఖండం" అని సర్‌జాన్ మార్షల్ చెప్పారు. హరప్పా స్నాన వాటిక దగ్గరే కుషాణ కాలపు స్తూపం, స్నానవాటిక ఉన్నాయి. దీని వల్ల సింధూ కాలపు స్నానవాటిక కూడా మతపరమైనదై ఉండవచ్చని భావిస్తున్నారు.

### ధాన్యాగారం

మొహంజొదారో, హరప్పా నగరాల కోటలో స్నాన వాటికకు దగ్గరగా ధాన్యాగారం ఒకటి బయట పడింది. ఇది ఆనాటి ప్రజల లేదా ప్రభుత్వాల దూరదృష్టికి నిదర్శనంగా భావించవచ్చు. వీటిలో ధాన్యం భద్రపరచి అతివృష్టి, అనావృష్టి కాలాల్లో వాడుకొన్నట్లు తెలుస్తుంది. హరప్పా ధాన్యాగారం 150 అ. పొడవు 80 అ. వెడల్పుతో 24 గదులతో ఉంది. గదుల పై కప్పు కొయ్యతో చేసి ఉంది. వీటి గోడలు కాల్చిన ఇటుకతో నిర్మించారు. రెండువరసల్లో ఒక్కొక్క వరసకు 6 చావడుల మంతున ఈ ధాన్యాగారం ఉంది. దీని ప్రతి గదికి గాలి, వెలుతురు కోసం చిన్న కిటికీలు ఉన్నవి. ఈ నిర్మాణం నదీ ముఖంగా ఉండటం వల్ల వీటిలోని మిగులు ధాన్యం దూరప్రాంతాలకు ఎగుమతి చేసేవారని భావించవచ్చు. దీన్ని ఆనుకొని ఎత్తైన వేదికలు ఉన్నవి. ఇవి బహుశా శకటాలలోని ధాన్యం దించుకొనటానికి, శకటాల్లోకి ధాన్యం ఎత్తుకొనటానికి వాడి ఉండవచ్చు.

### సభా భవనం

సింధూ నాగరికతా కాలం నాటి నిర్మాణాల్లో సభాభవనానికి ఒక ప్రముఖ స్థానం ఉంది. ఇది ధృడమైన 20 స్తంభాలతో నిర్మించి ఉంది. ఈ స్తంభాలు 4 వరసలుగా, ఒక్కొక్క వరసలో 5

స్తంభాల చొప్పున ఉన్నవి. ఇవి సుమారు 25 అ. ఎత్తు ఉన్నవి. ఈ నిర్మాణం 85 అడుగుల చతురస్రాకారంలో ఉంది. దీని ముందు భాగాన ఒక వేదిక, దానిపై ఒక ఆసనం ఉంది. దీన్ని ఎవరు, దేనికి వాడారో స్పష్టంగా తెలియటం లేదు. ఇది ప్రభుత్వాధినేత, లేదా పట్టణాధికారిదో ప్రజా ప్రతినిధుల సభాభవనమో, ప్రభుత్వ భవనమో అయి ఉండవచ్చని ఒక అభిప్రాయం ఉంది. ఇంకా కొందరు ఇది మతపరమైన భవనమని దీన్ని ప్రార్థనామందిరంగా గాని, మతాధిపతి భవనంగా గాని వాడి ఉంటారని భావిస్తున్నారు. ఇది బహుళ ప్రయోజన కారిగా కూడా ఉండవచ్చని ఒక అభిప్రాయం ఉంది. కానీ నాటి పాలనా వ్యవస్థ గురించి కాని, మత నిర్మాణాల గురించి గాని వివరాలు లభించనందువల్ల గట్టి అభిప్రాయమేదీ చెప్పడానికి కష్టంగా ఉంది.

**ఓడరేవు (dock)**

సింధూ నాగరకతా కాలపు నిర్మాణాలలో గుజరాత్‌లోని సౌరాష్ట్రంలో ఉన్న లోథాల్ ఓడరేవు కూడా విశిష్టమైయింది. ఇది భారతదేశ తొలి ఓడరేవుగా భావించవచ్చు. ఇది కాల్చిన ఇటుకలు పరచి 710 అడుగుల పొడవుగా ఉన్నది. ఈ ఓడరేవు ద్వారానే మెసపటేమియా ప్రాంతాలతో నాడు వ్యాపారం జరుగుతున్నట్లు తెలుస్తుంది. ఈ నౌకా వ్యాపారం బహ్రెయిన్ దీవులు మీదుగా సాగుతున్నట్లు కొన్ని శాసన ముద్రణలను బట్టి తెలుస్తుంది. నాటి నౌకాయానం గురించి సింధూ ముద్రణలపై గల నావికా బొమ్మల బట్టి కూడా తెలుసుకోడానికి వీలవుతుంది.

**సింధు నాగరకతా కాలపు శిల్పకళ**

సింధూ నాగరికతా కాలం నాటి శిల్ప కళ రెండు రకాలుగా ఉంది. అవి : (1) గుండ్రటి శిల్పాలు లేక శిలకు అన్ని వైపులా శరీర భాగాలు మలచబడిన శిల్పాలు (Sculptures in the round) (2) శిల మొదలయిన వాటిపై కొంత లోతు గీతల వలె చెక్కిన శిల్పాలు లేక అర్ధ శిల్పాలు (Relief Sculptures).

వీరి శిల్పాలు శిల, కంచు, మట్టి వంటి వాటితో తయారు చేసినవి. సామాన్య ప్రజలు మట్టి ప్రతిమలు వాడితే అధునీకరణం చేసిన, వ్యవసాయం, వ్యాపారాల వల్ల ఆనాడు ధనవంతులైన ప్రజలు శిల, కంచు వంటి వాటితో చేసిన శిల్పాలను ఉపయోగించారు.

వీరి కాలానికి చెందిన శిల్పాలను శిలా ప్రతిమల మొండేలు, కంచు విగ్రహాలు, జంతువుల బొమ్మలు, శిలా ప్రతిమల ముక్కలు, మట్టి బొమ్మలు పాత్రలు, ముద్రలు, నగలు మొదలైన విభాగాలు చేసి అధ్యయనం చేయవచ్చు.

**శిలా ప్రతిమల మొండేలు (torsos)**

హరప్పా ప్రాంతంలో లభించిన రెండు శిలా ప్రతిమల మొండేలు ఆనాటి శిల్ప కళా

నైపుణ్యాన్ని తెలుపుతున్నాయి. వీటిలో ఒకటి ఎర్ర రాతితోను, మరొకటి సున్నపు రాతితోను రూపొందించి ఉన్నాయి.

ఎర్ర రాతితో చేసిన శిల్పం మొండెం దిగంబరంగా ఉన్న పురుషుని ప్రతిమ. దీని చేతులు, తల ప్రస్తుతం లేకున్నప్పటికీ అవి విడివిడిగా తయారు చేసి అమర్చే విధానం శిలాప్రతిమ రూపంలో ఉన్నట్లు తెలుస్తుంది. ఈ విషయం ఈ ప్రతిమల భుజాల్లో ఏర్పరచి ఉన్న రంధ్రాలను బట్టి తెలుస్తుంది. మానవుని శిలా ప్రతిమలు ఏర్పరచటంలో హరప్పా శిల్పి నిపుణుడని ఈ మొండెమే తెలుపుతుంది. ప్రకృతి సిద్ధమైన, మానవ శరీర అంగాలను రూపొందిచటంలో పరిపూర్ణతను సంపాదించాడు. శరీర వంపు సొంపులు సృజనాత్మక శక్తితో ఉన్నాయి.

సున్నపు రాతితో తయారు చేసిన ఇంకో మానవుని మొండెం చాలావరకు ఎర్ర రాతి శిల్ప మొండెం సృజనాత్మకతను పోలి ఉంది. దీనికి కూడా తల, చేతులు, కాళ్ళు లేవు. కాళ్ల తొడ విభాగం మోతవరకు ఉంది. దీని తల, చేతులు కూడా విడివిడిగా తయారు చేసి అమర్చే వారని తల, భుజాల్లో ఉన్న రంధ్రాల ఏర్పాటును బట్టి తెలుసుకొనటానికి వీలవుతుంది. ఈ శిల్పం కుడికాలు నేల మీద ఆనించి నట్లు ఎడమకాలు పైకెత్తి ఉన్నట్లు ఉంది. దీన్ని బట్టి ఇది బహుశా ఒక నృత్యకారుని లేదా నాట్యగత్తె ప్రతిమై ఉండవచ్చునని కొందరి అభిప్రాయం. మరి కొందరు ఇది అతిప్రాచీన కాలపు నటరాజు ప్రతిమ అయి ఉండవచ్చని అభిప్రాయ పడుతున్నారు. పై రెండు ప్రతిమలు ప్రకృతి సిద్ధమైన శిల్ప కళా విధానంలో దిదర్గాన్ ప్రాంతంలోని యక్ష ప్రతిమలను పోలి ఉన్నాయి.

**కంచు ప్రతిమలు**

సింధూ నాగరకతకు చెందిన కంచు ప్రతిమలో మొహంజొదారో ప్రాంతాన లభించిన ఒక నాట్యగత్తె ప్రతిమ ముఖ్యమైంది. ఇది 4 1/2 అడుగుల ఎత్తున్నది. దీన్ని రూపొందించిన శిల్పి నైపుణ్యం ఉన్నతస్థాయికి చెందింది కాకపోయినా ఇది ఒక ముఖ్యమైన శిల్పంగా చెప్పవచ్చు. ఈ ప్రతిమకు పాదం, మడిమెలు లేవు. ఈ శిల్పంలోని నాట్యగత్తె తన కుడిచేతిని నడుం మీద ఉంచుకుని ఉంది. నడుం పై చేయి పెట్టుకొని ఉన్న విధానాన్నే కాట్యావలంబిత లేదా లోలహస్త అని అంటారు. ఈ నాట్యగత్తె ఎడమ చేతి నిండుగా గాజులను ధరించి ఉంది. ఈమె శిరోజాలను వెనుకభాగంలో కొప్పుముడి వలె వేసుకొని ఉంది. ఈమెకు పొడవైన కాళ్ళు, చేతులు ఉన్నాయి. తల కొద్దిగా పక్కకు తిరిగినట్లు ఉంది. ఈమె కుడిచేతి కడియాలు, ఎడమ చేతి గాజులు, నగలు సహజ సిద్ధంగా రూపొందించినట్లు ఉన్నాయి. హరప్పా శిల్ప మొండేల లోని భావాలు ఈ శిల్పంలో ద్యోతకమవుతున్నవి.

హరప్పా నాగరకతకు చెందిన కంచుప్రతిమ, అనేక జంతువుల కంచు బొమ్మలు (శిలా బొమ్మలు) కూడా లభించాయి. జంతువుల బొమ్మల్లో గేదె, పొట్టేలు మొదలైనవి ఉన్నాయి. వీటి కళ్లు సన్నగా, సగం మూసుకొన్నట్లున్నవి. ఆనాటి శిల్పి జంతువులను రూపొందించటంలో కూడా నేర్పరి అని తెలుస్తుంది.

**మానవ శిల్పాల ముక్కలు**

పై రెండు రకాల శిల్పాలు ఒక తరగతికి చెందినవి కాగా మత బోధకుని వలె ఉన్న శిల్పం మొదలైనవి రెండో తరగతికి చెందినవిగా చెప్పవచ్చు. వీటిలో అతి కొద్ది సంఖ్య మాత్రమే మంచి రూపంలో ఉన్నవి. ఇవి సబ్బురాయి (steatite), చలువరాయి, సున్నపు రాళ్ళతో రూపొందాయి.

సబ్బురాయి శిల్పం ఎక్కువ నాశనం కాలేదు. దీనికి తల, ఛాతి మాత్రమే ఉన్నాయి. మిగిలిన శరీర భాగాలు పూర్తిగా అదృశ్యమై ఉన్నాయి. శిల్ప రూపంలోని ఈ మత బోధకుడు ఒక శాలువ వంటి గుడ్డను తన ఎడమ భుజం మీదుగా మెడచుట్టు వేసుకొని ఉన్నాడు. ఈ శాలువ ఎడమ చేతిని కప్పినట్లు ఉంది. కుడిచేతిపై శాలువ లేదు. కానీ కుడిచేతి పక్కగా దీని కొన వేలాడినట్లు ఉంది. దీనిపై త్రిపత్ర లేక మూడు పూల రెక్కల డిజైనుల (trefoil designs) వరసతో అంచు ఉంది. ఈ పద్ధతిలో వస్త్రధారణ మనం కుషాణుల కాలం నాటి కొన్ని బుద్ధుని శిల్పాల్లో గమనించవచ్చు. ఈ శిల్పంలోని మత బోధకుని వంటి వ్యక్తి పొట్టి గడ్డం, బాగా కత్తిరింపు చేసిన మీసం, తలకట్టుతో ఉన్నాడు. తల కట్టు కొంగులు వెనక భాగంలో వెంట్రుకల ముడితో కలసి పోయి వ్రేలాడుతున్నాయి. ఇతనికి మంచి రూపంలోని ముక్కు ఉంది. మృదువైన పెదవులున్న నోరు, రంధ్రాలున్న చెవులు ఉన్నవి. నుదురు తక్కువగా ఉన్నట్లు చూపించారు. కళ్ళు సగం మూసినట్లుండి మత్తుగా ఉన్నట్లు కనిపిస్తున్నవి. ఈ కండ్లను బట్టి శిల్పంలోని వ్యక్తి యోగ ముద్రలో ఉన్నాడని కొందరు భావిస్తున్నారు.

మొహంజొదారో ప్రాంతంలో చలువరాతితో రూపొందించిన శిల్పం లభించింది. ఇది ఒక ఆసీనమైన వ్యక్తిది. ఈతని తల విరిగిపోయింది. వస్త్రధారణలో ముందు శిల్పంలో వలెనే ఇది కూడా ఉంది. కానీ ఈ శిల్పంలో మృదుత్వం తక్కువగా ఉంది.

సున్నపు రాతితో తయారు చేసిన మనుష్యుల తలలు కొన్ని మొహంజొదారో ప్రాంతంలో లభించాయి. ఇవి పైన వివరించిన శిల్పాలకన్నా భిన్నంగా ఉన్నాయి. వీటిలో పొడవైన ముక్కు, కొద్దిగా ఎత్తైన దవడ ఎముకలు, వెడల్పైన నుదురు, మధ్యరకపు పరిమాణంలోని నోరు, మృదువైన పెదవి, లావైన కింది పెదవి, నిండైన పొట్టి గడ్డం, గాలికి ఎగురుతున్న తల వెంట్రుకలు, తలకట్టు గల మానవ శిల్పం ముఖ్యమైంది. ఈతని శిరోజాలు వెనకముడివలె కొంచెం పక్కకు ఉన్నాయి. ఈ కొప్పులు ఇతర సింధూ శిల్పాల్లో కూడా కనిపిస్తాయి. మృదువైన, సహజమైన ముఖభాగం కలిగి ఉన్నాడు. ఇతని కళ్ళు కొద్దిగా మూసినట్లు కనిపిస్తాయి. పై రెండు తరగతులకు చెందిన శిల్పాలు భవిష్యత్ భారత శిల్పకళా రీతిని నిర్దేశించాయని చెప్పవచ్చు.

**మట్టి బొమ్మలు (terracotta figurines)**

సింధూ నాగరకతా కాల ప్రతిమల్లో ఎక్కువగా మట్టితో చేశారు. ఇవి ఎర్రగా ఉన్నాయి. మనుపును తెలుపటానికి ఎర్రటి పాలిష్ వంటిది పూశారు. వీటిలో స్త్రీ, పురుష, జంతు

సంబంధమైనవే గాక పిల్లలు ఆడుకొనే బొమ్మలు కూడా ఉన్నాయి. కాని స్త్రీ, ప్రతిమలే ఎక్కువగా ఉన్నాయి. సింధూకాలపు మట్టి బొమ్మలన్నీ రెండు ముక్కలుగా అచ్చుపోసి తయారు చేసే వారని కొందరి భావన. మరి కొందరు వీటిని చేతితో మాత్రమే తయారు చేసే వారని అచ్చు పోయటం అనాడు తెలియదని భావిస్తున్నారు.

స్త్రీ మట్టి బొమ్మలు అన్నీ దాదాపు ఒకే రకంగా ఉన్నాయి. ఉదాహరణకు ఒక ప్రతిమలో స్త్రీ విసనకర్ర అకారంలోని కిరీటాన్ని ధరించి ఉన్నాయి. ఈమె తలచుట్టూ ఒక తలకట్టు (fillet), చెవులకు దిద్దులు, మెడలో నెక్లెస్, నడుముకు మూడుపొగుల వడ్డాణం ఉన్నాయి. కండ్లు విడిగా తయారు చేసి అతికించినట్లున్నాయి. నోటిని తెలుపటానికి ఒక అడ్డగీత గీసి ఉంది. ఈ ప్రతిమలు చాల ఉన్నాయి. ఇవి బహుశా మాతృదేవత (mother godess) ప్రతిమలై ఉండవచ్చుని కొందరు భావిస్తున్నారు. వీటిలో కొన్నింటికి బాగా మసి తగిలి కాలినట్లు కనిపించడం వల్ల ఈ అభిప్రాయ మేర్పడింది. మరొక ప్రతిమలోని స్త్రీ ఒక శిశువును ఎత్తుకొని ఉంది. ఇది సంతాన వరాలిచ్చే దేవతా ప్రతిమై ఉండవచ్చని కొందరి అభిప్రాయ్యం. ఈ మాతృదేవతా ఆరాధనా విధానం ప్రపంచంలోని అన్ని ప్రాచీన నాగరకతల్లో కనిపిస్తాయి. ఈ మాతృదేవతా ఆరాధనే తరవాత కాలంలో కాళికాదేవి గ్రామదేవతల ఆరాధనా విధానంగా రూపొందింది.

హరప్పా ప్రాంతంలో పురుషుల మట్టి ప్రతిమలు కూడా లభించాయి. కాని వీటి సంఖ్య తక్కువ. స్త్రీ ప్రతిమలు స్థానక (standing) రూపంలో ఉంటే పురుష ప్రతిమలు చాలా వరకు ఆశీన్న రూపంలో ఉన్నాయి. ఇవి చాలావరకు దిగంబరంగా ఉన్నాయి. కొన్నింటిలో వీరు పొట్టి వస్త్రాః (seated) నడుముకు చుట్టుకొని ఉన్నారు.

అనేక పశువుల మట్టి బొమ్మలు కూడా ఈ కాలం నాటివి లభించాయి. మూపురం గల ఎద్దు, ఏనుగు, కోతి, గొర్రె మొదలైనవి ఉన్నాయి. గోవు ప్రతిమ లేకపోవటం గమనించదగ్గ విషయం. మట్టి ప్రతిమల్లో మూడువంతులు జంతువులవే ఉన్నాయి.

పిల్లలు ఆడుకొనే అనేక మట్టి బొమ్మలు కూడా లభించాయి. వీటిలో కొన్ని కదలే తలలవి కూడా ఉన్నాయి.

**మట్టి పాత్రలు**

బహుశా మాతృదేవతారాధనకు సంబంధించినవై ఉండవచ్చు. కొన్ని వెదురు బొంగువలె రెండు అంగుళాలు మొదలు 20 అంగుళాల ఎత్తుగా ఉన్నాయి. వీటికి ఒక వైపున చిన్న రంధ్రాలు ఉన్నాయి. ఇవి బహుశా పవిత్ర జలాలు చల్లటం కోసం గాని లేదా నీరు వడగట్టటం కోసం గాని వాడి ఉండవచ్చు. అనేక చిన్న చిన్న మట్టి పాత్రలు కూడా లభించాయి. ఇవి బహుశా పిల్లలు ఆడుకోటానికి ఉపయోగించి ఉంటారు: కొన్ని పాత్రలు పశువుల ఆకారంలో తయారు చేసి ఉన్నాయి. మరణించిన వారిని పూడ్చేటప్పుడు వారు వాడిన పాత్రలు కూడా పాతి పెట్టేవారు. సింధూ ప్రజల మట్టి పాత్రలు చాలా వరకు తాగటం, తినటం, వండటం, ధాన్యం వంటివి భద్రపరచటం నిత్య ఉపయోగార్థం తయారయ్యేవి.

## ముద్రలు

సింధూ నాగరకతా కాలానికి చెందిన అనేక ముద్రలు తవ్వకాల్లో లభించాయి. ఈ ముద్రలన్నీ సబ్బురాతితో తయారు చేశారు. వీటిలో కొన్ని చతురస్రాకారంలో ఉన్నాయి. వీటిపై కొన్ని బొమ్మలతో కూడిన రాతలున్నాయి. ఈ రాతలను ఇంత వరకు పూర్తిగా చదవగలిగిన వారు లేరు. కాని, కొంత ప్రయత్నం జరిగింది. ఈ ముద్రల వెనకవైపు ఒక చిన్న మేకు వంటిది ఉంది. దీనిలో దారం దూర్చటానికి రంధ్రముంది. కొన్ని ముద్రలు గుండ్రంగా ఉన్నాయి. మరి కొన్ని వెదురు బొంగువలె కొంత పొడవుగా ఉన్నాయి. కాని వీటి సంఖ్య అత్యల్పం. ఈ కాలపు ముద్రలపై గల బొమ్మల్లో పశువుల బొమ్మలే ఎక్కువ. ఇవి ఉబ్బెత్తుగా ముద్రలపై రూపొందించి ఉన్నాయి. ఈ జంతువుల్లో కొన్ని మిథ్యాశిల్పాలు (ఊహా శిల్పాలు). వీటిలో ఒంటి కొమ్ము మృగం ముఖ్యమైంది. వీటి ముందు ఒక స్తంభముంది. దీన్ని రుద్ర శివుడని అంటారు. కొమ్ములు, తోక గల మనిషి, పులి వంటి విచిత్ర జంతువుతో తగాదా పడటం, వృషభపు కొమ్ములు గల పొట్టేలు, మనిషి ముఖం, అందం, ఏనుగు దంతాలు, పులి వెనక భాగం వంటి వెనక భాగం గల జంతువులు కూడా ఉన్నాయి.

నిజమైన జంతువుల్లో కొన్ని పెంపుడు జంతువులు, మరికొన్ని అడవి జంతువులు ఉన్నాయి. ఎద్దు, గేదె మొదలైన సాకుడు జంతువులు, పులి, ఏనుగు, జింక, కుందేలు, రైనోసరస్ మొదలైన అడవి జంతువులు ఉన్నాయి. ఇవన్నీ సహజత్వాన్ని కలిగి ఉన్నాయి. ఇంతటి చిన్న బొమ్మల్లో సహజత్వాన్ని శిల్పి చూపగలగటం వల్ల అతని గొప్పతనం తెలుస్తున్నది. ఈ ముద్రలపై గల కొన్ని బొమ్మలు ఆసక్తి కరంగా ఉన్నాయి. ఒక ముద్రపై మూడు శిరస్సులు, అనేక చేతులు గల ఒక యోగి బొమ్మ ఉంది. ఈ యోగి తలపై కొమ్ములున్నాయి. ఇతని చుట్టూ అనేక జంతువులున్నాయి. ఇతడు ఒక వృక్షం కింద కూర్చొని ఉన్నాడు. ఇది పశుపతి రూపంలోని శివుని శిల్పమని కొందరి అభిప్రాయం. ఇట్లాంటి బొమ్మలు కొన్ని లభించాయి. కొన్నింటిలో ఒక చెట్టు కొమ్మల మధ్య గాని, చెట్టుబోదెపై గాని ఉన్నట్లు చూపడం జరిగింది. సింధూ నాగరకత ముద్రలు సుమారు 1200 లభించాయి. ఇవి అంగుళంలో 3/4 వంతు మొదలు 11/4 వ వంతు అంగుళం పరిమాణం వరకు ఉన్నాయి. వీటిని రూపొందించటం లోను, వీటికి పాలిష్ రూపొందించటంలోను హరప్పా శిల్పి తన శిల్పకళా చాతుర్యాన్ని చూపాడు. సుమేరియన్ నాగరకతా ముద్రల కన్నా ఇవి భిన్నంగాను ఉన్నతం గాను రూపొందించి ఉన్నాయి.

## రత్నాలు సానపెట్టు కళ (Lapidary art)

ఈ నాగరకతకు చెందిన అనేక బంగారు, వెండి పూసలు మొదలగు వాటితో తయారు చేసిన నగలు కూడా లభించాయి. బంగారు చేతి కడియాలు, చెవుల దిద్దులు, పలు ప్రకారాలైన పోగులు గల కంకణాలు, వడ్డాణాలను వీరు వాడారు. బంగారు, వెండి, వజ్ర వైడూర్యాలతో తయారు చేసిన పూసలు వడ్డాణాలు, నెక్లెస్‌ల వంటి వాటిలో పొదగబడ్డాయి. దక్షిణ భారతదేశం నుంచి బంగారు, ఆఫ్ఘనిస్తాన్ ప్రాంతాల నుంచి వెండి, సింధూ ప్రజలు పొందినట్లు తెలుస్తుంది. నగల్లో పూసలు పొదిగే సాంప్రదాయం సుమేరియన్ మెసపటోమియన్ నాగరకతల్లో కూడ అగుపిస్తుంది. సింధూ నాగరకతకు చెందిన చాన్‌హుడారో ప్రాంతాన అనేక రకాలైన పూసలు తయారు చేసే ఒక కర్మాగారం బయట పడింది. ఒక రకమైన మెత్తని పదార్థపు శిల్పాలపై, వజ్రాలపై కళాత్మకంగా చెక్కే విధానమూనాడు ఉండేది. తల చుట్టూ పట్టీ (fillet) ధరించే సాంప్రదాయం కూడా ఉంది. ఇది దాదాపు 1/2 అంగుళం వెడల్పు, 16 అంగుళాల పొడవు ఉంది. ఉంగరం, చెవులకు రింగులు ధరించే వారు. ఇవన్నీ నాటి బంగారు పనివారి చాతుర్యాన్ని తెలుపుతున్నాయి.

## ఫియాన్స్ వస్తువులు (Fiance objects)

ఫియాన్స్ (Fiance) అనే ఒక పదార్థంతో తయారు చేసిన కొన్ని బొమ్మలు కూడా లభించాయి. దీంతో తయారు అయిన వాటిలో ఉడత, జింక వంటివి కళాత్మకంగా రూపొందించి ఉన్నాయి.

# 2

# వేదకాల వాస్తు శిల్పకళ

**(క్రీ.పూ 1500–800)**

వృత్తిపరమైన, వర్ణరహితమైన (casteless) వ్యవస్థతోను, శ్రమారాధకులు శాంతి కాముకులు, నిర్మల మనస్కులు, ప్రజాస్వామిక భావాలు గలవారు విశాల భౌగోళిక జ్ఞానం గల వ్యాపారులు, చేతి వృత్తుల వారు, రైతులు, కూలీలతో నిండి ఉండిన ప్రపంచ ప్రసిద్ధి గాంచిన సింధూ నాగరకతకు చెందిన నగరాలు ప్రధానంగా ఆర్యుల రాక వల్ల పతనమగుటతో వారి అద్భుత కట్టడాలు అదృశ్యమై స్వదేశీ ఆదిమ రీతిలో నిర్మాణాల దశ ప్రారంభమైంది. ఈ నిర్మాణ విధానం కాలక్రమంలో రూపొందింది. దేశదిమ్మరులుగా ఉండి భారతదేశంలో వ్యవసాయిక గ్రామీణులుగా స్థిరనివాసాన్ని ఏర్పరచుకొన్న ఆర్యుల ద్వారా ఆదిమ రీతి తిరిగి ప్రారంభించడమైంది. ఇదే ఉన్నత రీతికి మూలం.

భారత దేశంలో ప్రవేశించిన ఆర్యులు అడవులను ఛేదించి ఆ అడవుల్లోని, పల్లపు ప్రాంతాల్లోని ఆదిమ జాతీయులు లేదా ఆటవికులు నిర్మించుకొని ఉన్న గృహాలను పోలిన ఇండ్లనే తాము కూడా నిర్మించుకోసాగారు. వీటిని వెదురు, కొయ్య, రెల్లు (reed), ఆకులతో నిర్మించుకొన్నారు. ఈ విషయం వేద గ్రంథాల ద్వారా తెలుస్తోంది. గృహాల సమూహ నిర్మాణంతో గ్రామం ఏర్పడింది. కాని ఈ గృహాలను లేదా గ్రామాలను భయంకర జంతువుల నుంచి రక్షించుకోవాల్సిన పరిస్థితులుండేవి. అందువలన నాటి మానవుడు గ్రామం చుట్టూ వెదురు బొంగుల నిలువులు లేక ( upright posts) అడ్డాలు (మంచి లేక horizontal bars) ఉపయోగించి కంచె (ప్రాకారం) ఏర్పాటు చేసుకొన్నాడు. వీటికి ప్రవేశ మార్గాలు, ఆ మార్గాల్లో గ్రామ ద్వారాలు (gate ways) ఏర్పరచడమయింది. ఈ గ్రామ ద్వారాలే తరవాత బౌద్ధ స్థూపాల తోరణాలు గాను, దేవాలయాల గోపురాలుగాను పరిణామం చెందాయి. పంట పొలాల చుట్టూ కూడా ఆర్యులు ఈ కంచెనే ఏర్పరచుకొనేవారు. ఆర్యుల గృహాలు తొలుత గుండ్రటి ప్లానులో నిర్మించడమైనట్లు తెలుస్తుంది. నాటి కుండలు, బుట్టలు, ధాన్య నిల్వలు కూడాగుండ్రంగా ఉండటం బట్టి వారి అభిమాన ప్లాను అర్థమౌతోంది. ఈ రీతిని క్రీ.పూ 800 కాలానికి చెందిన రాజగృహ నిర్మాణాలు కూడా ధృవీకరిస్తున్నాయి. ఆర్యుల గృహాలు వెదురుతో గుండ్రంగా నిర్మితమై పైన వెదురు వాసాలతో పై కప్పు రూపొంది దాని పైన గడ్డి ఆకు కప్పేవారు. ఇది నేటికి మనవురాతిలో రూపొందించిన బారాబర్ (బీహార్) కొండల్లోని అశోకుని సుదామ గుహాలయంలో గమనించవచ్చు. కాలక్రమాన గుండ్రటి

ఆకార స్థానంలో అండాకార (oval) రూపంలో గృహాలు నిర్మించటం ఆర్య కాలంలో ఏర్పడింది. వంచిన వెదురులతో పీపాకార స్థానంలో అండాకార రూపంలో గృహాలు నిర్మించటం ఆర్య కాలంలో ఏర్పడింది. వంచిన వెదురులతో పీపా ఆకార పై కప్పు ఏర్పరచి గడ్డి ఆకులతో ఈ నిర్మాణాలు అయ్యేవి. కొంత కాలానికి ఇట్టి గృహ మూడు నాలుగు ఒకే దీర్ఘచతురస్రాకార ప్రాంగణంలో నిర్మితమయి కొయ్య లేదా పెంకులతో పై కప్పు రూపొందించడమయ్యేది. పచ్చి ఇటుకలతో గోడలు నిర్మితమయ్యేవి. ఈ నిర్మాణాలు ముఖ భాగంలో విల్లు లేక చైత్య రూపంతో ఉన్నాయి. ఈ ఆర్యుల నిర్మాణాలు తరవాతి కాలపు నిర్మాణాలపై గట్టి ప్రభావాన్ని చూపాయి. ఇది కొయ్య, శిల, ఇటుక, ఏకశిలా నిర్మాణాలన్నింటినీ మనం గమనించవచ్చు. ఆర్యులు తమ గృహాలు అందంగా ఉండటానికి గోడలకు రంగు వేసే వారు. అట్లే నేటికీ మనము ఆంధ్ర, ఒరిస్సావంటి రాష్ట్రాల్లోని గ్రామాల్లోని మట్టి గోడల ఇండ్లకు గ్రామీణుల్లో సున్నం, ఎర్రమట్టి రంగులు వేసుకోవడం గమనించవచ్చు.

క్రీ.పూ. ఒకటో మిలీనియం మధ్యకాలానికి వేద సంఘంలో (ఆర్యసంఘంలో) మార్పులు ఏర్పడి నగరాలు వెలయటం ప్రారంభమయ్యాయి. వీటిలో కూడా గ్రామాల్లోని నిర్మాణాలే ఉన్నాయి. కాని పలు జాతులు లేదా మతాల మధ్య శత్రుత్వం ఏర్పడసాగింది. దీంతో వారి వారి నగరాల చుట్టూ ఎత్తైన గోడలు, కొయ్య ప్రాకారాలు నిర్మితమై వాటిలోపలి ప్రాంగణాల్లో కొయ్యతో గృహాల నిర్మాణం ప్రారంభమయింది. ఆనాడు కొయ్య అడవుల్లో సమృద్ధిగా ఉండేది. దీంతో కొయ్య నిర్మాణాల యుగం ప్రారంభమైంది. అట్లా అభివృద్ధి చెందటంతో వడ్రంగి ప్రాధాన్యత పెరిగింది. అందుకే ఆనాడు క్రీ.పూ. 5వ శతాబ్దం నాటి బౌద్ధ విమర్శకుడు ధమ్మపాలుడు కూడా మహాగోవిందుడనే వడ్రంగి అనేక రాజధానుల గృహాలను ఉత్తర భారతదేశంలో నిర్మించినట్లు ప్రస్తావించాడు. మహాగోవిందుడే భారత తొలి స్థపతి లేక వడ్రంగి (architect). నాటి నగరాలన్నీ దీర్ఘ చతురస్రంగా ఉండేవి. ఒక కేంద్రంలో కలసే రెండు ముఖ్య రహదారులు వీటిలో ఉండేవి. నగరం నాలుగు విభాగాలుగా ఏర్పడి ఉండేది. నగరాల చుట్టూ కోటలు, వాటికి ద్వారాలు ఉండేవి. కోట గోడలలోపల రాజభవనాలు, ఉన్నత, మధ్య తరగతి వారి భవనాలు, వ్యాపారుల భవనాలు ఉండేవి. రాజభవనాలు, కోట గల భాగం దాదాపు మొగలు కాలపు రాజ భవనాలు, కోటల వలె ఉండేవి. రాజభవనాల్లో రాజదర్శన నిర్మాణ భాగం రాణుల నివాసం గదులు, ఉద్యానవనాలు, ఫౌంటేన్‌లు ఉండేవి. రాజు అధికార విభాగాలైన సభా మండపం, న్యాయస్థానం, సంగీత మండపం, ప్రజా సభాభవనం, మల్ల యుద్ధ భవంతి, జంతువుల పోటీ విభాగాలు ఉండేవి. ఇవన్నీ చాలా వరకు కొయ్య కప్పు గలవి. నిర్మాణాలకు శిలా వాడకం ప్రారంభం గురించి రాజ గృహ నగర ప్రాకార కుడ్యం లభించటం వల్ల తెలుసుకొనటానికి వీలవుతుంది. అంటే శాశ్వత నిర్మాణాలకై ప్రయత్నం ప్రారంభమయిందని దీన్ని బట్టి తెలుస్తుంది.

పై వివరాల బట్టి వేదకాలంలో వెదురు, కొయ్య, మట్టి, రెల్లు, ఆకులతో నిర్మాణాలు జరిగేవని, అవి ఆదిమ రీతిలో ఉండేవని తెలుస్తుంది. కాని ఆనాటి నిర్మాణాలన్ని అశాశ్వతమైనవి కాబట్టి నేడు మనకు లభించటం లేదు. అవి లేకున్నా వాటి నిర్మాణాల వివరాలు ఋగ్వేదం, మలి వేదాలు, బ్రాహ్మణాలు, సూత్ర సాహిత్యం, రామాయణ మహాభారతాలు మొదలైన ప్రాచీన గ్రంథాల బట్టి

వేదకాలంలో యజ్ఞ వేది (sacrificial fire altars), యజ్ఞశాలలు (sacrificial halls) నిర్మించేవారు. ఇవి అశాశ్వత నిర్మాణాలు. మట్టి, 'కుస' గడ్డితో యజ్ఞ వేదికలు నిర్మితమయ్యేవి యజ్ఞశాలలకు గడ్డి రెల్లు, కప్పు ఉండేది. క్రీ.పూ. సుమారు 800 ప్రాంతం నాటి సుల్బ శాస్త్రాలు ఈ 'వేది' ల కొలత, నిర్మాణ రూపం గురించి కొన్ని సూత్రాలను నిర్దేశించాయి. ఇవి 'వేది'లు గాలి పట ఆకారం, రథాకారాల్లో ఉండాలని నిర్దేశించాయి. ఋగ్వేదం రథాలు తయారు చేసే వారైన రథకారులు లేదా రథకారికుల గురించి తెలుపుతుంది. శతస్తంభ గృహాల గురించి కూడా ఇది తెలుపుతుంది. ఋగ్వేదంలో గృహస్థలాల్లో వెలసిన వాడుగా చెప్పే దేవతయైన వాస్తోష్పతి స్తుతి సంబంధ శ్లోకాలున్నాయి. వాస్తోస్పతి గురించి భిన్న అభిప్రాయాలు ఉన్నాయి. సర్వ దేవతల ఏకరూపి యని ఒక అభిప్రాయం ఉంది. భారత వాస్తు నిర్మాణాలు మత సమ్మిళితమైనవి. వాస్తోస్పతి ఇంద్రుడుగా భావించటం కూడా ఉంది. ఇతనినే త్వస్తిర్ గా భావిస్తూంచడం కూడా ఉంది. త్వస్తిర్ దేవతల వడ్రంగి. విశ్వకర్మ విశ్వనిర్మాతగా స్తుతించటం ఉంది. త్వస్తిర్ ఇంద్రుని వజ్రాయుధానికి పదును పెట్టినట్లు ఒక శ్లోకంలో ఉంది. ఇతడే తరవాతి కాలపు తక్షుడు. మరో శ్లోకంలో అగస్త్యుడుగా భావించే 'మాన' గురించి తెలపడం జరిగింది. ఇతనితో రెండు వాస్తు రీతులు ఆరంభమైనట్లు తెలుస్తుంది. అవి. మానవిద్, సూత్రగ్రాహిన్, మానచార్య అగస్త్య. ఇవి ప్రాచీన వాస్తు విద్యాగ్రంథాలు.

వడ్రంగి త్వస్తిర్ ప్రస్తావన రుగ్వేదకాలపు వాస్తు కొయ్య సంబంధమైందనే విషయాన్ని తెలుపుతుంది. హర్మ్యాలు అనే మాట పలుమార్లు ఋగ్వేదంలో ప్రస్తావించటం వల్ల నాటి గృహాలు కొన్ని ప్రత్యేకంగా కూడి ఉండేవని తెలుస్తుంది. వేదాల్లో, స్తంభాలు, వాటి ఆకారాల గురించి ప్రస్తావించడమైంది. స్తంభాలను స్థూన, స్తంభ, స్కంభ, విష్కంభ అని పిలిచే వారు. వేదాలు స్మశానాలను మృణ్మయ గృహాలుగా తెలిపాయి. వేదాల్లో తల్ప ప్రస్తర మొదలైన వాటిని గురించి కూడా ప్రస్తావన ఉంది.

మలి వేదాలు, బ్రాహ్మణాలు ఎక్కువగా మత నిర్మాణాల గురించి తెలుపుతున్నాయి. కాని రుగ్వేదం లౌకిక నిర్మాణాల గురించి తెలుపుతుంది. మలి వేద గ్రంథమైన శుక్లయజుర్వేదం తెలుపుతున్న శ్మశాన నిర్మాణం తరవాతి కాలపు స్తూప నిర్మాణానికి మార్గదర్శకమైందని తెలుస్తుంది. కృష్ణ యజుర్వేదంలో 'యూప' (sacrificial pillar) ప్రస్తావన ఉంది. అధర్వవేదం శాలసుక్తలో నివాస గృహాల వివరాలున్నాయి. ఇందు వంశ (beam), స్థూన (pillar), భిన్న ఆకారాలు, పక్కలు గల గృహాల ప్రస్తావన ఉంది. నాటి గృహాలు రెండు, నాలుగు, ఆరు, ఎనిమిది, పది పక్కలు ఉండేవి. రుగ్వేదం వాస్తోస్పతి (Lord of the House) గురించి ప్రస్తావిస్తే అధర్వ వేదం వాస్తు దేవిని (Mistress of Building) గురించి తెలుపుతుంది.

బ్రాహ్మణాలు మత నిర్మాణాలైన 'యూప' 'వేది', 'శ్మశాన' 'చితి' (sacrificial altar) గురించి ప్రస్తావించాయి. శ్మశానాల గురించి శతపథ బ్రాహ్మణం వివరిస్తుంది. ఇది స్తూప నిర్మాణానికి మార్గదర్శకమైంది.

సూత్ర సాహిత్యంలో భారత వాస్తు వివరాలు నిండుగా ఉన్నాయి. ఇవి ప్రాచీన భారత వాస్తు శాస్త్రాలుగా చెప్పవచ్చు. సాంఖ్యాయన గృహ్యసూత్ర, అశ్వలాయన గృహ్య సూత్రాల్లో గృహ నిర్మాణ సూత్రాల గురించి ఉంది. ఇవి గృహ మధ్యస్తంభ (central pillar) పూజా విధానాల గురించి తెలుపుతున్నాయి. నాడు గృహ మధ్య భాగానికి ప్రాధాన్యత ఇచ్చేవారు. ఇవి నాటి గృహాలు గుండ్రటివని తెలుపుతున్నాయి. సుల్వ సూత్రం కూడా అనేక వాస్తు వివరాలను తెలుపుతుంది.

ఇతిహాసయుగపు రామాయణ, మహాభారతాలు అభివృద్ధి చెందన వాస్తు వివరాల గురించి తెలుపుతున్నాయి. వీటిలో నగరాలు, రాజాంతఃపురాలు, సభామండపాలు, కోటలు మొదలైన వాటి ప్రస్తావన ఉంది. స్తపత్యులను (experts in architecture) ఈ కాలంలో గౌరవించేవారు. విశ్వ కర్మ, మాయ అనే వారు వరసగా దేవతలు, అసురుల వడ్రంగులుగా ఇతిహాసాల్లో పలుమార్లు ప్రస్తావించి ఉంది. స్థపతి, వర్ధకి, సూత్రధార అనే సాంకేతిక పదాలు రామాయణంలో ఉన్నాయి. అనేక అంతస్తుల భవనాలైన అనకభౌమ, సప్తభౌమల ప్రస్తావన ఇతి హాసాలలో ఉంది. కొలిమి వద్ద లోహాన్ని వస్తువుల తయారీకి కరిగిస్తున్న కంసాలి వాడుగా పోల్చిన ఒక శిల్పం ఉంది. పెద్ద దేవతలు కూడా నాడు కంసాలి కొలిమిలో తయారయ్యే వారు. నేర్పరితనాన్ని శిల్పం, సుశిల్పం, అనేవారు. సురూపకృత్నుయని అందమైన శిల్పాన్ని రూపొందించిన వారిని అనేవారు.

నివాస గృహాల గురించి ప్రత్యేకంగా పరిశీలిస్తే వేద గ్రంథాలనుంచి పలు ఆసక్తికరమైన వివరాలు తెలుస్తున్నాయి. నాడు గృహాన్ని సదన, హర్మ్య, గృహ, పస్త్య, దామ, మాన, శాల అనే పేర్లతో పిలచేవారు. రాజ భవనాన్ని, ధనవంతుల గృహాలను మాన అనేవారు. సామాన్యుల ఇండ్లను శాల అనేవారు. రాగి రేకులపై బంగారు అలంకారాలు గల అలంకరణలతో నిండిఉండేది. సహస్రస్థూన అనే వేయి స్తంభాల భవనం కూడా ఉండేది. ఇది రుగ్వేద కాలపు ప్రజా ప్రతినిధుల సభ అయిన సమితి సభ్యుల సమావేశాలకు ఉపయోగించి ఉండవచ్చు. నాటి గృహాలు పలు నిర్మాణ భాగాలను కలిగి ఉండేవి. అవి: 1) ద్వారం, (2) ప్రాంగణం, (3) సదన్ అనే పురుషుల విభాగం, (4) స్త్రీల విభాగమైన పత్నిసదన, (5) అంతేగాక తరవాతి కాలంలో సామాన్యుల గృహాల్లో అగ్నిశాల (sacred fire kplace) ధనవంతులు రాజకుటుంబీకుల భవనాల్లో దేవగృహ అనే విభాగ కూడా ఏర్పరచబడింది. సదన్‌నే తరవాత కాలంలో ఆస్థాన మండప సభ, ఆస్థయిక అనే వారు. రాజభవనాల్లో సదన్‌ని ప్రజా నివేదికా మందిరంగా వాడేవారు. పత్ని సదనాన్ని అంతఃపుర అనేవారు. వేదకాల గృహాలకు రెండు, నాలుగు, ఆరు, ఎనిమిది లేదా పది కుడ్యాలుండేవి. గదిని కులయ అనేవారు. గదిలో గది కూడా నాడు ఉండేది. నిర్మాణ అంతస్తులను కోశ అనేవారు. గృహం ముందున్న ప్రాంగణాన్ని ఉదర, అంగన అనేవారు.

అధర్వణ వేదం శాలాసుక్తలో గృహ నిర్మాణ వివరాలు ఉన్నాయి. గృహాలు కొయ్యతో నిర్మింపబడేవని, ఒకటి లేదా అనేక పెద్ద స్తంభాలతో ఇవి నిర్మింపబడేవని దీన్ని బట్టి తెలుస్తుంది. గృహనిర్మాణంలో స్తంభం ప్రాముఖ్యాన్ని కలిగి ఉంది. దీనినే స్కంభ అనే వారు. ఇంద్రుడు స్తంభాల అధిపతియని పేరు గాంచి ఉన్నాడు. అందుకే ఇతనికి స్కంభియన్ అని పేరుండేది. మూడు వ[illegible]ల స్తంభాలపై గృహాల కప్పు ఉండేది. ఈ స్తంభాలపైనే వంచబడిన వాసాలు (rafters) కప్పు

కోసం నిర్మింపబడేవి. మధ్య స్తంభాలు ఎత్తుగా ప్రక్కస్తంభాలు పొట్టిగా ఉండేవి. మధ్య గల ఎత్తు స్తంభాలపై పొడవైన దూలం ఉంచబడేది. దీనినే పరిమిత లేదా విష్టువత అనేవారు. వెదురు వాసాలతో పైకప్పు కట్టబడి రూపొందింపబడేది. నిలువు వెదుర్ల పైన కట్టబడి వాటిపై ప్రణావః అని శాలసుక్తలో చెప్పిన ముంజ గడ్డితో కప్పబడేవి. వెదుర్లు కట్టడానికి వాడే తాడును నహణ అనేవారు. కాబట్టి నిలువు, అడ్డ వెదుర్లు, వెదురు దబ్బలు, గడ్డి కప్పడం, వీటిపైన మరో వరుస వెదురు దబ్బలు బిగిస్తూ (తాడు ముడులతో) పై కప్పు నిర్మించేవారు. మధ్య దూలంపైన పై కప్పుపై కుండలు బోర్లించబడేవి. ఇంటిలోని పొగ బయటికి వెళ్ళడానికి ఏర్పరచిన రంధ్రాలను ఇవి కప్పేవి. దీనినే సహస్రాక్షఒపస (100 eyed protuberants) అనే వారు. ఈ గృహాల కప్పునే గజపృష్ఠ ఆకార కప్పు అనేవారు. ఇదే తరవాత కాలంలో మనకు పశ్చిమ భారత చైత్య గృహాల్లో అగుపడును. వీరి గృహాల్లో గోవులకు, అశ్వాలకు స్థలం ఉండేది. గృహాన్ని అందమైన పెండ్లికూతురుగా వేదకాలంలో పోల్చేవారు. నేటికీ గృహ అందాన్ని ఇల్లాలుగా పోల్చే సామెత ఉంది.

కాని వేద కాల శిల్పాలేవీ మనకు లభించలేదు. వేదకాల ప్రజలు అనేకమంది దేవతలను ఆరాధించేవారు. నాడు శ్రీలక్ష్మి, కుమార, త్రివిక్రమ, గణపతి మొదలైన దేవతలను ఆరాధించేవారు. నాడు స్వస్తిక ఆరాధన ఉన్నట్లు తెలుస్తూన్నది. ఇది విశ్వచతుర్భుజాలుగా భావింపబడేది. ఇది బ్రహ్మ నాల్గు శిరస్సులను తెలుపుతూన్నదని కొందరి అభిప్రాయం. మరి కొందరు ఈ చిహ్నం చతుర్వేదాలను తెలుపుతూన్నదని భావిస్తారు. కొందరు ఇది నాల్గు లోకాలను లేదా నాల్గు వర్ణాలను లేదా నాల్గు ఆశ్రమాలను తెలుపు తుందంటారు. ఈ భావాలే తరవాత శిల్పంలో దేవ దేవీలుగా రూపొందాయి. శిశునాగ నందుల కాలానికి చెందిన రాజగృహంలో మాతృ దేవత వృత్తశిలలు లభించాయి. ఇవి శ్రీలక్ష్మి ఆరాధనను తెలుపుతున్నాయని కొందరి అభిప్రాయం.

# 3

# మౌర్యుల కాలపు వాస్తు, శిల్పకళ

మౌర్యుల అధికార స్థాపనతో భారతదేశ వాస్తు శిల్ప కళారీతిలో ఒక నూతన అధ్యాయం ప్రారంభమైంది. వీరి కాలంలో దేశంలోని అధిక భాగం ఒకే అధికారం కిందికి తీసుకొని రావడమేగాక విదేశీయుల దండయాత్రలను ఆపడం జరిగింది. వీరి విశాల రాజ్యస్థాపన, మేలైన పాలన విధానాలు విజ్ఞాన అభివృద్ధికి మార్గాన్ని కల్పించాయి. ఈ కాలంలో రాజకీయ, విజ్ఞాన, మానసిక దృక్పథాల్లో వచ్చిన మార్పు ఆనాటి వాస్తు శిల్ప కళలపై కూడా తన ప్రభావాన్ని చూపింది. దీంతో ఒక నూతన, వాస్తుశిల్ప కళా రీతి ప్రారంభమైంది. సుమారు యాభై సంవత్సరాలు పైగా చంద్రగుప్తమౌర్యుడు, అశోకుల కాలాల్లో మౌర్యుల వాస్తు, శిల్పకళ ఉన్నత స్థాయికి చేరుకొన్నది.

## మౌర్యుల కాలపు వాస్తుకళ

### 1. చంద్రగుప్త మౌర్యుని కాలపు వాస్తుకళ

### పాటలీపుత్ర (కుమ్రాహర్), బులందీబాగ్ నిర్మాణాలు

మౌర్యుల రాజధాని పాటలీపుత్ర నగరం. ఇది గంగానది, సోన్ నదుల సంగమ ప్రాంతంలో ఉంది. పాటలీపుత్రను నేడు కుమ్రాహర్ అంటారు. దీనికి ఉత్తరాననే బులందీబాగ్ ఉంది. చంద్రగుప్తుని కాలంలో పాటలీపుత్రను మెగస్తనీస్ సందర్శించాడు. ఇతడు గ్రీకు రాజైన సెల్యూకస్ రాయబారిగా చంద్రగుప్తుని ఆస్థానంలో పాటలీపుత్రలో ఉన్నాడు. ఇతడు పాటలీపుత్ర వైభవాన్ని వివరించాడు. పాటలీపుత్ర నగరం 9 మైళ్ల పొడవు, 1 1/2 మైలు వెడల్పు ఉండేదని తెలిపాడు. నగరం చుట్టూ అగడ్త (moat) ఉండేది. ఇది 600 అడుగుల వెడల్పు, 45 అడుగుల లోతు ఉండేది. దీని లోపల, నగరం చుట్టూ కోట నిర్మాణం ఉండేది. ఈ కోటకు 64 ప్రవేశ మార్గాలు 570 బురుజులు (bastians) ఉండేవి. ఇవన్నీ మెగస్తనీస్, అరియన్‌ల వల్ల తెలుస్తున్నాయి.

కుమ్రాహర్ ప్రాంతంలో చంద్రగుప్తుని అంతఃపురాన్ని కనుగొన్నారు. బులందీబాగ్ వద్ద సుమారు 450 అడుగులు గల ఈ నగర కోట గోడ కనిపించింది. ఈ ప్రాంతాల తవ్వకాలను డి.వి. స్పూనర్ చేపట్టాడు. కుమ్రాహర్ లోని అంతః పురం చారిత్రక యుగానికి చెందిన

మొదటి కట్టడ నిర్మాణంగా చెప్పవచ్చు. ఇది దర్బారు లాగ నిర్మింపబడి ఉంది. పెద్దదైన ఒకటో దర్బారులో రాజ అశ్వశాలలు, గజశాలలు, రక్షక భటుల గదులున్నాయి. రెండో దర్బారుల్లో సభామండపం లేదా అస్థాన మండపం ఉంది. మూడో దర్బారులో ముఖ్య అంతఃపురం లేదా స్త్రీల నివాస భవనం ఉంది. కుమ్రాహర్‌లో సభామండపాన్ని కనుగొన్నారు. పాటలీపుత్ర అంతఃపుర భవనాన్ని చంద్రగుప్తుడు నిర్మించాడని తెలుస్తుంది.

కుమ్రాహర్ సభామండపం ఆనాటి, భారతదేశంలోని నిర్మాణాలలో చాలా పెద్దది. ఇది 80 స్తంభాలను కలిగి ఉన్నది. ఇవి 10 వరుసల్లో వరసకు 8 స్తంభాల చొప్పున ఉన్నాయి. తూర్పుకొసలోను, హాలు మధ్యలోను మరిరెండు స్తంభాలున్నాయి. ఇవి బహుశా రాజ సింహాసనం ఉండె నిర్మాణ భాగానికి రక్షణ కల్పించి ఉండవచ్చు. కానీ ఈ హాలు లోని స్తంభాలు చాల వరకు అగ్నిప్రమాదంలో ముక్కలై శిథిల దశలో ఉన్నాయి. ఇందులోని స్తంభాల మధ్య 15 అడుగుల దూరమున్నది. ఇవి నేలపై ఉండేవి. కాని హాలు నేల భాగం, పై కప్పు రెండూ కొయ్యతో చేశారు. స్తంభాల పై భాగంలో లోహపు బోల్టులు బిగించడం కోసం రంధ్రాలున్నాయి. బోల్టులతో స్తంభాలకు పై కప్పును బిగించారు. ప్రతి స్తంభం గుండ్రటి కొయ్య పాదం లేదా మూలం పై ఉండేదని తెలుసుకోడానికి వీలవుతుంది ఈ పాదాలనే పీఠం లేక వేదిక అని కూడా అందురు. స్తంభం ఉన్న ప్రాంతంలో కాలిన గుండ్రటి కొయ్య భాగాలు హాలులో పలుచోట్ల ఉన్నాయి. కొన్ని ఛావు పాటి స్తంభాలకు కింది నుంచి 5 అడుగుల ఎత్తులో గుబ్బలు వంటి విభాగాలున్నాయి. వీటిని అద్దాలు, అలంకరణ వస్తువులైన జంతువులు, పక్షులు, తీగలు మొదలైనవి బిగించడానికి వాడేవారు. గ్రీకు రచయితలు కూడా ఈ అలంకారాల గూర్చి తమ రచనల్లో వివరించారు.

సభామండపానికి దక్షిణాన 7 కొయ్య వేదికలు తవ్వకాల్లో కనుగొన్నారు. ఈ వేదికలు ప్రతిదీ 30 అడుగుల పొడవు 5 అడుగుల 4 అంగుళాల వెడల్పు, 4 అడుగుల 6 అంగుళాల ఎత్తు ఉన్నాయి.

బులందీబాగ్‌లో కొయ్య నిర్మాణమైన కోట గోడ కూడా బయల్పడ్డాయి. పాటలీపుత్రం వద్ద కూడా ఇట్టి నిర్మాణం ఉంది. దీన్ని డి.వి. స్పూనర్ కనుగొన్నారు. ఇది సుమారు 450 అడుగులున్నది. దీనికి రెండు వైపులా 28 అడుగుల ఎత్తుగల 'సాల' కొయ్య నిలువు స్తంభాలు ఉన్నాయి. ఈ రెండు వరసలను కలుపుతూ 14 అడుగుల కొయ్య 'అడ్డాలు' ఉన్నాయి. ఈ నిలువుల మధ్య గల ఖాళీ భాగాల్లో మట్టి 'కూరబడి' ఉంది. పాటలీపుత్ర ప్రాకారం (కోట) పూర్తిగా కొయ్య నిర్మాణం రాయి వాడలేదు. మెగస్తనీస్ కూడా దీన్ని గూర్చి ప్రస్తావించాడు.

## 2. అశోకుని కాలపు వాస్తుకళ

అశోకుని పూర్వం కొయ్య, ఇటుకలతో కట్టడాలు ఉండేవి. ఇవి కొద్ది కాలానికి శిథిలమయ్యేవి.

కావున అశోకుడు తన నిర్మాణాలు శాశ్వతంగా ఉండాలనే ఆలోచనతో పెద్ద శిలాఖండాల్లో గుహాలయాలను (బౌద్ధ చైత్యాలు, విహారాలు) రూపొందింప చేశాడు.

అశోకుని నిర్మాణాలను అనేక విభాగాలుగా అధ్యయనం చేయవచ్చు. అవి: ఏకశిలాఖండ గుహాలయాలు, ఏకశిలా స్తంభాలు, ఇటుక స్థూపాలు, సాంచిఛత్రం, సారనాథ్ ఏకశిలా ప్రాకారం, ధౌళి, కల్సి ప్రాంతాల్లోని ఏకశిలా ఏనుగుల శిల్పాలు. వీటిలో వాస్తు దృష్ట్యా ఏకశిలా గుహాలయాలు ఏకశిలా స్తంభాలను ప్రధానంగా ప్రస్తావించవచ్చు.

**అశోకుని గుహాలయాలు**

అశోకుని గుహాలయాలు బీహారులోని గయజిల్లా లో ఉన్న బరాబర్ కొండల్లో నాలుగు, నాగార్జుని కొండలో మూడు, సీతామర్హి కొండలో ఒకటి ఉన్నాయి. బరాబర్ గుహలు గయకు ఉత్తరాన 16 మైళ్ళలో గల ఫల్గు నది ఎడమ ఒడ్డున ఉన్నాయి.

**అశోకుని గుహాలయాల ముఖ్యాంశాలు**

1. అశోకుని గుహాలయాలను శిలాఖండానికి నేరుగా (parallel to the surface of the rock) తొలచారు. (perpendicular) లంబరేఖ రూపంలో తొలచలేదు.
2. వీటి లోపలి కుడ్యభాగాలు అద్దం లాగ మెరిసే నునుపును కలిగి ఉన్నాయి.
3. వీటి ప్రవేశ మార్గాలు సమలంబ చతుర్భుజ (trapezoidal) ఆకారంలో ఉన్నాయి.
4. వీటి హాలు, దేవ గృహాలు పీపాకారపు పైకప్పును (barrel vaulted roof) వలే ఉన్నాయి.
5. ఈ గుహల ఒకదానినొకటి కలిపే మార్గభాగం పై కప్పు చదరంగా ఉన్నది.

**బరాబర్ కొండలోని సుదామ, లోమస్‌రిషి గుహలు**

బరాబర్ కొండలో నాలుగు గుహాలయాలున్నాయి. ఈ గుహలన్నీ నిర్మాణ రీతిలో ఒకే విధంగా ఉన్నాయి. ప్లాన్‌లో మాత్రం కొద్ది తేడా కలిగి ఉంది. ఈ నాల్గింటిలో సుదామ, లోమస్‌రిషి గుహలు ముఖ్యమైనవి. ఈ రెండింటికీ దీర్ఘ చతురస్రాకార హాలు ఉంది. దీనిపై పీపా కారపైకప్పు (barrel vaulted roof) ఉంది. సుదామ గుహల దేవగృహం గుండ్రంగాను, దాని పై కప్పు గుండ్రంగాను ఉంది, లోమస్‌రిషి గుహలో దేవ గృహం కోడిగుడ్డు ఆకారంలోను, దాని పై కప్పు పీపాకారంలోను ఉంది. దేవగృహం, హాలులను కలుపుతూ ఒక మార్గమున్నది. దీనిపై చదరపు పై కప్పు ఉంది.

సుదామ గుహలోని ఒక శాసనాన్ని బట్టి ఇది అతిప్రాచీనమైన అశోకుని గుహాలయంగా తెలుస్తుంది. ఇతడు క్రీ.శ. 252 లో తన 12వ సంవత్సర పరిపాలనా కాలంలో ఈ గుహను రూపొందింప చేసినట్లు ఈ శాసనం తెలుపుతుంది. లోమస్‌రిషి గుహలో శాసనం లేదు. ఈ

గుహాముఖ (ముందు) భాగంలో రెండు స్తంభాలున్నాయి. ఇవి లోపలికి వంగినట్లున్నాయి. పై కప్పుకు బలాన్నిస్తున్నాయి. వీటి మధ్య భాగాల్లో కొయ్య నిర్మాణాలున్నాయి.

ఈ గుహాల ముఖ భాగంలో ఎదురు ముఖాలతో గల ఏనుగుల జంటలు స్తూపాన్ని ఆరాధిస్తున్నట్లున్నాయి. హీనయాన కాలంలో స్తూపాన్ని బుద్ధుడుగా భావించుకొని ఆరాధించేవారు బుద్ధుని శిల్ప రూపంలో నాడు ఆరాధించే వారు కాదు. కానీ బౌద్ధ చిహ్నాలైన ధర్మచక్రం, బుద్ధుని పాదాలు వంటివాటిని ఆరాధించారు. మహాయాన కాలంలోనే బుద్ధుని శిల్పారాధన ప్రారంభమయ్యింది.

అశోకుని గుహాలయాల్లో కొయ్య నిర్మాణాల అనుకరణ కనిపిస్తుంది. గుహల ప్రవేశంలోని 'కూడు' ల యందలి శిలారూపంలోని దంతులు, వాటికొనలు, అల్లిక కిటికీలు, ఏనుగు జంటల శిల్పాల వరుసలు, కూడు, కలశ నిర్మాణ భాగాలు ఉన్నాయి. గుహల లోపలి పై కప్పు భాగంలోగల శిలాదంతులు (వాసాలు) వెదురు దబ్బల వాసాలలాగ ఉన్నాయి.

సుదామ, లోమస్‌రిషి గుహల్లో చైత్యగృహ అర్ధచంద్రాకార వంపు గల కుడ్య భాగం (apse), బుద్ధుని శిల్పంబదులు ఆరాధనకు వాడెడి స్తూపం (otive stupa) వంటి నిర్మాణ భాగాలున్నాయి. కాని ఆరాధనా స్తూపం లేదు.

## నాగార్జుని కొండలోని గోపి, కర్ణచౌపార్, వపియ, వేదాంతి గృహాలు

నాగార్జున కొండలో మూడు గుహాలున్నాయి. వీటిలో గోపికాగుహా ఒకటి. ఇది అశోకుని మనుమడు దశరథుని కాలంలో క్రీ.పూ 204లో తొలిచి రూపొందించబడింది. ఇది మౌర్యుల ఆఖరి గుహ. దీనిలో 46 అడుగుల పొడవుగల హాలు ఉంది. దీని కుడి ఎడమ కొనలు అర్ధ చంద్రాకారంలో ఉన్నాయి. ఈ హాలుపై గజపృష్ఠ లేక పీపా కారపై కప్పు (barrel vaulted roof). ఈ గుహ ముందు భాగలో చిన్న ప్రవేశమార్గమున్నది. ఈ గుహ విహారమై ఉండవచ్చు.

కర్ణ చోపార్ గుహ అశోకుని 19వ పరిపాలనా కాలంలో నిర్మింపబడింది. ఇందులో కూడా దీర్ఘ చతురస్రాకార హాలు గలదు. ఇది 33 అడుగుల పొడవు, 14 అడుగుల వెడల్పున్నది. దీని కొన భాగంలో ఒకవైపు ఒక వేదిక ఉంది. ఇక్కడ బహుశా బౌద్ధ చిహ్నాలు ఆరాధనకై ఉంచేవారు.

వపియ గుహాలో కూడా పెద్ద చతురస్రాకార హాలు, దాని ముందు అర్ధ మండపం ఉన్నాయి. దీని ప్రక్కనే వేదాంతి గుహ ఉంది. ఇది ఒక గుడిసె (toda) లాగ కనబడుతుంది.

## అశోక స్తంభాలు

అశోకుని ఏకశిలాస్తంభాలు అతని సహజమైన ఆలోచనకు, వాస్తు, శిల్పకళా ఉన్నత స్థాయికి ఉదాహరణలు. అశోక స్తంభాలు మొత్తం 30 ఉండేవి. వీటిలో 10 నేటికీ శిథిలం కాకుండా ఉన్నాయి. వీటిపై ఇతని శాసనాలు ఉన్నాయి. ఈ స్తంభాలు ఇతని యాత్రలను తెలుతుచున్నాయి.

అశోకుని స్తంభాలు 30 అడుగుల నుంచి 40 అడుగుల ఎత్తైన అండంతో (shaft) ఉన్నాయి. తాటి చెట్టు లాగ కింద లావుగాను, పైకి పోనుపోను సన్నగాను (tapering shape) ఉన్నాయి. అండం పైన గంట ఆకార శీర్షిక (capital) ఉంది. అండాలను కలుపుతూ రెండు అడుగుల గొట్టం వంటి లోహపు బోల్టు ఉంది. శీర్షిక పైన ఫలక (abacus) ఉంది. దీనిపైన గుండ్రటి జంతువు లేదా జంతు సమూహాల (నాల్గు) శిల్పం ఉంది. వీటిపైన బౌద్ధ చక్ర చిహ్నం ఉంది.

స్తంభ అండం, శీర్షిక కలిసి కొన్ని 50 అడుగుల ఎత్తున్నాయి. స్తంభాల శీర్షిక దానిపై ఉన్న జంతువులు శిల్పకళలో అద్భుతాలని చెప్పవచ్చు. ఇవి వాస్తు శిల్పకళా పరిణితిని తెలుపు తున్నాయి. ఆనాటి గ్రీకు కళకన్నా పరిణితి చెందిన సహజత్వం గల నిర్మాణాలు. ఇవి అండం, లను కలిపే బోల్టు నాటి కంసాలి నైపుణ్యాన్ని తెలుపుతాయి.

అశోకుని స్తంభాల్లో సారనాథ్, రాంపూర్వ స్తంభాలు ముఖ్యమైనవి. సారనాథ్ స్తంభంపై గంట, ఫలక, 4 జంతువులు ఉన్నాయి. జంతువులలో ఏనుగు, అశ్వం, ఎద్దుల్లో సింహం ఉన్నాయి. ఇవి నాలుగు దిక్కులను తెలుపుతున్నాయని భావిస్తున్నారు. ఈ జంతువుల మధ్య ఉన్న స్థలాల్లో ధర్మ చక్రాలున్నాయి. స్తంభాల మీద ఉన్న జంతువులపై ధర్మచక్రం ఉంది. రాంపూర్వ స్తంభ ఫలక పై పుష్పాలున్నాయి. దీనిపైన ఎద్దు శిల్పముంది. ఇది కూడా సారనాథ్ స్తంభం వలె చాలా అందమైంది. అశోక స్తంభాల ఎక్కువ వివరాల కోసం మౌర్యుల శిల్పకళ చూడాలి. అశోకుని శిల్పాలు గ్రీక్, రోమన ప్రభావంతో నిర్మించారని కొందరి అభిప్రాయం. కానీ తన నిర్మాణాలు శాశ్వతంగా ఉండాలని అశోకుడు ఇటువంటి వాటిని నిర్మించాడని చెప్పవచ్చు.

## స్థూపాలు

బుద్ధుడు, బౌద్ధమత బోధకులు లేదా మహావ్యక్తుల ధాతువులపై స్థూపాలను నిర్మించేవారు. వీటి నిర్మాణాన్ని అశోకుడే తొలుత (ఇటుకతో) ప్రారంభించినట్లు తెలుస్తోంది. ఇతడు 84,000 స్థూపాలను నిర్మించినట్లు ప్రతీతి. వీటిలో కొన్నింటిని హ్యుయాన్‌త్సాంగ్ చూసినట్లు చెప్పాడు. ఇవి సాంచి, సారనాథ్, ప్రయాగ, మొదలైన చోట్ల ఉన్నాయి. వీటిలో సాంచి స్థూపం ప్రపంచ ప్రఖ్యాతి గాంచింది. అశోకుడు దీన్ని ఇటుకతో నిర్మించాడు. దీని ప్రదక్షిణా పథ, వేదికలు

కొయ్యతో నిర్మించారు. శుంగులు కాలంలో ఈ స్తూపంపై రాయి కప్పబడి రెండింతలు చేయబడింది. కొయ్య నిర్మాణాలు, శిలా నిర్మాణాలుగా మార్చడం జరిగింది.

## మౌర్యుల కాలం శిల్పకళ

మౌర్యుల కాలం శిల్పకళ రెండు రీతులుగా ఉంది. అవి: 1)అంతఃపుర కళ లేదా రాజపోషణలోని కళ, 2) ప్రజాకళ లేదా రాజ పోషణ లేని కళ. పాటలీ పుత్ర భవనాల్లోని శిల్పకళ, నాగార్జుని సితామర్హి, బరాబర్ కొండల్లోని అశోకుని గుహాలయాల్లోని శిల్పకళల్లో అశోకుని ఏకశిలా స్తంభాలు మొదటి రీతికి చెందినవి. యక్ష, యక్షిణీప్రతిమలు, మట్టి బొమ్మలు రెండో రీతికి చెందినవి. మొదటిది చక్రవర్తుల భావాలను బట్టి నిపుణులైన శిల్పులు రూపొందించిన శిల్పాల రీతి. కొయ్య శిలలతో మౌర్యులకు పూర్వం నుంచి రూపొందించబడుతుండిన శిల్ప సాంప్రదాయాన్ని కొంత మెరుగు పరచి మౌర్యుల కాలంలో అనుసరించబడిన శిల్ప మట్టి ప్రతిమల రూపణా విధానమే రెండో రీతి.

పాటలీ పుత్రలో మౌర్య చంద్ర గుప్తుడు ఒక రాజభవనాన్ని పెద్ద సభా మందిరాన్ని నిర్మింప చేశాడని ఇదివరకే చదివాం. ఇందులో 80 స్తంభాలున్నాయని, వీటి మధ్య 15 అడుగుల దూరమున్నదని, ఇవి ఒక కొయ్య దిమ్మెపై ఉన్నాయని తెలుసుకొన్నాం. అంతేగాక ఈ స్తంభాలకు బంగారు, వెండితో చేసిన మిరుమెట్లు గొలిపే బొమ్మలు, తీగలు, నగిషీలు, అద్దాలు ఉండేవి. సభా మండప దక్షిణ భాగాన 30 అ. పొడవు 5.4 అ. వెడల్పు 4 1/2 అ. ఎత్తుగల 7 వేదికలుండేవి. కుమ్రాహార్ (పాటలీపుత్ర)లోని ఈ రాజభవన, సభామండపాలు సూస, ఎక్‌బతాన ప్రాంతములందలి సమకాలీన నాగరికతా రాజభవనాల కన్నా అద్భుతమైనవిగా ఉండేవని స్పూనర్ వంటివారు ప్రశంసించారు.

ఇక అశోకుని శిల్పకళను పరిశీలిస్తే అది ఐదు రకాలుగా ఉన్నట్లు తెలుస్తోంది. అవి: (1) ఏకశిలా ఖండ గుహాలయాలు, (2) ఇటుక నిర్మాణ స్తూపాలు, (3) ఏకశిలా స్తంభాలు, (4) ధౌళి, కల్సి ప్రాంతాల్లని ఏకశిలా ఏనుగులు. కాని శిల్ప రీత్యా కడపటి రెండు రకాలు ముఖ్యమైనవి.

నాగార్జుని, సితామర్హి బరాబర్ కొండల్లోని అశోకుని గుహాలయాల లోపల కుడ్యభాగాలపై ఉన్న నునుపైన పాలిష్ వంటి భాగాలు నాటి శిల్పుల నైపుణ్యాన్ని తెలుపుతున్నాయి. సాంచి తొలి నిర్మాణాన్ని అశోకుడే చేపట్టాడు. వీటి వాస్తు వివరాలు మౌర్యుల వాస్తు కళ విభాగంలో మనం ఇదివరకే అధ్యయనం చేశాం.

కాని అశోకుని శిల్పకళా ఖండాల్లో చెప్పుకోదగ్గవి ఏకశిలా స్తంభాలు. ఈ అశోక స్తంభాలు 30 ఉండేవి. భారతదేశానికి వచ్చిన ఫాహియాన్ వీటిలో ఆరింటిని చూసి నట్లు హ్యువాన్ చాంగ్ (హ్యుయాన్‌త్సాంగ్) 15 స్తంభాలను చూసినట్లు తమ రచనల్లో తెలిపారు. అశోక స్తంభాలు

చాల వరకు బుద్ధుని జన్మభూమి లుంబినికి వెళ్ళే మార్గాల్లో నాటబడి ఉన్నాయి. వీటిలో కొన్ని బౌద్ధ స్థూపాలు, విహారాల ముందు నాటినవి కొన్ని బహిరంగ ప్రాంతాల్లో నాటబడి ఉన్నాయి. ఇవన్నీ సుమారు 40 అడుగుల ఎత్తుఉన్నాయి.

అశోక స్తంభాలు మూడు రకాలు ఉన్నాయి. అవి. (1) అశోకుని శాసనాలు స్తంభాలు, (2) శాసనాలు లేని స్తంభాలు, (3) అంకిత శాసనాలున్న స్తంభాలు.

అశోకుని ఏకశిలా స్తంభాలు ఊర్ధ్వముఖంగా (కింది నుంచి పైకి) అండం (shaft), గంట శీర్షిక (bell capital), ఫలక (abacus), జంతుశిల్పం, బౌద్ధ చిహ్నం (ధర్మచక్ర) అనే విభాగాలుగా ఉన్నాయి. అండ విభాగం శిలా నిర్మితమైనను లోహపు స్తంభ అండం లాగ కనిపిస్తున్నది. ఇది కింది నుంచి పైకి పోను పోను సన్నగా ఉంది. భూమి నుంచి 40 అ. ఎత్తున్నది. గుండ్రంగా ఉంది. దీనిపై ఒక విధమైన మెటల్‌పాలిష్ వంటి ఉంది. ఈ పాలిష్ వలనే ఇది లోహ స్తంభంలా కన్పడుతున్నది. ఏ మిశ్రమాలతో ఈ పాలిష్ తయారు చేశారో తెలియటం లేదు. స్తంభం పైన గంటాకార శీర్షిక విభాగమున్నది. దీన్నే బోళించిన గంట, పూర్ణకుంభ, బోళించిన పద్మం ఆకారంలోని capital గా కూడా పలు పేర్లతో పిలుస్తున్నారు. దీని కింద అంచులు వలచగా రూపొంది ఉన్నాయి. పుష్పరేకుల లాగ ఈ శీర్షిక కు గల పట్టీలు అగుపడుతున్నాయి. శీర్షిక పైన ఫలక విభాగముంది. ఇది సాధారణంగా గుండ్రటి ఆకారంలో ఉంది. దీని పక్క భాగాలపై(faces) పుష్పాలు, తీగలు, పక్షులు, అశ్వాలు, ఏనుగులు, సింహాలు, ఎద్దులు వంటివి చెక్కబడి ఉన్నాయి. ఈ చిత్రాలు మధ్య గల స్థలాల్లో అశోక చక్రముంది. ఫలకం (abacus) పైన జంతు శిల్పముంది (animal capital).

అశోక స్తంభాలపై గల జంతు శిల్పాలు (animal capital) శిల్ప చరిత్రలో ఒక అద్భుతం. ఇతని స్తంభాల్లో బఖేరా, రాంపుర్వ, లారియా నందన్‌గర్, రుమ్మిందై, సాంచి, సాలంపూర్, సారనాథ్ స్తంభాలు ముఖ్యమైనవి. బఖేరా ప్రాంతమందలి స్తంభం పరిపూర్ణదశకు చెందని అండాన్ని, చతురస్రాకార ఫలకను, సింహపు శిల్పం (lion capital) ఉన్నాయి. రాంపుర్వ స్తంభాలకు అండం, గంటాకార శీర్షిక గుండ్రటి ఫలక, ఎద్దు శిల్పం (bull capital) ఉన్నాయి. లారియానందన్‌గర్ స్తంభంపై సింహపు శిల్పం (lion capital) ఉంది. రుమ్మిందై స్తంభం పిడుగు దెబ్బకు కొంత నాశనమై ఉంది. దీనిపై అశ్వ శిల్పం ఉంది (horse capital). సాంచి స్తంభంపై నాలుగు సింహాల శిల్పముంది. సాలపూర్ స్తంభంపై నాల్గు చిహ్నాలున్నాయి. సారనాథ్ స్తంభానికి కూడా అండం (tapering shaft).. ఈ స్తంభం అశోక స్తంభాల్లో ముఖ్యమైంది. దీని శీర్షిక గంటాకారం లేక పుష్పాకారంలో ఉంది. దీనిపై గల రేఖలు మందంగాను, వీటి అంచులు వలుచగాను ఉన్నాయి. శీర్షిక పైన గల ఫలక నాలుగు వైపుల ముఖభాగాల్లో నాలుగు జంతువుల శిల్పాలు చెక్కబడి ఉన్నాయి. ఇవి బుద్ధుని జీవితంలోని నాల్గు ముఖ్యఘట్టాలను తెలుపుతున్నాయని కొందరి భావన. ఇవి శివుడు, దుర్గ, సూర్యుడు, ఇంద్రుల వాహనాలని వీటిని ఆ దేవతలుగా భావించవచ్చని బ్లోచ్ అభిప్రాయ పడ్డారు. అశ్వం సూర్యుని వాహనం. ఇక్కడి నాల్గు జంతువుల్లో రెండు బుద్ధుని జీవితానికి సంబంధించినవని ఇతని భావం ఏనుగుకు బుద్ధుని జీవితానికి

సంబంధముందని ఒక గాథ తెలుపుతున్నది. బుద్ధుడు జన్మించే ముందు అతని తల్లి మాయాదేవి తెల్ల ఏనుగు ఆమె ఉదరమందు ప్రవేశించినట్లు కలగన్నది. ఈ కల తరవాత ఆమె గర్భవతియై బుద్ధునికి జన్మనిచ్చింది. ఈకల బౌద్ధ చిత్రలేఖనాల్లో కూడా చిత్రింపబడి ఉంది. సారనాథ్ ఫలకపై అశ్వం, ఎద్దు ఎందుకు చూపించారో స్పష్టంగా తెలియటం లేదు. ఫలకపై గల జంతువుల మధ్య అశోక చక్రముంది. ఇవి అశోక ధర్మాన్ని తెలుపుతున్నాయి. వీటికి 32 ఆకులు (spokes) ఉన్నాయి. ఇవి నాల్గు దిక్కులను తెల్పుతున్నాయని కొందరి అభిప్రాయం. సారనాథ్ స్తంభం పై భాగాన ఒకే వేపు గల నాల్గు సింహాల శిల్ప(four addorsed lions) ఉంది. నాలుగు సింహాలూ నాలుగు దిక్కులను చూస్తున్నాయి.

ధౌళి ప్రాంతమందలి ఏనుగు, రాంపుర్వ ప్రాంతమందలి వృషభాల శిలాప్రతిమలు మౌర్యుల పరిణతి శిల్పకళకు ముఖ్య తార్కాణాలు. ధౌళి యందలి ఏనుగు ఒక పెద్ద బండ నుంచి లేదా గుహ నుంచి వెలుపలికి వస్తున్నట్లుగా రూపొందింపబడి ఉంది. ఇది కళాత్మకంగాను, సహజసిద్ధంగాను ఉంది. ధౌళి ఏనుగు లాగ రాంపుర్వ వృషభం సహజత్వంతో ఉంది.

మౌర్యుల వాస్తు శిల్పాల వివరాలన్నింటిలోకి అశోకుని స్తంభాల విషయంలో భిన్నమైన అభిప్రాయాలు ఉన్నాయి. నున్నటి పాలిష్ గల ఈ స్తంభాలను చూసిన బిషప్ హెబర్ ఇవి నల్లని లోహపు పోత స్తంభాలని భ్రమపడ్డారు. సర్‌జాన్‌మార్షల్, స్పూనర్, సెనార్ట్ మొదలైన పాశ్చాత్యులు అశోక స్తంభాలపై పర్షియా శిల్పకళా ప్రభావం ఉందని భావించారు. అశోక స్తంభాల్లోని గంటాకార శీర్షిక వాటిపై గల పాలిష్, శాసనాలు చెక్కడం మొదలైన వివరాలు పర్షియన్ ప్రభావాన్ని తెలుపుతున్నాయని వీరి భావన. పాటలీపుత్రలోని రాజభవనంపై పర్షియా రాజభవనాలైన సూస, పెర్సిపొలిస్‌ల ప్రభావం ఉందని కూడా వీరి అభిప్రాయం. అంతేగాక అశోక స్తంభాలపైన జంతు శిల్పాలు ఉంచే విధానం బ్యాక్ట్రియా ద్వారా భారతదేశానికి వచ్చిన పర్షియన్ శిల్ప కళా ప్రభావమని వీరి అభిప్రాయం. కాని అగర్వాల వంటి వారు వీరి అభిప్రాయం సరైంది కాదని భావిస్తున్నారు. దీనికి అనేక కారణాలు ఉన్నాయి అవి:

1. మౌర్యుల శిలా స్తంభాలు, ఏక శిలా నిర్మితాలు. కాని పర్షియన్ స్తంభాలు కట్టడ స్తంభాలు ఏకశిలా నిర్మితాలు కావు.
2. మౌర్యుల స్తంభాలు గుండ్రంగా ఉన్నాయి. పర్షియన్ స్తంభాలునిలువు పట్టీలు లేక ఫలకల (flooted) ఆకారంలో ఉన్నాయి.
3. అశోక స్తంభాలు వడ్రంగి స్తంభాలను చెక్కి రూపొందించాడా అన్నట్లు అందంగా ఉన్నాయి. కాని పర్షియన్ స్తంభాల్లో శిల్పి పనితనం బదులు తాపీ వాని పనితనం (మొరటు రీతిలో) కనిపిస్తుంది.
4. అశోక స్తంభాలు భవనాల అంతర్భాగంలో గాక భవనాలకు దూరంగా లేదా భవనాలు లేని చోట్ల బహిరంగ ప్రాంతాల్లో ఆధారరహితంగా నాటబడి ఉన్నాయి. కాని పర్షియన్ స్తంభాలు భవనాల అంతర్భాగంగా నిర్మించబడి ఉన్నాయి.

5. అశోక స్తంభాలు పర్షియన్ స్తంభాల కన్నా అద్భుతమైన పాలిష్ కలిగి లోహపు స్తంభాల్లాగ భ్రమింప చేస్తున్నవి.

6. మౌర్య స్తంభాల శీర్షిక భాగాలు చూచటానికి సాదాగా ఉన్నాయి. కాని పర్షియన్ స్తంభాల శీర్షిక సంక్లిష్ట (complex and complicated) రీతిలో ఉన్నాయి. అంతేగాక కళాత్మకం, నిండుతనాన్ని కల్గి ఉన్నాయి.

పై అంశాలు వల్ల అశోక స్తంభాలు పర్షియన్ ప్రభావాన్ని కల్గినవి కావని, పూర్తిగా స్వదేశీయ వాస్తు శిల్ప సాంప్రదాయం నుంచి పుట్టిన కళయని అగర్వాల వంటి వారు అభిప్రాయపడుతున్నారు. కాని పూర్తిగా అగర్వాల అభిప్రాయాన్ని బలపరచడానికి వీలు పడదు. పర్షియన్ ప్రభావం అశోక స్తంభాలపై కొంతమేరకు కలదని చెప్పవచ్చు. అశోక స్తంభాల రూపణకు ప్రభావితం చేసిన అంశం ఏదైనప్పటికీ ఈ స్తంభాలు ప్రపంచ శిల్పకళలో ప్రముఖ స్థానాన్ని కలిగి ఉన్నాయి. మౌర్యులు భారతీయ శిల్పకళను అంతర్జాతీయ స్థాయికి పెంచారు. పర్షియన్, గ్రీకు శిల్ప కళల కన్నా ఉన్నతంగా రూపొందింప జేశారు. మౌర్యరాజ్య, పాలనా విశిష్టతలతో బాటు శిల్ప కళా ఔన్నత్యాన్ని మౌర్యులు తమ పోషణలో అంతర్జాతీయంగా పేరు ప్రఖ్యాతులు పొందునట్లు చేశారు.

ప్రజాకళ లేదా రాజపోషణలేని శిల్పకళకు పాట్నాయందలి యక్ష, పర్కాం యందలి యక్ష, దిదర్గాంజ్ యక్షిణి ప్రతిమలు ముఖ్య ఉదాహరణలు. ఇవన్నీ చైనార్ నందలి ఇసుకరాయి (sand stone) తో తయారు చేశారు. ఇవి ఒకరకమైన అద్భుతమైన పాలిష్‌ను కలిగి యున్నాయి. ఇవి మథురా శిల్పకళ మొదటి దశకు చెందినవని నిహార్ రంజన్ రే అభిప్రాయపడ్డారు. కాని ఇవి మౌర్య కాలానివని అగర్వాల శివరామమూర్తి భావించారు. దిదర్గాంజ్ యక్షిణి ఆధునికతను నింపుకొని ఉంది.

# 4

# శుంగుల (క్రీ.పూ. 185-73) వాస్తు శిల్పకళ

అశోకుని మరణంతో మౌర్య సామ్రాజ్య పతనం ఏర్పడి పుష్యమిత్ర శుంగుడు క్రీ.పూ. 185లో శుంగ వంశాన్ని స్థాపించాడు. శుంగుల పతనం తరవాత కాణ్వులు వంశ స్థాపన చేసి క్రీ.పూ. 75-30 మధ్య రాజ్యపాలన చేశారు. వీరి పాలనలతో భారతదేశంలో విశాల సామ్రాజ్యం అంతరించి దాని స్థానంలో చిన్న రాజ్యాలు వెలశాయి. పశ్చిమ భారతదేశంలో అదే కాలంలో యవనులు రాజ్య స్థాపన చేశారు. క్రీస్తు పూర్వం చివరి రెండు శతాబ్దాల్లో దేశంలో రాజకీయ మార్పులు జరుగుతున్నా సాంస్కృతిక కళా విషయాల్లో అభివృద్ధి సాగుతున్నది. ఈ విధంగా అభివృద్ధి చెందుతున్న శిల్పకళకు ఉత్తర భారతదేశంలోను, మధ్య భారతదేశంలోను బార్‌హుత్, బుద్ధగయ, సాంచి, మధుర వంటి ప్రాంతాలు కేంద్రాలైనాయి.

శుంగుల వాస్తు శిల్పకళకు బార్హుత్, బుద్ధగయ, సాంచి ముఖ్య కేంద్రాలైనాయి. వీరి శిల్పకళ మౌర్యుల రీతికి భిన్నమైందే గాక విదేశీ ప్రభావం లేంది. మౌర్యుల కాలంలోలాగ ఏకశిలా స్తంభాలు, గుహాలయాలైన చైత్యాలు, విహారాలు వీరి కాలంలో నిర్మింపబడలేదు. వీటి బదులు బౌద్ధ స్తూపాల నిర్మాణం జరిగింది. శుంగుల శిల్పకళలో కొన్ని ముఖ్యాంశాలు ఉన్నాయి. అవి:

1. మౌర్యుల శిల్పకళ లాగ లోతైన చెక్కడం, గుండ్రటి రూపంలో మలచడం శుంగుల శిల్ప కళలో కనపడదు. వీరి కాలంలో శిల్పాన్ని గుండ్రంగా మలచడం అరుదు. ఎక్కువగా అర్ధ శిల్ప రీతి కనపడుతుంది.
2. మౌర్య కాలంలో కథాయుక్తమైన శిల్పాలు లేవు. కాని శుంగుల కాలంలో జాతక కథలు తెలిపే కథా వివరణ శిల్పాలు (narrative sculptures) అత్యధికంగా ఉన్నాయి.
3. మౌర్య కాలంలో జంతు సంబంధమైన శిల్పాలు అధికంగా ఉంటే శుంగుల కాలంలో మానవ శిల్పాలు అధికంగా ఉన్నాయి. కోసల రాజైన ప్రసేన జిత్తుడు బుద్ధుని వద్దకు వెళ్ళడం, అజాత శత్రు వంటి శిల్పాలు ఉన్నాయి.
4. మౌర్య కాలపు శిల్పకళ చక్రవర్తుల పోషణలో వృద్ధి చెందితే శుంగుల కాలపు శిల్పకళ బౌద్ధ సంఘం చేత, భూస్వాములు, ధనికులు, సామాన్య ప్రజల చేత పోషింపబడింది.
5. మౌర్య శిల్ప కళలో పరిణితి దశ కనపడుతున్నది. కాని శుంగుల కళలో ఆటవిక ప్రాథమిక దశలోని నాగరికతల్లోని శిల్ప రీతులైన వృక్ష పూజ వంటివి అనేకాలు ఉన్నాయి.

6. మౌర్య కళపై పర్షియన్ శిల్పకళా ప్రభావం ఉంటే శుంగుల కళ స్వదేశీయంగా ఏర్పడి అభివృద్ధి చెందింది. కానీ కొన్ని అంశాల్లో పశ్చిమాసియా శిల్పకళా ప్రభావం లేకపోలేదు.
7. మౌర్య శిల్పాలు స్వేచ్ఛగా, విడిగా, ఏకాకిగా నిలుపబడి ఉన్నాయి. కాని శుంగుల శిల్పాలు విడిగా రూపొందించక పెద్ద శిలాఖండాల మీద చెక్కబడి ఉన్నాయి.
8. శుంగుల చిత్రాలకు చరణ చిత్రాలని పేరు. వస్త్రంపై బుద్ధుని జీవిత ఘట్టాలు చిత్రించే విధానం ఉండేది. వీటిని శుంగుల శిల్పంలో రూపొందించారు. ఇట్టి రీతి సాంచి, బారహుత్ తోరణాల్లో కూడా కనపడుతుంది.
9. శుంగుల శిల్పకళ బౌద్ధమత సంబంధమైనవి. ఇవి నాటి సంస్కృతి, సాంప్రదాయం, ఆలోచనా రీతులను ప్రతిబింబిస్తున్నాయి.
10. శుంగుల శిల్పాల్లో రేఖా ప్రవాహం (flowing lenior rhytham) కనపడుతుంది. భక్తులు, జంతువులు, నాట్యగత్తెల శిల్పాల వంటి వాటిలో ఇది కనవడుతుంది.

**a) బార్హూత్ స్తూపం**

బార్హుత్ ప్రాంతంలో అశోకుడు నిర్మించినట్లుగా తెలిపే స్తూపం ఉంది. సాంచి స్తూపంలాగ దీని నిర్మాణ భాగాలను కూడా తరవాత కాలంలో ఇతర రాజవంశీయులు పెంచారు. బార్హూత్ స్తూపం చుట్టూ గల వేదీ లేక ప్రాకార (railing) తోరణాలు క్రీ.పూ 150 నాటి శుంగుల కాలానివి. వాటిపై శుంగుల కాలపు శిల్పాలున్నాయి. అవి: సుమారు 20 జాతక కథలు, 6 చారిత్రక దృశ్యాలు - బుద్ధుని వద్దకెళ్లుతున్న ప్రసేన జిత్తుడు, బుద్ధుని వద్దకెళ్లుతున్న అజాత శత్రువు, సుమారు 30 యక్ష, యక్షిణి, దేవత, నాగరాజు శిల్పాలు మొదలైనవి ఉన్నాయి. ఇక్కడి శిల్పాల కింద చాలా వాటికి పేర్లు ఉన్నాయి. బార్హూత్ శిల్పాల్లో వివరణాత్మక గాథలున్నాయి. శిల్పాలు మితిమీరిన సంఖ్యలో ఉన్నాయి. ఈ శిల్పాలన్నింటిని కింది అంశాల కింద అధ్యయనం చేయవచ్చు. అవి :

1. మానవాతీతులైన యక్ష, యక్షిణి, దేవత, నాగరాజ, అప్సరస శిల్పాలు.
2. మానవులైన రాజులు, అధికారులు, మత ప్రచారకులైన సన్యాసులు మొదలైనవారు.
3. జంతువులు.
4. ఆరాధనా శిల్పాలైన స్తూప, ధర్మచక్ర, బౌద్ధ వృక్షం, బుద్ధుని పాదాలు, త్రిరత్నాలు, వృక్షాలు, ఫలాలు.
5. జాతక కథలు, చారిత్రక, మిశ్రమ, హాస్యచిత్రాలు.
6. స్తంభాలపై గల శిల్పాలు - అంతఃపురాలు మొదలైనవి.

**1. మానవాతీతుల శిల్పాలు**

మానవాతీత లేదా దేవతా శిల్పాల్లో స్త్రీ శిల్పాలే అధికం. వీటిలో శిరిమ దేవత, చుళకోక దేవత, మహాకోక దేవత శిల్పాలు ముఖ్యమైనవి. సంపద, జన్మనిచ్చే దేవతైన శ్రీలక్ష్మియే

శిరిమ దేవత. చుళకోక, మహాకోక దేవతలు అక్కచెల్లెళ్ళు.

నాగ శిల్పాల్లో ఎరావటు నాగరాజు ముఖ్యుడు. ఇతడు నీళ్లలో సగం మునిగి కుటుంబ సభ్యులతో బాటు బోధివృక్షాన్ని ఆరాధిస్తున్నాడు. ఇతనికి మానవాకారం కలిగి ఉంది. కానీ కుషాణ శిల్పాలతో లాగ పడగల్లో ఉన్నాడు.

బార్హూత్‌లో అప్సరసల శిల్పాలు కూడా ఉన్నాయి. వీరిలో సుదర్శన, అలంబుస, మిశ్రకేసి, సుభద్ర ముఖ్యులు.

**2. మానవ శిల్పాలు**

కోసల రాజైన ప్రసేన జిత్తుడు బుద్ధుని సందర్శించడానికి ఏనుగుపై పెద్ద పరివారంతో వెళ్తున్న శిల్పం బార్హూత్‌లో ఉంది. ఇతడు ఏనుగు దిగి ముకుళిత హస్తాలతో బుద్ధుని సింహాసనానికి నమస్కరిస్తున్నాడు. మరో శిల్పంలో మత ప్రచారకులు సాంప్రదాయ బద్ధమైన దుస్తులతో ఆశ్రమ వాతావరణంలో ఉన్నట్లు చూపటం జరిగింది.

**3. జంతువులు**

బార్హూత్ జంతువుల శిల్పాలు రెండు రకాలుగా ఉన్నాయి. అవి 1. ప్రకృతి పరమైనవి, (2) కృత్రిమ రూప (fabulous) జంతువులు. మొదటి తరగతికి చెందిన వాటిలో మొసలి, తాబేలు, బల్లి, గొర్రె, కోతి ఉన్నాయి. రెండో తరగతికి చెందిన వాటిలో చేపతోక గల ఏనుగు, చేప తోక మొసలి, రెక్కల గుర్రం ఉన్నాయి.

**4. ఆరాధనా వస్తువులు**

బార్హూత్ శిల్పాల్లో స్తూప, ధర్మచక్ర, బోధివృక్షం, బుద్ధుని పాదాలు, బుద్ధుని శిరోజాలు, బుద్ధుని తలకట్టు, త్రిరత్న చిహ్నాలనే ఆరాధనా వస్తువులు (శిల్పాలు) ఉన్నాయి. ఆనాడు బుద్ధుని శిల్పరూపంలో గాక చిహ్నరూపంలో ఆరాధించే వారని ఇవి ధృవీకరిస్తున్నాయి.

**5. జాతక కథలు**

బుద్ధుని పూర్వజన్మ వృత్తాంతాలు తెలిపే కథలను జాతక కథలంటారు. వీటిలో వెస్సంతర జాతక, మృగ జాతక, నాగ జాతక, మొదలైనవి ఉన్నాయి. ఈ వర్గంలో బుద్ధుని సందర్శించడానికి వెళుతున్న విధురపండితుడు శిల్పం కూడా ఉంది.

### స్తంభాల శిల్పాలు

బార్హుత వద్ద అనేక ఏడి స్తంభాలను కనుక్కోడం జరిగింది. వీటిపై అనేక శిల్పాలు ఉన్నాయి. వీటిలో ప్రసేనజిత ఉన్న స్తంభం ఒకటి. దీనిపై సింహాసన ఆరాధన, ధర్మచక్ర ఆరాధన, ఏనుగులు ఆరాధిస్తున్న సింహాసనం, నల్గురు నాట్యగత్తెలు, ఎనిమిది మంది సంగీత విద్వాంసులు, స్తూపాన్ని ఆరాధించడానికి వెళుతున్న జంట, నాగరాజు ఏరాపటు శిల్పాలు ఉన్నాయి. అజాత శత్రు స్తంభం అనే మరో దానిపై ఉన్న శిల్పాలు కఠినంగా, విడివిడిగా, నిలువు అడ్డ గీతల లాగ ఉన్నాయి. ఈ స్తంభంపై దీర్ఘచతురస్రాకార పథకాలున్నాయి. తలపాగ ఆరాధన, బుద్ధపాద ఆరాధన శిల్పాలు కూడా ఉన్నాయి.

భారత తొలి, ప్రాచీన శిల్పకళకు బార్హుత్ ఒక ముఖ్య ఉదాహరణ. ఇక్కడి శిల్పాలు అణకువ, నిగ్రహం, స్పష్టత గుణాలను కలిగి ఉన్నాయి.

### b) బోద్‌గయ శిల్పాలు

గయకు దక్షిణాన ఆరుమైళ్ల దూరంలో బోద్‌గయ ఉంది. ఇక్కడి అశోకుని స్తూపం వేదిక (railing) శుంగుల కాలం నాటిది. సుమారు క్రీ.పూ. 75 నాటిది. అనేక శిల్పాలు ఉన్నాయి. వీటి ముఖ్యాంశాలు కింది విధంగా ఉన్నాయి.

1. బోద్‌గయ శిల్పాలు బార్హుత్ శిల్పాల కన్నా లోతుగా బండలో తొలచబడి (in high relief) గుండ్రంగా రూపొందించబడి ఉన్నాయి.
2. బార్హుత్ శిల్పాలలోని కథలు బోద్‌గయ శిల్పాలు చెక్కే కాలానికి బాగా ప్రచారంలోనికి వచ్చి ఉండటం వల్ల వాటి కింద పేర్లు (labels) లేవు.
3. బార్హుత్‌లో ఉన్నట్లు కథలు వివరణాత్మకంగా లేవు. క్లుప్తంగా చెప్పబడి ఉన్నాయి.
4. మానవ రూపాలు స్వేచ్ఛాయుత జీవుల లాగ అద్భుతంగా చెక్కబడి ఉన్నాయి.
5. బోద్‌గయ శిల్ప జంతువులు, చెట్లు రూపొందించడంలో కూడా ఎక్కువ శ్రద్ధ తీసుకోడం జరిగింది. ఏనుగు, జింక, దుప్పి, రావిచెట్టు, పద్మతీగలు వంటి చిత్రాలున్నాయి.
6. బోద్‌గయ శిల్పాలు అందంలోగాని, సాంకేతికంగా గాని బార్హుత్ శిల్పాలకన్నా మేలైనవి. మితిమీరిన రీతిలో గాక శిల్పాలు పరిమిత సంఖ్యలో ఉన్నాయి. అనవసర కథా అంశాలు తొలగించబడి ఉన్నాయి.
7. బోద్‌గయ శిల్పాలు మితమైన లావును, స్పష్టతను, క్రమశిక్షణను, పొట్టి రూపాన్ని కలిగి ఉన్నాయి.
8. శిల్పాల అంగరూపణ బట్టి వెచ్చటి రక్తాన్ని గల శరీరం, మృదువైన కండరాలతో ఆరోగ్యం, యువత గల రూపాలుగా భావించుటకు వీలవుతుంది.

బోద్‌గయ శిల్పాల ఉదాహరణ:

1. బోద్‌గయలో వేదిక (railing) నిలువులు, ఉష్ణిష లపై తామరల వరుసలున్నాయి.
2. వెస్సంతర జాతక, ఛద్దంత జాతక, కిన్నర జాతక మొదలైన జాతక కథలు ఉన్నాయి.

3. బుద్ధుని జీవిత గాథలను తెలిపే చారిత్రక శిల్పాలు కూడా ఉన్నాయి. వీటిలో గంధర్వ పంచశిఖుడు ఇంద్రశాల గుహ ముందు నిలుచొని ఉండడం, అంజలి ముద్రలో, గుహాముందు ఉన్న మిథున శిల్పాలు, లోపల వజ్రాశనం గల గుహాముందు కూర్చొని ఉన్న ఋషి శిల్పాలు ముఖ్యమైనవి.
4. బోద్‌గయలో మిథున శిల్పాలు కూడా ఉన్నాయి. స్తంభాల ముందు లేదా వెనుకదా విడిగా ఉన్న మిథున శిల్పాలు, కల్పవృక్షం వద్ద ఉన్న మిథున జంటలు, మంచం couch పై కూర్చొని ఉన్న మిథున శిల్పం వీటిలో ముఖ్యమైనవి. ఒక అంతఃపురం, దానిపై తోరణమున్నట్లు, ఒక వేదికపై ఒక పురుషుడు ఇద్దరు స్త్రీలతో వేదిక (railing) వెనుకగా ఉన్నట్లు కూడా ఒక శిల్పముంది.
5. బోద్‌గయలో గజలక్ష్మి శిల్పముంది. ఇది శ్రీదేవి ఆరాధనను తెలుపుతుంది.
6. మిథున జంట బోధివృక్షాన్ని ఆరాధిస్తున్న శిల్పం ఉంది.
7. ధర్మ చక్ర, త్రిరత్న స్తూప ఆరాధనా శిల్పాలున్నాయి.
8. యక్ష శంకు కర్ణుని శిల్పముంది.

## ఇతర శిల్పాలు

1. ఒక దేవకన్య (nymph or dryed)కింద ఉన్న యక్షుని సహాయంతో చెట్టునెక్కుచున్నట్లున్న శిల్పం.
2. తల్లి బిడ్డలు ఒక పొట్టేలుతో బాటు ఉండటం.
3. పూర్ణకుంభంపై నిలుచొని ఉన్న స్త్రీ శిల్పం కలదు. దీన్ని శ్రీలక్ష్మి శిల్పంగా భావిస్తారు. మథురలో తామరల మధ్య ఉన్న శ్రీలక్ష్మి శిల్పం ఉంది.

## మిశ్రమ శిల్పాలు

1. 64 చతురాల్లో 8×8 సంఖ్యగల దాయాల బోర్డుపై ఆడుతున్నట్లున్న మిథున శిల్పం.
2. జేతవన బహుమాన శిల్పం.
3. బోధి వృక్షాన్ని ఆరాధిస్తున్నట్లున్న ఏనుగుల గుంపు.

బోద్‌గయ శిల్పాల్లో అనేకం జంతువులవే ఉన్నాయి. వీటిలో రెక్కల సింహం, రెక్కల గుర్రం, రెక్కల ఏనుగు, చేపతోక మనిషి, ఎద్దు, పొట్టేలు, మకరం మొదలగు కృత్రిమ రూప (fabulous) జంతువులు కూడా ఉన్నాయి. వీటిలో జలచరాలు, భూచరాలున్నాయి.

బార్హుత్ శిల్పాలను వృద్ధిచేసి సాంచి, మథుర శిల్పులకు బోద్‌గయ శిల్పి అందించాడని చెప్పవచ్చు. బోద్‌గయ శిల్పాల్లో సహజత్వమున్నది. బోద్‌గయ స్తూపం పలుమార్లు పునర్నిర్మాణాన్ని పొందింది. చివరగా గుప్తుల కాలంలో పునర్నిర్మాణాన్ని (restoration) పొందింది.

**c) భాజ చైత్య గృహం**

కడపటి శుంగుల కాలపు నిర్మాణం భాజ చైత్య గృహం. ఇది గుహాలయం (చైత్య). దీని వివరాలకు బౌద్ధ చైత్య గృహాల అధ్యాయంలో చూపటం జరిగింది.

**d) సాంచి**

బౌద్ధ శిల్పకళ, బౌద్ధ నిర్మాణాలకు కేంద్రమైన వాటిలో సాంచి ఒక ముఖ్యమైంది. సాంచిలో, దాని పరిసరాల్లో దాదాపు 60 స్తూపాలు నిర్మింపబడ్డాయి. ఈ ప్రాంతమందలి నిర్మాణాలన్నింటిని కలిపి 'భిల్సాతోప్స్' అంటారు. ఈ నిర్మాణాలు అశోకుని కాలం మొదలుకొని సుమారు వెయ్యి సంవత్సరాలు సాగాయి. సాంచి కొండపై ఆసక్తికరమైన స్తూపాలు, విహారాలు, దేవాలయాలు మొదలైనవి అనేకాలున్నాయి. గుప్తకాలంలో ఈ నిర్మాణాలన్నింటికీ కలిపి 'కాకనాదబోత' విహారమని పేరు.

సాంచియందలి శుంగుల కాలపు నిర్మాణాల ఉదాహరణకు ఒకటి,రెండు, మూడు, సంఖ్యగల స్తూపాలు ముఖ్యమైనవి. నేటికీ ప్రాచీన ఔన్నత్యం ఉంది. ఒకటో స్తూపానే "మహాచైత్య" అంటారు. ఇది పై మూడింటిలో పెద్దది. మిగిలిన రెండూ చాలా చిన్నవి. మూడో స్తూపంలోనే బౌద్ధ బోధకులు శారిపుత్ర, మహామొగ్గలాయన ధాతువులు ఉంచడం జరిగింది.

ఒకటో స్తూపం శిలా అండం (stone egg), పెద్ద ఛత్రం (umbrella), హర్మిక, నేల మీది వేదిక (railing), నేలపై గల గచ్చు మార్గం (కొండమీద), బెర్మ్ చుట్టాగల వేదిక, సోపానం (flanking steps), సుంగుల కాలపు నిర్మాణాలు. ఇవి క్రీ.పూ. సుమారు 150-50 మధ్య కాలానివి. ఈ స్తూపం ఇటుకతో అశోకుని కాలంలో నిర్మించడం జరిగింది. కాని శుంగుల కాలంలో రాతి కప్పు వేయబడి రెండింతలు చేయడం జరిగింది. ఆంధ్ర రాజుల కాలంలో దీనికి తోరణాలు నిర్మింపబడ్డాయి. రెండో స్తూపం నేల మీది వేదిక శుంగుల కాలంలో నిర్మింపబడింది. మూడో స్తూపం వేదికలు శుంగుల కాలం నాటివి. ఇవన్నీ సుమారు క్రీ.పూ. 150-50 మధ్య కాలం నాటివి. నలభై సంఖ్య ఆలయం (plinth) క్రీ.పూ. 200 నాటి క్రీ.పూ. 50 నాటి స్తంభాలు శుంగ కాలం నాటివి. పై మూడు స్తూపాల్లో ఒకటో స్తూపం ప్రసిద్ధి పొందింది. దీని తోరణాలపై గల శిల్పాలు ప్రపంచ ప్రఖ్యాతి పొందాయి.

5

# ఆంధ్ర (శాతవాహనుల) శిల్పకళారీతి

క్రీస్తుపూర్వం 232లో అశోకుడు మరణించిన తరవాత దక్కన్ ప్రాంతంలో ఆంధ్రశాతవాహనులు స్వతంత్ర రాజ్యాన్ని ఏర్పరచారు. వీరి రాజ్యం మధ్య భారతదేశంనుంచి తమిళ ప్రాంతాల వరకు వ్యాపించింది. వీరి రాజ్యాన్నే శాసనాల్లో శాతవాహన రాజ్యమని, పురాణాల్లో ఆంధ్ర రాజ్యమని అన్నారు. వీరి కాలంలో వాస్తు శిల్పకళ విశేషంగా అభివృద్ధి చెందింది. దక్కన్‌లోని సాంచి, కార్లె, భాజ, అజంతా ప్రాంతాలు, ఆంధ్ర ప్రాంతంలోని అమరావతి, జగ్గయ్యపేట, నాగార్జున కొండ, గుమ్మడి దుర్రు మొదలైనవి ఆంధ్ర శాతవాహనుల శిల్పకళా రీతికి ముఖ్య కేంద్రాలుగా ఉండేవి. వీటి వాస్తు వివరాలు వేరొక అధ్యాయంలో ఇవ్వడమైంది. ఆంధ్ర ప్రాంతాల శిల్పకళారీతిని అమరావతి శిల్పకళ అని కూడా అంటారు.

## సాంచి శిల్పకళ

అశోకుడు 84,000 స్తూపాలను నిర్మింపచేశాడని ప్రతీతి. వీటిలో సాంచి మహాచైత్య (1వ స్తూపం) ఒకటి. 60 అడుగుల వ్యాసంతో, 25 అడుగుల ఎత్తుగా దీన్ని అశోకుడు నిర్మింప చేశాడు. ఇది ఇటుకతో నిర్మించటం జరిగింది. స్తూపం చుట్టూ కొయ్యతో వేదిక నిర్మించడం జరిగింది. స్తూపం దక్షిణాన అశోక స్తంభం నాటటం జరిగింది.

అశోకుడు నిర్మించిన స్తూపం శుంగులు, కాణ్వులు ఆంధ్ర శాత వాహనుల కాలంలో మార్పులు చెందాయి. శుంగుల కాలంలో ఇటుక స్తూపం అండంపై శిలలు కప్పడం జరిగింది. అప్పుడు దీని వ్యాసం, ఎత్తుల పరిమాణం రెండింతలు పెరిగింది. దీని కొయ్య వేదిక స్థానంలో శిలా వేదిక నిర్మింపబడింది. ఇది 9 అ. ఎత్తున్నది. స్తూప అండం (base or drum) చుట్టూ 16 అ. ఎత్తుగా పై ప్రదక్షిణా పథ నిర్మింపబడింది. దీని దక్షిణాన రెండు వైపులుగా రెండు సోపానాలు నిర్మింపడం జరిగింది. అండంపైన పూర్వపు చదరపు భాగంలో వేదిక గల హార్మిక (railed enclosure) దాని పైన ఛత్రవళి (triple umbrella) నిర్మించడం జరిగింది. స్తూపం చుట్టూ వేదిక లోపల భూమికి సమతలంగా మరో ప్రదక్షిణా పథ ఉంది.

క్రీస్తు పూర్వం ఒకటవ శతాబ్దంలో ఈ సాంచి స్తూపానికి నాలుగు దిక్కుల్లో నాలుగు తోరణాలు (gateways) నిర్మించటం జరిగింది. ఇవి ఒక్కొక్కటి 34 అడుగుల ఎత్తున్నాయి. రెండు నిలువు స్తంభాలపైన మూడు అడ్డ విభాగాలున్నట్లు వీటిని రూపొందించారు. ఈ తోరణాల

లాగానే ఈ స్తూపం ప్రపంచ ప్రసిద్ధమైనదిగా పేరు గాంచింది. ఈ తోరణాలు ఏసుక్రీస్తు జీవించి ఉన్న కాలంలో నిర్మించడం జరిగింది. వీటిపై అనేక అద్భుత శిల్పాలు చెక్కబడి ఉన్నాయి. కొన్ని పలుసార్లు చెక్కబడి ఉన్నాయి. సాంచి శిల్పి లోకసంబంధమైన అందాలనే తన చెక్కడాలకు అధికంగా ఎన్నుకొన్నట్లు కనిపిస్తున్నది.

సాంచి తోరణాల శిల్పాలను రెండు విభాగాలుగా చేసి పరిశీలించవచ్చు. అవి: (1) పలు పర్యాయాలు తోరణాలపై చెక్కబడి చిహ్నారూపంలో ఉన్న అందమైన శిల్పాలు. (2) ప్రతి తోరణంలో తేడాగా ఉన్న విశాలమైన శిల్పాలు.

**1. మొదటి విభాగం శిల్పాలు**

మొదటి విభాగం శిల్పాలను నాలుగు విభాగాలుగా అధ్యయనం చేయవచ్చు. అవి

a) బుద్ధుని జీవితంలోని నాల్గు ముఖ్యఘట్టాలు.
b) యక్ష, యక్షిణి శిల్పాలు
c) జంతు, పక్షి సంబంధమైన శిల్పాలు
d) వృక్ష సంబంధమైన శిల్పాలు

**a) బుద్ధుని జీవితంలోని నాల్గు ముఖ్యఘట్టాలు**

జాతి (జన్మ), సంబోధి, ధర్మ చక్ర ప్రవర్తనం, మహా పరినిర్వాణం అనే నాలుగు ముఖ్యమైన బుద్ధుని జీవిత ఘట్టాలకు చెందిన శిల్పాలు సాంచి తోరణ శిల్పాల్లో కనపడతాయి. బుద్ధుని జన్మ విషయం పూర్ణ ఘట్టం నుంచి ఉద్భవిస్తున్న తామర పుష్పం లేదా తామర పుష్పాల గుర్తు చిహ్నాలతో ఉంది. కొన్ని శిల్పాల్లో మాయాదేవి బాగా వికసించిన తామరపుష్పంపై కూర్చొని ఉన్నట్లు చూపడం జరిగింది. బుద్ధుని జన్మకు చిహ్నంగా ఒక రావి చెట్టు, దాని కింద ఒక సింహాసనం ఉన్నట్లు చూపడం జరిగింది. దీన్ని భక్తులు ఆరాధిస్తున్నట్లు కొన్ని శిల్పాల్లో చూపబడింది. మరి కొన్నింటిలో 'మార' మొదలైన రాక్షసులను కూడా చూపారు. జింకల వనంలోని బుద్ధుని ధర్మచక్ర ప్రవర్తనాన్ని ఒక చక్రం చిహ్నారూపంలో చూపడం జరిగింది. కొన్ని శిల్పాల్లో ఈ చక్రం ఒక సింహాసనంపై ఉంచినట్లుంది. మహాపరినిర్వాణాన్ని స్తూప రూపంలో తెలుపడం జరిగింది. దీనిని కొందరు ఆరాధించుచున్నట్లు చూపటం జరిగింది.

**b) యక్ష, యక్షిణి శిల్పాలు**

తోరణాల పైన గల మూడు అడ్డ దూలాలు (architraves) ఒక దానికి మరొక దానికి మధ్య గల నిలువులు పై (upright) అద్భుతమైన యక్ష, యక్షిణి శిల్పాలు చెక్కబడి ఉన్నాయి.

**c) జంతు, పక్షి సంబంధమైన శిల్పాలు**

సాంచి తోరణాల్లోని జంతువులు, పక్షులు జంటగా చూపటం జరిగింది. జంతువుల్లో

సహజమైనవి, అసహజమైనవి ఉన్నాయి. కొన్ని శిల్పాల్లో జంతువులపై వ్యక్తులున్నారు. సాంచి జంతువుల్లో ఏనుగు, అశ్వం, సింహం, వృషభం, ఒంటె ఉన్నాయి.

### d) వృక్ష సంబంధమైన శిల్పాలు

సాంచిలో వృక్ష సంబంధమైన శిల్పాలు అద్భుతంగా ఉన్నాయి. ప్రకృతిని క్షుణ్ణంగా పరిశీలించి శిల్పి వీటిని చెక్కినట్లు తెలుస్తుంది. తామర పుష్పం, తీగలతో ఉన్న తామర, గావి చెట్టు ఇక్కడి వృక్షసంబంధ శిల్పాల్లో ముఖ్యమైనవి. బుద్ధుని పాదాలు, త్రిరత్న చిహ్నం కూడా ఇక్కడి తోరణాల పై ఉన్నాయి.

## 2. రెండో విభాగం శిల్పాలు

సాంచి స్తూపం నాల్గువైపులా దిక్కుల వారి పేర్లతో నాలుగు తోరణాలున్నాయి. వీటిని ఆంధ్రరాజులు నిర్మింప జేశారు. వీటి పైననే రెండో విభాగానికి చెందిన శిల్పాలు కూడా గలవు. ఇచట దక్షిణ, తూర్పు, పశ్చిమ దిక్కు(లలో) తోరణాలున్నాయి.

దక్షిణవైపు గల తోరణం క్రీ.పూ. ఒకటో శతాబ్దం ఆఖర్లో నిర్మింపబడ్డట్లు తెలుస్తుంది. దీన్ని ఆంధ్ర శాతవాహన మూడో రాజైన ఒకటవ శాతకర్ణి కాలంలో అతని వాస్తు శిల్ప నిపుణుల కూటమికి పర్యవేక్షకుడైన ఆనందుడు రూపొందించాడు. ఇది శిథిలమై ఉంటే 1882లో పూర్వస్థితి కల్పించడం జరిగింది. అన్ని స్తూపాల తోరణాల కున్నట్లే దీనికి కూడా తోరణం పైన మూడు అడ్డదూలాలు (architraves) ఉన్నాయి. ఈ తోరణం దూలం (architrave) ముందు భాగంలో (front face of the upper architrave) తామరల మధ్య నిలబడి ఉన్న శ్రీలక్ష్మి శిల్పమున్నది. ఈ దేవికి ఇరువైపులా ఒక ఏనుగు ఉన్నది. ఈ దేవి మాయాదేవని, శ్రీలక్ష్మని, సిరిమదేవతని పలు అభిప్రాయాలు ఉన్నాయి. మధ్య అడ్డ దూలం (middle architrave) ముందు భాగంపై (face) అశోకుడు రథంపై రామ గ్రామానికి వెళ్ళే శిల్పచిత్రముంది. ఇతని వెంట గజారూఢులైన వ్యక్తులు పయనిస్తున్నట్లు కూడా చూపడం జరిగింది. రామ గ్రామ స్తూపాన్ని 'నాగరక్షకులు రక్షిస్తున్నట్లుంది.

పైనున్న అడ్డ దూలాల వెనుక భాగమందు (back face of the upper architrave) మూడు స్తూపాలున్నాయి. ఈ స్తూప శిల్పాల మధ్య ఒక్కొక్క వృక్షం పంతున మొత్తం నాల్గు వృక్షాలున్నాయి. ఈ వృక్షాల మధ్య ఒక సింహాసనముంది. దీని ముందు మానవులు, దేవతలు ఆరాధిస్తున్నట్లు చూపడం జరిగింది. ఈ ఏడు శిల్ప రూపాలు బుద్ధుని, మనూషి బుద్ధులను చిహ్న రూపంలో తెలుపుతున్నాయి. మధ్య అడ్డ వెనుక భాగంపై (back face of middle architrave) జాతక కథ చెక్కబడి ఉంది. కింది అడ్డ వెనుక భాగంపై కుసి నగరప్రాంతమందలి మల్ల జాతీయులకు, ఇతర ఏడు రకాలైన నాయకులకు మధ్య బుద్ధుని అస్థికల కోసం జరిగిన యుద్ధం శిల్పంలో, చూపబడి ఉన్నది. ఈ తోరణం నిలువు స్తంభాలపై నాగరాజయు చలిందుని శిల్పముంది. ఇతని చుట్టూ నలుగురు నాగరాణులున్నారు.

ఉత్తర భాగమందలి తోరణం పైనున్న అడ్డ దూలం (uper architrave) ముందు భాగం (face) పై ఏడుగురు మనిషి బుద్ధుల్లో స్తూపాలు బోధి వృక్షాల చిహ్న రూపాల్లో చూపడం జరిగింది. మధ్య అడ్డ దూలంపై (middle architrave) ముందు భాగం పై కూడా ఏడుగురు మనిషి బుద్ధులను చిహ్న రూపంలో చూబడ్డారు. ఈ రెండు అడ్డదూలాల వెనుక ముఖ భాగం (back face) పై చెద్దంత జాతక చెక్కబడి ఉన్నది. కింది అడ్డముందు, వెనుక, ముఖభాగాలపై (front and back faes of lower architrave) వెస్సంతర జాతక కథలు వివరంగా శిల్పంలో చూపడం జరిగింది.

తూర్పు తోరణం పైనున్న అడ్డ దూలం ముందు విభాగంపై ఏడుగురు మనిషి బుద్ధులను ఏడు స్తూపాలు, బోధి వృక్షాల చిహ్న రూపాల్లో చూపడం జరిగింది. మధ్య గల అడ్డదూలం (front face) ముందు భాగంపై బుద్ధుని పరిత్యాగం చెక్కబడి ఉంది. ఈ చిత్రంలో కపిలవస్తునగరం దాని ప్రాకారం, ద్వారాలు, కందకం చూపబడ్డాయి. నాలుగు దశల్లో బుద్ధుని పరిత్యాగం శిల్పంలో చూపబడి ఉన్నది. కింది అడ్డ దూలం పై బుద్ధ గయలోని బోధి వృక్షం వద్దకు వెళ్తున్న అశోకుని చిత్రముంది. పైనున్న అడ్డ వెనుక ముఖ భాగంపై బోధి వృక్షం కింద ఉన్న సింహాసనాన్ని ఆరాధిస్తున్న సహజ, అసహజ జంతువుల శిల్ప చిత్రాలున్నాయి. ఈ తూర్పు తోరణంపైన గల మూడు అడ్డదూలాలు ఒక దానికి మరొక దానికి మధ్య దీర్ఘచతురస్రాకార దిమ్మెల వంటి విభాగాలున్నాయి. వీటిపైన అశోక స్తంభాలు, బుద్ధుని జీవిత ఘట్టాలు చిహ్నరూపంలోను చూపబడి ఉన్నాయి. అంతేగాక శ్రీలక్ష్మి శిల్పమున్నది. ఈ తోరణ నిలువ స్తంభాలపై ఏనుగులు, యక్షుల ప్రతిమలున్నాయి. ఎడమ స్తంభం కింద భాగంలో కాశ్యపతెగవారిని బౌద్ధమతంలోకి మారుస్తున్న బుద్ధుని చిత్ర వివరముంది. బుద్ధుడు నీళ్లపై నడచి వీరిని బౌద్ధమతం స్వీకరించేటట్లు చేశాడు. ఈ తోరణం లోని యక్షులు ఒక మామిడి చెట్టు కింద నిలబడి ఉన్నట్లు చూపడం జరిగింది.

పశ్చిమవైపున గల తోరణం పై భాగ అడ్డదూలంపై ముందు ముఖ భాగంపైన ఏడుగురు మనిషి బుద్ధులను చిహ్నరూపంలో చూపడం జరిగింది. మధ్య అడ్డపై సారనాథ్ లోని జింకల వనంలోని బుద్ధుని ధర్మచక్ర ప్రవర్తన జీవిత ఘట్టం చూపబడి ఉన్నది. ఇక్కడ ఒక చక్రం, దానికిరువైపులా జింకలు, ఆ జింకలు బుద్ధుని బోధనలను శ్రద్ధతో వింటున్నట్లు లేదా తిలకిస్తున్నట్లు చూపబడ్డాయి. కింది అడ్డ దూలంపై ఛద్దంత జాతక కథా చిత్రాలు చెక్కబడి ఉన్నాయి.

## సాంచి శిల్పాల అంచనా

సాంచి స్తూపం నాల్గు తోరణాలపై గల చిత్రాలు విడివిడిగా సంపూర్ణంగా చెక్కబడి ఉన్నాయి. ఒక్కొక్క శిల్పం ఒక్కొక్క చిత్ర కూటమిలాగ ఉన్నది. బుద్ధుని అస్థికలకోసం జరిగిన యుద్ధ ఘట్టం ఇందుకు ఉదాహరణ. వెస్సంతర జాతక కథ సంక్షిప్త రీతిలో శిల్పంలో చూపబడి ఉన్నది. కాని బార్హుత్‌లో లాగ చిత్ర ఖండాల కింద పేర్లు లేవు.

సాంచిలో ప్రకృతి సంబంధమైన చిత్రాలైన వృక్షాలు, అడవి జంతువులు, సాకుడు జంతువులు ఉన్నాయి. బార్హుత్ లో లాగ గాక సాంచిలో జాతక కథలు తెలిపే శిల్పం తక్కువ. సాంచిలో చెద్దంత జాతక కథను పలుమార్లు చెక్కడం జరిగింది. అంతేగాక బుద్ధుని జీవితంలోని ఘట్టాలను తెలిపే శిల్పాలను చెక్కడంలో శిల్పి శ్రద్ధకనపరచాడు.

బుద్ధుడు గాలి, నీటి మీద నడిచే శిల్పాలు అద్భుతంగా ఉన్నాయి. చారిత్రక అంశాలు కూడా సాంచిలో ఎక్కువగా ఉన్నాయి. అజాతశత్రు బుద్ధుని వద్ద కెళ్ళడం, కోసల రాజు ప్రసేనజిత్తుడు బుద్ధుని వద్ద కెళ్ళడం, ప్రసేనజిత్తుడు శ్రావస్తి లోని మామిడివృక్షం వద్ద కెళ్ళడం, బుద్ధుని వద్ద కెళ్తున్న శుద్ధోదన రాజు మొదలైన దృశ్య శిల్పాలు ఈ తెగలో ముఖ్యమైనవి. 'ఉత్తరకురు' చిత్రాలను కూడా సాంచి శిల్పి చెక్కాడు. కల్పవృక్షం కింద సంగీత మత్తుపానీయాలతో అనంత ఆనందాన్ని పొందడాన్ని ఉత్తరకురు చిత్రమంటారు. ఈ చిత్రాలు బౌద్ధమత స్వర్గాన్ని తెలుపుతున్నాయని అగర్వాల భావించారు. సాంచి శిల్పి బుద్ధుని చిహ్నారూపంలో తెలిపి ఉన్నాడు. నాలుగు జంతువుల వెనుక భాగాలు కలసి ఉన్నట్లుగా జంతువుల శిల్పాలు చెక్కడంలో కూడా సాంచి శిల్పి నేర్పరని తెలుస్తున్నది. ఇదే రీతిలో సాలభంజిక శిల్పాలున్నాయి. శ్రీలక్ష్మి, పూర్ణకుంభ శిల్పాలను కూడా పలుమార్లు చెక్కడం జరిగింది. సాంచిలో అన్ని చోట్లా ఒక రీతిలో లేవు. ఇది వివిధ కథా ఘట్టాలలో కన్పడుతుంది. ధనవంతులు, గొప్ప భూస్వాముల దర్బారు జీవితం, నిరంతరం యాంత్రికంగా కృషి చేసే మానవుని నిత్య జీవితం, అణుకువైన నెమ్మది కుటుంబ జీవితాన్ని గడపే గ్రామీణ జీవితం, ఆటవిక మానవ జీవితాలను సాంచి శిల్పి అతి సహజంగా చెక్కాడని ఎన్.కె.సరస్వతి తెలిపారు. సాంచి శిల్పకళ ప్రపంచ వ్యాప్తంగా ప్రఖ్యాతి గాంచి శిల్ప చరిత్రలో ప్రముఖ స్థానాన్ని వహించింది.

### కార్లే చైత్య

బొంబాయికి ఆగ్నేయంలో వందమైళ్ళ దూరాన భాజకు దగ్గరలో కార్లే ఏకశిలా ఖండ చైత్యగృహ (గుహ) ఉంది. ఇది కూడా ఆంధ్ర రీతికి చెందింది. ఇది క్రీస్తుశకం 1-2 శతాబ్దాల మధ్య కాలానిది. ఇది 124 అ.పొడవు, 46 1/2 అ. వెడల్పు, 45 అ. ఎత్తు ఉన్నది. దీని హాలులో 67 స్తంభాలున్నాయి. ఇవి అద్భుతమైన శీర్షిక భాగాలను కలిగి ఉన్నాయి. ఈ చైత్య వాస్తు వివరాలు బౌద్ధ చైత్య గృహాల అధ్యాయంలో తెలుపడం జరిగింది.

### అమరావతి శిల్పకళా రీతి

పశ్చిమ దక్కన్, మధ్య భారతదేశంలోని సాంచి, కార్లేలలో లాగ ఆంధ్రప్రాంతంలో అమరావతి, జగ్గయ్యపేట, నాగార్జునకొండ, గుమ్మడి దుర్రు మొదలైన ప్రాంతాల్లో కూడా ఆంధ్ర శాతవాహనుల ఆంధ్ర శిల్పకళారీతి లేదా అమరావతి శిల్ప కళారీతి అనేది వ్యాప్తి చెందింది. ఈ ఆంధ్ర ప్రాంతాల నిర్మాణాలు చాలా వరకు శిథిలమైనాయి. ఈ నిర్మాణాలకు చెందిన కొన్ని అర్ధ

శిల్పాలు (reliefs) గుండ్రటి శిల్పాలు (sculpture in round) లభించాయి. వీటి నుంచే నాటి శిల్పకళా వివరాలు తెలుసుకోడానికి వీలవుతుంది. ఆంధ్రలోని శాతవాహన నిర్మాణాల్లో అమరావతి స్తూపం ముఖ్యమైంది. ఈ స్తూపం చాలాకాలం మట్టిచే కప్పబడి ఒక గుట్టలాగ (దిబ్బలాగ) ఉన్నది. ఆధునికకాల ప్రారంభంలో దీన్ని ఎవరో కొందరు వ్యక్తులు అయాచితంగా తవ్వారు. ఈ మట్టి దిబ్బనే 'దీపాల దిన్నె' అని పిలుస్తున్నారు. ఈ దిబ్బను బ్రిటిష్ అధికారైన కల్నల్ మెకంజీ కనుగొన్నారు. ఇది తొలుత 1797 లో కనుగొనడం జరిగింది. ఇది గుంటూరుకు 20 మైళ్ళ దూరంలో ఉన్నది. చింతపల్లి జమిందారైన రాజావాసి రెడ్డి వెంకటాద్రినాయుడు తన జమిందారి రాజధానిని అమరారామానికి (అమరావతి) మార్చి అమరావతి స్తూపమందలి ఇటుకలు, పాలరాళ్ళను తన భవన నిర్మాణానికి వాడుకొన్నాడు.

అనేక అమరావతి శిల్పాలను బ్రిటిష్‌వారు తమ దేశానికి తరలించారు. నేటికీ ఇవి లండన్‌లోని బ్రిటిష్ మ్యూజియంలో ఉన్నాయి. 1897 లో అలెగ్జాండర్ రీ అమరావతిలో 128 పాలరాతి అర్ధ శిల్పాలను చూశాడట. రీ, వాల్టర్ ఇలియట్ సివెల్, బర్జస్ అనేవారు ఈ ప్రాంతంలో తవ్వకాలు చేశారు. తవ్వకాలు దాదాపు 1909 వరకు సాగాయి.

అమరావతి స్తూపాన్ని శాతవాహన రాజులు క్రీ.పూ. 200 ప్రాంతంలో నిర్మించారు. దీని వేదిక క్రీ.శ. 150 ప్రాంతంలో నిర్మించబడింది. క్రీ.శ. 250 నాటికి దీని నిర్మాణం పూర్తయింది. హుయాన్‌త్సాంగ్ ఈ స్తూపాన్ని చూసినట్లు తన రచనల్లో తెలిపారు. క్రీ.శ. 12వ శతాబ్దం వరకు ఈ స్తూపం బహుళ ఆదరాన్ని పొందింది. ఈ స్తూపం సుమారు 162 అ. వ్యాసంతో ఉంది. వేదికవరకు 192 అ. వ్యాసం ఉంది వేదికపై ప్రదక్షిణాపథ, అదిష్ఠానం, అండాలపై అద్భుత శిల్పాలుండేవి. స్తూపం ఆకు పచ్చ తెలుపు పాలరాతి పలకలతో కప్పబడి ఉన్నది.

అమరావతి శిల్పకళా రీతి క్రీ.పూ. 200 నుంచి క్రీ.శ. 270 వరకు వెలసి ఉన్నది. ఈ ఆంధ్ర అమరావతి శిల్పకళారీతికి చెందిన ప్రాంతాల్లో అమరావతి, జగ్గయ్యపేట అతి ముఖ్యమైనవి. పాలరాతి పై చెక్కిన శిల్పాలు ఈ ప్రాంతాల్లో లభించాయి. వీటిని బట్టి ఈ అమరావతి శిల్పకళారీతి తెలుసుకొనగలుగుతున్నాం. బార్హూత్, సాంచి శిల్పకళ కన్నా ఆంధ్ర అమరావతి శిల్పకళ ఉన్నతంగా ఉన్నది. అమరావతి శిల్ప రీతిలో అర్ధశిల్పాలు ఎక్కువ గుండ్రంగా చెక్కబడడమే గాక సంపూర్ణతను, సృజనాత్మకతను కలిగి ఉన్నాయి. అమరావతి శిల్పి ఉన్నత నైపుణ్యాన్ని చూపాడు.

అమరావతి శిల్ప కళారీతి తొలిదశకు చెందిన సాంచి, బార్హుత్ బుద్ధగయ శిల్ప కళారీతికి, ఉన్నతదశకు చెందిన గుప్త,పల్లవ శిల్పకళారీతులకు మధ్య ఒక పరిణామ దశకు చెందిన రీతిగా చెప్పవచ్చు. బార్హుత్, సాంచి ప్రాంతాల్లో లాగ అమరావతిలో కూడా బౌద్ధ శిల్పాలే ఎక్కువ. ఇది మతసంబంధ శిల్పకళ అనవచ్చు. ఈ శిల్ప కళలోని యక్షిణి, నాట్యగత్తెల అర్ధశిల్పాలు అతి సహజంగా ఉన్నాయి. ఇవి సన్నగా, పొడవుగా సృజనాత్మకంగా ఉన్నాయి.

మధుర, సాంచి శిల్పకళకన్నా ఆధునికత అందంతో ఉన్నాయి. శిల్ప చాతుర్యం వీటిలో కనపడుతుంది. నాగార్జున కొండ, గుమ్మడి దుర్రు, గోలి మొదలైన ప్రాంతాల శిల్పాలు ఒకే తరగతికి చెందినవైనా అవి అమరావతి శిల్పాల కన్నా తక్కువ శిల్పకళగా కనపడుతున్నాయి.

అమరావతి శిల్పకళారీతి నాలుగు దశలకు చెందిందిగా చెప్పవచ్చు. అవి:

1. క్రీ.పూ. 200-క్రీ.పూ.100 మధ్యకాలపు శిల్పకళ
2. సుమారు క్రీ.శ. 100 కాలపు శిల్పకళ
3. సుమారు క్రీ.శ. 150 నాటి శిల్పకళ
4. క్రీ.శ. 200- క్రీ.శ. 250 మధ్య కాలపు శిల్పకళ.

**1. క్రీ.పూ. 200-క్రీ.పూ. 100 మధ్య కాలపు శిల్పకళ**

ఈ కాలానికి చెందిన శిల్పాలు చాలా తక్కువ. లభించిన వాటిలో కూడా అనేకం ముక్కలుగా ఉన్నాయి. ఈ శిల్పాల్లో కర్కశత్వం, భంగిమల్లో వికారత్వం, ముఖంలో నీరసత్వం కనపడుతుంది. ఈ కాలమందలి మానవ శిల్పాల్లో పెదిమలు వికారంగా ఉన్నాయి. నగలు ధరించడంలో కూడా సహజత్వం లేదు. కాళ్ళు నిలపడానికి వీలు లేని భంగిమల్లో రూపొందించారు. ఈ చిత్రాలు స్తూప నిర్మాణ కాలానికి ఈ చిత్రాలు చెందాయి. ఈ శిల్పాల్లో కొన్ని మౌర్య లేదా శుంగ శిల్పులు లేదా వారి ప్రభావం గల శిల్పులు చెక్కినట్లు తెలుస్తుంది.

ఈ కాలానికి చెందిన శిల్పాలు దుస్తులు, నగలు, ముఖ భంగిమల్లో చాలా వరకు బార్హుత్, అజంతా లోని 9,10 వ గుహాలయాలోని శిల్పాలను పోలి ఉన్నాయి. ముఖాలు నేరుగా రూపొందించబడి ఉన్నాయి. అనేక శిల్పాలకు తలపాగ ఉన్నది. కొన్ని శిల్పాలకు ఉంగరాలు నెక్లెస్‌లు ఉన్నాయి. వీరి కండ్లు కొద్దిగా పక్కచూపుతో ఉన్నాయి. బుద్ధుడు చిహ్నరూపంలో చూపబడి ఉన్నాడు. ఈ కాలమందలి యక్ష శిల్పాలు తరవాతి కాలమందలి గణపతి చిత్రాలకు మార్గం చూపినవా అన్నట్లున్నాయి. మకరాలు పుష్పాలను నోటితో పట్టుకొని జార్రుతున్నట్లు కనిపిస్తున్నాయి.

**2. సుమారు క్రీ.శ. 100 నాటి శిల్పకళ**

రెండో దశకు చెందిన అర్ధ శిల్పాల్లో సిద్ధార్థుని 'మహాభినిష్క్రమణ' లేదా ఇల్లు విడిచి వెళ్ళడం, జ్ఞానాన్ని పొందిన బుద్ధుని ఆరాధించే భక్తులు, రామ గ్రామ స్తూపాన్ని తెరచే, మాయాదేవి సాన్నమాచరించడం మొదలైన అర్ధశిల్పాలు ముఖ్యమైనవి.

ఈ కాలం నాటి శిల్పాలను అందంగా నాజూకుగా రూపొందించడం జరిగింది. ముఖం అతి సహజంగా ఉంది. స్త్రీలను ఎక్కువ వస్త్రాలను ధరించినట్లు రూపొందించారు. ఈ దశ (కాలం) శిల్పకళ వాసిష్ఠీపుత్ర పులుమావి సమకాలీనమైనవి. ఇతని శాసనం కూడా ఒకటి అమరావతి స్తూపం వద్ద ఉన్నది. సహజత్వం, స్వేచ్ఛ, ఎక్కువ అందాన్ని ఈ కాలపు శిల్పాలు కలిగి ఉన్నాయి. ఈ శిల్పాలు ఎక్కువగా కుషాణ, మధుర శిల్పకళారీతిని పోలి ఉన్నాయి.

ఇవి నాటి సాంఘిక వ్యవస్థను తెలుపుతున్నాయి. బుద్ధుడు ఈ రెండో దశ కాలంలో చిహ్న రూపంలోను, ప్రతిమా రూపంలోను చూపటం జరిగింది. బుద్ధుని మహాభినిష్క్రమణ, కుమార విజయం ఘట్టాలు చూపడం జరిగింది.

### 3. సుమారు క్రీ.శ. 150 నాటి శిల్పాలు

అశోక వనం లోని శుద్ధోదన-మాయాదేవి శిల్పచిత్రం, నలగిరి అనే పేరుగల కోపోద్రిక్తమైన ఏనుగు రాజగృహ వీధుల్లో సృష్టించిన భీభత్సాన్ని చూపే చిత్రం, బుద్ధుని జీవిత ఘట్టాలైన రాజభవనం నుంచి పరిత్యాగం చేసి వెళ్ళడం, చూడామహ ఘట్టం (తలపై ధరించిన బుద్ధుని ఆభరణాన్ని స్వర్గానికి తీసుకెళ్ళేటప్పుడు చేసే ఉత్సవం) తెలిపే చిత్రాలు ఈ మూడో దశ శిల్పాల్లో ముఖ్యమైనవి. ఇందులో బుద్ధుని జీవిత ఘట్టమైన అవక్రాంతి చిత్రం (తెల్ల ఏనుగు రూపంలో స్వర్గం నుంచి భువికి దిగివస్తున్న బుద్ధుడు) కూడా ఉంది. ఈ శిల్పాలన్నింటినీ ఆచార్య నాగార్జునుడు నిర్మించిన వేదిక పై చెక్కడం జరిగింది. భారతదేశంలోని శిల్పాల్లోను, శాతవాహన శిల్పకళలోను అమరావతి వేదికపై గల శిల్పాలు ఉన్నతమైనవి. ఈ శిల్పాలు మృదుత్వాన్ని, సహజత్వాన్ని కలిగి ఉన్నాయి. పరిపూర్ణ భంగిమలను కలిగి ఉన్నాయి. ఒకే చిత్ర కూటమిలోని ముఖ్య చిత్రం పెద్దదిగను, లోతుగను చెక్కబడి, మిగిలిన దూరంగా ఉన్న శిల్పాలు అల్ప నేర్పరితనంతో చెక్కబడిఉన్నాయి. అమరావతి శిల్పి మనుష్యగుంపులను చెక్కడంలోను, ఆ మనుష్య గుంపుల భావాలను సహజంగా చూపడంలోను నేర్పరి అని తెలుస్తున్నది. ఇది నలగిరి ఏనుగు సృష్టించిన భీభత్స దృశ్యంలో కనపడుతుంది. వేదిక ఉష్ణిష (coping stone) పై ఇద్దరు యువతులు పూలమాలను పట్టుకొని ఉన్న చిత్రమున్నది. లక్ష్మీదేవి తామర పుష్పంపై కూర్చొని ఒక సింహం నోటి నుంచి పూలమాలను స్వీకరిస్తున్నట్లు మరొక చిత్రం కూడా ఉంది. ఈ వేదికపై జాతక కథలు, బుద్ధుని జీవిత ఘట్టాలు కూడా ఉన్నాయి. పరిపూర్ణతగల పుష్పాల చిత్రాలు కూడా ఉన్నాయి. ఇవి పల్లవ మొదలైన దక్షిణ పాలకుల శిల్పకళలోనే గాక జావా ప్రాంత శిల్పకళలో కూడా కనపడతాయి.

### 4. సుమారు క్రీ.శ. 200-250 మధ్యకాలపు శిల్పకళ

ఈ ఆఖరు దశ కాలానికి చెందిన అర్ధ శిల్పాలు పొడవుగా, సన్నగా ఉండడమే గాక ఎక్కువ నగలను కలిగి ఉన్నాయి. వీటిలో మణికర్ణిక, ఉదరబంధం, యజ్ఞోపవీతము ఉన్నాయి. అనేక బుద్ధుని జీవిత ఘట్టాలు కూడా ఈ స్తూపపు పాలరాతిపై చెక్కబడి ఉన్నాయి. కాని క్రీ.శ. 2వ శతాబ్దం నాటి శిల్పాల్లోని అభివృద్ధి చెందిన రీతి క్రీ.శ. 3వ శతాబ్దం నాటి శిల్పాల్లో కనపడదు. ఈ కాలపుశిల్పాలు నాగార్జునకొండ స్తూపాల అర్ధశిల్పాల లాగ ఉన్నాయి. ఈ కాలంలో కొన్ని పద్ధతులు, సాంప్రదాయలు శిల్పకళలో ప్రవేశపెట్టినందువల్ల శిల్పి స్వేచ్ఛగా తన ఊహకు నచ్చిన రీతిలో శిల్పాలను రూపొందించలేక పోయాడు. పవిత్ర దారమైన యజ్ఞోపవీతాన్ని దేవతలు, మానవులు స్త్రీ పురుష భేదం లేకుండా ధరించెడి రీతిని శిల్పి ప్రవేశపెట్టాడు. ఇది గుప్తశిల్పకళలో సర్వసామాన్యమైనది. సీమంతమకరిక అనే తలకు ధరించే ఆభరణం, కీర్తిముఖ లేదా సింహముఖ అనే కిరీటం ఈ దశకు చెందిన శిల్పాల్లో చూపబడి ఉన్నాయి.

# 6

# గాంధార శిల్పకళ

## (క్రీ.శ. 1-8 శతాబ్దాల మధ్యకాలం)

క్రీస్తుశకం ఒకటవ శతాబ్దంతో ఉత్తర భారతదేశ శిల్పకళలో మార్పులు ఏర్పడసాగాయి. చిహ్న రూపంలో బుద్ధుని ఆరాధించే హీనయాన కాలం అంతరించి దేవునిగా ప్రతిమ రూపంలో బుద్ధుని కొలిచే మహాయాన కాలం ప్రారంభమైంది. దీనితో బౌద్ధమతంలో బుద్ధుని ప్రతిమలు రూపొందించవలసిన అవసరమేర్పడింది. బుద్ధునితో బాటు బోధిసత్వుల శిల్పాలు కూడా ఏర్పడసాగాయి.

బౌద్ధమతంలో ఇట్టి మార్పు ఏర్పడుతున్న కాలంలోనే భారతదేశం, రోమ్ రాజ్యాల మధ్య పెద్ద ఎత్తున వ్యాపార వాణిజ్య సంబంధాలు ఏర్పడ్డాయి. భారతదేశం నుంచి ఈ పాశ్చాత్యులు సుగంధ ద్రవ్యాలు, శిల్కు వంటివి తీసుకొని పోతుంటే భారతీయులు రోమ్ గ్రీసు వంటి పాశ్చాత్యుల నుంచి బంగారు, గ్లాసు వస్తువుల వంటివి కొంటున్నారు. ఈ సంబంధాల వల్ల భారతదేశంలో దక్షిణాన ఆంధ్రులు, ఉత్తరాన కుషాణ రాజ్యప్రజలు ఆర్థిక అభివృద్ధిని పొందుతున్నారు.

రోమ్ వ్యాపారం సాగుతున్న కాలంలోనే క్రీ.శ. 78 ప్రాంతంలో కుషాణ రాజ్యానికి కనిష్కుడు రాజయ్యాడు. ఇతడు ఉత్తరాన గాంధార, కాశ్మీరాలనుంచి దక్షిణాన సాంచి సరిహద్దుల వరకు, పశ్చిమాన కాబూల్ నుంచి తూర్పున బెనారస్ వరకు రాజ్యమేర్పరచుకొని పాలించాడు. నేటి పాకిస్తాన్‌లోని పెషావర్ (పురుషపురం) ఇతని రాజధాని. తన గొప్పతనానికి తగినట్లు ఇతడు రోమ్‌లోని ట్రాజన్ చక్రవర్తి వద్దకు తన రాయబారిని కూడా పంపాడు.

కనిష్కుని రాజ్యంలోని స్వాత్, కాబూల్, సింధూ నదులతో కూడిన పశ్చిమ భాగాలనే గాంధార ప్రాంతమనే వారు. ఈ ప్రాంతంలో కనిష్కుని పోషణలో ఒక నూతన శిల్ప కళారీతి అభివృద్ధి చెందింది. ఈ శిల్పకళారీతినే గాంధార శిల్పకళ అంటారు. ఈ శిల్పకళకు గాంధారప్రాంతమందలి తక్షశిల, పెషావర్ (నేటి పాకిస్తాన్), హద్ద (నేటి ఆఫ్ఘనిస్థాన్) ముఖ్య కేంద్రాలుగా ఉండేవి. కనిష్కుని కాలానికి ఈ ప్రాంతం విదేశీయుల ప్రభావానికి లోనయింది. అట్టివారిలో రోమన్‌లు, గ్రీకులు, పర్షియనులు, శకులు ముఖ్యులు. కనిష్కుని నాణేలపై గల పర్షియన్ దేవతలు, రోమ్, అలెగ్జాండ్రియా దేవతలు, పశ్చిమాసియా దేవతలైన హెరాకిల్స్, హెలియోస్, సెరాపిస్, విక్టరీ, భారతదేవతలైన శివ స్కంద కుమారులు ఈ విషయాన్ని

ధృవీకరిస్తున్నాయి.

గాంధార శిల్ప కళపై గ్రీక్, రోమన్ శిల్పకళా ప్రభావం ఉందని కొందరి అభిప్రాయం. కాని పాంపే, హెర్క్యులేనియం వంటి గ్రీక్ రోమన్ శిల్పాలతో గాంధార శిల్పాలను పోలిస్తే గాంధార శిల్పాలను సామాన్య శిల్పులు రూపొందించిన ప్రతిమల లాగ ఉన్నాయి. పతనమవుతున్న రోమ్ గ్రీకు శిల్పాలను కొంతవరకు మాత్రమే పోలి ఉన్నాయి. కాబట్టి గాంధార శిల్పకళ రోమ్‌గ్రీకు శిల్పకళ ప్రభావానికి లోనైనదనటం కన్నా రోమ్ గ్రీకు శిల్పకళా ప్రేరణ లేదా ప్రభావంతో రూపొందిందని చెప్పవచ్చు. ఈ విషయాన్నే స్టెల్లా క్రమారిష్ కింది వాక్యాల్లో తెలిపారు. "It (Gandhara art) is Indian and colonial from a Hellenistic point of view, it is Hellenistic and colonial when viewed from India".

కుషాణ కాలంలో గాంధార ప్రాంతాన రోమ్, గ్రీన్‌ల శిల్పులు స్వచ్ఛతలేని పతనదశలోని రోమ్, గ్రీన్ ప్రేరణా శిల్పరీతిని భారతీయ బౌద్ధ భిక్షువుల (సన్యాసుల) ఆధ్వర్యాన భారతీయ విషయాలు, దృశ్యాల రూపణలో (శిల్పంలో) అనుసరించారు. అంటే గాంధార శిల్పి చేయి రోమ్ గ్రీన్‌లది, హృదయం భారతీయులది. భారతీయ హృదయం, పాశ్చాత్య ప్రేరణా శిల్పం గాంధార శిల్ప రీతిలో ఉన్నందు వల్ల ఇవి రెండూ సమ్మిళితం కాలేకపోయినందువల్ల గాంధార శిల్ప కళ కొద్దికాలానికే అదృశ్యమైంది. భవిష్యత్ భారతశిల్పకళపై గట్టి ప్రభావాన్ని చూపలేకపోయింది. కాని కుషాణ కాలంలోనే మధుర కేంద్రంగా అభివృద్ధి చెందుతున్న సర్వమత భారతీయ శిల్పకళ భావిశిల్పకళపై ప్రభావాన్ని చూపగలిగింది.

గాంధార శిల్పకళలో రూపొందించిన బుద్ధుడు, బోధిసత్వులు అననుకూల నిలచెడి తీరులో, భారతీయ సన్యాస రీతికి భిన్నంగా, ఆత్మలేని బొమ్మలలాగ, రోమ్ గ్రీన్‌ల హీనకాల శిల్పరీతిలో ఉన్నారు. గాంధార బుద్ధునికి తల వెనక ప్రభామండలం తలపై ఉష్ణీషను, హస్తం, పాదాలలో చక్రాలను, కనుబొమ మధ్య ఊర్ణాన్ని (బొట్టువంటిది), సహజమైన రీతిలో మడతలుగల పలుచని 'సంఘటి' అనే వస్త్రం, సహజ రీతిలోని కండరాలు, నరాలు, ఎముకల రూపాలు ఉన్నాయి. బోధిసత్వులకు కొన్ని శిల్పాల్లో మీసాలు, తలపాగలు ఉన్నాయి. వీరికి కుడిభుజం, చేతులపై వస్త్రం లేదు. ఈ లక్షణాలన్నీ గ్రీకో - రోమన్ ప్రభావితాన్ని తెలుపుతున్నాయి. వస్త్రం రోమన్, టోగ, లాగ ఉన్నది. ముఖ కవళికలు కూడా గ్రీకో-రోమన్ ప్రభావాన్ని తెలుపుతున్నాయి.

బౌద్ధ కథల్లోని సన్యాసులు, పూజారులు గ్రీకో - రోమన్ శిల్ప సాంప్రదాయంలోని గడ్డాలు గల తత్వవేత్తలు, ఋషుల లాగ ఉన్నారు. యక్ష, యక్షిణి, నాగ, గరుడ, బోధిసత్వులు గ్రీకో - రోమన్ శిల్పంలోని హెరాకిల్స్, అట్లాంటెజ్, బచూస్, జెయస్, ఎరోస్, హెర్మెస్, పోసిడన్, జెనై మొదలైన వారి లాగ ఉన్నారు. దీనిని బట్టి గాంధార శిల్పాలు స్వదేశీయమైన మధుర, బార్హూత్, సాంచి, పల్లవ, గుప్త వంటి శిల్పకళారీతులకు అర్థ విషయంలో గాని, ఆధ్యాత్మికతలో గాని, శిల్ప రూపంలోను దాదాపు పోలికలేని విధంగా ఉన్నాయని చెప్పవచ్చు.

బుద్ధుడు చిహ్న రూపానికి బదులు ప్రతిమా రూపంలో గాంధార శిల్పకళలో కుషాణ (కనిష్కుని) కాలంలో మొట్టమొదటి సారిగా రూపొందింపబడ్డాడు. నేడు బోస్టన్ మ్యూజియంలో ఉన్నటువంటి క్రీ.శ. 1వ శతాబ్దం అఖరు కాలం క్రీ.శ. 2వ శతాబ్దం తొలికాలం మధ్య తయారైన కనిష్కుని నాణెంపై గల బుద్ధుని ప్రతిమ ఈ విషయాన్ని తెలుపుతున్నది. ఈ నాణెం వెనుక కనిష్కుని ప్రతిమ కూడా ఉంది. ఈ నాణెంపై గల బుద్ధుని వంటి శిల్పాలే ఆనాడు గాంధార శిల్పకళారీతిలో కూడా రూపొందింపబడ్డాయి. పైన చెప్పిన నాణెంలో బుద్ధుడు స్థానక రూపంలో ఉన్నాడు. సంఘటి అనే నిడివైన వస్త్రాన్ని, తలపై ఉష్ణిషను, చెవులకు పొడవైన అభరణాన్ని ధరించి ఉన్నాడు. తల వెనుక, శరీరం వెనుక విడివిడిగా రెండు ప్రభా మండలాలు ఉన్నాయి. కుడిచేయి అభయ ముద్రలో ఉన్నట్లున్నది. ఎడమ చేయి సంఘటి కొసలను పట్టుకొని ఉన్నది. బుద్ధునికి కుడివైపు గ్రీకు లిపిలో గల శాసనం నాణెంలోని ప్రతిమ బుద్ధుడని తెలుపుతున్నది. ఎడమ వైపు కనిష్కుని రాజ ముద్ర ఉంది. ఈ నాణెం వెనుక గల కనిష్కుని ప్రతిమలో అతడు కిరీటాన్ని, ఖడ్గాన్ని, మెత్తటి చెప్పులను, నడుముకు బెల్టును, గడ్డంతో ఉన్నాడు. అటవిక రీతిలోని పై వస్త్రం, పేంటు వంటి కింది వస్త్రం ధరించి ఉన్నాడు. ఇది పార్థియన్ శిల్ప ప్రభావాన్ని తెలుపుతున్నది. ఇతడు అగ్నిగుండంలో ఏదో పూజా పదార్థాన్ని పోస్తున్నాడు. ఇది అగ్ని ఆరాధనను తెలపుతుంది.

ఈ నాణెంపై గల బద్ధుని పోలిన శిల్పం లాహెూర్‌లో లభించింది. ఇది ప్రస్తుతం లాహెూర్ మ్యూజియంలో ఉంది. సుమారు 1.40 మీటర్ల ఎత్తుఉంది. క్రీ.శ. 2వ శతాబ్ద మధ్య కాలానిది. ఇది బూడిదవర్ణం సిస్ట్ blue-grey schist తో తయారైంది. ఇందులో కూడా బుద్ధుడు రోమన్ 'టోగా' వంటి నిడివైన సంఘటి వస్త్రాన్ని ధరించి ఉన్నాడు. తలపై ముడులజుట్టు వంటి ఉష్ణిష, తల వెనుక ప్రభామండలం ఉన్నాయి. కుడిచేయి అభయ ముద్రలో ఉండేది. నేడు లేదు. ఎడమ చేయి సంఘటిని పట్టుకొని ఉన్నది. కనుబొమల మధ్య బొట్టువంటి జ్ఞాన చిహ్నం లేదా కన్ను ఉంది. కాళ్ళకు చెప్పులు లేవు. ఈ స్థానక శిల్పం కింద గల పీఠం ముఖభాగల్లో స్తూపారాధన చేస్తున్న ఆరుగురు భక్తులు ఉన్నారు. ఈ శిల్పంలో వస్త్రం సహజంగా ఉంది. కాని భారతీయ రీతికి భిన్నంగా చూపటం జరిగింది.

బుద్ధుని నాలుగు జీవిత ఘట్టాలను తెలిపే అర్ధ శిల్పాలు కూడా గాంధారప్రాంతంలో లభించాయి. ఇవి క్రీ.శ. 2వ శతాబ్దం నాటివి. నేడు వాషింగ్‌టన్, డి.సి. లోని ఫ్రీయర్ ఆర్ట్ గాలరీలో ఉన్నాయి. ఈ శిల్ప సమూహంలోని వ్యక్తులు, వారి వస్త్రాలు అతి స్పష్టంగా సహజంగా ఉన్నాయి. లుంబిని వనంలో బుద్ధుని జన్మ, బోధివృక్షం కింద తపస్సులో ఉన్న బుద్ధుని మార, అతని పరివారం ముట్టడించడం, సారనాథ్ వద్ద గల జింకల వనంలో బుద్ధుడు చేసిన తొలిబోధన లేదా, ధర్మచక్రప్రవర్తనం, బుద్ధుని మరణం లేదా మహాపరినిర్వాహణం అనే బుద్ధుని జీవిత ఘట్టాలు నాల్గు ఈ వాషింగ్టన్ శిల్ప సమూహంలో ఉన్నాయి.

బుద్ధుని జన్మ దృశ్యంలో మధ్యగా బుద్ధుని తల్లి మాయాదేవి సాలభంజిక రీతిలో బార్హుత్, సాంచిలలోని యక్షిణిల లాగ నిలుచొని చెట్టుకొమ్మను పట్టుకొని ఉన్నది. ఈమెకు కుడివైపున

కిరీటధారియైన ఇంద్రుడు వస్త్రం పట్టుకొని పుణ్యపురుషుడైన శిశువుని (బుద్ధుడు) స్వీకరిస్తున్నాడు. ఇంద్రునిపైన బ్రహ్మ శిశువైన బుద్ధుని ఆరాధిస్తున్నాడు. మాయాదేవికి ఎడమవైపున ముగ్గురు స్త్రీలు ఉన్నారు. చివరి ఇద్దరు నెమలి ఈకల విసనకర్ర, ఒక గుండ్రటి పెట్టె, అద్దాలను పట్టుకొని ఉన్నారు. ఈ స్త్రీలు కూడా ఉన్నత తరగతికి చెందిన వారుగా కనపడుతున్నారు. కుడి కొసలో మరిద్దరు పురుషులున్నారు.

బుద్ధుని రెండో జీవిత ఘట్ట దృశ్యంలో మార, అతని పరివారం బుద్ధుని బోధివృక్షం క్రింద జ్ఞానోదయం పొందకుండా తరిమివేయడానికి ప్రయత్నించడం, అందులో విఫలం చెందడం చూపడం జరిగింది. మార, అతని పరివారమే గాక అశ్వం, ఒంటె, కోతి, గజం, సర్పం, పొట్టేలు, వంటి జంతువులు గొంతు వద్ద కణితి గల వ్యక్తి ఒక డోలు ధరించి ఉన్నాడు. ఇందులో బుద్ధుడు తలపై ఉష్ణీష, తల వెనుక ప్రభామండలం, శరీరంపై సంఘటి వస్త్రం, కలిగి పీఠంపై ఆశీనుడై ఉన్నాడు.

బుద్ధుని మూడో ఘట్ట దృశ్యంలో పీఠ ఆసీనమై ఉన్న బుద్ధుని భక్తులు, సన్యాసులు ఆరాధిస్తున్నారు. పీఠం ముఖభాగాన ధర్మచక్రం, దానికి ఇరువైపులా జింకలు ఉండటాన్ని బట్టి ఇది బుద్ధుని ధర్మచక్రప్రవర్తనను తెలుపుచున్నదని చెప్పవచ్చు. ఇందులో బుద్ధునికి ఎడమవైపున బోధిసత్వ వజ్రపాణి వజ్రాయుధాన్ని ధరించి నిలుచొని ఉన్నాడు.

నాల్గో జీవిత ఘట్టంలో బుద్ధుడు శయన రీతిలో ఉన్నాడు. ఇతని చుట్టూ భక్తులు, సన్యాసులు దుఃఖంతో ఉన్నారు. శయన వేదిక ముందు సుభద్ర అనే సన్యాసి కాబోలు కూర్చొని ఉన్నాడు.

బుద్ధుని శిల్పమే గాక బోధిసత్వుని శిల్పాలు కూడా గాంధార శిల్పకళలో రూపొందించడం జరిగింది. వీటిలో ఒకటి ఫ్లారిడాలోని సెయింట్ పీటర్స్ బర్గ్స్ లో ఉన్నది. జ్ఞానాన్ని లేదా బుద్ధత్వాన్ని పొందడానికి పూర్వ రూపాన్నే బోధిసత్వ రూపమంటారు. పై శిల్పంలో బోధిసత్వుడు పొడవైన అలంకార శిరోజాలు, మీసాలు, అనేక ఆభరణాలు, చెప్పులు, విలువైన (సన్యాసికి భిన్నమైన) దుస్తులను కలిగి ఉన్నాడు. అభయముద్రలో ఉన్న కుడిచేయి, ఎడమ చేయి విరిగి ఉన్నాయి. ఇతడు ధరించిన వస్త్రం, శరీరం సహజంగా ఉన్నాయి. ఈ శిల్పం క్రీ.శ. 2వ శతాబ్దానిది.

గాంధార ప్రాంతంలో కనిష్కుని పోషణలో అనేక బౌద్ధ స్తూపాలు, విహారాలు నిర్మింపబడి వాటిలో పలురకాలైన బుద్ధుడు, బోధిసత్వుల చిత్రలేఖనాలు రూపొందింపబడ్డాయి. ఇవి గచ్చుతో వేయబడ్డాయి (succoed and pointed) ఉంది. ఇట్టి చిత్రలేఖనాలు గల స్తూప, విహారాలు ఆఫ్ఘనిస్థాన్ లోని గుల్దారాలో ఉన్నాయి. స్వాత్ లోయలో ఇట్టి స్తూప రూప శిల్పం కూడా ఉంది. కాని గాంధార ప్రాంత స్తూపాలు సాంచి మొదలైన దక్షిణ ప్రాంతాలలోని స్తూపాలకు భిన్నంగా ఉన్నాయి. వీటికి ఎత్తైన అండం, ఛత్రం, పెద్ద చతురస్రాకార వేదిక ఉన్నాయి. కనిష్కుని

గాంధారరీతి స్తూపాల్లో, షాజికిఢేరి ప్రాంత స్తూపం గొప్పది. ఇది పెషావర్ దగ్గరలో ఉన్నది. ఇది 300 అ. వ్యాసాన్ని 700 అ. ఎత్తును కలిగి ఉన్నది. దీనికి 13 అలంకార ఛత్రాలు ఉన్నాయి. నేడు శిథిలమై ఉన్నది. కాని ఈ స్తూప శిథిలాల్లో లభించిన కంచు శిల్పం అద్భుతంగా ఉన్నది. ఇది గొట్టం ఆకారంలోని పెట్టె లాగ ఉంది. 5 అం. వ్యాసం, 4 అం. ఎత్తు ఉంది. దీని మూత పై 8 అం॥ ఎత్తు గల మూడు శిల్పాలు ఉన్నాయి. దీనిపై ఖరోష్టిలిపిలో శాసనం గలదు. ఈ పెట్టె పై గల శిల్పాల్లో బుద్ధుడు మధ్య ఉన్నాడు. ఇతనికి ఇరువైపులా బ్రహ్మ, ఇంద్రులు ఉన్నారు. పెట్టె మూత అంచుల్లో ఎగిరే బాతులున్నాయి. బౌద్ధమత విదేశీ వ్యాప్తిని ఇవి సూచిస్తున్నాయి. పెట్టె ప్రక్క భాగాల్లో సర్పమాల, దానిపై కూర్చున్న బుద్ధులు, సూర్యుడు, చంద్రుడు, నిలుచొని ఉన్న కుషాణ రాజులు ఉన్నారు. ఇది పర్షియన్ ప్రభావాన్ని తెలుపుతున్నది. బుద్ధుడు తొలి గాంధార రీతిలో ఉన్నాడు.

ఆఫ్ఘన్‌స్థాన్‌లోని బిమరాన్‌లో కెంపులు పొదిగిన పై పెట్టె వంటిది లభించింది. దీని పక్కలలో తోరణాలు వంటివిభాగాలు, వాటిలో బుద్ధుని శిల్పం ఉన్నాయి. ఇది పాశ్చాత్య ప్రభావాన్ని కలిగి ఉన్నది. ఇది నేడు లండన్‌లో బ్రిటిష్ మ్యూజియంలో ఉన్నది.

పాశ్చాత్య విషయంతో పాశ్చాత్యులైన గాంధార శిల్పులు రూపొందించిన వాటిలో లాహోర్‌లోని రోమ లేదా 'అథేన' శిల్పం ప్రముఖమైంది. ఇది నేడు లాహోర్ కేంద్ర మ్యూజియంలో ఉన్నది. ఇది బూడిదరంగు సిస్ట్ blue-grey schist తో రూపొందించిన స్త్రీ శిల్పం. ఈ కన్య శిరస్సుపై రక్షణ కవచాన్ని ధరించి ఉన్నది. ఎడమ వైపు ప్రక్కలో కత్తి ఉంది. ఈమె భారతీయ రాజుకు రక్షకురాలుగా ఉన్న విదేశీ స్త్రీయని నదీ దేవత, నగరదేవత అని పలు అభిప్రాయాలున్నాయి.

పై విధంగా గాంధార శిల్ప కళ అభివృద్ధి చెందుచుండగా క్రీ.శ. 3వ శతాబ్దం మధ్యలో పర్షియాలో పార్థియనులను ససేనియన్‌లు ఓడించి తక్షశిల, పెషావర్లు వరకు ఆక్రమించడం వల్ల కుషాణుల పరిపాలన బలహీనపడసాగింది. కాని గాంధార శిల్పకళ కొనసాగింది. క్రీ.శ. 5వ శతాబ్దంలో హూణులు దండెత్తి గాంధారను నాశనం చేశారు. కాని ఈ కళ 8వ శతాబ్దం వరకు కొనసాగింది. బమియన్ (హిందూకుష్ ప్రాంతం) ఇందుకు ముఖ్య ఉదాహరణ. ఇక్కడి బౌద్ధ శిల్పాల్లో బ్రహ్మాండంగా ఉన్న మూడు స్థానిక బుద్ధుల శిల్పాలు ముఖ్యమైనవి. వీటిలో ఒకటి 175 అ. ఎత్తు ఉన్నది. ఇది కొంతవరకు గుప్తరీతిలో ఉన్నది. మరొక శిల్పం 120 అ. ఎత్తున్నది.

ఆఫ్ఘన్‌స్థాన్‌లో గచ్చు పూతల శిల్పాలు (plaster sculpture) కూడా లభించాయి. వీటిపై ససేనియన్ రీతి ప్రభావం ఉంది. ఆఫ్ఘన్‌స్థాన్‌లోని హడ్డ, ఫొన్‌డుకిస్థాన్ లోని బౌద్ధ నిర్మాణాల్లో బౌద్ధ చిత్రలేఖనాలు గలవు. మధుర రీతిలో సుర్క్‌కోటల్ ప్రాంతాన కనిష్కుడు ఒక బౌద్ధ ఆలయాన్ని నిర్మించాడు. ఇక్కడి పర్వతంపై అనేక ఆలయాలున్నాయి. అగ్నిగుండం, అగ్ని దేవాలయం, అహురమజ్ద ఆలయం కూడా ఉన్నాయి. సర్క్‌కోటల్ ఆలయాలను కనిష్కుడు

నిర్మిస్తే, వాటిని హువిష్కుడు పునరుద్ధరింపజేశాడు.

పై ఉదాహరణలే గాక క్రీ.శ. 1వ శతాబ్దపు లోర్యాటాంగై, హస్తనగర్‌లలో లభించిన బుద్ధుని తొలి శిల్పాలు, తక్షశిల, జలాలాబాద్, సిర్కావ్ శిల్పాలు, మర్దన్‌లోని మహాపరినిర్వాణ శిల్పం, తక్త్ఇబహాయ్‌లోని మైత్రేయి శిల్పం, సిక్రిలోని బౌద్ధ దేవతల శిల్పాలు, గాంధార శిల్ప కళా ఉదాహరణలుగా చెప్పవచ్చు.

# 7

# మధుర శిల్పకళ

## (క్రీ.శ. 1–4 శతాబ్దాల మధ్యకాలం)

గాంధార శిల్పకళతో బాటు కుషాణుల కాలంలో మధుర శిల్పకళ కూడా ఉద్భవించింది. కుషాణులు అన్ని మతాలను సమానంగా ఆదరించి లౌకిక భావాలతో పరిపాలించారు. వీరి రాజ్య పశ్చిమ భాగంలో గాంధారలో గాంధార శిల్పకళాభివృద్ధి జరిగితే తూర్పు భాగంలో మధుర ముఖ్య కేంద్రంగా మధుర రీతి శిల్పకళ అభివృద్ధి చెందింది. గాంధార శిల్పకళలో బౌద్ధ శిల్పాలు మాత్రమే గ్రీక్, రోమన్ శిల్పకళా ప్రేరణలో రూపొందిస్తే మధుర శిల్పకళలో వివిధ మతాల శిల్పాలే గాక మతేతర శిల్పాలు కూడా రూపొందించడం జరిగింది. కుషాణ పాలకుల లాగ మధుర శిల్పికి మతభేదం లేదు. ఇతడు బౌద్ధ శిల్పాలనే గాక హిందూ, జైన శిల్పాలను, యక్ష యక్షిణీ శిల్పాలను, మాతృదేవతా శిల్పాలను, నాగ నాగినీ శిల్పాలను, సాలభంజిక, అలసకన్య మొదలైన స్త్రీ శిల్పాలు, సామాజిక జీవనాన్ని తెలిపే శిల్పాలు, వృక్ష, జంతు, ప్రకృతి దృశ్య శిల్పాలను రూపొందించాడు. వీటన్నింటినీ మధుర శిల్పి స్వదేశీ రీతిలోనే రూపొందించాడు. గ్రీసు రోమన్ శిల్ప కళా ప్రభావితంతో రూపొందింపబడుతున్న గాంధార ప్రాంత శిల్ప కళా ప్రభావం మధుర శిల్పకళపై పడలేదు. కాని మధుర శిల్పి స్వదేశీయమైన బార్హుత్ సాంచి శిల్ప కళారీతి ద్వారా ప్రభావితం (ప్రేరణ) అయ్యాడు. అనుకరణ మాత్రం చేయలేదు. అంతేగాక ఈ ప్రాంతాల్లో లాగ బౌద్ధమతానికే పరిమితం కాలేదు. అన్ని మతాల శిల్పాలు రూపొందింపబడ్డాయి.

మధుర కుషాణులకు పూర్వం నుంచే జైన మతానికి కేంద్రంగా ఉన్నది. కుషాణుల రాకతో బౌద్ధమతానికి కూడా కేంద్రమైంది. మరికొంత కాలానికి కృష్ణ భక్తి లేదా భాగవత తెగ భక్తి ఉద్యమ కేంద్రంగా కూడా అయింది. ఇక్కడి జైన శిల్ప ప్రభావంతో గాంధార బుద్ధుని రూపొందింపబడ్డ కాలంలోనే మధుర బుద్ధుని కూడా రూపొందించి ఉండవచ్చు. మధురలో ఏర్పడిన పలు మతాల శిల్పాలు సారనాథ్, శ్రావస్తి, తక్షశిల, మధ్య ఆసియా మొదలగు ప్రాంతాలకు తరలి వెళ్ళినట్లు తెలుస్తుంది. మధురలో సుమారు ఐదువేల శిల్పాలు లభించాయి. మధుర శిల్పాలు చాల వరకు కనిష్కుని కాలంలోను, ఆ తర్వాత హువిష్క, వాసుదేవుల కాలంలోను

రూపొందింపబడ్డాయి. ఈ మథు ర శిల్పకళ కాలక్రమాన గుప్త శిల్పకళలో కలసి పోయింది. గాంధార శిల్పకళ లాగ అదృశ్యం కాలేదు. క్రీ.శ. 100 ప్రాంతంలో పుట్టి సుమారు క్రీ.శ. 300 ప్రాంతం వరకు నిలచి ఉన్నది. అంటే మధుర శిల్పకళ భవిష్యత్ భారత శిల్పకళపై గొప్ప ప్రభావాన్ని చూపిందని చెప్పవచ్చు. గుప్తకళ మధుర శిల్ప రీతి నుంచే ఉద్భవించింది. ఈ ఉదాహరణ మధుర ప్రభావాన్ని తెలుపుతుంది.

**ముఖ్యాంశాలు**

1. మధుర శిల్పాలు చాలవరకు సిక్రీలో లభించే తెల్ల చుక్కలుగల ఎర్ర ఇసుకరాయితో తయారు చేయబడ్డాయి.
2. ఇవి గుండ్రంగా (carved boldly in the round) లేదా లోతుగా చెక్కబడి (in high relief) ఉన్నాయి.
3. వెడల్పాటి రొమ్ముభాగం, భుజాలను, బరువైన దేహాన్ని కలిగి ఉన్నాయి.
4. గాంధార శిల్పరీతికి భిన్నంగా ఉన్నాయి. ఆదిమరీతి సాంప్రదాయం వలె ఉన్నాయి. యక్షయక్షిణులు ఇందుకు ఉదాహరణ.
5. మధుర శిల్పాలకు కుడి భుజంపై వస్త్రం లేదు.
6. శిల్పం పై అర్ధభాగం బాగా రూపొందింపబడి కింది అర్ధభాగం కఠినంగా మృదుత్వ రహితంగా ఉన్నది. ఉదాహరణకు కాళ్ళు చెట్టు మొద్దుల లాగ ఉన్నాయి.
7. మధుర శిల్పాల్లో బౌద్ధ, జైన, హిందూమతాల శిల్పాలు, మాతృదేవత, నాగ నాగిని, యక్ష యక్షిణి, జంతు వృక్ష ప్రకృతి, స్త్రీ శిల్పాలు ఉన్నాయి.
8. సాంచి, సారనాథ్‌ల్లో లాగ వృక్ష శిల్పాలున్నాయి.
9. మానవుని ఆనందం, ఉద్రేకాలు ప్రకృతి పరంగా చిత్రించటం జరిగింది.
10. పాత అలంకరణ చిత్రాలు, నూతన అలంకార చిత్రాలు ఉన్నాయి.
11. శిల్ప రూపణలో నేరుగా రూపొందించే విధానం అనుసరించలేదు.
12. మానవ శిల్పాల రూపణలో నైపుణ్యం చూపడం జరిగింది.
13. స్త్రీ శిల్పాల రూపణలో శిల్పి ప్రత్యేక శ్రద్ధ కనపరిచారు. వీరి వస్త్రాలు, నగలు పరిమితంగా ఉన్నాయి. , ఇవి సాలభంజిక శిల్పాల్లో కనపడతాయి.
14. మధుర శిల్పి సాంచి, బార్హుత్ శిల్పి వల్ల ప్రభావితం అయ్యాడు. కాని వారిని అనుకరించలేదు.

**బౌద్ధ శిల్పాలు**

మధుర శిల్పి ప్రపంచంలోనే మొదటిసారిగా బుద్ధుని శిల్పాన్ని రూపొందించాడు. ఇది భారతీయ (స్వదేశీ రీతి) రీతిలో రూపొందించబడ్డది. ఈ విషయాన్ని దివ్యవదన అనే ప్రాచీన గ్రంథం కూడా ధృవీకరిస్తున్నది. బౌద్ధ మతంలో వచ్చిన మార్పు వల్ల బుద్ధుడు దేవుని రూపంలో రూపొందించవలసి వచ్చింది. బౌద్ధమంతలో కనిష్కుని కాలానికి మహాయానమతం ఏర్పడింది. ఈ తెగవారు బుద్ధుని దేవునిగా భావించారు. వారి భావనా అవసరాలు తీర్చడానికి బుద్ధుని

శిల్పం రూపొందించవలసి వచ్చింది. దాదాపు ఇదే కాలంలో భక్తి ఉద్యమం కూడా ఏర్పడి మత అవసరాలకు దేవతా శిల్ప రూపణ ప్రారంభమైంది.

మథురలో లభించిన బౌద్ధ శిల్పాల్లో సారనాథ్ పురావస్తు ప్రదర్శన శాలలో ఉన్న స్థానక బోధిసత్వ శాక్యముని శిల్పం, మథుర పురావస్తు ప్రదర్శన శాలలో ఉన్న స్థానక బోధిసత్వమైత్రేయి శిల్పం, మథుర పురావస్తు ప్రదర్శన శాలలోని ఆశీన బుద్ధుని శిల్పం ముఖ్యమైనవి. ఈ బోధిసత్వుల కాళ్ళమధ్య ఆశీన బుద్ధుని పీఠం (సింహాసనం) ముఖభాగాన సింహాల ప్రతిమలున్నాయి. ఇవి శాక్య సింహుడనెడి బుద్ధుని బిరుదాన్ని తెలుపుతున్నాయి. బుద్ధుడు శాక్య తెగలో సింహం వంటివాడని, సింహగర్జన వంటి తొలి సందేశాన్ని సారనాథ్‌లో ఇచ్చిన వాడని కూడా ఇవి తెలుపుచున్నాయి. దీనివల్ల బుద్ధుని ధర్మచక్రప్రవర్తన పూర్వ రూపం తెలుస్తుంది. దీని వల్లనే బుద్ధుని బోధిసత్వుడుగా మథుర శిల్పకళలో భావించడం గలదు. అంటే గౌతముడు భవిష్యత్తులో "బుద్ధుడు" (జ్ఞాని) కాబోతున్నాడని అర్థం.

మథురలోని బోధిసత్వుడు (బుద్ధుని తొలి రూపం) స్థానక రూపంలో ఉన్నాడు. బౌద్ధమత అవసరాలు తీర్చడానికి యక్షుల ఆరాధనారీతిలోని యక్షుడే బోధిసత్వుని లాగ మథుర శిల్పి మార్చినట్లు ఈ శిల్ప రుపం ఉంది. ఈ శిల్పాన్ని పాట్నా, పార్కంలలోని మౌర్య, శుంగుల కాలపు యక్షులతో పోల్చి చూస్తే ఈ విషయం తెలుస్తుంది. మథురలోని పై బోధిసత్వుడు తల వెనుక ప్రభామండలాన్ని, తలపై చుట్టల ముడుల టోపీ వంటి ఉష్ణిషను కలిగి ఉన్నాడు. కుడిచేయి అభయ ముద్రల ఉన్నది. ఎడమచేతిలో కమండలం ఉంది. కుడిచేయి అరేతిలో ధర్మానికి చిహ్నామైన చక్రం ఉంది. అనాగరిక వస్త్ర ధారణ ఉంది.

సారనాథ్ బోధిసత్వునికి స్వదేశీ వస్త్ర రీతి ఉంది. ఈ శిల్పం ఎనిమిది అడుగుల ఎత్తున్నది. ఎడమ చేయి నడుం మీద ఉంది. కుడి చేయి విరిగి ఉన్నది.

మథురలోని ఆశీనబుద్ధుడు 27 అం. ఎత్తున్నాడు. ఇతడు సింహాసనంపై ఆశీనమై ఉన్నాడు. ఇది క్రీ.శ. 2వ శతాబ్దానిది. ఇది భారత రీతి తొలి బుద్ధుని శిల్పంగా చెప్పవచ్చు. ఇక్కడి బుద్ధుని సింహాసనంపై గల శాసనంలో ఇతనిని బోధిసత్వుడనే చెప్పడం జరిగింది ఇది బుద్ధత్వాన్ని పొందే పూర్వరూప గౌతముని శిల్పం. సింహాసనంపై సింహాలున్నాయి. బుద్ధుడు (బోధిసత్వుడు) ఈ శిల్పంలో పలుచటి స్వదేశీ వస్త్రాన్ని ఎడమ భుజం మీదుగా ధరించి ఉన్నాడు. బుద్ధుడు యోగి లాగ సింహాసనంపై బోధివృక్షం కింద ఆశీనమై ఉన్నాడు. తల వెనుక ప్రభామండలం ఉంది. తలపై ఉష్ణిష, కనుబొమ్మల మధ్య బొట్టువంటిది ఉంది. కుడిచేయి అభయ ముద్రలో ఉన్నది. ఎడమ చేయి ఎడమ మోకాలిపై ఉన్నది. కుడి అరచేయి కాలి పాదాలలో ధర్మచక్రం ఉంది. బుద్ధునికి ఇరువైపులా కింది భాగంలో వింజామరలు ధరించి ఉన్నారు. పై భాగాల్లో దేవతలు ఉన్నారు. కుషాణా, ఆంధ్రరాజ్యాలు అంతరించినప్పటికి గుప్తకాలంలో కూడా మథుర బౌద్ధ శిల్ప రీతి కొనసాగింది.

### హిందూ శిల్పాలు

మధుర శిల్పులు తొలిసారిగా హైందవ దేవతలైన విష్ణు, లక్ష్మి, దుర్గ, సప్తమాతృకలు, కార్తికేయుడు మొదలైన వారి శిల్పాలను రూపొందించారు. ఈ దేవతల ప్రతిమా లక్షణాలు ఈ కాలం నాటి భక్తి ఉద్యమ ప్రభావంతో నిర్ణయించబడ్డాయి. హైందవ ప్రతిమలు అనేకం మధురలో లభించాయి. కంకాళితిలలోని ఒక ప్రతిమ సూర్యునిదని కూడా ఒక అభిప్రాయం ఉంది.

### జైన శిల్పాలు

జైన స్తూపాలు, 24 మంది జైన తీర్థంకరుల శిల్పాలు మధురలోనే తొలిత రూపొందించబడ్డాయి. మధురలోనే జైన ప్రతిమల లక్షణాలు మొదటి సారిగా నిర్ధారింపబడడం కూడా జరిగింది. మధుర, కంకాళితిలలలో జైన స్తూపాలు, శిల్పాలు లభించాయి. కంకాళితిల స్తూపంలో వేయిశిల్పాలు ఉన్నాయి. జైన శిల్పాలు స్థానక, ఆశీన రూపాల్లో ఉన్నాయి. స్థానక శిల్పాలు కాయోత్సాగర రీతిలోను, ఆశీన శిల్పాలు పద్మాసన రీతిలోను ఉన్నాయి. జైన తీర్థంకరుల దేహం, తల, కండ్లు, ధ్యాన రీతిలో ఉన్నాయి. మధుర జైన తీర్థంకరులను వారి కింది భాగంలోని పీఠంపై గల శాసనాల వల్ల తెలుసుకోడానికి వీలవుతున్నది. ఈ కాలానికి వీరికి విడివిడిగా లాంఛనాలు (cognizance) రూపొందలేదు. చౌముఖ తీర్థంకరుల శిల్పాలు కూడా రూపొందింపబడ్డాయి.

### మాతృదేవతా శిల్పాలు

మధుర శిల్పి మాతృదేవతా శిల్పాలను కూడా రూపొందించినట్లు తెలుస్తుంది. వీరిలో మహిష మర్ధని, అంబిక, వసుదన్, బౌద్ధమత దేవి హారితి ముఖ్యులు.

### నాగ, యక్ష, యక్షిణి శిల్పాలు

యక్ష, యక్షిణి శిల్పాలను కూడా మధుర శిల్పి రూపొందించడం జరిగింది. ఈ యక్షుడి రూపంలోనే కొంతవరకు బోధిసత్వుని శిల్పం కూడా రూపొందించబడి ఆదిమరీతి ప్రభావాన్ని బోధిసత్వ శిల్పం తెలుపుతున్నది. యక్షుల శిల్పాలతో బాటు మధురలో యక్షిణి శిల్పాలు కూడా లభించాయి. యక్షిణి శిల్పాలు నగ్నంగా గాని, అర్ధనగ్నంగాని ఉన్నాయి. శృంగార భంగిమల్లో ఉన్నాయి. ఈ అప్సరసలు అందమైన రూపంతో, భారీ రూపంతో నిండైన వదనంతో, కటిభాగంతో, మృదువైన దేహభాగాలతో, ఉన్నారు. శిరస్సులు కొంత పక్కకు ఉన్నాయి. కంకాళితిల యందు వేదిక స్తంభాలపైగల యక్షిణిలు మధర యక్షిణులకు ఉదాహరణ. వీరు మరుగుజ్జులపై వివిధ భంగిమల్లో నిలుచొని ఉన్నారు. ఈ శిల్పాలు క్రీ.శ. 2వ శతాబ్దానివి.

నేడు కలకత్తాలోని ఇండియన్ మ్యూజియంలో ఉన్నాయి. మధుర యక్ష, యక్షిణి, నాగ శిల్పాలు శుంగ, ఆంధ్ర కాలపు యక్ష, యక్షిణి, నాగ శిల్పాల లాగ ఉన్నాయి.

## సాలభంజిక అప్సరస స్త్రీల శిల్పాలు

మధురలోని వేదిక నిలువులు, అడ్డవిభాగాలపై అనేక రకాల స్త్రీల శిల్పాలు అందంగా రూపొందించబడి ఉన్నాయి. ఈ వేదికనే పద్మవర వేదిక అంటారు. దీనిపై శుంగుల కాలపు బార్హుత్ సాంచి ప్రాంతాల్లో లాగ చెట్టు నుంచి పూలు కోస్తున్న స్త్రీ శిల్పం, ఎడమ చేతితో ఫలాన్ని పట్టుకొని చిలుకలకు తినిపిస్తున్న స్త్రీ శిల్పం, జలపాతం కింద స్నానమాచరిస్తున్న స్త్రీ శిల్పం, స్నానమాచరించిన తరవాత వెనుకకు తిరిగి కురులలోని నీటిని పిండుతుంటే ఆ నీటిని ఒక హంస తాగుతున్నట్లున్న స్త్రీ శిల్పం, తన అంతర్ వస్త్రాన్ని కాబోలు నడుము వద్ద సడలిస్తున్న స్త్రీల శిల్పాలు, చేతులు పైకెత్తి మత్తుగా దేహాన్ని వంచుతున్న అలసకన్యలనే స్త్రీల శిల్పాలు ఉన్నాయి. ఒక శిల్పంలో 'అశోకదోహద' శిల్పం ఉంది. అంటే ఎడమచేతితో అశోక వృక్షపు కొమ్మను వంచి పట్టుకొనిఎడమ పాదంతో ఆ కొమ్మను తాకుచున్న స్త్రీ శిల్పం. ఇది అశోక వృక్షానికి కన్య పాదం తగిలితే వికసిస్తుందనేది సామెతను ధ్రువీకరిస్తున్నది. మరుగుజ్జులపై నిలుచొని ఉన్న స్త్రీల శిల్పాలు, మత్తుపానీయ పాత్రను ఒక వృక్షం కింద పట్టుకొని నిలుచొని ఉన్న స్త్రీ శిల్పం, అనంత ఆనంద స్థితిలో ఉన్న మానవ జీవన వ్యవస్థను తెలిపే శిల్పాలు కూడా ఈ వేదికలపై ఉన్నాయి.

## కుషాణ రాజుల శిల్పాలు

మధుర దగ్గరలో ఉన్న మత్ లేదా తోకితిల గ్రామ ప్రాంతంలోని కుషాణ రాజవంశీయుల ఆలయంలో కుషాణ రాజుల శిల్పాలున్నాయి. వీటిలో రెండు సింహాసన ఆశీనుడై ఉన్న వీమాకాడ్ఫయిసిస్ శిల్పాలు, ఒకటి నిలుచొనిఉన్న కనిష్క శిల్పం ఉన్నాయి. ఇవి రెండూ విరిగి ఉన్నాయి.

వీమాకాడ్ఫయిసిస్ శిల్పానికి తలలేదు. నడుం వద్ద విరిచివేయబడి ఉన్నది. అయినప్పటికీ తల లేని స్థితిలో కూడా 6 అం. 10 అం. ఎత్తున్నది. ఈ శిల్ప మోకాళ్ళు విరగగొట్టబడి ఉన్నాయి. ఎడమచేయి నడుం వద్ద, కుడిచేయి ఎద వద్ద ఉన్నాయి. కాళ్ళకు ఎత్తైన, బరువైన బూట్లు, పొంటువంటి వస్త్రం ఉన్నాయి. కాళ్ళు పీఠంపై ఉన్నాయి. శిల్పం ఇరువైపులా సింహాలున్నాయి. బరువైన వస్త్రాన్ని ఇతడు ధరించి ఉన్నాడు. ఈ శిల్పం నేడు మధుర పురావస్తు మ్యూజియంలో ఉన్నది.

కనిష్కుని శిల్పానికి కూడా తల, చేతులు లేవు. కాని ఈతని కుడి, ఎడమ చేతులు నడుం వద్ద ఉన్నట్లు రూపొందింపబడి ఆ భాగపు చేతులు మాత్రం ఉన్నాయి. ఇతని ఎడమ చేతిలో ఖడ్గం, కుడిచేతిలో గద ఉన్నాయి. బరువైన కోటు వంటిది పై నుంచి కాలి మడిమెల

వరకు ఇతడు ధరించి ఉన్నాడు. పొంటు వంటి కింది వస్త్రాన్ని ధరించి ఉన్నాడు. లావుపాటి పెద్ద బూట్లను కాళ్ళకు ధరించి ఉన్నాడు. ఈ శిల్పం లోని వ్యక్తి కనిష్కుడని తెలుపుతూ మోకాళ్ళ కింది భాగంలో కోటు పై భాగంలో అతని పేరు తెలుపుతూ ఖరోష్టి లిపిలోని ఒక శాసనం ఉంది.

మధుర దగ్గరలోని గోకర్ణేశ్వర దేవాలయంలో మరొక కుషాణ రాజు శిల్పం ఉంది.

కంకాళితిల ప్రాంతంలో ఒక శిల్పం విచిత్రరీతిలో ఉన్నది. ఇది కుషాణ రాజు శిల్పం లాగను సూర్యదేవుని శిల్పం లాగను రెండు విధాలుగా కనిపిస్తుంది. ఇది నేడు మధుర పురావస్తు ప్రదర్శనశాలలో ఉన్నది. ఇది సూర్యుని శిల్పమని అధికమంది అభిప్రాయం. ఇది ఆశీన శిల్పం. ఇతడు చుట్టవంటి తలపాగను, సిథియన్ రీతి దుస్తులను, మీసాలను, ఎడమ చేతిలో చిన్న ఖడ్గంతో ఉన్నాడు. మెడలో బరువైన ఆభరణం, కాళ్ళకు బూట్లు ఉన్నాయి. ఈ శిల్ప పీఠం ముఖ భాగాన అగ్ని గుండం ఉంది. శిల్పంతల వెనుక ప్రభామండలం ఉండేది. నేడు విరిగి ఉన్నది. శిల్పం ఇరువైపులా అశ్వాలున్నాయి. ఇవి ఇతన్ని సూర్యునిగా తెలుపుతున్నాయి. ఖడ్గం బూట్లు వంటివి రాజుగా తెలుపుతున్నాయి.

# 8

# గుప్తుల శిల్పకళ

పాటలీ పుత్ర నగరం రాజధానిగా పరిపాలించిన గుప్తుల కాలంలో విజ్ఞాన శాస్త్రం, సాహిత్యం, సంగీతం, చిత్ర లేఖనాలే గాక శిల్పకళాభివృద్ధి కూడా ఇతోధికంగా జరిగి వారికాలం స్వర్ణయుగంగా పేరు గాంచింది. గుప్తుల కీర్తికి వారి శిల్పకళే కొంత వరకు కారణం. వీరి కాలంలో శిల్పకళలో నూతన శకం ప్రారంభమైంది. మధుర, బెనారస్, పాట్నా, శ్రావస్తి, సారనాథ్, కౌశాంబి, బుద్ధగయ వీరి కాలపు శిల్పకళా కేంద్రాలు. వీరి శిల్పకళలో అనేక ముఖ్య లక్షణాలు కనిపిస్తాయి. అవి:

గుప్తుల కాలమందలి శిల్పాల్లో మత బేధం లేకుండా రూపొందించిన బౌద్ధ, హిందూ శిల్పాలు కనపడతాయి. సారనాథ్‌లో లభించిన బుద్ధుని శిల్పాలు, మధురలో లభించిన శిల,కంచు బుద్ధుని శిల్పాలు సుల్తాన్‌గంజ్‌లోని రాగి బుద్ధుని శిల్పం, దేవేఘర్, ఉదయగిరి వంటి ప్రాంతాల్లోని విష్ణు, వరాహ, శివ మొదలైన హిందూ దేవతా శిల్పాలు ఇందుకు ఉదాహరణలు.

వీరి కాలానికి శిల్పకళలో పలు ప్రయోగాలు పూర్తయి ధ్యేయం, శిల్ప సూత్రాలు, ఆధ్యాత్మికతలకు అనుగుణమైన అద్భుత శిల్పాలు రూపొందింపబడుటే గాక తరవాతి కాల శిల్పకళపై గొప్ప ప్రభావాన్ని చూపింది.

గుప్త శిల్పాలు భావి శిల్పకళకు మార్గదర్శకాలుగా నిలచిపోవుటే గాక మలె, సుమత్ర, జావ, అన్నాం, కంబోడియా (కంపూచియా) క్లీవ్స్ వంటి ప్రాంతాల శిల్పకళపై కూడా చెరగని ముద్ర వేశాయి.

వీరి శిల్పాల్లో అందం, కళాత్మకమైన ఆకృతి హెూదా, దేదీప్యమానంగా వెలిగే ఆధ్యాత్మికత, అనంత ఆనందం, రాసకళ కనపడుతుంది.

జ్ఞానాంశం ఉన్నత స్థానాన్ని పొంది ఉద్రేకతలు అలంకారాలు అదుపులో ఉంచటం జరిగింది.

గుప్త శిల్పాలు ఆలోచనకు సంబంధాన్ని తెలుపుతున్నాయి. శరీరానికి మనస్సుకు గల ప్రబంధం లాగ శిల్ప బహిర్ రూపానికి అంతరార్థానికి అనుసంధానం కల్పించబడి ఉన్నది.

శారీరక, మానసిక క్రమశిక్షణ వీరి శిల్పాలలో కనపడుతుంది. దీని వల్ల మధుర శిల్పాలలోని భారమైన శరీరం (earthyness) వేంగి (ఆంధ్ర) శిల్ప కళలో కనపడే ఆకర్షణీయమైన అందం, భౌతిక ఆనందం ఇచ్చేడి గుణం తొలగి పోయింది. ఇందువల్ల శిల్పం అనుభవ స్థాయి రూపాన్ని పొందింది. ముఖం ప్రకాశవంతమై జ్ఞానాన్ని తెలుపుతుంది.

వీరి శిల్పాల్లో కళ్ళు బాహ్యప్రపంచాన్ని చూసే బదులు కనురెప్పలు మూసుకొని శారీరక మానసిక క్రమశిక్షణతో ఏర్పడిన ధ్యాన ఏకాగ్రతతో అంతర్లీనమై ఉన్నాయి. ఈ రీతి బౌద్ధ, హిందూ దేవదేవీల శిల్పాలలోనే గాక మానవ స్త్రీ పురుషులలో కూడా కనిపిస్తుంది.

శారీరక, మానసిక క్రమశిక్షణ శిల్పాల్లో ఉన్నందు వల్ల మానసిక ఆందోళనలు, ఇంద్రియ కోర్కెలు, శారీరక భారం అదృశ్యమై శరీర రూపం స్థానక, ఆశీన, వంపు రూపాలన్నింటిలోను తుల్యత, సొంపైన వంపుల రీతిని పొంది ఉన్నది. ముఖం విజ్ఞానంతో వెలిగి పోతున్నది.

కండరాలు శరీరంలో ప్రవహించే విద్యుత్‌తరంగాల మీటలతో మృదుత్వంతో ఉప్పొంగుతున్నాయి.

జ్ఞానం సత్యాలతో నిండుకొని ఉన్న శరీరం విశ్రాంతిని పొందుతున్నది.

శారీరక, మానసిక ఉద్రేకతల వీరి శిల్పంలో కనపడదు.

గుప్తుల శిల్ప సముదాయంలోని కదలికలో ఒక శిల్పానికి మరొక శిల్పానికి సంబంధం కనపడదు. ప్రతి శిల్పం దేనికదే నిలచి ఉన్నది. ప్రతిదీ జీవితాన్ని అర్థం చేసుకున్న రీతిలో ఉన్నది.

వీరి శిల్పాల్లో దుస్తులు, ఆభరణాలు, అలంకరణలు అవసరమున్నంత వరకు మాత్రమే ఉన్నాయి. శరీర అందాలు పలుచటి వస్త్రంలో మరుగయ్యాయి. అంటే ఈ కాలంలో నగ్నత్వం పూర్తిగా రూపుమాపబడింది.

గుప్త శిల్పంలో సహజత్వం, తాజా గుణం, సజీవం కనపడుతుంది.

సాంప్రదాయాల నుంచి శిల్పం తుల్యతను, స్వేచ్ఛను పొంది ఉన్నాయి.

గుప్తకాలానికే ఉన్న అందమైన కుషాణ శిల్పం గుప్తకాలంలో పరిణితిని పొందింది. స్వదేశీ శిల్పకళ గుప్తకాలంలో ఉన్నత స్థాయికి చేరుకొన్నది.

**బౌద్ధ శిల్పకళ**

గుప్త రాజ్య స్థాపనా కాలానికి కూడా మధురలో ఇంకా నిలచి ఉన్న కుషాణ శిల్పరీతి (మధుర రీతి) నుంచి గుప్త శిల్పకళ ఉద్భవించిందని చెప్పవచ్చు. పలుమతాలకు, దేవతా ప్రతిమల రూపణకు కుషాణ కాల పూర్వం నుంచే మధుర కేంద్రంగా ఉండేది. గుప్తకాలపు

బుద్ధుని శిల్పాలు మధురలో రెండు లభించాయి. రెండూ ఒకే రీతిలో ఉన్నాయి. వీటిల ఒకటి ఎర్ర ఇసుక రాతితో రూపొందించబడింది. ఇది నేడు ఢిల్లీలోని నేషనల్ మ్యూజియంల ఉంది. ఇది స్థానక శిల్పం. సుమారు 2.17 మీటర్లు ఎత్తున్నది. క్రీ.శ. 4-5 శతాబ్దాల మధ్య రూపొందించబడింది. ఈ శిల్పంలో బుద్ధుని శిరస్సు వెనుకగా అలంకారయుక ప్రభామండలం ఉంది. బుద్ధుడు సంఘటి అనే చారల వంటి ముడతలు గల పలుచట వస్త్రాన్ని భుజాల మీదుగా మెడనుంచి మోకాళ్ళ కింది వరకు ధరించి ఉన్నాడు. శిల్పంల సహజత్వం సాదాతనం, ప్రశాంతత, అంతఃశాంతం, ఆధ్యాత్మికత కనబడుతుంది. వస్త్రం ఎడమ చేతి మీదుగా వ్రేలాడు తున్నది. కుడిచేయి సగం విరిగి పోయి ఉన్నది. అయినా ఇది అభయ ముద్రలో ఉన్నట్లు తెలుస్తుంది. తల, ఉష్ణీషలు ముడుల వంటి వంకీల జుట్టుతో ఉన్నాయి కండ్లు బరువైన, మూతబడి ఉన్న కనురెప్పలను కలిగి ఉన్నాయి. ఇది ఏకాగ్రధ్యానాని తెలుపుతున్నది. ప్రభామండలంలో తామరల వృత్తం, తామర రేకుల వృత్తాలు ఉన్నాయి

సారనాథ్‌లో లభించిన గుప్తుల బుద్ధుని శిల్పాలను పరిశీలిస్తే మధురలోని గుప్త శిల్పకళ సారనాథ్‌లో మరింత పరిపక్వతను, సంపూర్ణతను సంతరించుకొన్నదని తెస్తున్నది. ఇక్కడ నీటిల ముంచినట్లు కనపడే 'తేమబుద్ధు'లని పిలవబడే శిల్పాలున్నాయి. వీటిలో ఒకటి నేడు క్లీవ్‌లాండ్ ఆర్ట్ మ్యూజియంలో ఉన్నది. ఇందులో బుద్ధునికి మధుర రీతిలోని వ్రేలాడే వస్త్రంలేదు కానీ శరీరానికి అంటుకొని ఉన్న పలుచటి వస్త్రం ఉంది. శిల్ప వేళ్ళ మధ్య చర్మం ఉంది ఇది క్రీ.శ. 5వ శతాబ్దానిది. చూనార్ ఇసుకరాతితో రూపొందించబడింది.

సారనాథ్‌లో ప్రసిద్ధి గాంచిన ఆశీన బుద్ధుని ప్రతిమ ఉంది. ఇది క్రీ.శ. 5వ శతాబ్దానిది చూనార్ ఇసుకరాతితో రూపొందించబడి ఉన్నది. సుమారు 1.60 మీటర్ల ఎత్తుఉంది. ప్రస్తుతం ఇది సారనాథ్ మ్యూజియంలో ఉంది. ఇది ధర్మచక్ర ప్రవర్తన బుద్ధుని శిల్పం. గుప్త శిల్పాల్లో పరిపూర్ణమైనది. ఇందులో అలంకరణ, సాదాతనాల తుల్యత ఉంది. భవిష్యత్‌కాల అన్ని మతాల శిల్పకళలపై ఇది గొప్ప ప్రభావాన్ని చూపింది. ఈ శిల్పంలో బుద్ధుడు యోగి లాగ ధర్మ చక్ర ప్రవర్తన ముద్రలో కూర్చొని ఉన్నాడు. ఇతని తల వెనుక భాగంలో ప్రభామండలం ఉంది. దీనిపై భాగంలో కుడిఎడమల్లో ఇద్దరు స్వర్గదేవతలు (గంధర్వులు) ఉన్నారు. గొంతు దగ్గర, కాళ్ళు చేతుల మడిమెల దగ్గర రూపొందింప బడి ఉన్న పట్టీల వంటి రూపాలతో ఇతని సంఘటి అనే పలుచటి వస్త్రం ఉన్నది. బుద్ధుడు ఆశీనుడై ఉన్న సింహాసనం కింది విభాగంలో ఆరుగుర్ము భక్తులు (శిష్యులు) ధర్మ చక్రాన్ని ఆరాధిస్తున్నారు. రెండు జింకలు ధర్మచక్రానికి ఇరువైపులా ఉన్నాయి. ఇవి జింకల వనాన్ని తెలుపుతున్నాయి. బుద్ధునికి ఇరువైపులా సింహాసన భాగంలో దుముకుతున్న సింహాలున్నాయి. ఈశిల్పంలో బుద్ధుని హస్తాలు బోధనా రీతిలో ఉన్నాయి. తలపై గల శిరోజాలు వంపులతో ముడుల లాగ ఎత్తుగా ఉన్నాయి. ఏకాగ్ర ధ్యానం, అనంత ఆనందం ఇతని ముఖంలో కనబడుతాయి. గుప్త శిల్పాల్లో సారనాథ్ శిల్పాలు ప్రసిద్ధి గాంచాయి.

గుప్తుల కాలపు లోహపు బుద్ధ శిల్పాల్లో సుల్తాన్ గంజ్ శిల్పం ముఖ్యమైంది. ఇది

ఎనిమిది అడుగుల ఎత్తున్నది. ఇది ప్రస్తుతం బర్మింగ్‌హాం మ్యూజియంలో ఉన్నది. ఇతని సంఘటికొసలలోనే మడతలు కనపడతాయి. దూరదూరంగా గల గీతలతో వస్త్రం తెలుపబడి ఉన్నది. ఇది స్థానక శిల్పం. సారనాథ్ రీతిలో ఉన్నది. ఇది క్రీ.శ. 5 లేదా 6వ శతాబ్దానిది.

ఉత్తరప్రదేశ్‌లో మరో లోహ బుద్ధుని శిల్పం లభించింది. ఇది నేడు కాన్సాస్‌సిటీ మ్యూజియంలో ఉన్నది. దీన్ని కంచుతో తయారు చేశారు. చిన్నది. తల వెనుక పెద్ద ప్రభామండలం ఉంది. వస్త్రం ముడతలు స్పష్టంగా తెలుపబడి ఉన్నాయి.

కాశ్మీర్ ప్రాంతంలో దంతంతో తయారు చేసిన బోధిసత్వులు, బుద్ధుని శిల్పాలు లభించాయి. ఇవి గుప్తుల ఆఖరి కాలానివి. క్రీ.శ. 8వ శతాబ్దానికి చెందాయి. ఇవి కొంతవరకు గాంధార రీతికి దగ్గరగా ఉన్నాయి.

## హైందవ శిల్పకళ

గుప్త కాలంలో బౌద్ధ శిల్పకళతో బాటు హైందవ శిల్ప కళ కూడా అభివృద్ధి చెందింది. గుప్తుల మత సమానత్వాన్ని అనుసరించారు. కాని వీరికాలానికి బౌద్ధ జైనాలు పతన దశలో ఉండటం వల్ల హైందవ మతం పుంజుకొన్నది. కుషాణ కాలంలోనే మధుర వంటి ప్రాంతాల్లో హైందవ దేవతలైన సూర్యుడు, విష్ణువుల శిల్పాలు రూపొందించటం ప్రారంభమయ్యింది. కాని గుప్తుల కాలంలో విష్ణువు పలు అవతార శిల్పాలు రూపొందించటం ప్రారంభమయింది.

గుప్తుల కాలపు హైందవ శిల్పకళకు మధ్య భారతదేశంలోని భోపాల్ వద్ద గల ఉదయగిరి గుహాలయం తొలి ఉదాహరణ. ఇది క్రీ.శ. 401-2 మధ్యకాలానిది. రెండో చంద్రగుప్తుని కాలానిది. ఇక్కడి గుహాలయం ఏడవ భాగాన పెద్ద శిలాఖండ ముఖభాగాన భూ దేవిని రక్షిస్తున్న విష్ణువరాహావతారం ఉంది. అమృతం కోసం దేవతలు రాక్షసులు పాల సముద్రాన్ని మధిస్తే విష్ణువు అవతరించాడని కథనం ఉంది. ఇక్కడి శిల్పంలో వరాహుడు భూదేవిని నాగరాజు సముద్రాంతరాళాలలోనికి తీసుకొని వెళ్తుంటే రక్షించి వెలికి తెచ్చినట్లు, నాగరాజు పడగలను ముక్కలు చేసినట్లు, దేవతలు అందుకు ఆనందిస్తున్నట్లు చూపటం జరిగింది. ఈ గుహలో కుడిభాగాన స్థానక విష్ణు శిల్పం ఉంది. ఇందు విష్ణువు లో దేవతి ధరించి ఉన్నాడు. చతుర్భుజాలు ఉన్నాయి. రెండు చేతుల్లో మాలను పట్టుకొని ఉన్నాడు. ఆభరణ కిరీటాన్ని ధరించి ఉన్నాడు. హృదయంపై శ్రీవత్స ఆభరణం ఉంది. వరదముద్రలో ఉన్న పై కుడిచేయి విరిగి ఉన్నది. శంఖాన్ని కలిగి ఉన్న పై ఎడమ చేయి కూడా విరిగి ఉన్నది. కుడి ఎడమ కింది చేతులు ఆయుధాలు ఆయుధ పురుషులతో కూడి ఉన్నాయి. ఉదయగిరి గుహ ద్వారంపైన లింటల్ భాగంలో గంగాదేవి శిల్పం ఉంది.

బెస్ నగర్ ప్రాంతంలో కూడా ఒక గంగాదేవి శిల్పం లభించింది. ప్రస్తుతం ఇది బోస్టన్ మ్యూజియంలో ఉంది. ఇందు గంగాదేవి మకరం పై నిలుచొని ఉన్నది. దేవి సహజత్వాన్ని

కలిగి ఉన్నది. త్రిభంగ రీతిలో ఉన్నది. దేవికి ఇరువైపులా ఇద్దరు మరుగుజ్జులు ఉన్నారు.

దేవేఘర్ సందలి దశావతార దేవాలయంలో అనంత శాయి విష్ణుప్రతిమ ఉంది. ఇందులో విష్ణు ఆదిశేషునిపై పాల సముద్రంలో పవళించి ఉన్నాడు. ఇతనికి పై భాగంలో బ్రహ్మ, ఇంద్రుడు, శివుడు మొదలైన దేవతలున్నారు. లక్ష్మీదేవి విష్ణుకాళ్ళను ఒత్తుతున్నది. విష్ణు కింది భాగంలో విష్ణు ఆయుధాలు మానవాకారంలో (ఆయుధ పురుషులు) చూపబడి ఉన్నారు. అంతేగాక ఇద్దరు రాక్షసులు కూడా చూపబడి ఉన్నారు.

దేవేఘర్‌లోని నరనారాయణ, మధురలోని వరాహ, విష్ణు, శేషశాయి, రామయణ, కృష్ణలీలల శిల్పాలు వైష్ణవ శిల్పాల్లో మరి కొన్ని ఉదాహరణలు. రామలక్ష్మణ సీతలు అగస్త్య రుషి ఆశ్రమానికి వెళ్ళడం, లక్ష్మణుడు శూర్పణక ముక్కు కోయడం వంటి రామాయణ శిల్పాలు గుప్తుల శిల్పకళలో ఉన్నాయి.

అందమైన శివుని శిల్పాలు కూడా గుప్తుల కాలానివి లభించాయి. లింగరూపంలో కుషాణ కాలంలో కూడా శివుడు ఆరాధించబడినప్పటికీ గుప్తకాలంలో ఏకముఖ, చతుర్ముఖ శివలింగ ఆరాధన ఏర్పడింది. ఖోహ్, భిత ప్రాంతాల్లో ఏకముఖ శివలింగాలు లభించాయి. అర్ధనారీశ్వర రూపంలో కూడా వీరి కాలంలో శివుడు ఆరాధింపబడ్డాడు.

విష్ణు, శివ శిల్పాలే గాక పలు రకాల హైందవ శిల్పాలు కూడా వీరి కాలానివి లభించాయి. మధురలో గణేశ, దుర్గ, ఏకముఖలింగం, అమృతమదన శిల్పాలు లభించాయి. భుమారలో మహిష మర్దని శిల్పం ఉంది. దేవేఘర్‌లో గజేంద్ర మోక్ష శిల్పమున్నది. కోసమ్‌లో శివపార్వతి, మకరంపై గల గంగాదేవి, తాబేలుపై గల యమున శిల్పాలున్నాయి. పవయలో సూర్యగీతు, నృత్య శిల్పాలున్నాయి. బక్సార్‌లో గంగాయమునలు గల తోరణం లభించింది. రాజోనలో కిరాతార్జునీయ, గంగా పరిణయ శిల్పాలు లభించాయి. ఇవి ప్రస్తుతం కలకత్తా మ్యూజియంలో ఉన్నాయి. గ్వాలియర్ మ్యూజియంలో సప్తమాతృకలు, నవగ్రహాల శిల్పాలున్నాయి. భూమారలోని శిల్పాలు అనేకం అలహాబాదు మ్యూజియంలో ఉన్నాయి.

గుప్తుల శిల్పకళ తరవాతి కాలపు శిల్పకళలపై గొప్ప ప్రభావాన్ని చూపినదని చెప్పవచ్చు. గంగా యమున శిల్పం అట్టి ప్రభావాల్లో ముఖ్యమైంది. ఇది వాకాటక, తొలి చాళుక్య ఆలయాల్లో ప్రధానంగా కనపడుతుంది.

గుప్త కాలపు మట్టి బొమ్మలు కూడా అనేకం లభించాయి. వీటిలో దేవదేవీలు, స్త్రీ పురుషులు, జంతువులు మొదలైనవి ఉన్నాయి. దేవతల్లో విష్ణు, సూర్య, దుర్గ, గణేశ, యమున ల మట్టి బొమ్మలున్నాయి. వీరి కాలపు మట్టి బొమ్మలు భిత, భితర్గాన్ అహిచ్ఛత్ర, రాజ్‌ఘర్ వంటి ప్రాంతాల్లో లభించాయి.

# 9

# బౌద్ధ వాస్తుశిల్పం

## ఎ. స్తూపాలు

బౌద్ధ వాస్తు నిర్మాణంలో స్తూపానికి ఒక ప్రత్యేక స్థానం ఉంది. కాని బౌద్ధ మతానికి పూర్వమే స్తూపాల నిర్మాణం ఉన్నట్లు తెలుస్తున్నది. నాడు రాజులు, మహావ్యక్తులు మరణించినపుడు వారి శరీర అవశేషాలపై స్తూపాలు నిర్మించారు. కాని బౌద్ధులే స్తూప నిర్మాణంలో ఉత్సాహాన్ని చూపి బౌద్ధ సాంప్రదాయకంగా ఏర్పరచారు. బుద్ధుడు, అతని శిష్యుల చితి నుంచి పుట్టిన ధాతువు (చైత్యం) పై కట్టబడ్డ దిబ్బ వంటి నిర్మాణం కావున దీనికి స్తూపం అని పేరు వచ్చింది. ఈ స్తూపాలను, స్తూప చిహ్నాలను బుద్ధుడుగా భావించి బౌద్ధులు ఆరాధించేవారు. నిత్య పూజ నిమిత్తం చైత్య గృహాలలో కూడా స్తూపాలను నిర్మించుకొనేవారు. స్తూపాలు మూడు రకాలు. అవి: శారీరక స్తూపం, పారిభోగిక స్తూపం, ఉద్దేశిక స్తూపం. ఇవి తొలుత ఇటుకతో, ఆ తరవాత రాతితో నిర్మించారు. ఇటుక నిర్మాణాల చుట్టూ రాతి కప్పువేయడం గూడ ఉన్నది. స్తూపాలకు పీఠం (base), అండం (dome), హర్మిక (hormika) ఛత్ర (flag) కింది ప్రదక్షిణ, పై ప్రదక్షిణ, వేదిక లేదా ప్రాకారం (railing), తోరణ (gateway), ఆయక స్తంభాలనే భాగాలున్నాయి.

### a) పిప్రావ స్తూపం

ఇది భారతదేశ స్తూపాల్లో మొదటిది. అశోకుని పూర్వకాలానికి చెందినదిగా భావిస్తున్నారు. కపిలవస్తుకు 11 మైళ్ళ దూరంలో బస్తి జిల్లాలో నేపాల్ సరిహద్దున పిప్రావ గ్రామం ఉంది. ఇక్కడి స్తూపం 116 అ. వ్యాసాన్ని, 21.5 అ. ఎత్తును గలిగి ఉన్నది. అనగా భూ కొలతకు ఎత్తుకు సమతుల్యం లేదు. ఇది స్తూప ప్రాచీనతను తెలుపుతున్నది. ఈ స్తూపం ఇటుకలతో నిర్మించటం జరిగింది. దీని ఇటుకలు 16" × 11" × 3" కొలతను కలిగి ఉన్నాయి. స్తూపం లోపల ఇసుకరాతితో (sand stone) చేసిన ధాతు పాత్రలో (relic casket or vase) బుద్ధుని ధాతువు నిక్షిప్తం చేయబడింది. ఈ పాత్ర (vase) పై ఒక మూత (lid) ఉంది. పాత్రపై భాగాన అశోకుని పూర్వకాలానికి చెందిన అక్షరాల్లో ఒక శాసనం ఉంది. పాత్రలో కొన్ని ఎముకల ముక్కలు, కార్నీలియన్ (carnelian) గోమేధికం, (topaz), పగడం, (coral), స్ఫటికం (crystal), బంగారు (gold) మొదలైన విలువైన వాటిపై కళాత్మకంగా రూపొందించిన పూలు, ఆకులు ఉ-
భూ దేవి చిత్రం చెక్క బడి ఉన్న ఒక బంగారు ముక్క కూడా ఉంది.

**b) సాంచి స్తూపం**

విదేశ, వేత్రావతీ నదుల సంగమ ప్రాంతంలో విదేశ (భిల్సాకు) 5 1/2 మైళ్ళ దూరంలో సాంచి ఉంది. ఇది తూర్పు మాళవ రాజధాని. మధుర - ప్రతిష్ఠాన పురాల రహదారి మార్గంలో ఉంది. సాంచిలో అనేక అద్భుత నిర్మాణాలు ఉన్నాయి. స్తూపాలు, దేవాలయాలు, విహారాలు స్మృతి స్తంభాలు ఉన్నాయి. ప్రసిద్ధి గాంచిన ఇక్కడి సాంచి స్తూపాన్ని అశోకుడు నిర్మించినట్లు తెలుస్తుంది. మహావంశ గ్రంథం ప్రకారం అశోకుడు 84,000 స్తూపాలను విహారాలను నిర్మించినట్లు తెలుస్తున్నది. తండ్రి ద్వారా ఉజ్జయినీ ప్రాంతానికి రాజప్రతినిధిగా నియమితుడైన అశోకుడు అచక్కడికి వెళ్తూ విదిశలో ఆగాడు. ఇక్కడే ఒక వ్యాపారుని కుమార్తెను వివాహమాడాడు. ఆమెకు జన్మించిన వాడే మహేంద్రుడు. సాంచిని బుద్ధుడు సందర్శించలేదు. కాని స్తూప నిర్మాణానికి సాంచి అనుకూలంగా ఉన్నందున అశోకుడు ఇక్కడ స్తూప నిర్మాణం చేయించాడు. ఈ ప్రాంతాన్నే ఆధునిక కాలంలో కన్నింగ్ హాం సందర్శించి "భిల్సాతోవ్స్" అను గ్రంథాన్ని 1854లో రచించాడు. ఇక్కడ భిల్సాతోవ్స్ అని పిలువబడుచున్న 60 స్తూపాలు సోనాలిలోకి, శతధారలో 5, అంధేరిలో 3భోజ్‌పూర్‌లో 37, సాంచిలో 7 స్తూపాలు ఉన్నాయి.

సాంచిలోని 7 స్తూపాలలో ఒకటో, రెండో, మూడో సంఖ్యల స్తూపాలు ముఖ్యమైనవి. మూడో సంఖ్య స్తూపంలో బుద్ధుని శిష్యులైన మొగ్గలయన, సారి పుత్రల ధాతువులు నిక్షిప్తం చేయబడి ఉన్నాయి. మొదటి, మూడవ స్తూపాలు ఇక్కడి కొండపైన నిర్మింపబడి ఉన్నాయి. రెండో స్తూపం కొండ పశ్చిమాన నిర్మింపబడి ఉన్నది.

ఒకటో స్తూపాన్నే మహా చైత్య అంటారు. దీనికి నాలుగు ప్రవేశ ద్వారాలు (తోరణాలు) ఉన్నాయి. దక్షిణద్వారం ముందు భాగాన అశోక స్తంభం ఉంది. రెండో స్తూపానికి ప్రవేశ ద్వారం లేదు. మూడో స్తూపానికి ఒక ప్రవేశ ద్వారం ఉంది. ఈ ఐదు ప్రవేశ ద్వారాలు లేదా తోరణాలు (gate ways) వేదీలు (railings) క్రీ.పూ. ఒకటో శతాబ్దపు ద్వితీయ అర్ధభాగాన ఆంధ్ర శాత వాహనులచే నిర్మించారు. మహాచైత్య దక్షిణ తోరణం పైగల ఒక శాసనం, దీన్ని ఆనందుడనెడివాడు నిర్మించినట్లు తెలుపుచున్నది. ఇతడు శాతవాహన రాజైన శ్రీ శాతకర్ణి యొక్క స్థపతుల అధిపతి. శాసన మందలి శాతకర్ణిరాజు క్రీ.పూ. ఒకటో శతాబ్దానికి చెందిన ఆరో శాతవాహన రాజైన రెండో శాతకర్ణిగా చెప్పవచ్చు.

మహాచైత్య (స్తూపం)ను మాత్రం అశోకుడు నిర్మించాడు. ఇది ఇటుక నిర్మాణం. దీని చుట్టూ రాతి నిర్మాణాన్ని తరవాతి కాలంలో శుంగులు నిర్మించారు. ఈ నూతన నిర్మాణం మౌర్యుల నిర్మాణానికి రెండింతలున్నది. ఇది 120" వ్యాసాన్ని 54" ఎత్తును నేడు కలిగి ఉన్నది. తొలి నిర్మాణ కాలంలో స్తూపం చుట్టూ ఇటుక రాళ్ళ గులక పరచబడింది. ఆ తరవాత మొరటు రాళ్ళతో కప్పబడింది. కానీ సిమెంటు వంటి పదార్థాలు ఇందుకు వాడబడలేదు. ఇది భారతదేశ తొలి శిలా నిర్మాణ విధానాన్ని తెలుపుచున్నది. శిలల ముఖభాగాలు మాత్రం 4 అంగుళాల మందంతో అద్భుతమైన పూత పూయబడి ఉన్నాయి. ఈ స్తూపం అర్ధ చంద్రాకార

అండంను కలిగి ఉన్నది. స్తూపం చుట్టూ కిందగా ప్రదక్షిణా పథ ఉన్నది. దానికి కొయ్యతో నిర్మింపబడ్డ వేది ఉన్నది. ఈ స్తూప పునర్నిర్మాణం క్రీ.పూ. ఒకటో శతాబ్దంలో చేయబడి, రెండింతలు చేయబడుటే గాక దీనికి ముందు నాలుగు దిక్కుల్లో నాలుగు తోరణాలు కూడా నిర్మించడం జరిగింది. దీని ఛత్ర భాగం నున్నటి రాతితో నిర్మింపబడి ఉంది. దీని అండ భాగాన దీపపు గూళ్ళు గలవు. బహూశా వీటిలో దీపాలు ఉత్సవాలు, పండుగల కాలంలో వెలిగించేవారు.

## తోరణాలు

మహాచైత్య అండాల్లో తోరణ శిల్పాలు ముఖ్యమైనవి. ఇచటి తోరణాల్లో దక్షిణ దిక్కుది తొలుత నిర్మించబడింది. దీని తరవాత ఉత్తర దిక్కుది నిర్మించటం జరిగింది. ఇది నేటికీ చెక్కు చెదరలేదు. తూర్పు, పశ్చిమ తోరణాలు తరవాత నిర్మింపబడ్డాయి. కానీ తోరణాలన్నీ ఒకే రీతిలో రూపొందించడం జరిగింది. ప్రతిదీ 34 అ. ఎత్తు గలదు. ప్రతి తోరణానికి రెండు ఘన చతురస్రాకార స్తంభాలు గలవు. వీటిపైన శీర్షిక (capital) విభాగం కలదు. దీనిపైన వృత్తాల (spiral) కొన భాగం గల మూడు దూలాల (architraves) గలవు. శీర్షిక పైన గల నాలుగు ఘన చతురస్రాకార జతలు (blocks) ఈ architrave లను విభజిస్తున్నాయి. ప్రతి ఘన చతురస్రాకార జతల మధ్య మూడు చిన్న నిలువులు గలవు. ప్రతి రెండు నిలువుల మధ్య ఒక అశ్వం గాని, ఏనుగు గాని ఉంది. వీటిపై స్వారి చేయువాడు కూడా ఉన్నాడు. శీర్షిక విభాగాల్లో నిలుచొని ఉన్న మరుగుజ్జులు లేక సింహాలు గలవు.

## తోరణసాల భంజికలు

తోరణాల కింది దూలానికి శీర్షిక మూల భాగానికి మధ్యగాగల వెలుపలి భాగాల్లో చెట్ల కింద నిలుచొని ఉన్నట్లుగా స్త్రీల శిల్పాలు కలవు. తోరణ శిల్పాలలో ఇవి అద్భుతమైనవి. ఈ స్త్రీలనే వృక్షకులని, యక్షిణులని పిలుచుట గలదు. పై భాగాన ఉన్న మూడో దూలం architrave పై భాగాన మధ్యలో బుద్ధుని ధర్మచక్రం గలదు. దీనికిరువైపుల చౌరి ధరించిన యక్షులు గలరు. వీరి ప్రక్కగా త్రిరత్నాలు గలవు. బార్హుత్ స్తూపంలోని మతపరమైన అంశాలు చాల వరకు ఈ తోరణాల్లో అర్ధ శిల్పమందు అగుపడును. వీటిలో పవిత్ర వృక్షాలు, స్తూపాలు, బుద్ధుని జీవిత ఘట్టాలు, జీవిత కథలు గలవు.

## వేది (Railing)

ఇచట వేది రాతితో నిర్మితమైంది. ఇది 11 అ. ఎత్తు గలదు. దీనిలో 9 అ. ఎత్తుగల నిలువు స్తంభాలు, 2 అ. వెడల్పుగల అడ్డ విభాగాలు గలవు. నిలువు స్తంభాల పై భాగాన ఉష్ణిష copingstone గలదు. నిలువుల మధ్య 2 అ. దూరం, అడ్డాల మధ్య 3 1/4 అం.

దూరం గలదు. ఇవి 1. గుంత భాగంలో గుబ్బ వంటి విభాగాన్ని బిగించు విధానం (tenon and mortice), 2. స్కార్ఫ్ అతుకుడు (scarf joining) \పద్ధతిలో రూపొందించబడి ఉన్నాయి. దీనిని గూర్చి పెర్సీ బ్రౌన్ ఈ విధంగా నుడివారు. "In no other country has the carpenters' and joiners' craft has practiced over two thousand years ago been so fully and accurately recorded". ఇచటి శిలా నిర్మిత వేది ప్రాచీన కాలపు కొయ్య ద్వారాల ప్రతిరూపాలుగా భావించవచ్చు. ఈ స్తూపం 'వేది' 16 అ. ఎత్తు గలదు. దీని పై భాగం పై ప్రదక్షిణా పథగా ఉపయోగ పడుతుంది. దీని చుట్టూ కూడా 'వేది' గలదు. ఈ విభాగానికి వెళ్ళుటకు స్తూప దక్షిణ భాగాన రెండు వరుసల సోపానాలు గలవు. ప్రతి సోపాన మందు 25 మెట్లు గలవు. ఇచటి వేదిలు శుంగుల కాలంలోను, తోరణాలు ఆంధ్ర శాత వాహనుల కాలంలోను నిర్మించినట్లు భావించుటం కూడా గలదు. దక్షిణ తోరణంపై శాతవాహనుల శాసనం ఉన్నందున ఇది వారి కాలంలో నిర్మింపబడ్డట్లు భావిస్తున్నారు. ఈ శాసనంలో శాతవాహన వంశంలో ఆరో రాజైన రెండో శాతకర్ణియని చెప్పబడి ఉన్నది. కుషాణ రాజు విశిష్కుడు బుద్ధుని శిల్పాన్ని ఈ స్తూపంలో నిర్మించినట్లు తెలుస్తుంది గుప్తుల కాలానికి చెందిన ఒక శాసనం కూడా ఈ స్తూపం వేది పై గలదు. ఇందు సాంచికి అనాదు కాకనాడ బేత అని పేరున్నదని తెలుస్తుంది. ఒక గ్రామం సాంచి ఆర్య సంఘానికి దానంగా ఇచ్చినట్లు తెలుస్తుంది. సాంచి ప్రాచీన నామం మహా చేతియగిరి.

## రెండో స్తూపం

ఇది పర్వత పశ్చిమ సానువుల్లో సుమారు 350 గజాల కిందుగా నిర్మింపబడి ఉన్నది. ఇది చాలవరకు ఒకటో స్తూపాన్ని (మహాచైత్య) పోలి ఉన్నది. దీనికి తోరణాలు లేవు. ఒకటో, రెండో స్తూపాల్లో కొన్ని ముఖ్యమైన తేడాలు గలవు. అవి (1) రెండో స్తూపంలో మూడు వేదిలు గలవు a) కింది వేది (ground railing or balustrade) b) berm బెర్మ్ వేది c) హర్మిక వేది, (2) ఒకటో స్తూపం వేది సాదాగా ఉండగా రెండో స్తూపం వేదిపై శిల్పాలు గలవు. (3) ఒకటో స్తూపంలో నాలుగు దిక్కుల్లో నాలుగు తోరణాలుండగా, రెండో స్తూపానికి తోరణాలు లేవు. వీటి బదులు 'L' ఆకార ప్రవేశ మార్గాలు గలవు.

రెండో స్తూపం వ్యాసం 47 అ. ఎత్తు, 37 అ. గలదు. కింది వేది పై అనేక శిల్పాలు గలవు. ఈ శిల్పాలు ఒకటో స్తూపం తోరణంపై ఉన్న వాటిలాగానే ఉన్నాయి., ఈ శిల్పాల్లో చిహ్న రూపంలోని బుద్ధుని నాలుగు జీవితఘట్టాలైన జన్మ, జ్ఞానోదయం, ధర్మ చక్రప్రవర్తనం, మహాపరి నిర్వాణాలు ముఖ్యమైనవి. తామర పుష్పం బుద్ధుని జన్మగను, రావి చెట్టు జ్ఞానోదయాన్ని, ధర్మచక్రం ధర్మ చక్రప్రవర్తనాన్ని, స్తూపం మహాపరినిర్వాహణాన్ని తెలుపుచున్నవి. ఇవి రెండో స్తూపం వేదిపై చూపబడి ఉన్నవి. ఇతర శిల్పాల్లో యక్ష, యక్షిణీలు, బహు పడగల నాగ శిల్పాలు ముఖ్యమైనవి. రెండో స్తూపంలో అశోకుని కాలం నాటి ప్రముఖ బౌద్ధ బోధకులు, ప్రచారకులు ధాతువులు ఉంచబడి ఉన్నాయి. ఈ కింది వేదిపై ఏనుగులు, ఎద్దులు, అశ్వాలు, జింకలు మొదలగు జంతువుల శిల్పాలు గలవు. రెక్కల సింహాలు, అశ్వ శిరస్సు, చేప

తోక గల మనుష్యుల శిల్పాలు కూడా గలవు. బౌద్ధ త్రిరత్న చిహ్నం కూడా దీనిపై ఉన్నది. కింది వేది నిలువు స్తంభాలపై కూడా శిల్పాలు గలవు. వీటిలో తామరపుష్పాలు, వ్రేలాడు తీగలు, పూర్ణకుంభ రూపం, బుద్ధుని ఆరాధనను తెలిపెడి విధంగా ధర్మ చక్రం, స్థూపాల ఆరాధనా చిత్రాలు గలవు.

## మూడో స్థూపం

ఇది 50 అ. వ్యాసాన్ని, 35 అ. 4 అం. ఎత్తును గలిగి ఉన్నది. ఇందు బుద్ధుని శిష్యులైన సారిపుత్ర, మొగ్గలన్నల ధాతువులు ఉంచబడి ఉన్నాయి. ఇవి ఒక రాతి పాత్రలో ఉన్నాయి. తరువాత లండన్‌కు బ్రిటిష్ వారిచే తీసుకొని వెళ్ళబడ్డాయి. దీని కింది వేది (ground railing) పూర్తిగా అదృశ్యమై ఉన్నది. ఈ స్థూపానికి దక్షిణాన ఒకే తోరణమున్నది. ఇక్కడి 5 తోరణాలలో ఆఖరుది క్రీ. శ. ఒకటో శతాబ్దంలో నిర్మింపబడినట్లు తెలుస్తుంది. ఈ తోరణం 17 అ. ఎత్తున్నది. ఒకటో స్థూపం నాల్గు తోరణాలు గల యక్ష, యక్షిణి, అశ్వికులు, త్రిరత్నాలు, ధర్మ చక్రం మొదలగు శిల్పాలే దీనిపై కూడా గలవు. దీనిపై గల శిల్పాలు క్రీ.పూ 2వ శతాబ్దానికి చెందినవిగా భావిస్తున్నారు. ఈ స్థూపపు వేది, తోరణాలపై హారంతో ఉన్న యక్ష శిల్పాలు గలవు. స్థూప ఆరాధన, బోధివృక్ష ఆరాధన, చక్ర ఆరాధన, వీటి నుంచి వెలువడచున్న తీగలు గల చేప తోక మఖర, పంచ శిరస్సుల నాగరాజు, తామర పుష్పాల గుత్తి కలిగి ఉన్న మరుగుజ్జులు, గజలక్ష్మి, ఎద్దు, అశ్వాలు, ఏనుగులు, కల్పలత శిల్పాలు కూడా కలవు. సాంచి వద్ద ఇతర స్థూపాలు కూడా ఉన్నాయి. కానీ ఇవి చాల శిథిలమైనవి.

సాంచి వద్ద అనేక స్వేచ్ఛగా నిలబడి ఉన్న స్తంభాలు గలవు. వాటిలో 10వ. స్తంభం ముఖ్యమైంది. ఇది అశోక స్తంభం. ఇది ఒకటో స్థూపం దక్షిణ తోరణం దగ్గరలో ఉన్నది. ఇది ప్రస్తుతం విరిగి ఉంది. దీనిపై నుండిన సింహపు శీర్షం పురావస్తు ప్రదర్శనశాలలో భద్రపరచబడి ఉంది. ఈ స్తంభం మొత్తం 42 అ. ఎత్తు ఉన్నది. ఇది గుండ్రటి టేపరింగ్ (tapering) అండాన్ని, బోర్లించిన తామర లేక గంటం (పూర్ణ ఘట) ఆకార శీర్షికను, నాలుగు సింహాలుగల ఫలకను (abcus) కలిగి ఉన్నది. స్తంభం అద్భుతంగా నునుపు చేయబడి ఉన్నది. ఈ స్తంభ ఆకారంలోనే 26వ స్తంభ మున్నది. ఇది శుంగుల కాలానిది. 35వ స్తంభాన్ని వజ్రపాణి స్తంభముందురు. గుప్తుల 17వ దేవాలయం కూడా సాంచిలో ఉన్నది.

## c) బార్హుత్ స్థూపం

బార్హుత్ గ్రామం ఉచహ్రాకు ఈశాన్యాన 6 మైళ్ళ దూరంలో అలహాబాదుకు సుమారు 120 మైళ్ళ నైరుతిలో ఉన్నది. బార్హుత్ స్థూపాన్ని తొలుత అలెగ్జాండర్ కన్నింగ్‌హాం కనుగొన్నాడు. కానీ స్థూపం ఆగ్నేయ భాగం మాత్రమే నిలిచి ఉన్నది. ఈ భాగం 10 అ. పొడవు 6 అ. ఎత్తు ఉన్నది. అండంనందు దీపాల కొరకు దీపపు గూళ్ళున్నాయి. స్థూపం బహుశా 68 అ. ఎత్తును కలిగి ఉండవచ్చునని భావించాడు. వేదిలపై గల స్థూపపు ప్రతిమల బట్టి ఇచటి

స్తూపపు రూపాన్ని తెలుసుకొనగలుగుటకు వీలగుచున్నది. బార్హుత్ స్తూపం శుంగుల కాలానిది. కొంత భాగం మాత్రమే నిలచి ఉన్నది. దీని తొలి నిర్మాణం అశోకుని కాలంలో జరిగింది. తరవాత శుంగుల కాలంలో దీని చుట్టూ పెద్ద నిర్మాణం చేయబడింది. తొలి నిర్మాణాన్ని మట్టి, ఇటుకలతో నిర్మించారు. ఇది గుండ్రటి వేదిని, అర్ధచంద్రాకారపు అండం ఉంది. పెంచబడిన స్తూపం క్రీ.పూ. 2వ, (BC. 200-150) శతాబ్ద తొలి అర్ధ భాగ కాలానికి చెందింది. ఇది అండ, వేది, హర్మిక ఛత్రాలను కలిగి ఉన్నది. ఇదిగట్టి రాతి అధిష్టానంపై నిర్మింపబడి ఉన్నది. స్తూపం మాత్రం ఇటుకతో నిర్మింపబడి ఉంది. సాంచి మహా చైత్యం లాగ ఈ స్తూపం కూడా శిలా వేదికను, నాలుగు తోరణాలను కలిగి ఉన్నది. వేదిక నిలువు స్తంభాలు ధభ (upright), అడ్డ భాగాలు లేక సుచి (cross bar), ఉష్ణిష (coping) శిలను గలిగి ఉన్నాయి. తోరణం రెండు నిలువు స్తంభాలను కలిగి ఉంది.

## వేదిక

స్తూపం చుట్టూ లోపల, వెలుపలలో రెండు వేదికలున్నాయి. లోపలిది శుంగుల కాలానిది, పెద్దది. వెలుపలిది తరవాత కాలానిది, చిన్నది. బహూశా ఇది కుషాణ కాలానిది. 3 అ. 3 అం. ఎత్తున్నది. దీనిపై శిల్పాలు లేవు. లోపలి వేదికకు నిలువు స్తంభాలు, అడ్డ భాగాలు, ఉష్ణిష (coping) శిల గలవు.

## తోరణాలు

ఈ స్తూపానికి నాల్గు దికుల్లో నాల్గు తోరణాలున్నాయి. ప్రతిదీ 9 అ 7 1/2 అం. ఎత్తైన రెండు నిలువు స్తంభాలను కలిగి ఉన్నది. వీటిపై మూడు దూలా (architrave) లు గలవు. ఇవి చతురస్రాకార శిలా విభాగాలచే విడగొట్టబడుతున్నాయి. కొన్ని స్తంభాలు నాలుగు అష్టముఖ (octogonal) అందాలను కలిగి ఉన్నాయి. ప్రతి స్తంభం రెండు రెక్కలు గల సింహాలు, రెండు రెక్కల ఎద్దులను, శీర్షిక భాగాన కలిగి ఉన్నాయి. ఈ శీర్షిక పైనే మొదటి (architrave) గలదు. బార్హుత్ దూలాల, కొనల భాగాల్లో నోరు తెరుచుకొని ఉన్న మొసళ్ళు గలవు. (సాంచిలో ఇలా లేదు). పై భాగాన గల మూడో దూలం పైన ధర్మ చక్రం, దాని కిరువైపులా త్రిరత్న చిహ్నాలు గలవు.

బార్హుత్ వేదికల నిలువు స్తంభాలు, అడ్డ భాగాలు, ఉష్ణిష శిలలపై అనేక శిల్పాలున్నాయి. ఇవి చాల వరకు బౌద్ధ మతానికి చెందినట్టివి. కొన్ని అనాటి నమ్మకాలను తెలుపుచున్నాయి. ఉష్ణిష శిల లోపలి పై భాగంపై జాతక కథలు, పుష్పాలు, ఫలాలు, చెవి పోగులు, ఇతర ఆభరణాలు గలవు. దీని వెలుపలి భాగంపై కల్పలతలున్నాయి. వేదిక నిలువు స్తంభాలపై పూర్ణ పథకాలు, అర్ధ పథకాలు, యక్ష, నాగదేవతా శిల్పాలు గలవు. అనేక జంతువులు, బౌద్ధకథలు, చరిత్రలోని ఘట్టాలు చెక్కబడి ఉన్నాయి. స్తంభాలపై జాతక కథలున్నాయి.

వాటిలో మాయాదేవి, తెల్ల ఏనుగు గాథ, 6 బౌద్ధ వృక్షాల శిల్పాలు గలవు. వేదిక మూలలలోని స్తంభాలలోపలి మూలలో యక్ష, యక్షిణి, దేవత, నాగరాజ శిల్పాలున్నాయి. వీరే స్తూప ప్రవేశా యక్షకులు. ఉదాహరణకు ఉత్తర ద్వారం వద్దకు కుబేర, యక్ష, చంద్ర యక్షులు, దక్షిణ ద్వారం వద్ద నాగరాజ, చక్రవాక, ఛులకోక దేవతలున్నారు. వేదిక అడ్డ భాగాలు 228 ఉండగా ఉన్నవి. వీటిల్లో 80 గలవు.

## ప్రదక్షిణా పథ

స్తూపానికి, వేదికకు మధ్య 10 అ. 4 అం వెడల్పు గల ప్రదక్షిణా పథ గలదు.

## d) సారనాథ్ స్తూపం

సారనాథ్ స్తూపాన్నే ధర్మ రాజిక స్తూప లేక ధమేక్ స్తూప మంటారు. ఇది 57 అ. వ్యాసం గల నిర్మాణం. ఇటుక, రాళ్ళతో నిర్మించబడింది. వేదిపై దీపపు గూళ్ళు కలవు. ఇది ఆరు పర్యాయాలు పెంచబడింది. ఆఖరుగా క్రీ.శ. 6వ శతాబ్దంలో పెంచబడింది. ప్రస్తుతం ఇది తక్షశిల లోని భల్లార్ స్తూపం రాజగృహ (రాజ్‌ఘీర్) నందలి స్తూపాల వాస్తు వివరాలు ఉన్నాయి. ఇది గొట్టపు ఆకారంలో 138 అ. ఎత్తున్నది. అర్ధ చంద్రాకారంలో లేదు. అండంపై అలంకార శిల్పాలున్నాయి.

## బుద్ధగయ స్తూపం

బుద్ధుడు జ్ఞానోదయాన్ని బుద్ధగయలోనే పొందాడు. ఇది గయకు 6 మైళ్ళు దక్షిణాన ఉన్నది. ప్రాచీన గ్రామమైన ఉరు విలకు దగ్గరగా ఉన్నది. ఉపగుప్తుని సలహా మేరకు అశోకుడు ఇచట బోధి ఆలయాన్ని నిర్మించాడు. ఇచటి బోధి వృక్షాన్ని బోధిద్రుమ లేక జ్ఞానాన్నిచ్చే వృక్షమంటారు. బుద్ధుని ఆసనాన్ని బోధి మంద అంటారు. ఇ చటి ఆసనంపై నిర్మాణాన్ని మహా బోధి విహార మంటారు. దీని దగ్గరలోనే మహాబోధి సంగారామం గలదు. బుద్ధగయలో అశోకుడు నిర్మించిన బౌద్ధ ఆలయం నేడు లేదు. కాని దీని రూపం బార్హుత్ స్తూపం శిల్పాల్లో కనపడుతుంది. ఇందు స్తంభాల నిర్మాణం లాగ ఈ స్తూప మున్నట్లు కనపడుతున్నది. దీని బుద్ధుని శిల్పానికి బదులు ఆరాధించే శిలా స్తూప స్థాపనా స్థానం (pavilion) మధ్య బుద్ధుని ఆసనం, దాని వెనుక బోధి వృక్షం ఉన్నది. ఆసనం పైన అనేక పుష్పాలు చెక్కబడి ఉన్నాయి.

## దక్షిణ భారత దేశ స్తూపాలు

దక్షిణ భారతదశంలోని స్తూపాలలో అధిక సంఖ్య ఆంధ్రప్రాంతంలోనే గలవు. ఇవి చాల వరకు పర్వత, నదీ పరివాహక ప్రాంతాల్లో ఉన్నాయి.

## ముఖ్యాంశాలు – ప్రత్యేకతలు

దక్షిణ భారత స్తూపాలు చాలా వరకు గట్టి (solid) నిర్మాణాలు. ఉదాహరణకు వీటి అండము (dome) చక్ర, స్వస్తిక ఆకార ఇటుక కుడ్యాల చుట్టూ నిర్మింపబడి ఉన్నాయి. చక్ర కుడ్య నిర్మాణ విధానంలో మధ్య భాగంలోను, చుట్టు భాగాల్లోను రెండు కుడ్యాలున్నవి. మధ్య భాగ కుడ్యం నుంచి, చుట్టు భాగ కుడ్యాన్ని కలుపుతూ ఆకులుతో కుడ్యాలున్నాయి. ఈ చక్ర కుడ్యాల మధ్య గల ఖాళీ భాగాలు మట్టి, గులకలతో నింపబడి ఉన్నాయి. ఈ విధానం నిర్మాణ ఖర్చును తగ్గించుటే గాక నిర్మాణానికి శక్తి నిస్తుంది. ఆంధ్రలో జనించిన చైత్యకులు లేక చైత్యకీయులనెడి బౌద్ధ తెగ ఆలోచనలతో ఈ విధాన మేర్పడి ఉండవచ్చు.

కొన్ని స్తూపాలలోపలి కుడ్యం స్వస్తిక ఆకారంలో ఉన్నది. స్తూప మధ్య భాగ కుడ్యం స్తూపం చుట్టూ గల కుడ్యంతో కలిసినట్లుగా నిర్మింపబడి ఉన్నది. ఈ విధానం స్తూపపు బరువును, ఖర్చును తగ్గించింది. స్వస్తిక విధానంలో నిర్మింపబడిన స్తూపంలో నాగార్జున కొండ యందలి Site No. 20, 59, 108 లోనివి ముఖ్యమైన ఉదాహరణలు. ఇలాంటివి గుంటూరు జిల్లాలోని పెద్ద గంజాంలో కూడా ఉన్నాయి. స్వస్తిక విధానం మత సిద్ధాంత పరంగా ఏర్పడిందని చెప్పవచ్చు. బుద్ధుణ్ణి స్వస్తిక చిహ్నంతో ఆరాధించుట గలదు. ఇట్టి శిల్పాలు అమరావతి, నాగార్జున కొండల్లో గలవు. చక్రకుడ్య విధానం కూడా వాస్తు అవసరాలతో కూడిన మత సిద్ధాంత పరమైనదై ఉండవచ్చునని చెప్పవచ్చు.

కొన్ని దక్షిణ భారతదేశ స్తూపాల 'వేది' అండం (dome) ల భాగాలు శిల్పాలతో కూడిన చలువ రాయితో కప్పబడి ఉన్నాయి.

స్తూపపు 'వేది' నాలుగు దిక్కువల్లో దీర్ఘచతురస్రాకార వేదికల వంటి (platforms) నిర్మాణ విభాగాలు పూజావస్తువులు ఉంచుట కొరకు నిర్మింపబడి ఉన్నాయి. ఈ వేదికల (platforms) పై ఆయక లేక కంభాలనెడి 5 స్వేచ్ఛా స్తంభాలు చలువరాతితో నిర్మింపబడి ఉన్నాయి. ఇవి స్తూపానికి అందాన్నిస్తున్నాయి. నాగార్జున కొండలో ఈ ఆయక స్తంభాలపై ఇక్ష్వాకుల శాసనాలు కలవు. కాని శంకరం, రామతీర్థం వంటి ప్రాంతాల స్తూపాల్లో ఇట్టి స్తంభాలు లేవు.

దక్షిణ దేశ బౌద్ధ స్తూపాలు రెండు రకాలుగా ఉన్నాయి. అవి (1) రాతిని తొలిచి నిర్మించినవి, (2) ఇటుకతో నిర్మించినవి. ఇటుక నిర్మాణాలలో భట్టిప్రోలు, అమరావతి మొదలగునవి ఉదాహరణలు, రాతి నిర్మాణాలలో శంకరం, గుంటుపల్లి మొదలగు ప్రాంతాలవి ఉదాహరణగా చెప్పవచ్చును.

## క) భట్టిప్రోలు స్తూపం

ఇది స్తూప నిర్మాణాలలో తొలి దశకు చెందింది. క్రీ.పూ ఒకటవ లేక రెండో శతాబ్దానికి

ఉత్తర భారతదేశ స్తూపాల లాగ ఇది నిర్మింపబడి ఉన్నది. దక్షిణ దేశ స్తూపాలు చక్ర కుడ్య లేక స్వస్తిక కుడ్య విధానంలో నిర్మింపబడలేదు. ఈ స్తూపం చాలవరకు సాంచి స్తూపాన్ని పోలి ఉన్నది. ఇది భూస్థాపితమై ఉన్నది తవ్వకాలో బయల్పరచబడ్డాయి. దీని శిల్పాలు అమరావతి స్తూప శిల్పాల లాగ ఉన్నాయి. దీనికి నాల్గు ఆయక వేదికలు ఉన్నాయి. చలువరాళ్ళ శిల్పాలు కూడా కలిగి ఉన్నది. దీని వేది శిల్పరహితంగా ఉన్నది. దీని చుట్టూ శిల్ప రహిత చలువరాతి వేదిక ఉండినది. ఈ స్తూప మందు బ్రాహ్మిలిపి లోని అశోకుని పూర్వ కాలానికి చెందినదిగా చెప్పబడుచున్న శాసనాన్ని గలిగిన ధాతువు భద్రపరచబడి ఉన్న పాత్ర ఉంది. ఈ పాత్రలో విలువైన వజ్రాలు, బంగారు పూలు, పూసలు, 24 నాణేలు గలవు. ఈ స్తూపానికి వేది, అండం, మొదలగునవి గలవు.

## b) గుడివాడ స్తూపం

ఇది భట్టిప్రోలు స్తూపం లాగ ఉన్నది. ఇది కూడా గట్టి (solid) స్తూపం. ఇది 120 అ. వ్యాసాన్ని కలిగి ఉన్నది. స్తూపం చుట్టూ కొయ్య వేదిక గలదు.

## c) గరికపాడు స్తూపం

ఇది ఇటుకతో నిర్మింపబడిన స్తూపం. ఇది 78 అ. వ్యాసాన్ని కలిగి ఉన్నది.

## d) జగ్గయ్య పేట స్తూపం

ఇది కృష్ణా జిల్లాలో ఉన్నది. ఇది 32 అ. వ్యాసాన్ని కలిగి ఉన్నది. నాలుగు ఆయక వేదికలు గలవు. ప్రతి వేదిక 12 అ. నుండి 15 అ. పొడవును 2 అ. నుండి 2 1/2 అ. వెడల్పును కలిగి ఉన్నది. స్తూపం పై భాగాల్లో ఇటుక కప్పబడి, దానిపై శిల్పాలు గల చలువ రాళ్ళు కప్పబడి ఉన్నాయి. స్తూపం చుట్టూ 10 1/2 అ. ప్రదక్షిణ గలదు. ఒక వేదిక (railing) కూడా గలదు. స్తూపం మధ్య ధాతు పాత్ర గలదు.

## e) ఘంటసాల స్తూపం

ఘంటసాల కృష్ణాజిల్లా లోని చిన్న గ్రామం. ఇచటి స్తూపం మట్టిలో కప్పబడి ఉన్నది. దీని గ్రౌండ్‌ప్లాన్ (ground plan) ప్రత్యేకంగా ఉన్నది. స్వస్తిక, చక్ర కుడ్యాల విధాన మిశ్రమ రీతిలో నిర్మించబడి ఉంది. దీని మధ్య 10 చ. అ. ఇటుక స్తంభమున్నది. దీని చుట్టూ 21 అ. ప్రక్క కొలతలు గల ఒక చతురస్రాకార నిర్మాణం గలదు. దీని చుట్టూ రెండు గుండ్రటి కుడ్యాలు గలవు. మధ్య స్తంభం చతురస్ర నిర్మాణం, గుండ్రటి కుడ్యాలు మూడు ఇటుకతో నిర్మింపబడి ఉన్నాయి. లోపలి గుండ్రటి కుడ్యం పైకి పెరిగి అండం (dome) గా రూపొందింది. రెండు గుండ్రటి కుడ్యాల మధ్య గల భాగం ప్రదక్షిణా పథగా ఉపయోగపడుచున్నది. స్తూపంలో భాగం 32 విభాగాలుగా ఉన్నది. ఈ విభాగాల మధ్య భాగం మట్టితో నింపబడి ఉన్నది.

## f) పెద్ద గంజాం స్తూపం

ఇచట 5 స్తూపాలు గలవు. వాటిలో ఒకటవ స్తూపం భోగం దాని దిబ్బలో పూడు కొని ఉన్నది. ఇది కూడా ఘంటసాల స్తూపం లాగా గ్రౌండ్ ప్లాన్ కలిగి ఉన్నది. ఇది 54 అ. వ్యాసాన్ని (ground plan) కలిగి ఉన్నది. దీనికి చలువరాతి వేదిక (railing) ఉన్నది. కింది ప్రదక్షిణా పథ 13 అ. 6 అం. వెడల్పు గలదు. ఈస్తూపమంతాపూత (plaster) చేయబడి ఉన్నది.

## g) గోలి స్తూపం

గోలి గుంటూరు జిల్లాలో ఉంది. నాగార్జున కొండకు 18 మైళ్ళు దూరంలో కృష్ణానది ఉపనదైన కొల్లేరు నది ఒడ్డున ఉన్నది. ఇచట అనేక చలువరాతిపై చెక్కబడిన శిల్పాలు లభించాయి. ఇచటి శిల్పాలు మేలు రకానికి చెందనవి. అమరావతి, నాగార్జున కొండ శిల్పాల లాగ పరిణితి చెందాయి. ఇచటి శిల్పాల్లో స్తూప శిల్పం కూడా గలదు. ఈ శిల్పంలో స్తూపం ఆయక వేదికను, ఆయక స్తంభాలను, వేది, అండం, ధార్మిక, ఛత్రాలను కలిగి ఉన్నాయి. ఈ స్తూపం క్రీ.శ. 2వ శతాబ్దానికి చెందిందని చెప్పబడుచున్నది.

## h) అమరావతి స్తూపం

అమరావతి గుంటూరు జిల్లాలో విజయవాడకు 18 మైళ్ళ దూరంలో ఉన్నది. అమరావతి స్తూపం దీపాల దిన్నె అనెడి మట్టి దిబ్బలో పూడు కొని ఉన్నది. దీనిని క్రీ.శ. 17వ శతాబ్దంలో తొలుత ఆ ప్రాంత ప్రజలు కనుగొని తమ జమిందారైన రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడికి, తెలిపారు. ఈ జమిందారు తొలుత చింతపల్లి కేంద్రంగాను, తరవాత అమరావతి కేంద్రం గాను తన జమిందారీని పాలించెను. స్తూప వివరాలు వినిన ఇతడు దానిని త్రవ్వించి స్తూపపు ఇటుకలను తన భవన నిర్మాణానికి ఉపయోగించారు. శిల్పాలు గల పాలరాళ్ళను పొడి చేయించి పూతగా వాడాడు. కల్నల్ మెకంజీ దీనిని 1797లో సందర్శించాడు. తిరిగి 1816 ఇతడు దీనిని సందర్శించి బొమ్మలను గీసుకొని చిన్న వివరణా పట్టీని తయారు చేసి ప్రచురించాడు. ఆ తరవాత తిరిగి చట్ట వ్యతిరేకంగా త్రవ్వకం చేయబడ్డాయి. దాని వల్ల స్తూపానికి చాల నష్టం జరిగింది. ప్రస్తుతం స్తూప ప్రతిబింబ చిత్రాల నుండే దాని వివరాలు తెలుసుకొనగలుగుచున్నాం. 1881లో అలెగ్జాండర్ రీ, రాబర్ట్ సివెల్, బర్జెస్, వాల్టర్ మొదలగు వారు దీనిని తరవాత సందర్శించారు. అలెగ్జాండర్ రీ 1891లో తిరిగి త్రవ్వకాలు ప్రారంభించాడు.

అమరావతి స్తూపాన్ని శారీరక స్తూపమంటారు. ఇందు బుద్ధుడు లేక అతని శిష్యుల్లో ఒకరి ధాతువు భద్ర పరచబడి ఉన్నది. ఇది తొలుత చిన్నది. కాల క్రమంగా పెంచబడింది. రాతి వేదిక (railing) ఆయక వేదిక, ఆయక స్తంభాలు, శిల్ప ఫలకాలు తరవాత (add) చేర్చబడ్డాయి. వేదిక (railing) శాతవాహనుల కాలంలో (క్రీ.పూ. 220-క్రీ.శ. 220) సుమారు క్రీ.శ. 150 సం.లో నిర్మింపబడింది. స్తూపం క్రీ.శ. 250లో పూర్తి చేయబడింది. వేదిక (railing) ను నాగార్జున కొండ ప్రాంతంలో నివసించిన ఆచార్య నాగార్జునునిచే నిర్మింపబడ్డట్లు భావిస్తున్నారు.

ఈ స్తూపాన్ని చైనా యాత్రికుడు హుయాన్‌త్సాంగ్ కూడా సందర్శించాడు.

తొలుత ఈ స్తూపం 162 అ. వ్యాసాన్ని, 90 లేక 100 అ. ఎత్తును కలిగి ఉన్నట్లు తోస్తున్నది. దీనికి కింద పైన రెండు ప్రదక్షిణా పథాలున్నాయి. పై ప్రదక్షిణ 20 అ ఎత్తులో ఉన్నది. దీని చుట్టూ వేదిక గలదు. పై ప్రదక్షిణా పథం నాల్గు దిక్కులలో నాల్గు ఆయక వేదికలను కలిగి ఉన్నది. ప్రదక్షిణ చుట్టూ 8 అ. ఎత్తుగల వేదిక ఉంది. అనేక శిల్పాలు గల్ప చలువరాళ్ళతో ఇది నిర్మింపబడి ఉన్నది. వెలుపలి వేదిక 13 అ. ఎత్తు గలదు. సూచి, ధభ, ఉష్ణిషలను కలిగి ఉంది.

వేదికకి స్తూపానికి మధ్య గల ప్రదక్షిణా పథ 15 అ. వెడల్పున్నది. వేదిక నాల్గు వైపులా ముందుకు చొచ్చుకొని ఉన్న ప్రవేశ మార్గాలను కలిగి ఉంది.

స్తూపపు పై ప్రదక్షిణా పథలోని వేదిక ఆయక వేదిక, ఆయక స్తంభాలు, స్తూప వేదిలపై అనేక శిల్పాలు గలవు.

స్తూపం పై భాగానున్న చతురస్రాకార హర్మిక వేదికను (ballustrade / railing) కలిగి మధ్య భాగాన స్తంభాన్ని, ఛత్రాన్ని కలిగి ఉంది. తొలుత ఈ స్తూపం శిల్ప రహితంగా ఉంది. (తొలుత ఈ స్తూపం శిల్ప రహితంగా ఉంది.) కొన్ని శిల్పాలు తరవాత రూపొందించబడ్డాయి.

ఆయక వేదికపై మాత్రమే తొలుత శిల్పాలున్నాయి. వేదికపై అతి కొద్ది శాల్పాలున్నాయి. వీటిలో బౌద్ధ చిహ్నాల పక్కల్లో భక్తులుండెడి చిత్రాలు ముఖ్యమైనవి.

స్తూప పునర్నిర్మాణ కాలంలో ఆయక వేదికలపైన, అనేక శిల్పాలు రూపొందించబడ్డాయి.

పై ప్రదక్షిణా పథ వెలుపలి కొసలో పిట్టగోడ (ballustrade) గలదు. ఘన చతురస్రాకార ఫలకలు దీని నిలువు స్తంభాలు మధ్య నిర్మింపబడి ఉన్నాయి. దీనిపై ఉష్ణష (coping stone) ఉంది.

కింది శిలా వేదిక (railing) క్రీ.పూ. 200 సంవత్సరానికి చెందింది. పునర్నిర్మాణ కాలంలో ఇది పెంచబడింది. క్రీ.శ. 150-200 మధ్య ఇది శిల్పకళా అద్భుతాల్లో ఒకటిగా తయారైంది. క్రీ.శ. 200-250 మధ్య ఈ స్తూపపు శిల్పాలు ఆఖరుగా నైపుణ్యాన్ని సంతరించుకొన్నాయి.

## h) నాగార్జున కొండ స్తూపాలు

నాగార్జున కొండ గుంటూరు జిల్లాలో కృష్ణానది దక్షిణ ఒడ్డున మాచర్లకు 14 మైళ్ల దూరంలో ఉంది. ఇచటి స్తూపాలు చక్ర కుడ్య విధానంలో నిర్మింపబడి ఉన్నాయి. మధ్య భాగాన

ఇరుసు, ఆకులు (spokes) గుండ్రటి చుట్టు నిర్మాణాలు కలవు. ఇచటి చిన్న స్తూపాలు 60 అ. వ్యాసాన్ని, పెద్దవి 120 అ. వ్యాసాన్ని (మహాచైత్య) కలిగి ఉన్నాయి. చిన్న స్తూపాల ఇరుసు గుండ్రటి స్తంభం లాగా ఉన్నది. ఆకుల మధ్య గల ఖాళీ స్థలాల్లో మట్టి, ఇటుకలతో నింపి ఇటుకతో స్తూపం మూయబడి సున్నంతో పూత వేయబడింది. అర్ధ చంద్రాకార అండం సుమారు 60 అ. నుండి 90 అ. ఎత్తు గలవు. అండం పై భాగాల్లో నాల్గు ఆయక వేదికలు, 5 ఆయక స్తంభాలు గలవు.

నాగార్జున కొండలోని మహాచైత్య ఇటుక నిర్మాణం. ఇటుకలు 20" × 10" × 3" కొలత గలవు. చక్రకుడ్య విధానంలో నిర్మింపబడి ఉంది. స్తూపం మధ్య గుండ్రటి ఇరుసు, 8 అ. పొడవు గల ఆకులు (spokes), చుట్టూ గల గుండ్రటి కుడ్యాలు గలవు. గుండ్రటి కుడ్యం చుట్టూ మరొక కుడ్యం గలదు. లోపలి గుండ్రటి కుడ్యం అండానికి అధిష్ఠానంగాను, వెలుపలి గుండ్రటి కుడ్యం 'వేది' అధిష్ఠానంగాను ఉన్నాయి. ఈ కుడ్యాల నిర్మాణం ద్వారా ఏర్పడిన పై భాగాలు పై ప్రదక్షిణగా ఉపయోగపడుతున్నవి. పై ప్రదక్షిణ 14 అ. వెడల్పు. దీని కప భాగాల్లో పిట్టగోడ (ballustrade) ఉంది.

ఈ స్తూపం 60 అ. ఎత్తును, 100 అ. వ్యాసాన్ని కలిగి ఉంది. ఇక్ష్వాకుల రాణియైన శాంతిశ్రీ ఈ స్తూపాన్ని క్రీ.శ. 3వ శతాబ్దంలో నిర్మించింది. దీని ఆయక స్తంభాలు ఈ కాలంలోనే నిర్మించబడ్డాయి. స్తూప వేది వెలుపలి భాగాలపై ఇక్ష్వాకుల శిల్పాలు గలవు. ఈ శిల్పాల్లో బుద్ధుని జీవిత ఘట్టాలు, జాతక కథలు ప్రధానంగా ఉన్నాయి. ఇవి చలువరాళ్ళ పలకలపై చెక్కబడి ఉన్నాయి. ఈస్తూప ఆయక వేదికలు 22" 5" కొలతలు గలిగి ఉన్నవి. ఈ స్తూపంలో బుద్ధుని ధాతువులు గలవు.

ఎనిమిది చక్ర కుడ్యాలు గల 8 స్తూపాలు, నాలుగు చక్ర కుడ్యాలు గల 6 స్తూపాలు, పది చక్ర కుడ్యాలు గల ఒక స్తూపం కూడా ఇచట గలవు. కొన్ని స్తూపాలు చక్ర కుడ్యాల లేకుండాను, ఆయక వేదికలు లేకుండాను కూడా ఇచట నిర్మింపబడి ఉన్నాయి.

### i. నాగపట్నం ఆలయం

తమిళనాడు లోని తంజావూరు జిల్లాలోని నాగపట్నంలో ఒక బౌద్ధ ఆలయం (స్తూపం కాదు) గలదు. దీనిని చోళ రాజైన ఒకటో రాజరాజు మలయ రాజుతో గల సంబంధానికి గుర్తుగా నిర్మించాడు. ఈ ఆలయాన్ని చూడామణి వర్మ విహారమంటారు. ఇది క్రీ.శ. 13 వ శతాబ్దంలో ఆఖరి చోళ రాజు కాలంలో నాశనం అయింది. కొంత భాగం మాత్రం క్రీ.శ. 18వ శతాబ్దం వరకు నిలిచి ఉంది. కాని క్రైస్తవ స్థావరకులు దీనిని నాశనం చేశారు.

# II
# చైత్య గృహాలు

## హీనయాన చైత్య గృహాలు

చైత్య గృహాలను హీనయానకాల చైత్య గృహాలని, మహాయాయన కాల చైత్య గృహాలని రెండు విభాగాలుగా అధ్యయనం చేయవచ్చు. హిందువులకు దేవాలయం లాగ, క్రైస్తవులకు చర్చిలాగ, బౌద్ధులకు చైత్యగృహం పూజా మందిరం. భారతదేశ తొలి చైత్య గృహాలు శిథిల మయ్యేటి వస్తువులైన కొయ్య గడ్డి, మట్టి మొదలగు వాటితో నిర్మింపబడేవి. కావున అట్టివి నేడు లేవు. కొండ శిలా ఖండాలను తొలచి రూపొందించిన (rock - cut or cut in) చైత్య గృహాలు తరవాత ప్రసిద్ధిగాంచాయి. ఇవి తొలి నిర్మాణాల ప్రతిబింబాలని చెప్పవచ్చును. శిలా నిర్మిత గుహాలయాల్లో అశోకుని కాలానివి మొదటివి. ఇతడు త్రవ్వించిన గుహాలయాలు బీహారులోని బరాబర్, నాగార్జుని; సితామర్హి కొండలలో గలవు. వీటిలో కొన్ని ఇతని మనుమడు దశరథుడు త్రవ్వించాడు. శిలా ఖండ రూపానికి అనుగుణంగా ఇవి రూపొందించ బడి ఉన్నాయి. వీటి గూర్చి వివరంగా మౌర్యుల వాస్తు శిల్పకళ అనెడి అధ్యాయంలో తెలుపబడి ఉంది.

బౌద్ధ గుహాలయాల నిర్మాణంలో క్రీ.పూ. 200-క్రీ.శ. 200 మధ్య కాలం మరొక ముఖ్యదశగా చెప్పవచ్చు. ఈ కాలంలోనే హీనయాన బౌద్ధ చైత్య గృహాల నిర్మాణం సాగింది. పూనా జిల్లాలోని భాజ, బేద్స, నాసిక్, జునార్, కార్లే, కొలబ జిల్లాలోని కొండల్లో, ఔరంగాబాద్ జిల్లాలోని పితల్‌కోరా, బొంబాయి వద్ద గల కన్హేరి, అజంత ప్రాంతాలలో ఈ హీనయాన చైత్యగృహాలు గలవు. అజంతాలో 8,9,10,12 వ గుహాలయాలు ఈ తెగకు చెందాయి.

ప్రతి చైత్య గృహంలో నేవ్ అనెడి హాలు భాగం, దాని రెండు వైపు ఎయిల్స్ ప్రక్క మార్గాలు (side ailes) హాలు భాగం, (nave), (side ailes) ప్రక్క మార్గాలు మధ్య అనెడి స్తంభాల వరుస,కలొన్నేడ్ అనెడి (colonnade) అనెడి చైత్య అర్ధ చంద్రాకార వెనుక కుడ్య విభాగం, అర్ధచంద్రాకార వంపు గల కుడ్య నిర్మాణ భాగం (apse) మధ్యలో బుద్ధుని శిల్పానికి బదులు ఆరాధనకు వాడే స్తూపం శిల్పం (Otivestupa) రూపొందించబడి ఉన్నది. (Nave) హాలు పై భాగాన పీపా వంటి (గజపృష్ఠ) పై కప్పు ఉన్నది. Aile ల పైన అర్ధ పీపాకార వంటి పై కప్పు గాని, చదరపు పై కప్పుగాని ఉంది. గజ పృష్ఠ పై కప్పు లో భాగంలో కొయ్య దంతులు వంటి రూప నిర్మాణం గలదు. ఇది ప్రాచీన కొయ్య విధానాన్ని ప్రతిబింబిస్తున్నది. చైత్య గృహాల ముందు భాగంలో ఒక వరండా ఉంది. దీని ముఖ భాగం కొన్ని సందర్భాల్లో రెండు అంతస్తులుగా ఉన్నది. కింది విభాగంలో ప్రవేశ వసారా (portico), పై విభాగంలో లోపలికి గాలి, వెలుతురును ఇచ్చెడి పెద్ద చైత్య కిటికీ ఉన్నది.

## భాజ చైత్యగృహం

పూనా జిల్లాలోని భాజ ప్రాంతమందలి చైత్య గృహం మొదటిదని చెప్పవచ్చు. ఇది క్రీ.పూ. 200 ఘం. కాలానికి చెందినట్లు తెలుస్తున్నది. ఇది 55 అ. పొడవు, 26 అ. వెడల్పు గల హాలును, 2 1/2 అ. వెడల్పుగల ప్రక్కను, 11 అ ఎత్తుగల స్తంభాలను కలిగి ఉంది. స్తంభాలు పూర్తి నిలువుగా లేవు, కొంత లోవైపుకు వంపు తిరిగాయి. పై కప్పు 29 అ. ఎత్తులో ఉన్నది. దీని లో వైపు కొయ్య దంతులు గలవు. అర్ధచంద్రాకార వంపు గల కుడ్య నిర్మాణ భాగం (Apse) భాగంలో స్తూపశిల్పమున్నది. దీనికి గుండ్రటి గొట్టం వంటి అధిష్ఠానం, ఎత్తైన అండం గలవు. అండం పైన కొయ్య వేదిక (railing) ఉంది. ఈ గుహ ముందు భాగంలో లావు పాటి రెండస్తుల కొయ్య తెర గలదు. కింది అంతస్తు నాల్గు స్తంభాలపై నిర్మింపబడి ఉన్నది. ఈ చైత్య గుహకు 3 ద్వారాలున్నాయి. మధ్య ది హాలులోనికి, దీని ప్రక్కవి రెండు (ailes) లోనికి ప్రవేశాన్నిచ్చుచున్నాయి. ఇచటి కొయ్య తెరవంటివి కొండనె, పిథల్‌ఖోర, 10వ. అజంతా గుహాలయాల్లో ఉన్నాయి. ఇట్టి కొయ్య తెరల స్థానంలో తరవాత కాలంలో రాతి తెరలు రూపొందింపబడుట జరిగింది. బౌద్ధ చిహ్నాలైన త్రిరత్న, ధర్మచక్ర, స్తంభాలపై నగలు. పద్మాలు వంటి శిల్పాలు మాత్రం ఈ చైత్య గృహాలో ఉన్నాయి. ఇతర శిల్పాలేవీ లేవు. ఇచటి స్తంభాలలో వంపు గలిగి, పైకప్పు గజపృష్ఠ ఆకారంలో ఉన్నాయి. ద్వారబంధాలు ఏటవాలుగా ఉన్నాయి.

## కొండనె చైత్య గృహం

కొండనె ప్రాంతం కొలబ జిల్లాలో ఉన్నది. ఇచట ఒక చైత్య గృహం, ఒక విహారం గలవు. చైత్య గృహం 66 అ పొడవు, 27 అ. వెడల్పు, 28 అ ఎత్తుగలదు. ఇది ముందు భాగంలో ఒక స్తంభ వరండాను, దాని వెనుక ఒక హాలును, దీని రెండు వైపుల (ailes) హాలు వెనుక భాగంలో ని కలిగి ఉన్నది. మధ్య భాగంలో స్తూపశిల్పమున్నది. ఈ చైత్యలోని స్తంభ వరండా తొలుత కొయ్య స్తంభాలను కలిగి ఉండేది. తరవాత రాతి స్తంభాలు రూపొందించబడింది. కావుననే ఇచట కొయ్య, రాతి స్తంభాలు గలవు. ఈ చైత్యహాలు భాజ చైత్య హాలు కంటె కొంత పొడవుగా ఉంది.

## పిథల్‌ఖోర చైత్య గృహం

మహారాష్ట్రలోని ఔరంగా బాద్ జిల్లాలో పిథల్‌ఖోర ప్రాంతముంది. ఇది అజంతాకు 50 మైళ్ళు, ఎల్లోరాకు 23 మైళ్ళ దూరంలో ఉంది. ఇది బౌద్ధ గుహాలయాలకు ప్రసిద్ధి గాంచింది. ఇచటి 3వ గుహాలయం చైత్య గృహం. ఇది క్రీ.పూ. 2వ శతాబ్దానికి చెందింది. ఇది కొంతకాలం హీనయాన బౌద్ధులచే వాడబడి తరవాత ఉపయోగించకుండా వదిలి వేయబడింది. ఆ తరవాత మహాయానులు దీనిని వాడుట ప్రారంభించారు. ఈ కాలంలోనే కొన్ని చిత్ర లేఖనాలు

ఇచటి చైత్య గృహ హాలులో చిత్రించబడ్డాయి.

ఇచటి చైత్య గృహం 86 అ. పొడవును, 35 అ. వెడల్పును గలిగి ఉన్నది. దీని హాలు ఇరువైపులా ప్రక్క మార్గాలు (ailes), స్తంభాలు, హాలు వెనుక అర్ధచంద్రాకార వంపు గల కుడ్య నిర్మాణ భాగం (apse) స్తూప శిల్పం apse, votive స్తూప గలవు. హాలులో 37 స్తంభాలుండేవి. కాని ఇప్పుడు 12 గలవు. స్తంభాలులో వంపు గలిగి భాజ స్తంభాల లాగ ఉన్నాయి. ఈస్తంభాల పైనే మహాయాన కాల చిత్రలేఖనాలు గలవు. ఇవి క్రీ.శ. 5వ శతాబ్దానికి చెందినవిగా భావించుట గలదు. ఈ చైత్య గృహంలో క్రీ.పూ. 2వ శతాబ్దానికి చెందిన రెండు శాసనాలున్నాయి. పైఠాన్ (ప్రతిష్ఠానపురం) ప్రజలు ఈ చైత్య గృహ ఖర్చుల కొరకు బహుమతుల నిచ్చిరని ఈ శాసనాల్లో తెలుపబడి ఉంది.

స్తూపం పై కప్పు గజపృష్ఠాకారంలో ఉంది. దీని లో భాగంలో కొయ్య దంతులున్నాయి. ఈ దంతుల మధ్య భాగాల్లో క్రీ.శ. 5వ శతాబ్దం నాటి చిత్రలేఖనాలున్నాయి. ఇవి చాల వరకు శిధిలమై ఉన్నాయి. కానీ పద్మాల వంటివి ఇప్పటికి అగుపడచున్నాయి. స్తూప స్తంభాలు, కుడ్యాలపైన బుద్ధుడు, బోధిసత్వుల చిత్రలేఖనాలున్నాయి. ఇవి అజంతాలోని వాకాటకుల చిత్రలేఖనాల సమకాలీనమైనవి.

### అజంతా 10వ గుహాలయం

అజంతా యందు 26 గుహాలున్నాయి. వీటిలో కొన్ని చైత్య గృహాలు, కొన్ని విహారాలు. కొన్ని హీనయాన, మరికొన్ని మహాయాన కాలాలివి. 10వ. గుహాలయం హీనయాన కాలానిది. ఇది 100 అ. పొడవు, 40 అ. వెడల్పు, 33 అ. ఎత్తు గలదు. హాలు ప్రక్కల్లో 39 స్తంభాలు గలవు. అర్ధచంద్రాకార వంపు గల కుడ్య నిర్మాణ భాగం (Apse) లో రెండస్తుల స్తూపశిల్పం (Otivestupa) స్తూపముంది. గజపృష్టపై కప్పు లో భాగంలో కొయ్యదంతులున్నాయి. చైత్య ముఖ భాగంలో క్రీ.పూ. 2వ శతాబ్దానికి చెందిన శాసనం గలదు. ఇందు వాసిష్ఠీపుత్ర కలలాడి గూర్చి ప్రస్తావించబడి ఉంది.

బేద్సా పూనా జిల్లాలో ఉన్నది. ఇచటి చైత్యగృహం నాల్గు స్తంభాల వరండాను కలిగి ఉన్నది. దీనికి కూడా హాలు, ప్రక్కలలో స్తంభాలు, ప్రక్క మార్గాలు (ailes), వెనుకగా అర్ధచంద్రాకార వంపు గల కుడ్య నిర్మాణ భాగం (apse), స్తూపశిల్పం (otivestupa) స్తూపములున్నాయి. హాలు స్తంభాలు భోళించిన తామర పుష్పాల శీర్షిక (capital) విభాగాన్ని కలిగి ఉన్నాయి. దీని పైన ఫలక (abacus) కలదు. దానిపైన మానవ, జంతు శిల్పాలున్నాయి. గుహ లో భాగంలో శిల్పాలు లేవు.

### అజంతా 9వ గుహాలయం

ఈ గుహాలయం తుల్యమానంగా ఉంది. మధ్యద్వారం శిల్పాలతో నిండి ఉంది. దీనిపై భాగంలో వెలుతురు, గాలిని లోనికి ప్రవేశ పెట్టుచూ చైత్య కిటికీ ఉన్నది. ద్వారం, కిటికీలను

విభజించుచూ ఒక కపోత ఉంది. మహాయాన కాలంలో బుద్ధుడు, బోధి సత్త్వుల శిల్పాలు గుహముఖ భాగంలో చెక్కబడ్డాయి. గుహలోపల శిల్పాలు లేవు. గజపృష్ట పై కప్పు లో భాగంలో కొయ్య దంతులున్నాయి. పక్క మార్గాలు గల నిర్మాణ విభాగం. Ailes పై కప్పు చదరంగా ఉంది.

## నాసిక్ చైత్య గృహం

ఈ చైత్య గృహంలో గౌతమి పుత్ర శాతకర్ణి, యజ్ఞశ్రీ, నహపాణుడనేడి శాతవాహన రాజుల శాసనాలున్నాయి. ఈ చైత్య ముఖ భాగం రెండు అంతస్తులుగా ఉన్నది. పై విభాగంలో చైత్య కిటికీ ఉంది. ద్వారానికిరువైపుల కుడ్యంపైన కుడ్య స్తంభాలు స్తూప రూపాల శిల్పాలున్నాయి.

## జున్నార్ చైత్య గృహం

ఇచటి చైత్య గుండ్రంగా ఉన్నది. ఇది 25అ. వ్యాసాన్ని కలిగి ఉంది. స్తూపం చైత్య మధ్య గలదు. దీని చుట్టూ 12 స్తంభాలున్నాయి. చైత్యపై కప్పు గజపృష్ట ఆకారంలో ఉంది.

## కార్లే చైత్య గృహం

కార్లే పూనా జిల్లాలో ఉంది. దీని నిర్మాణ కాలం సరిగా తెలియటం లేదు. క్రీ.పూ.ఒకటి లేక రెండే శతాబ్దానికి చెందిందై ఉండవచ్చని భావించుట గలదు. హీనయాన చైత్యాలలో ఇది అందమైంది, ప్రముఖమైంది. దీనికి ముందు విభాగంలో ఒక వరండా గలదు. వరండా ముందుగా రెండు అశోక స్తంభాల వంటి 50 అ. ఎత్తు, 16 పక్క ముఖాలు గల శిలా స్తంభాలున్నాయి. స్తంభాలపైన పద్మ లేక గంట శీర్షిక, ఫలక చక్రం గలవు. చైత్యహాలు లోనికి ఒక ముఖ్య ప్రవేశ మార్గం, దాని కిరువైపులా లోనికి మార్గాన్నిచ్చెడి మరి రెండు ప్రవేశ మార్గాలు గలవు. చైత్య ముఖ భాగం రెండు అంతస్తులుగా ఉంది. పై విభాగంలో పెద్ద చైత్య కిటికీ, కింది విభాగంలో ద్వార ముఖభాగాల కిరువైపులా శిల్పాలున్నాయి. వీటిలో అర్హురు దాతలు, నాగలు పట్టుకొని ఉన్న పద్మం పైగల స్థానక బుద్ధ ప్రతిమలున్నాయి. ఈ విభాగ అధిష్ఠాన భాగాల్లో శిల నుంచి వచ్చుచున్నట్లున్న ఏనుగుల శిల్పాలున్నాయి. చైత్య పై కప్పు గజపృష్ట ఆకారంలో ఉంది. దీని లో భాగంలో కొయ్య దంతులున్నాయి. చైత్య 124 అ. పొడవు, 46 అ. వెడల్పు, 46 అ. ఎత్తున్నది. ఇందు 37 స్తంభాలున్నాయి. ఇవి రెండు రకాలుగా ఉన్నాయి. ప్రతి స్తంభం మెట్ల వంటి ఉపాన భాగాన్ని, దానిపైన కుండాకార మూలభాగాన్ని (base), దానిపైన అష్టముఖ అందం (shaft) భాగాన్ని కలిగి ఉంది. స్తంభ, శీర్షిక భాగంలో కుంభ, మెట్లాకార ఫలక, దానిపైన వంగి ఉన్న ఏనుగులు, జంటల శిల్పాలు, అశ్వాల జంటలు గలవు. చైత్య లోపలి స్తూపం యొక్క వేది రెండు భాగాలుగా ఉన్నది.

పైనున్న అండం అర్ధ చంద్రాకారంగా ఉన్నది. దానిపైన మెట్లు వంటి పీఠమున్నది. దీనిపైన కొయ్య ఛత్రముంది. కార్లే చైత్య గృహం చాలా పెద్దది, శిథిలం కాకుండా ఉన్న వాటిలో ముఖ్యమైంది. దీని చైత్య కిటికీలో నుంచి సూర్యకిరణాలు నేరుగా స్థూప భాగంపై పడుచున్నట్లు రూపొందించబడి ఉంది.

## కణ్హేరి చైత్య గృహం

బొంబాయి దగ్గరిలోని సాల్‌సెట్ దీవిలో కణ్హేరి ఉంది. ఇచటి 3వ గుహాలయం హీనయాన చైత్యగృహం. ఇది కార్లే చైత్య గృహం లాగ ఉన్నది. దీని ముఖ భాగంలో తలపాగా ధరించిన దాతల శిల్పాలున్నాయి. గుహ ముందు శిలా ఖండమందు సింహాల శిల్పాలున్నవి. చైత్య వరండాలో రెండు బుద్ధుని శిల్పాలున్నాయి. ఇవి తరవాతి కాలానివి. చైత్య గృహం లోపల క్రీ.శ. 5వ శతాబ్దం బుద్ధుని శిల్పం గలదు.

## ఔరంగాబాద్ చైత్య గృహం

ఔరంగాబాద్‌లోని 4వ గుహాలయం చైత్య గృహం. ఇది శిథిల దశలో ఉంది. ఇది 38 అ. పొడవు, 23అ వెడల్పుంది. చైత్య ముఖ భాగం పూర్తిగా శిథిలమైంది. చైత్య, అర్ధచంద్రాకార వంపు గల కుడ్య నిర్మాణ భాగం (apse) భాగంలో స్తూపరూప శిల్పం (otivestupa) స్తూపముంది. హాలు ఇరువైపులా 17 అష్టముఖ స్తంభాలున్నాయి. హాలు పై కప్పు గజపృష్ఠాకారంలోను, పై కప్పు చదరంగాను ఉన్నది. పై కప్పు లోపలి విభాగంలో శిలా దంతులున్నాయి.

## గుంటుపల్లి చైత్య గృహం

ఆంధ్రలోని పశ్చిమ గోదావరి జిల్లాలోని గుంటుపల్లి లోని చైత్య గృహం గుండ్రంగా ఉంది. దీని మధ్యస్తూపరూప శిల్పం (otivestupa) స్తూపమున్నది. ఈ చైత్య కొంతవరకు జునార్ చైత్యను పోలి ఉంది. గుంటుపల్లిలో 2 శిలా ఖండ వివరాలు, ఒక కట్టడ స్తూపం కూడా గలవు. ఇచటి చైత్య క్రీ.పూ. 200 నం. నాటిది. ఇది గుండ్రటి 'తోడ' లేక గుడిసెను పోలి ఉన్నది. చైత్యముందు భాగంలో వరండా ఉంది. పై కప్పు లోపలి విభాగం 16 దంతులను కలిగి ఉన్నది.

## మహాయాన చైత్యగృహాలు

మహాయాన చైత్య గృహాలు క్రీ.శ. 450-700 సంవత్సరాల మధ్య కాలానికి చెందినవి. ఇవి చాలావరకు వాకాటకుల కాలానికి చెందినవి. వాకాటకులు క్రీ.శ. 450-600 మధ్య

పరిపాలించారు. మహాయాన చైత్యగృహాలకు కొన్ని ముఖ్యాంశాలున్నాయి. అవి. (1) చైత్య గృహాలు కొయ్యతో నిర్మించే కాలం నాటి నిర్మాణ విధానాలు కొన్ని హీనయాన కాల శిలాఖండ చైత్య గృహాలు పై కప్పు దంతులు, తెరలు (screens) కొయ్యతోనే ఈ కాలంలో కూడా నిర్మింపబడ్డాయి. కాని మహాయాన కాలంలో చైత్య గృహాల నిర్మాణంలో కొయ్య వాడుక దాదాపు పూర్తిగా అదృశ్యమైంది. (2) మహాయాన కాలానికి బౌద్ధ మతస్థులలో మత నమ్మకాల్లో చాలా మార్పు ఏర్పడింది. ఈ కాలంలో బుద్ధుని దేవునిగా గుర్తించారు. దీనికి ముందు కాలంలో బుద్ధుడు ఒక మహా వ్యక్తిగా మాత్రమే గుర్తింపబడ్డాడు. ఈ మార్పు మహాయాన కాల శిల్పంలో కనబడుతుంది. దీని వలన బుద్ధుని, బోధిసత్వుని శిల్పాలు ఈ కాలంలో కనపడుతున్నాయి. ఇవి స్తూపం ముందు భాగంపై చెక్కబడ్డాయి. ఇవి స్థానక (standing) లేక ఆశీన రూపంలో ఉన్నాయి. ఆశీన రూపాన్ని ప్రలంబపాద ఆసన రూపమంటారు. (3) మహాయాన కాల చైత్యల్లో అనేక శిల్పాలున్నాయి. చైత్య ముఖభాగంపైన, హాలు స్తంభాలపైన ఇవి కనపడుతుంది. ఈ శిల్పాల్లో బుద్ధుడు, బోధిసత్వులు బౌద్ధ దేవతలైన తారవంటి వారు, జంతువులు, పుష్పాలు, చెట్లు, చిహ్నాలు ముఖ్యమైనవి. (4) మహాయాన కాల చైత్యాల ముఖ భాగం కూడా రెండు భాగాలుగా ఉన్నది. కింది విభాగం లో స్తంభ వరండా, పై భాగంలో చైత్య కూడా ఉంది. వీటి మధ్య భాగంలో కపోతం ఉంది. దీనిపై శిల్పాలున్నాయి. చైత్య ముఖ పై విభాగంలో కొన్ని చైత్యాల్లో ముందుకు చొచ్చుకొని ఉన్న వరండా balcony ఉన్నది. దీనికి కింది నుంచి మెట్లు గలవు. ఎల్లోరా 10వ గుహాలయం కూడా ఇట్లే ఉంది.

## అజంతా చైత్య గృహం (19వ గుహ)

అజంతాలోని 19వ గుహాలయం చైత్య గృహం. ఇది అజంతా 10వగుహాలయం కొలతలనే కలిగి ఉన్నది. దీని ముఖ భాగం రెండు విభాగాలుగా ఉంది. ఈ రెండు విభాగాల మధ్య కపోత ఉన్నది. దీనిలో రెండు వరుసల ఆసన బుద్ధుని శిల్పాలు చతుర్శ్రాకార విభాగాల్లో ఉన్నాయి. చైత్య ముఖ విభాగ కుడ్యాలపై భాగాలంతా బౌద్ధ శిల్పస్తంభాల అందం పుష్పాలతో నిండుకొని ఉన్నాయి. చైత్య ముందు గల వరండాలోని స్తంభాల అందం పుష్పాలతో నిండుకొని ఉన్నాయి. చైత్య ముఖ భాగ కింది విభాగం, ఒక ద్వారాన్ని కలిగి ఉన్నది. ఈ ద్వారం పై భాగాల్లో బుద్ధుడు, బోధిసత్వుల శిల్పాలున్నాయి. పై విభాగంలో పెద్ద చైత్య కిటికీ ఉన్నది. దీని కిరువైపులా అందమైన కుబేర యక్షుల శిల్పాలున్నాయి. వీరి శిరోజాలు ఒక వైపు వాలి ఉన్నాయి. ఈ చైత్య లోపల 17 స్తంభాలున్నాయి. వీటికి అష్టముఖ అందముంది. వీటి శీర్షిక (capital) భాగంలో కుంభ, ఫలక, వ్యాళకారులు, మిధున జంటలు శిల్పాలున్నాయి. చైత్య పై కప్పు లోపలి దంతులు శిల్ప నిర్మితాలు. చైత్య లోపల హాలు వెనుక భాగంలో స్తూపరూప శిల్పం (olive) స్తూపమున్నది. దీనికి ఎత్తైన వేది, అండం గలవు. దీని ముందు భాగంపైన మకరతోరణం కింది ఇరువైపులా కుడ్యస్తంభాలున్నాయి. బుద్ధుని కిరువైపులా పరివారకులు లేరు. బుద్ధుని శిల్పం స్తూపపు అర్థ భాగం ఎత్తు వరకు ఉంది. అండం పైన హార్మిక ఉంది. దీనిపైన ఛత్ర గలదు.

## అజంతా చైత్య గృహ (26వ. గుహ)

ఇది 19వ చైత్య గృహ పరిమాణాన్ని పోలి ఉంది. ఇది అద్భుతమైన శిల్పాలతో నిండి ఉన్నది. దీని ముందు భాగంలో స్తంభ వరండా గలదు. వరండా వెనుక గల కుడ్యముందు మూడు ప్రవేశ మార్గాలు గలవు. ఈ ద్వారాల కిరువైపులా కుడ్యభాగంపై బుద్ధుని శిల్పాలున్నాయి. ఈ చైత్య లోపలి భాగం 19వ గుహాలయాన్నే పోలి ఉంది. హాలు పై కప్పు లోపలి భాగదంతులు శిల్ప నిర్మితాలు. లతాతోరణం (Triforium) పై బుద్ధుని శిల్పాలున్నవి. ప్రక్కమార్గాలు గల నిర్మాణ భాగా (Aile) ల కుడ్యాలపై మహాపరినిర్వాణ బుద్ధుని శిల్పమున్నది. బుద్ధుని దగ్గరలో ఈతని శిష్యుల శిల్పాలు ఉన్నాయి. ఈ చైత్యలోని స్తూపం. ముందు భాగంపై బుద్ధుని ఆశీన శిల్పం.. ఒక కోష్టంలో ప్రలంబపాద ఆసనంలో ఉన్నది. స్తూప రూప శిల్పం ఎత్తుగా ఉన్నది. అండం వేదిలో సగముంది. బుద్ధుని కిరువైపులా పరివారకులు లేరు. మహాయాన కాలంలో స్తూప రూప శిల్పం ప్రాధాన్యం తగ్గి దానిపై గల బుద్ధుడు ప్రాధాన్యమయ్యాడు. క్రమంగా స్తూపం అదృశ్యమై బుద్ధుని శిల్పం మాత్రమే ఆరాధనకు వాడటం జరిగింది. ఇచటి చైత్య వరండా కుడి ఎడమ భాగాల్లో చిన్న దేవగృహాలు గలవు. వీటి కుడ్యాలపై బుద్ధుని శిల్పాలు, పరివారకులు, తార, మహామయూరి, భృకుటి మొదలగు వారి శిల్పాలు గలవు.

## ఎల్లోరా చైత్య గృహాలు

ఎల్లోరా లో 34 గుహాలయాలున్నాయి. వీటిలో ఒకటో గుహనుంచి 10.వ గుహ వరకు బౌద్ధ గుహాలయాలు 1 నుంచి 29 వరకు హిందూ గుహాలయాలు, 30 నుంచి 34 వరకు జైన గుహాలయాలు. బౌద్ధ గుహాలయాలలో 9 విహారాలు, ఒక చైత్య గృహం గలవు. ఈచైత్యనే విశ్వకర్మ చైత్య గృహం అంటారు. ఇది అజంతా చైత్య కన్నా పెద్దది. ఈ చైత్య ముఖ భాగం రెండు భాగాలుగా ఉంది. రెండిటి మధ్య కపోత గలదు. పై విభాగం త్రివక్రకూడు (trefoil arch) లాగ ఉంది. దీనికి మెట్లు గలవు. కింది భాగం స్తంభ వరండాగా ఉన్నది. ఈ వరండా కుడి, ఎడమల్లో రెండు పూజా మందిరాలున్నాయి. వీటి గోడలపై బుద్ధుడు, పరివారకులు, తార, మహామయూరి చతుర్భుజ భృకుటి శిల్పాలు గలవు. వరండాలో నుంచి చైత్య హాలులోకి మూడు ప్రవేశ మార్గాలున్నాయి. వీటిలో కుడి, ఎడమలలోనివి మూసి వేయబడి ఉన్నాయి. చైత్య లోపలి భాగం 86 అ. పొడవు, 43 అ. వెడల్పు, 34 అ. ఎత్తున్నది. హాలు రెండువైపులా 28 అష్టముఖ స్తంభాలున్నాయి. లతాతోరణం (triforium) బుద్ధుని శిల్పాన్ని కలిగి ఉన్నది. పరివారకులు గూడా గలరు. చైత్య పై కప్పు లోపలి భాగం శిలాదంతులను కలిగి ఉన్నది. హాలు వెనుకవిభాగంలో 27 అ. ఎత్తుగల స్తూపం ఉంది. దీని ముందు భాగం పై ధర్మచక్రప్రవర్తన బుద్ధుని శిల్పం ఉంది. ఈ శిల్పం 11అ ఎత్తు ఉంది. బుద్ధుడు బోధి వృక్షం కింద సింహాసనపై ప్రలంభ పాద ఆసనంలో కూర్చొని ఉన్నాడు. బుద్ధుని కిరువైపులా పరివారకులున్నారు.

## నాగార్జున కొండ చైత్య

నాగార్జున కొండలో 6,2 వ స్థలాల్లో (Sites) విహారాలు, చైత్య గృహాలున్నాయి. 6వ స్థలంలో మూడు విభాగాల విహారమున్నది. ప్రతి విభాగంలో 5 గదులున్నాయి. ఉత్తర, దక్షిణ విభాగాల అంచులలో ఎదురెదురుగా రెండు చైత్య గృహాలున్నాయి. ఇవి శిలను త్రవ్వి నిర్మించినవి కావు. ఇవి ఇటుకతో నిర్మింపబడి పూత పూయబడ్డాయి. ఈ రెంటిలో ఒకటి స్తూప చైత్యం. దీని వెనుక భాగంలో స్తూపరూపశిల్పముంది. మరొకటి బుద్ధ చైత్యం. దీని వెనుక విభాగంలో బుద్ధుని శిల్పం గలదు. రెండింటి నేల (floor) భాగం, కడపరాళ్ళతో కప్పబడి ఉంది. ఈ రెంటిలో స్తంభాలు లేవు. రెండు చైత్యాల ప్రవేశ మార్గానికి ముందు అర్ధ చంద్రాకార శిల ఉంది. దాన్నే చంద్రశిల (moon stone) అంటారు. వీటిపై కప్పు శిథిలమై ఉంది.

# III

# విహారాలు

విహారమనగా ఒక సంఘారామం లేక మత ప్రచారకుల నివాసమందిరం. తొలి విహారాలు కొయ్య, ఇటుకలతో నిర్మింపబడియుండవచ్చు. కావుననే అవి అదృశ్యమైనవి. శిలలో తవ్వి రూపొందించినవి, రాతి కట్టడాలవి మాత్రం నిలచి ఉన్నాయి. మౌర్యుల కాలానికి చెందిన బీహారులోని బరాబర్, నాగార్జుని, సితామర్హి కొండలలోనివి తొలి విహారాలు. వీటికి వాల్టెడ్ (vaulted) పై కప్పు గలదు. పశ్చిమ భారతదేశంలో చైత్య గృహాలున్న ప్రాంతాలన్నింటిలో విహారాలు కూడా గలవు. విహారాలు దీర్ఘచతురస్ర లేక చతురస్రాకార ప్లానులో నిర్మింపబడి ఉన్నాయి. వీటిపై కప్పు చదరంగా ఉంది. కానీ పిథలఖోర, బేద్సా వంటి ప్రాంతాల్లోని తొలి విహారాలు వాల్టెడ్ పై కప్పును కలిగి ఉన్నాయి. విహారానికి మధ్యలో హాలు, దానికి మూడు వైపులా గదులు శిలలో తొలచబడి ఉన్నాయి. విహార ముందు వరండా ఉన్నది. కొన్ని సమయాల్లో వరండా ప్రక్క కుడ్యాల్లో కూడా గదులు రూపొందింపబడి ఉన్నాయి. ఈ గదులలో గూళ్ళున్నాయి. మతపరమైన ప్రార్థనలు, చర్చలు, అధ్యయనాల కొరకు లేక భోజనాలు చేయడానికి హాలు ఉపయోగించేవారు. ఈ హాళ్ళలో రెండు వరసల బల్లలు కూడా ఉన్నాయి.

## తొలి విహారాలు లేక హీనయాన విహారాలు (క్రీ.పూ. 200– క్రీ.శ. 200)

హీనయాన కాల విహారాలు స్వచ్ఛమైన విహారాల తెగకు చెందాయి. వీటిలో కొన్ని చైత్య గృహాల ప్రక్కలలోనే ఉన్నాయి. తొలి దశలో విహారాల హాలు వెనుక గోడ మధ్యలో

పూజా మందిరం ఏర్పాటు చేయడం. ఇందు బుద్ధుని శిల్పం ప్రతిష్ఠించబడి ఉన్నది. ఈ మందిరానికి ముందు ఒక అర్ధమండపం కూడా ఉన్నది. కాని తొలి విహారాల్లో స్తంభాలుండేవి కావు. తక్కువ శిల్పాలున్నాయి.

**అజంతా విహారాలు**

అజంతా ప్రాంతానివి తొలి దశకుచెందిన విహారాలుగా చెప్పవచ్చు. ఇచట 4 చైత్య గృహాలు 25 విహారాలు గలవు. అజంతాలోని 8,12,13,15A గుహలు తొలి విహారాలు. 8వ గుహ చాలావరకు శిథిలమై ఉంది. 12వ గుహ ముందు గోడ పతనమై ఉంది. ఈ విహారం 36 అ. చతురస్రంగా ఉంది. 12 గదులు గలవు. ప్రతి గది పై భాగంలో చైత్య కిటికీ శిల్ప రూపముంది. హాలులో స్తంభాలు లేవు. 13వ గుహ ముందు గోడ కూడా పతనమైంది. దీని హాలులో కూడా స్తంభాలు లేవు. దీనికి 7 గదులున్నాయి. ప్రతి గదిలో రెండు రాతి పడకలు గలవు. 15వ గుహ ముందు గోడ కూడా పతనమైంది. దీని హాలులో కూడా స్తంభాలు లేవు. దీనికి మూడు గదులు గలవు.

**నాసిక్ (విహార) గుహలు**

మహారాష్ట్రలోని నాసిక్ వద్ద గల 3, 8, 15వ గుహలు తొలి విహారాలు. ఇవి గౌతమీ పుత్ర శాతకర్ణి, నహపాణుడు, యజ్ఞశ్రీల కాలాల్లో రూపొందించబడ్డాయి. వీటి ముందు స్తంభ వరండా ఉంది. హాలులో స్తంభాలు లేవు.

**భాజ విహార**

భాజలో విహార, చైత్య గృహాలు పక్కపక్కగా నిర్మించి ఉన్నారు. విహారముందు గల వరండా గజ పృష్టాకార పై కప్పు కలిగి ఉంది. ఈ విహారలో శిల్పాలు అతి తక్కువగా ఉన్నాయి.

**బేద్స విహార**

బేద్సా ప్రాంతంలో కూడా విహార, చైత్య పక్కపక్కనే రూపొందింపబడి ఉన్నాయి. ఈ రెండూ గజపృష్ఠ (apsidal) ప్లానులో రూపొందింపబడి, గజపృష్ఠ ఆకారం పై కప్పు ఉంది.

**గుంటుపల్లి**

ఇచట రెండు విహారాలున్నవి. ప్రతి దానికి 3 ద్వారాలున్నాయి. ఒక విహార మాత్రం శిథిలమై ఉంది.

**తొలి దశ మలి విహారాలు (క్రీ.శ. 200-500)**

మధ్య భారదేశంలోని ధార్ జిల్లాలో ఉన్న భాగ్ ప్రాంత విహారాలు ఈ దశకు చెందినట్టివి.

ఇచట మొత్తం 9 గుహాలున్నాయి. 4వ గుహ ప్రసిద్ధి గాంచినది. దీనినే రంగమహల్ అంటారు. ఇది 96అ. పొడవు, 44 అ. వెడల్పు గలదు. ముందు కుడ్యంలో తప్ప మిగిలిన మూడు గోడ భాగాల్లో గదులు తొలచబడి ఉన్నాయి. ఇచటి హాలును నవరంగ లేక రంగ మండపమంటారు. హాలులో అన్ని వైపులా రెండు వరసల్లో 28 స్తంభాలున్నాయి. మధ్య భాగంలో ఖాళీ స్థలముంది. హాలు వెనుక గోడ భాగంలో చిన్న గదుల్లో స్తూపరూపశిల్పాలున్నాయి. విహార లాగాను చైత్య గృహాలాగాను కూడా ఈ చైత్య ఉపయోగ పడుతుంది.

**అజంతా విహారాలు**

అజంతాలోని 16, 17 వ విహార గుహాలు క్రీ.శ. 500 సం. నాటివి. ఇవి వాకాటక రాజు హరిసేనుని కాలానికి చెందినట్టివి. 1,2 వ విహార గుహాలు క్రీ.శ. 600 నాటివి.

16వ విహార గుహ అజంతాలోని అందమైన విహారాల్లో ముఖ్యమైంది. వాకాటక రాజైన హరిసేనుని మంత్రి వరాహదేవునిచే ఇది తవ్వించబడింది. ఈ విహారముందు ఒక స్తంభ వరండా గలదు. ఈ వరండా రెండు ప్రక్కలలో రెండు గదులు గలవు. విహారం ఒక చతురస్రాకార స్తంభ హాలులో ఉంది. హాలు ప్రక్కలలోని గదులు మొత్తం 14 ఉన్నాయి.

హాలు వెనుక గోడలో పూజా మందిరముంది. ఇందు బుద్ధుని ప్రతిమ గలదు. ఇతడు ప్రలంభ పాద ఆసనంలో ఉన్నాడు. ఈతని కిరువైపులా వజ్రపాణి, పద్మపాణి గలరు. దీని వెనుక గోడపై గంధర్వుల శిల్పాలున్నాయి.

17వ విహార గుహ కూడా 16వ గుహాలయం లాగానే ఉంది. దీన్ని వాకాటక రాజు హరిసేనుని సామంతుడు తవ్వించాడు.

1వ. విహార గుహకు కూడా ఒక వరండా, హాలు, ప్రక్క గదులు, పూజా గది గలవు. పూజ గదిలో ధర్మ చక్ర ప్రవర్తన పర్యాంకాసనంలో ఉన్నాడు. బుద్ధుని కిరువైపులా చౌరి ధరించిన పద్మ పాణి, వజ్రపాణి గలరు.

2వ విహార అజంతా లోని గుహాలలో గట్టిగా నిలచి ఉంది. దీనికి కూడా వరండా, హాలు, ప్రక్కగదులు, పూజా గది గలవు. పూజా గదిలో ధర్మ చక్ర ప్రవర్తన బుద్ధుని ప్రతిమ గలదు. ఈయన కిరువైపులా పద్మపాణి, వజ్రపాణి గలరు. బుద్ధుడు ఆశీనమై ఉన్న పీఠం పై ధర్మ చక్ర శిల్పముంది. దీనిపైనే ఒక బోధకుడు శిష్యులకు బోధించుచున్నట్లున్న శిల్పం గలదు. ఇందు ముందు వరసలో ముగ్గురు శిష్యులు శ్రద్ధగా వింటున్నారు. వీరి వెనుక ఇద్దరు తగవులాడుకొంటున్నారు. వీరికి మరి కొంత దూరం లో 5 గురు పొట్టేలు పందేలను చూస్తున్నారు.

4వ విహార అజంతాలోని గుహల్లో పెద్దది. కానీ ఇది అసంపూర్తిగా ఉన్నది. ఇది 87 అ. చతుర్శ్రంగా ఉన్నది. 28 స్తంభాలను గలిగి ఉన్నది. పూజ గదిలో ధర్మ చక్ర ప్రవర్తన బుద్ధుడు, ఈతని కిరువైపులా పద్మ పాణి, వజ్రపాణి శిల్పాలున్నాయి. ఇది క్రీ.శ. 550 కాలానిది.

ఎల్లోరాలో 34 గుహలు కలవు. వీటిలో 12 బౌద్ధ గుహలు. వీటిలో 10వ గుహ చైత్య గృహము. మిగిలిన 11 గుహలు విహారాలు. 13 నుంచి 29వ గుహవరకు హిందూ గుహలు. 30 నుంచి 35వరకు జైన గుహలు. బౌద్ధ గుహలు కొండకు దక్షిణాన, జైన గుహలు ఉత్తరాన గలవు. వీటి మధ్య హిందూ గుహలున్నాయి. బౌద్ధ విహారాలు 11లో 1, 2, 3, 5వ గుహలు క్రీ.శ. 400 సం. నాటివి.

ఒకటో గుహ ఒక విహారం. దీనికి ఒక హాలు, ఎనిమిది గదులు గలవు.

రెండో గుహకు హాలు గలదు. కాని గదులు లేవు. దీని మూడు కుడ్యాలపై బౌద్ధ శిల్పాలు గలవు. వీటిలో బుద్ధుని శిల్పాలు, బోధి సత్వుని శిల్పాలు గలవు.

మూడో గుహ హాలు రెండువైపులా గదులు గలవు. హాలు వెనుక గోడలో పూజా మందిరం ఉంది. ఇందు పద్మం పైగల బుద్ధుని శిల్పం గలదు. నాగ ప్రతిమలు కూడా ఉన్నాయి.

ఐదో గుహనే మహన్వాడ అంటారు. ఇది ఎల్లోర విహారాల్లో పెద్దది. దీనికి 117 అ. పొడవు, 60అ వెడల్పు గల హాలు గలదు. హాలు వెనుక గోడలో పూజా గది. కుడి ఎడమ కుడ్యాల్లో గదులు గలవు. పూజా గది ద్వారం. ఇరువైపులా ద్వార పాలుర శిల్పాలు గలవు. ఎడమవైపు గల ద్వారపాలుడు అవలోకి గలరు. అవలోకి తేశ్వరుడు కుడి చేతిలో అక్షమాలను, ఎడమ చేతిలో పద్మాన్ని కలిగి ఉన్నాడు. రెండో ద్వార పాలునికి కూడా ఇద్దరు స్త్రీ సేవకులు గలరు. విహారంలోని పూజా మందిరంలో ధర్మ చక్రవర్తన బుద్ధుడున్నాడు. ఈతని కిరువైపులా పద్మపాణి, వజ్రపాణి గలరు.

4, 6, 12వ గుహలు క్రీ.శ. 500-700 మధ్య కాలానివి. వీటిలో 4వ గుహ రెండంతస్తులుంది.

ఆరో గుహ కూడా కొంత ప్రత్యేక తరహాలో ఉన్నది. ఈ గుహకు 6 గదులు కలవు. హాలు వెనుక కుడ్యంలో పూజా మందిరం, దాని ముందు అర్ధ మండపం గలవు. పూజ గదిలో ధర్మ చక్ర ప్రవర్తన బుద్ధుడున్నాడు. ఈ గది గోడలపై 9 బుద్ధుని శిల్పాలున్నాయి. అర్థ మండప ఎడమ కుడ్యముపై బౌద్ధ దేవత తార, కుడి కుడ్యంపై మహామయూరి ఆమె వాహనం నెమలి శిల్పాలున్నాయి.

7, 11, 12వ గుహల్లో అద్భుత శిల్పాలున్నాయి. 12వ గుహని ప్రాంతీయంగా తింతాల్ (మూడంతుస్తుల గుహ) అంటారు. ఒక ఏకశిలా ద్వారం దీని ప్రాంగణంలోకి మార్గాన్నిచ్చుచున్నది. ఈ ప్రాంగణం వెనుక కొసలో 3 అంతస్తుల గుహముఖ భాగం ఉంది. ప్రతి అంతస్తులో ముందుగల వరండాలో 8 ఘన చతురస్రాకార స్తంభాలు గలవు. గుహ ముఖ భాగం 50 అ. ఎత్తుగలదు. ఈ గుహ 115 అ. పొడవు, 43అ. వెడల్పున్నది. హాలులో మూడు వరుసల్లో స్తంభాలున్నాయి. ప్రతి వరుసలో 8 స్తంభాలున్నాయి. హాలు వెనుక గోడపై అనేక శిల్పాలున్నాయి. వీటిలో బుద్ధుడు, బోధిసత్వులు మొదలగు వారు గలరు. హాలు ప్రక్కలలోని గుదుల్లో ఒక దాని నుంచి పైకి మెట్లు గలవు. రెండో అంతస్తు హాలులో 4 వరుసల్లో స్తంభాలున్నాయి. ప్రతి వరుసలో 10 స్తంభాలున్నాయి. మూడో అంతస్తు గుహ కూడా మిగిలిన రెంటి వలెనే ఉంది. ప్రతి అంతస్తు హాలు వెనుక గోడలో పూజా మందిరం ఉంది.

**ఔరంగాబాద్ విహారాలు**

ఇచట 9 గుహాలున్నాయి. వీటిలో 4వ గుహ చైత్య గృహం. మిగిలినవి విహారాలు. ఇవి క్రీ.శ. 7 లేక 8వ శతాబ్దానికి చెందినట్టివి. ఒకటో గుహ వరండాలోని స్తంభాల మూలలు ఘన చతురస్రంగా ఉన్నాయి. ఈ స్తంభాల శిల్ప శీర్షిక (bracket Capital) లో స్త్రీల శిల్పాలున్నాయి. వరండా వెనుక గోడపై పద్మం పై కూర్చొని ఉన్న బుద్ధుని శిల్పముంది. నాగ ప్రతిమలు గూడా ఉన్నాయి.

రెండో గుహ హాలు వెనుక గోడలోని పూజా మందిరం వెనుక గోడపై ధర్మ చక్ర ప్రవర్తన బుద్ధుని శిల్పముంది. మూడవ గుహకు వరండా, స్తంభాల హాలు, హాలు ఇరుప్రక్క కుడ్యాల్లో గదులు, హాలు వెనుక గోడలో పూజా మందిరం గలవు. హాలు 82 అ. పొడవు, 63 అ వెడల్పు గలదు. హాలులో 12 స్తంభాలున్నాయి. పూజా గదిలో ధర్మ చక్ర ప్రవర్తన బుద్ధుని శిల్పమున్నది. ఈతని కిరువైపులా ప్రణామం చేయు భక్తులున్నారు. ఈ శిల్పాలు అద్భుతంగా చెక్కబడి ఉన్నాయి. ఏడో గుహ కొంత ప్రత్యేకంగా ఉన్నది. దీని చుట్టూ ప్రదక్షిణా పథ గలదు. దీని ముందు వరండా గలదు. వరండా వెనుక గోడ కుడి, ఎడమల కొసలలో ప్రదక్షిణా పథలోనికి మార్గాలున్నాయి. హాలు కుడి, ఎడమలలో ప్రతి వైపు మూడు గదులు గలవు. వీటిలో బుద్ధుని శిల్పాలున్నాయి. పూజా మందిరం పై కప్పు, హాలు పై కప్పు విడివిడి గా ఉన్నాయి. అద్భుత ఎల్లోరా శిల్పాల్లాగ ఇచట కూడా శిల్పాలు సుందరంగా ఉన్నాయి. ఇవి మహాయాన తెగకు చెందినట్టివి. పూజా మందిర ప్రవేశ మార్గానికి కిరువైపులా బోధిసత్వులు, పద్మపాణి, వజ్రపాణి గలరు. పద్మపాణి భక్తుల కోరికపై ఎనిమిది విపత్తులను నిర్మూలించెడి వివరాలు కూడా గలవు. అగ్ని జలం, సింహం, సర్పం, మతిస్థిమితం లేని ఏనుగు, ఖడ్గం, బానిసత్వ గొలుసు, మరణం అనునవి ఎనిమిది విపత్తులు. తల్లి ఒడి నుంచి బిడ్డను లాగుకొనుచున్న ఆడ రాక్షసి లాగ మరణం శిల్పంలో రూపొందించబడి ఉంది. వజ్రపాణి ప్రక్కలో సరస్వతి, గంధర్వులు, అప్సరసలు మొదలగు వారున్నారు. గుంఢ్రటి శిల్పంలో అనేక మహాయాన దేవీలు కుడ్యాలపై ఉన్నారు.

# 10

# జైన వాస్తుశిల్పం

## ఎ. గుహాలయాలు

### 1. ఉదయగిరి, ఖండగిరి గుహాలయాలు

ఒరిస్సాలోని పూరి జిల్లాలో ఉదయగిరి, ఖండగిరి పర్వతాల్లో జైన గుహాలయాలు గలవు. ఇవి క్రీ.శ. 100-క్రీ.శ. 150 మధ్య కాలానికి చెందినట్టివి. ఈ కొండల్లో ఇసుకరాయి పై భాగాలను గుహల నిర్మాణానికి జైన స్థపతులు ఎన్నుకొన్నారు. ఈ గుహాలయాలకు అనేక ముఖ్యాంశాలున్నాయి. అవి:

1. బౌద్ధ విహారాల్లో వలే వీటికి స్తంభాల హాలులు లేవు.
2. ఈ గుహాల శిల మెత్తదైనందున గుహాల పై భాగ బరువు తగ్గించి గుహాలు ఎక్కువ కాలం నిలచుట కొరకు ఈ గుహలు శిలా ఖండాల పై భాగాలకు దగ్గరగా తొలచి రూపొంది ఉన్నాయి.
3. బౌద్ధ విహారాల్లోని గదుల కన్నా వీటిలోని గదులు చాలా చిన్నవి.
4. గదుల ప్రవేశ మార్గాలపైన శిలా ఖండాలతో నిండుకొని ఉన్నాయి.
5. వీటి స్తంభాల కింది పై విభాగాలు ఘన చతురస్రంగాను, మధ్య భాగం అష్టముఖంగాను ఉన్నాయి. స్తంభాల కార్బెల్స్ వంపును కలిగి ఉన్నాయి. కొన్ని సందర్భాల్లో స్తంభ పాదం కుడ్య చూరులను కలిపెడి రీతిలో స్త్రీల శిల్పాల్లో ఉన్నాయి.
6. ఇచట 35 గుహాలున్నాయి. వీటిలో 17 ముఖ్యమైనవి. కొన్ని గుహలు ఒకే గదిని కలిగి ఉన్నాయి. వరండా కూడా లేదు. కొన్ని వరండాలను కలిగి, వాటి వెనుక గోడలో గదులు ఉన్నాయి. మరి కొన్ని గుహలు రెండంతుస్తులున్నాయి.
7. పెద్ద గుహలు మొత్తం నాల్గున్నాయి. ఇవి రెండంతుస్తులవి. వీటిలో ప్రాంగణం చుట్టూ మూడు వైపులా స్తంభ వరండా గల గదులున్నాయి. ఒక వైపు పూర్తిగా ప్రవేశ మార్గముంది. ఈ గుహలకు ఒక పద్ధతితో కూడి ప్లాను లేదు.
8. ఈ గుహాలయాల గదులపై ప్రవేశాల పై భాగాల్లో తోరణాలు, అద్భుత శిల్పాలున్నాయి. ఇవి తోరణం లోపల భాగం ఉన్నాయి. ప్రవేశ మార్గాల ఇరువైపులా గల కుడ్య స్తంభాలపైన ఈ తోరణాలు రూపొంది ఉన్నాయి. కుడ్య స్తంభాల శీర్షిక (capital) భాగంలో నాల్గు వీపులు కలిసినట్లున్న జంతువులున్నాయి. తోరణాలను కలుపుతూ ఒకే షే(railing) ఉంది. వేదికకు నిలువు, అడ్డాలనెడి భాగాలున్నాయి.

## ఉదయగిరి గుహలు

### ఒకటో గుహ

దీన్నే రాణీగుంఫా అంటారు. ఉదయగిరి గుహల్లో ఇది పెద్దది, తొలి దశకు చెందింది. ప్రాంగణం మూడు వైపులా గదులు గలవు. కుడివైపు వరసలో ఒక గది ఉంది. దీనికి మూడు ప్రవేశ మార్గాలు, స్తంభ వరండా గలవు. ఎడమ వైపు వరసలో ఒక స్తంభం వరండా, దానికి మూడు వైపులా మేడో ముఖ్య విభాగ వరసలో ఒక స్తంభం వరండా, దాని వెనుక గోడ భాగంలో మూడు గదులు, ఎడమవైపు ఒక గది ఉంది. వరండా రస్తంభాలు, పై కప్పు అదృశ్యమై ఉన్నాయి. కింది అంతస్తులో రక్షకులుగా ద్వారాల కిరువైపులా ద్వారా పాలురు గలరు. స్తంభాలు, కుడ్య స్తంభాల ఫలక పైన అశ్వాలు, ఏనుగులు, నృత్యకారులు, ఖార వేలునిగా చెప్పడం జరిగింది. రాజు దండయాత్ర, ఆ రాజు విజయంతో తిరిగి వచ్చు దృశ్యాలు ఉన్నాయి. పై అంతస్తులో వరండా, అందలి స్తంభాలు అదృశ్యమై ఉన్నాయి. వరండా కుడి, ఎడమ వరసల్లో ఒక్కొక్క గది, వెనుక గోడ భాగంలో నాల్గు గదులున్నాయి. గదుల ద్వారా పై భాగాల్లో శకుంతల, దుష్యంతలున్నారు.

### మూడో గుహ

దీనినే ఛోటా హాతీ గుంఫా అంటారు. ఇది చిన్నది. వరండా లేదు. దీని ముఖ భాగంలో, ద్వారం పైన తోరణం, ద్వారానికిరువైపులా మూడు చొప్పున మొత్తం ఆరు ఏనుగులున్నాయి.

### నాల్గో గుహ

దీనినే అలకపురి గుంఫా అంటారు. ఇది ఒక దానిపై ఒకటిగా రెండు గుహలను కలిగి ఉంది.

### ఐదో గుహ

దీన్నే జయ విజయ గుంఫా అంటారు. దీనికి ఒక వరండా, రెండు గదులున్నాయి.

### తొమ్మిదో గుహ

ఉదయగిరి పెద్ద గుహలలో ఇదొకటి. ఇది రెండతస్తులుంది. కింది గుహను మంచాపురియని, పై గుహను స్వర్గపురియని అంటారు. మంచాపురికి రెండు వరసల్లో నాల్గు గదులున్నాయి. గదులకు రక్షకులుగా ద్వారపాలురున్నారు. స్వర్గపురి గదుల ద్వారాలపైన ముఖరాల నోటి నుంచి వస్తున్నట్లున్న తీగల శిల్పముంది. గుహను ఖారవేలుని ముఖ్యదేవి జైన సన్యాసులకు దానమిచ్చినట్లు తెలుస్తుంది.

**పదో గుహ**

దీన్నే గణేశ గుహ అంటారు. ఈ గుహ వెనుక గోడపై గణేశ శిల్పమున్నందున ఈ గుహకు ఈ పేరు వచ్చింది. గుహ ముందు రెండు ఏకశిలా ఏనుగులున్నాయి. ఈ ఏనుగులు తొండాల్లో మామిడి కొమ్మలను పట్టుకొని ఉన్నాయి.

**పన్నెండో గుహ**

దీన్నే పులి గుహ అంటారు. పులిపై దవడ లాగ ఈ గుహపై విభాగంలో రూపొందించి ఉన్నందున దీనికీ పేరొచ్చింది.

**పదునాల్గో గుహ**

హతీగుంఫ అని కూడా దీన్ని అంటారు. ఇది ప్రకృతి పరంగా ఏర్పడి కొంత మార్పు చేయబడ్డ గుహలాగ ఉన్నది. గుహ ముందు పరండా లేదు. ఈ గుహ పైననే కొంత శిథిలమై ఉన్న భారవేలుని శాసనముంది.

**ఖండగిరి గుహలు**

**మూడో గుహ**

దీన్నే అనంత గుంఫ అంటారు. దీని ద్వారాలపైన తోరణాల భాగంలో సర్పాల, జంటల శిల్పాలున్నందున ఈ గుహకు ఈ పేరు వచ్చింది. జైన చిహ్నాలైన నందిపాద, శ్రీవత్స, స్వస్తిక చిహ్నాలు కూడా ద్వారాలపై ఉన్నాయి. తోరణం (కూడు) భాగంలో సూర్య, గజలక్ష్మి శిల్పాలున్నాయి. ఇవి జైన, బౌద్ధ, హైందవ మతాలన్నింటిలో కనపడుతుంది. సాంచి (బౌద్ధమతంది) ఖండగిరి (జైనమతంది), దక్షిణ భారత దేవాలయాల్లో ఇవి కనపడతాయి. ఖండగిరిలో గజలక్ష్మి వికసించిన తామరలున్న కొలనులో నిలుచొని ఉన్నది. ఈమె చేతులకు తామరలు చుట్టుకొని ఉన్నాయి. ఈమె కిరువైపులా గల ఏనుగులు ఈమెకు స్నానం చేయించుచున్నవి. ఈ గుహ తోరణాల (కూడు) మధ్య గల భాగాల్లో శీఘ్రంగా పయనించుచున్న గంధర్వుల శిల్పాలున్నాయి.

**ఏడో గుహ**

నవముని గుహయని కూడా దీనినంటారు. గుహలో తొమ్మిది మంది తీర్థంకరుల శిల్పాలున్నందున దీనికి పేరొచ్చింది. ఇచటి తీర్థంకరుల్లో వృషభనాథుడు, పార్శ్వనాథుడు, నేమినాథుడు మొదలైన వారు ఉన్నారు. వీరు పద్మాసనం లో కోష్ఠాల్లో ఆశీనులై ఉన్నారు. తీర్థంకరులపైన ఒకదానిపై ఒకటిగా మూడు వరసల్లో గొడుగు (ఛత్రము)లున్నాయి. వీరి కింద శాసన దేవతలున్నారు. వీరిలో చక్రేశ్వర, రోహిణి, ప్రజ్ఞాపతి, వజ్రశృంఖల, గాంధారి, పద్మావతి, అమర అనువారు ఇక్కడ ఉన్నారు. వీరిపైన గణపతి ఉన్నాడు. ఈయన మోదక, పరసు కలిగి ఉన్నాడు.

**ఎనిమిదో గుహ**

ఈ గుహ గోడలపై మొత్తం 24 మంది తీర్థంకరులున్నారు. వీరిలో ఒకరిని పలుమార్లు చెక్కి ఉన్నారు. 24 మంది కింది భాగాల్లో 24 మంది శాసన దేవీలున్నారు.

**తొమ్మిదో గుహ**

ఇందు 8 మంది తీర్థంకరులున్నారు. రుషభనాథుడు, అతని పరివార సేవకుల శిల్పాలు కూడా ఉన్నాయి.

**10. 11వ గుహలు**

వీటిలో కూడా కొన్ని తీర్థంకరుల శిల్పాలున్నాయి.

**2. ఎల్లోరా గుహలు**

ఎల్లోరాలోని 30, 31, 32, 33, 34 వ గుహలు జైన గుహాలయాలు. ఇవి క్రీ.శ. 9, 10 శతాబ్దాలకు చెందినట్టివి. తొలివి క్రీ.శ. 800 సం. కాలానివై ఉండవచ్చు. ఇవి ఇచటనే ఉన్న హిందూ గుహాలయాల వలే ఉన్నాయి. కానీ వీటి శిల్పాల్లో తేడా ఉంది.

**30వ గుహ**

ఈ గుహను ఛోటా కైలాస మంటారు. ఎల్లోరాలోని ప్రసిద్ధి గాంచిన కైలాస దేవాలయం యొక్క చిన్న రూపంగా దీన్ని చెప్పవచ్చు. ఈ గుహ ముందు ఏక శిలా గోపుర ద్వారముంది. దీని ద్వారా లోనికి ప్రవేశించినచో నంది వ్రపతిమ గలదు. ఈ గుహ ముఖమండప, అంతరాళి, గర్భ గృహాలున్నాయి. దీని కుడ్యాలపై అనేక జైన శిల్పాలున్నాయి. గర్భ గృహాలో సింహాసనంపై ఉన్న మహావీరుని శిల్పముంది.

**32వ గుహ**

దీన్ని ఇంద్రసభ యంటారు. ఈ గుహ ముందు ఏకశిలా గోపుర ద్వారముంది. దీని ద్వారా లోపల ప్రాంగణంలోనికి ప్రవేశించినచో ప్రాంగణం మధ్యలో ఏకశిలా ఆలయముంది. ఇది దక్షిణ భారతదేశ కట్టడ ఆలయంలాగ ఉన్నది. ఈ గుహ రెండు అంతస్తులుగా ఉంది. కింది అంతస్తు స్తంభ వరండాను, అనేక గదులను గలిగి ఉంది. గదుల్లో జైన శిల్పాలైన సింహాసనంపైనున్న మహావీరుని శిల్పాల వంటివి ఉన్నాయి. ఇతర శిల్పాల్లో వృషభనాథుడు, గోమతేశ్వరుడు, మాతంగుడు ముఖ్యులు. గదుల ద్వారాల రక్షకులుగా ద్వార పాలురున్నారు. పై అంతస్తులో వరండా, స్తంభమండప లేక హాలు, హాలు వెనుక గోడ భాగంలో గర్భ గృహ, వరండా కుడి, ఎడమల్లో పెద్దవిగా ఏనుగుపై నున్న మాతంగుడు, సింహం పై నున్న శిద్ధాంకుడుల శిల్పాలున్నాయి. పై అంతస్తును ఇంద్ర సభ అంటారు. ఇందలి మండపంలో 12 స్తంభాలున్నాయి. స్తంభాలపై ఏభాగంలో పూర్ణకలశ డిజైన ఉన్నది. ఇచటి హాలు ప్రక్కలలో గదులున్నాయి.

వీటిలో పెద్ద అకారాల్లో పద్మాసనం ధ్యానముద్రలోని మహావీరుని శిల్పాలున్నాయి. ఇందలి ఇతర శిల్పాల్లో పార్శ్వనాధుడు, గోమతేశ్వరుడు ముఖ్యులు.

**33వ గుహ**

జగన్నాధ సభయని కూడా దీన్ని అంటారు. ఇది కూడా రెండంతస్తుల గుహ. కింది అంతస్తులో వరండా, స్తంభాల మండప, హాలు, హాలు వెనుక గోడలో గర్భ గృహ ఉన్నాయి. వరండా రెండు కొనల్లో మాతంగ, శిద్ధాంకుల శిల్పాలున్నాయి. ఇచటి ఇతర శిల్పాల్లో మహావీర, పార్శ్వ నాథులున్నారు. పై అంతస్తులోని హాలులో 14 స్తంభాలున్నాయి. హాలు వెనుక గోడ భాగంలో గర్భగృహ ఉంది. తీర్థంకరులు, మాతంగ, శిద్ధాంకుల శిల్పాలు ఈ గుహ యందున్నవి.

## 3. బాదామి గుహలు

కర్ణాటకలోని బాదామి ప్రాంతంలోని 4వ గుహ జైన గుహాలయం. ఇది వరండా, హాలు, గర్భ గృహను కలిగి ఉన్నది. దీని కుడ్యాలపై అనేక శిల్పాలున్నాయి.

## 4. ఐహొలె

ఐహొలె (అయ్యవోలు) లో రెండు గుహాలయాలున్నాయి. వీటిలో ఒకటి రావల గుడి అంటారు. ఇది శివాలయం. ఇచటి గర్భగృహాలో శివలింగముంది. రెండే గుహ జైన గుహాలయం. ఇది బాదామి గుహ లాగ ఉంది.

## 5. జైన శిల్పాలు

**ఉదయగిరి, ఖందగిరి గుహల శిల్పాలు**

ఒరిస్సాలోని భువనేశ్వర్ వాయవ్యంగా ఉదయగిరి, వద్ద, ఉదయగిరి ఖందగిరి అనే కొండలున్నాయి. ఇవి ఇసుక రాతి కొండలు. వీటిలోని గుహలు క్రీ.పూ. 100 క్రీ.శ. 150 మధ్య కాలానికి చెందినవి. ఉదయగిరి కొండలో 19 గుహలు, ఖందగిరి కొండలో 16 గుహాలున్నాయి. ఇవి జైన గుహలు. వీటిలో ఉదయగిరి కొండలోని రాణి గుంఫా, హాతి గుంఫా, గణేశ గుంఫా, మంచాపురి గుహలు ముఖ్యమైనవి.

1. జైన గుహలు కొండపై భాగానికి దగ్గరగా రూపొందింపబడి ఉన్నాయి. ఈ విధానం గుహపైన గల బరువు తగ్గించుటకు అనుసరించడం జరిగింది. శిల మెతువు వల్ల కూడా ఇట్టి పద్ధతి అనుసరించడం జరిగింది.
2. ఉదయగిరి, ఖందగిరి జైన గుహలకు బౌద్ధ గుహలలో వలె మధ్య హాలు లేదు.

3. గదులను, వరండాలోని క గాని, ప్రాంగణంలోకి గాని ప్రవేశం ఉంది.
4. వీటికి బౌద్ధ గుహల్లో లాగ గర్భ గృహ (పూజ గది) లేదు.
5. గదులు శిల్ప రహితంగా ఉండగా, గుహల ముఖ భాగాలు, స్తంభాలపై శిల్పాలున్నాయి.
6. కొన్ని గుహలు రెండంతస్తులున్నాయి. ఒకటి రెండు గదులును, ప్రతి గదికీ వరండా ఉంది.
7. కొన్ని గుహలకు ముందు భాగంలో ప్రాంగణాలున్నాయి.
8. గదులు ప్రాంగణం ఒక వైపు, రెండు వైపుల లేక మూడు వైపుల ఉన్నాయి.
9. స్తంభాలపై భాగం, కింది భాగం ఘన చతురస్రకారంగాను, మధ్య భాగం అష్టముఖం రూపంలోను ఉన్నాయి. చతురాలపై అర్ధ పథకాలున్నాయి.
10. ద్వారంపైగల తోరణం (tympanum) లోవల, తోరణాల మధ్యగల భాగాల్లో శిల్పాలు న్నాయి. కూడులు చే కలుపబడి ఉన్నాయి.

ఈ గుహలో భారతదేశ సాహిత్యం, పల్లెల్లో ప్రముఖ నాటకీయ ప్రాచీన కథల్లో ఘట్టాలతో కూడిన శిల్పాలున్నాయి. గుహల గదుల ద్వారాల కిరువైపులా గల కుడ్య స్తంభాల ఫలక (abascus) పైన రెక్కల సింహం, ఎద్దు మొదలగు జంతువుల శిల్పాలున్నాయి. ద్వారా పైనున్న కూడుల్లో తేనెటీగలు, జంతువుల నోటి నుంచి ఉద్భవించుచున్న తీగలు, పద్మాలు, వాటిపైన శ్రీ వత్స చిహ్నాలు ఉన్నాయి. ఒక కూడు మరో కూడుల కిందికొసలు వేదిక చే కలుపబడి ఉన్నాయి. ఈ గుహలలో ఉదయన, వాసవదత్త కథ, దుష్యంత శకుంతల కథా శిల్పాలున్నాయి. ద్వారాల పైనున్న కూడుల్లో తేనెటీగలు, జంతువుల నోటి నుంచి ఉద్భవించుచున్న తీగలు, పద్మాలు, వాటిపైన శ్రీ వత్స చిహ్నాలు ఉన్నాయి. ఒక కూడు మరో కూడుల కింది కొసలు వేదిక (railing) చే కలుపబడి ఉన్నాయి. ఈ గుహలలో ఉదయన, వాసవదత్త కథ, దుష్యంత శకుంతల కథా శిల్పాలున్నాయి.

దుష్యంతల శకుంతల కథలో దుష్యంతరాజు, కణ్వమహర్షి ఆశ్రమానికెళ్లటం, అచట శకుంతలను చూచి ఆమెను ప్రేమించుట అనెడి కథ ఇచటి శిల్పాల్లో ఉన్నది. వివిధ ఘట్టాలు స్పష్టంగా రూపొందించి ఉన్నాయి. తొలి చిత్రంలో దుష్యంతరాజు, సైన్యంతో వచ్చుట ఉంది. రెండో చిత్రంలో ఈతడు వేటాడుతున్నాడు. భయం చెందుతున్న జింకలపై బాణం వదలుచున్నాడు. మూడో చిత్రంలో జింకల మంద నాయకుడు రాజు దృష్టి ఒక అందమైన స్త్రీపై పడునట్లు చేయటం జరిగింది. ఈ చిత్రాలన్నీ మహాభారతం ఆది పర్వంలోని దుష్యంత శకుంతలల కథకు దగ్గరగా ఉన్నాయి. ఇట్టి శృంగార గాథలు భారత సాహిత్యంలోను, శిల్పకళలోను మిక్కుటాలు. జైన గుహల్లో ఈ కథ శిల్ప రూపంలో ఉండుట బట్టి ఈ కథ ఆనాడు మంచి ప్రచారంలో ఉన్నట్లు తెలుస్తుంది.

పై అంతస్తులో 8 గదులున్నాయి. వీటి ద్వారాలపై 7 శిల్ప దృశ్యాలున్నాయి. ఒకటో దృశ్యంలో స్వర్గదేవతలు ఒక పద్మాల దండను తీసుకొని వెళ్లుతున్నారు. రెండో చిత్రంలో రెండు ఏనుగులు భయకంపితులైన ప్రజలను ముట్టడిస్తున్నవి. మూడో చిత్రంలో నాలుగు స్తంభాలు,

వాటిపై చిత్రాలు అగుపడును. వీటిలో ఒక దానిలో ఒక పురుషుడు ఒక స్త్రీని ఎత్తుకెళ్ళుతున్నట్లు చూపబడి ఉంది. ఆరో చిత్రంలో ముగ్గురు జంటలు ఆనందంగా తాగుచున్నారు. ఈ చిత్రం సాంచి లోని ఉత్తరకురు చిత్రాన్ని పోలి ఉంది. ఉత్తరకురు అనేది ఊహాతీతమైన ఆనంద నిలయం. ఇందు స్త్రీ, పురుషులు నిరంతర యవ్వనాన్ని కలిగి ఉంటారు. వారి కోర్కెలను కల్పవృక్షం తీరుస్తుంది. ఈ గుహపై అంతస్తులోని గదుల ద్వారాలపై గల కూడుల భాగాల్లో తేనెటీగలు, పద్మం, పలురకాల తీగలు, జంతువులను తరుముతున్న బాలుర చిత్రాలున్నాయి. బాలుర చిత్రం అజంతా చిత్రలేఖానాల్లోను, అమరావతి శిల్పంలోను ఉంది. ఒక కూడే మరొక కూడుల మధ్య గల విభాగాల్లో శకుంతల, దుష్యంతుల కథా శిల్పముంది.

### మూడో గుహ (ఛోటా హతీ గుంఫా)

ఈ గుహ ముఖ భాగంలోని కూడు కిరువైపులా మూడు వంతులు అద్భుత ఏనుగుల శిల్పాలున్నాయి. ద్వారానికిరువైపులా గల కుడ్య స్తంభాల పైన రెక్కల జంతువుల శిల్పాలున్నాయి.

### గణేశ గుంఫా శిల్పాలు

ఈ గుహ చారిత్రక శిల్పాలకు ప్రసిద్ధి గాంచింది. ఇందు కళింగ రాజైన ఖారవేలుడు యుద్ధ భూమి కెళ్లడానికి, అతడు యుద్ధభూమి నుంచి తిరిగి వచ్చుటను శిల్పంలో చూపబడి ఉంది. మొదటి చిత్రంలో కాల్బల సైనికుల గుంపు చూపిస్తుంది. సైనికులకు ముందు ముగ్గురు వ్యక్తులు ఏనుగుపై పయనిస్తున్నారు. వీరిలో మధ్య వ్యక్తి ఖారవేలుడై ఉండవచ్చు. ఈతడు ప్రముఖంగా చూపబడి ఉన్నాడు. మూడో వ్యక్తి ఒక స్త్రీ. ఈమె ఏనుగును నడుపుతున్నది. రెండో చిత్రంలో ఏనుగు కిందికి వంగు చుండగా దానిపైనున్న ముగ్గురు వ్యక్తులు కిందికి దిగుతున్నారు. మూడో చిత్రంలో ఈ ముగ్గురూ ముందు కెళ్ళుతున్నారు. ఇవన్నీ ఖారవేలుని గూర్చి తెలిపే చారిత్రక చిత్రాలుగా గుర్తించడం జరిగింది. ఈ గుహల్లోనే రాణి గుంఫా గుహలో చూపే చూపిన స్త్రీని ఎత్తుకెళ్లే శిల్పఖండముంది.

### ఖండగిరి గుహాశిల్పాలు

ఖండగిరిలోని మూడో గుహ తోరణం లోపల గజలక్ష్మి శిల్పముంది. ఇందు లక్ష్మీదేవి మధ్యలో ఉంది. ఈమె కిరువైపులా గల రెండు ఏనుగులు ఈమె పై తొండాలతో నీళ్ళను పోస్తున్నవి. తొలి గజలక్ష్మి శిల్పాల్లో ఇది ఒకటి. ఈ గుహలో జైన మత చిహ్నాలైన శ్రీవత్స, నందిపాద, స్వస్తికలు కూడా గలవు. అనంత గుంఫా గుహా ద్వారా పైన నాగతోరణముంది.

### జైన శిల్ప రీతి (Style)

1. జైన గుహాలయాల శిల్పాల్లో శిల్పి నైపుణ్యంలో ఏకరీతి కనపడదు. కాని శిల్ప రూపేణ బార్హుత్ శిల్పాల కన్నా పరిణితి రీతిని తెలుపుతున్నాయి. 2. రాణి గుంఫా పై అంతస్తులోని శిల్పాలు సాంచి తోరణాల శిల్పాల లాగ ఉన్నత రీతిలో ఉన్నాయి. 3.జైన

సహజత్వం ఉట్టిపడుతుంది. ఉదయగిరి, ఖండగిరి శిల్పి శిల్పంలోని ప్రాణుల మానసిక భావాలైన బాధ, సంతోషం, భయం, పట్టుదల, మానసిక ఒత్తిడి వంటివి కూడా సహజంగా చూపాడు. శిల్పాలను ఒకదానికొకటి సంబంధం ఉంది. శిల్పాలు గీతలు లాగ కాక మూడు ముఖాల లోతుగా రూపొందించబడి ఉన్నాయి. కానీ అన్ని శిల్పాల్లోను ఇదే పద్ధతి అనుసరించబడలేదు. కాబట్టి శిల్పాల్లో ఏకరీతి రూపణ లేదు. అనగా తక్కువ రీతికి చెందినట్టివి. శిల్పరీతిలో ఏకత్వం లేక ఒకే శిల్ప రీతి లేకుండటానికి కారణం పలు శిల్పులు వీటిని వారి వారి రీతిలో రూపొంది ఉండవచ్చు. పరిణితి శిల్పాలు మలి దశపై ఉండవచ్చు. ఈ రెండు దశల మధ్య కాలంలో శిల్పి తన నైపుణ్యాన్ని పెంచుకొని ఉండవచ్చు. ఈ గుహల శిల్పాలు ఆనాటి ప్రజల సాంఘిక జీవనాన్ని గూర్చి కూడా తెలుపుతున్నాయి. వాటిలో నాటి ప్రజల దుస్తులు, నగలు, శిరోజాలంకరణలు, గృహోపకరణాలు మొదలైనవి ముఖ్యమైనవి.

**దుస్తులు**

నాటి ప్రజలు పలుచటి ధోవతిని ముఖ్యంగా కట్టుకొనేవారు. స్త్రీలు ఈ ధోవతిపై నడుం భాగం నగ్నంగా ఉంది. పురుషులు తలపాగాలు ధరించే వారు. ధనవంతులు వీటికి విలువైన అభరణాలు ధరించే వారు. స్త్రీలు వలువలను తలపై (ముఖం కాదు) కప్పుకొనే వారు. స్త్రీల శిరోజాలు అనేక రకాల ముడుతలతోను, నగలతోను అలంకారంగా రూపొందించుకొనే వారు.

**నగలు**

స్త్రీలు దుస్తులు కన్నా నగలను ఎక్కువగా ధరించేవారు. చెవి ఆభరణాలు, నెక్‌లెస్‌లు, గాజులు, వడ్డాణాలు, కలి గజ్జెలు, తలాభరణాలు ధరించేవారు. చెవికి ముఖ్యంగా రింగులు, కమ్మలు ధరించేవారు.

**గృహోపకరణాలు**

గృహోపకరణాల్లో పక్కలు, పీటలు, మేజాలు మొదలైనవి వాడేవారు.

**ఆటపాటలు**

ఈ శిల్పాలు నాటి ప్రజల సంగీతం, నాట్యం, మొదలైన ఆటపాటల గూర్చి కూడా తెలుపుతున్నాయి.

భారతదేశంలో ప్రత్యేకమైన జైన వాస్తు రీతి రూపొందలేదు. వీరి నిర్మాణాలు బౌద్ధ నిర్మాణాలకు గాని, జైన నిర్మాణాలకు గాని పోలికలో లేవు. కాని ఇవి జైన మత అవసరాలను తీర్చెడి రీతిలో ఉన్నాయి. కడపటి జైన తీర్థంకరుడైన వర్ధమాన మహావీరుడు జైనమత స్థాపకుడుగా భావించట గలదు. జైన మతంలో మొత్తం 24 మంది తీర్థంకరులు లేక జినులు గలరు. వీరికి దైవత్వం ఆపాదించి జైన ఆలయాల్లో ప్రతిష్ఠింపబడి ఆరాధించబడ్డారు. బౌద్ధులు,

హైందవులు, కట్టడ ఆలయాలను నిర్మించగా జైనులు కూడా కట్టడ ఆలయాలను నిర్మించుకొన్నారు. కాని వీరి కట్టడాలు ఆయా ప్రాంతాల్లోని బౌద్ధ, హిందూ నిర్మాణ రీతులకు దగ్గరగా ఉన్నాయి.

జైనులు ఆలయాలు దాదాపు పూర్తిగా పర్వతాలపై నిర్మితమై ఉన్నాయి. వీరి పర్వత ఆలయాల సమూహాలనే "ఆలయ నగరాలు" అంటారు. వీరి ఆలయాలు చాల వరకు క్రీ.శ. 15వ శతాబ్దం తరవాత కాలానివి. అంతకు పూర్వం నిర్మింపబడినట్టివి దాదాపు లేవు. దీనికి అనేక కారణాలు గలవు. అవి (1) జైనులకు పాత ఆలయాలను కూల్చి వేసి వాటిపై నూతన కట్టడాలు చేసే ఆచారం ఉండుట వలన పాత ఆలయాలు అదృశ్యమైనవి. (2) జైనుల లోని సిద్ధాంతపరమైన విభేదాలు వీరి నిర్మాణాల నాశనానికి కారణమైనవి. (3) వెలుపలిశక్తులైన ముస్లింల దండయాత్ర, జైన ఆలయాలు అదృశ్యమవడానికి కారణం. జైనుల 'ఆలయ నగరాల' చుట్టూ ఎత్తైనా ప్రాకారం ఉంది. దీని లోపలి నిర్మానాలు వార్డులు లేక "టుక్"లు గా ఏర్పడి ఉన్నాయి. ప్రతి 'టుక్' చుట్టూ లావుపాటి గుండ్రటి కోట నిర్మాణం ఉంది. వీటికి గట్టి ద్వారాలున్నాయి. ఈ మొత్తం నిర్మాణాల చుట్టూ పచ్చటి వనాలున్నాయి. ఈ ఆలయ నగరాలనే తీర్థాలని కూడా పిలుస్తారు. ఈ నగరాల్లో నివాస గృహాలు గాని, మానవ నివాసం గాని ఉండదు. నిర్ణీత దినాల్లో మాత్రమే భక్తులు ఈ నగరాల ఆలయాలను సందర్శించే వారు. నగరాల్లో అన్ని వేళల్లో అన్ని దినాలలో జన సంచారం ఉండదు. ముఖ్యంగా రాత్రి పూట ఎవరూ ఉండరు. కొన్ని సందర్భాల్లో మాత్రం రక్షకభటుడు ఉంటాడు. వీటిలోని నిర్మాణాలు మధ్యయుగ వాస్తు రీతిలో ఉన్నాయి. ఏక గృహ నిర్మాణాలు, బహుగృహ నిర్మాణాలు, అంతస్తుల నిర్మాణాలు, స్తంభ వరండాలతో కూడిన నిర్మాణాలు ఈ నగరాల్లో గలవు. అంతేగాక "చౌముఖ్" అనే నాలుగు వైపులా ఒక్కొక్క ముఖం గల చతుర్ముఖ తీర్థంకర లేక తీర్థంకరుల శిల్పాన్ని గలిగి ఉన్న దేవ గృహాలు కూడా కొన్ని ప్రాంతాల్లో ఉన్నాయి. ఇట్టి ఆలయాలకు నాలుగు ద్వారాలు గలవు.

ఆలయ నగరాల్లో కథియవాడ్ జిల్లాలోని శత్రుంజయ, గిర్నార్ కొండలపై గలవి ముఖ్యమైనవి. వీటిలో శత్రుంజయ ఆలయ నగరం పెద్దది. ఇది ఫలిటనాకు దక్షిణాన గలదు. ఇచటి ఆలయాలు రెండు పర్వత భాగాలపై గలవు. ఇవి 250 గజాల దూరం గలవు. ఇవన్నీ 'S' ఆకారంలో కనపడతాయి. పలురకాలు పలు పరిమాణాలతో కూడిన ఆలయాలు ఇచట ఉన్నాయి. వీటిలో ఆదినాధుని చౌముఖ్ ఆలయం ఒకటి. ఇది 'కరలారవాసితుక్'లో ఉంది. ఇది పాత శిథిలం పై క్రీ.శ.1618లో నిర్మింపబడింది. ఈ ఆలయ గర్భగృహ 23 అ. చతురస్రంగా ఉన్నది. నాలుగు ద్వారాలున్నాయి. తూర్పుది హాలుతో కలుపబడి ఉంది. మిగిలిన మూడింటి ముందు వసారాలున్నాయి. ఇచటి 'విమలవాసి తుక్'లో ఉంది. ఇది పాత శిథిలం పై క్రీ.శ. 1618లో నిర్మింపబడింది. ఈ ఆలయ గర్భగృహ 23 అ. చతురస్రంగా ఉంది. నాలుగు ద్వారాలున్నాయి. తూర్పుది హాలుతో కలుపబడి ఉంది. మిగిలిన మూడింటి ముందు వసారాలున్నాయి(Porches). ఇచటి 'విమలవాసి తుక్'లో శ్రీ ఆదీశ్వరాలయం ఉంది. ఈ ఆలయం కూడా పాత శిథిలాలయం స్థానంలో నిర్మింపబడింది. ఇది క్రీ.శ. 1530

నాటిది. దీనికి ఒక గర్భగృహ ఉంది. ఆలయం ముందు స్తంభాల వసారా గలదు. దీనిపై అంతస్తు గలదు. ఆదాగార గూళ్లు గలవు. ఆలయ అధోరూపం ఉంది. ఆకర్షణీయంగా ఉంది.

జునాఘడ్ దగ్గరలోని గిర్నార్ పర్వతం పై గల ఆలయ నగరంలో శత్రుంజయలో ఉన్నన్ని దేవాలయాలు లేవు. ఇచటి వాటిలో నేమినాధ ఆలయం ముఖ్యమైంది. ఇది 13వ శతాబ్దంలో పునరుద్ధరించబడింది. తరవాత కూడా మార్పులు చేయడం జరిగింది. 190 అ. పొడవు, 130 అ. వెడల్పు గల ప్రాకారం మధ్య ఈ ఆలయం నిర్మింపబడి ఉంది. దీని చుట్టూ 70 ప్రాకార దేవతా గృహాలు గల స్తంభాల వసారా గలదు. ఆలయం పశ్చిమ భాగంలో ఉంది. ఆలయం 120 × 60 అడుగులు ఉంది. ఆలయం ముందుగల మండపం 43 అ. చతురస్రంగా ఉంది. విమాన భాగంలో ఉప విమానాలు గలవు. ఇది పశ్చిమ భారతదేశ ఆలయాల విమాన రీతి లాగ ఉంది. గిర్నార్ పర్వతంపై వాస్తుపాల, తేజపాలుర దేవాలయం గలదు. ఇది 13వ శతాబ్దంలో నిర్మించబడింది. ఒక పెద్ద హాలు యొక్క మూడు పక్కల్లో మూడు దేవగృహాలు, నాలుగవ ప్రక్క ప్రవేశమార్గం ఉండేట్లు ఈ ఆలయం నిర్మించడం జరిగింది. తూర్పు దేవగృహం ముఖ్యదేవగృహం. ఇందు మల్లినాధుడనెడి 19వ జైన తీర్థంకరుని ప్రతిమ ఉంది. మిగిలిన రెండింటిలో జైన చిహ్నాలున్నాయి. వీటిలో సమో(solid masonry) సుమేరు (squarebase) లేక మేరు పర్వతం గలవు. మధ్య ప్రక్క నిర్మాణాలపై శిఖరాలున్నాయి.

మధ్య భారతదేశంలో దాతిమ వద్ద గల సోనార్‌ఘర్ యందు, మధ్య ప్రావిన్సుల్లో దామొ జిల్లాలోని కుండల్‌పూర్‌యందు, బీరార్‌లోని గవాలగర్ వద్ద గల ముక్తగిరి యందు, బీహార్‌లోని పరాశనాథయందు కూడా జైన ఆలయ నగరాలు గలవు. అంతేగాక పశ్చిమ భారతదేశంలో కూడా ఇట్టి నగరాలున్నాయి. వీటిలో మార్వార్‌లోని సదరి దగ్గరిలోని రాణ్‌పూర్ యందు ఆదినాధ ఆలయం గలదు. దీని స్థవకుడు దేవకుడు. దీని నిర్మాణ ధరణక. ఇది క్రీ.శ. 1439 లో నిర్మితమైంది. ఇది 40,000 చదరపు అడుగుల ప్రాంతాన్ని ఆక్రమించి ఉంది. ఈ ఆలయంలో 29 మండపాలు, 420 స్తంభాలు గలవు. ఎత్తైన అధిష్ఠానంపై అతి పెద్దదిగా ఇది నిర్మింపబడి ఉంది. ఈ ఆలయంలో 66 దేవగృహాలున్నాయి. ప్రతి దేవగృహంపై ఉపశిఖరాలున్నాయి. వీటికన్నా పెద్దవి ఐదుగలవు. మధ్య గల శిఖరం అన్నింటి కన్నా ఎత్తుగా ఉంది.

జైన దేవాలయాలు దక్షిణ భారతదేశంలో కూడా గలవు. మైసూరుకు 40 మైళ్ల దూరం లోని శ్రావణ బెళ్గొల వీటిలో ముఖ్య కేంద్రం. ఇచట క్రీ.పూ. 309 భద్రబాహుడు, చంద్రగుప్త మౌర్యుడు నివసించి జైన సిద్ధాంతాల ప్రకారం తనువు చాలించినట్లు ఆధారాలు గలవు. కావుననే ఇచటి పర్వతానికి చంద్రగిరి అని పేరు. ఇచట 12 వ శతాబ్దం తరవాత నుంచి అనేక ఆలయాలు నిర్మించడం జరిగింది. ఇచట చంద్రగిరి, ఇంద్రబెట్ట అను పర్వత భాగాలున్నాయి. ఈ రెంటి మధ్య బెళ్గొళ అనే దీర్ఘ చతుస్ప్రాకార చెరువు కొలను ఉంది. చంద్రగిరి ఆలయాలను 'బస్తీలు' లేక 'బసదీలు' అంటారు. ఇవి మొత్తం 15 గలవు. ఇవి చంద్రగిరి పర్వతంపై

ఉన్నాయి. ఇవి 12వ శతాబ్దానివి. ద్రవిడరీతిలో ఉన్నాయి. ఇచటి ఆలయాల్లో చాముండరాయ బస్తీ పెద్దది, ఆకర్షణీయమైంది. ఇది క్రీ.శ. 1135 నాటిది. 70 అ.పొడవు 36 అ. వెడల్పుగా ఈ ఆలయం ఉంది. పిరమిడ్ ఆకార శిఖరం ఉంది. మిగిలిన ఆలయాలు కూడా ఇదే రీతిలో ఉన్నాయి. ఇంద్రబెట్ట చుట్టూగల ప్రాకారం లోపల భాగంలో 'బెట్ట' అనే జైన నిర్మాణం గలదు. ఇది నిజానికి ఆలయం కాదు. పెద్ద ప్రాంగణం చుట్టూ స్తంభాల వసారా గలిగి మధ్య జైన ప్రతిమను కలిగి ఉంది. ఈ ప్రతిమలు స్థానక రూపంలో ఉన్నాయి. ఇవి ఏకశిలా రూపాలు. పెద్ద పర్వత బండ భాగంలో రూపొందించడం జరిగింది. ఇట్టి ప్రతిమలు కెనరాలోని కర్కల ఏనూర్‌లలో గూడా కలవు. కర్కల శిల్పం 40 అ. ఎత్తు గలదు. ఏనూర్ శిల్పం 35 అ. ఎత్తున్నది. కర్కల శిల్పం క్రీ.శ. 1432 లోను ఏనూర్ శిల్పం క్రీ.శ. 1604 లోను రూపొందించడం జరిగింది. కాని ఇట్టి ఏకశిలా జైన ప్రతిమల్లో పెద్దది, తొలిది, అద్భుతమైనది ఇంద్రబెట్ట పర్వతంపై గలదు. ఈ ప్రతిమనే ప్రసిద్ధిగాంచిన గోమటేశ్వరుడు లేక గోమఠ అంటారు. గోమఠుడు జైన తీర్థంకరుల్లో మొదటి తీర్థంకరుని కుమారుడు. ఈ గోమటేశ్వర ప్రతిమ 56 అడుగు ఎత్తున్నది. ఇది గాంగరాజైన రెండో రాచమల్లుని కాలంలో ఒక పెద్ద పర్వత బండ భాగాన రూపొందిచడం జరిగింది. రాచమల్లుని మంత్రి చాముండరాయ కోరిక మేరకు క్రీ.శ. 983లో ఇది రూపొందించబడ్డట్లు తెలుస్తుంది. ఈ శిల్పం దిగంబరంగా ఉంది. ఇది శుద్ధ దిగంబర రీతిని తెలుపుతుంది. ఈజిప్టులోని Great Sphinx కన్నా 10 అడుగుల తక్కువ ఎత్తు మాత్రమే ఇది ఉంది.

జైనులు మాన స్తంభాలనెడి స్వేచ్ఛా స్థానక స్తంభాలను (free-standing pillars) కూడ నిర్మించారు. ఇవి 'బస్తీల' ముందు నిర్మించడం జరిగేది. ఉదాహరణకు శ్రావణ బెళ్గొళలోని పార్శ్వనాథ స్వామి ఆలయం ముందు ఒక మానస్తంభం గలదు. ఈ స్తంభాలు ఆకర్షణీయంగా సుమారు 50 అ. ఎత్తున్నాయి.

# 11

# హిందూ గుహాలయాలు

అత్యధికంగా ఇటుక, కలపలతో నిర్మితమవుతున్న నిర్మాణాలతో బాటు అశోకుని కాలమందు భారతదేశంలో మొట్టమొదట గుహాలయాలు శిలలందు రూపొందించుట ప్రారంభమైంది. అశోకుడు, అతని మనుమడైన దశరధుడు ప్రాంతీయమైన అతి కఠినశిల (quartzose-gneiss) యందు నిర్మించిన తొలి గుహాలయాలు గయ దగ్గరలోని బారాబర్, నాగార్జుని, సితామర్హి పర్వతములందు గలవు. వాటిలో సుదామ, లోమస్‌రిషి గుహాలయాలు ముఖ్యమైనవి. క్రీ.పూ. 200-క్రీ.శ.200 మధ్య కాలమందు పశ్చి దక్కన్ యందు పూనా, నాసిక్, అజంతా, ఔరంగాబాద్, ఎల్లోరా లందు మెతువు శిల యందు చైత్యగృహాలు, విహారాలువిర్వరచబడ్డాయి. ఉత్తర కోస్తా ఆంధ్రయందు, చైత్య గృహాలు, విహారాలు విర్వరచబడ్డాయి. ఉత్తర కోస్తా ఆంధ్రయందు, దక్షిణ ఒరిస్సా యందు ఖండగిరి, ఉదయగిరి, గుంటుపల్లి, శంకరం వంటి ప్రాంతాల్లో మెతువు శిల యందు ఇవి నిర్మించబడ్డాయి. గుంటుపల్లి గృహాలయాలు సుదామ, లోమస్‌రిషి గుహాలయాలను పోలి ఉన్నాయి. అజంతా యందలి గుహాలయాల్లో ఎనిమిదిన క్రీ.పూ. 2వ శతాబ్దం మధ్య భాగాన నిర్మింపబడినవి. మిగిలినవి 4వ శతాబ్దం తరవాత నిర్మించబడ్డాయి. ఇవి వాకాటక రాజుల కాలమందు క్రీ.శ. 450-650 మధ్య కాలాన నిర్మింపబడ్డాయి. ఈ నిర్మాణాలు రాష్ట్ర కూటుల కాల మందు ఎనిమిది, తొమ్మిది శతాబ్దాల వరకు కొనసాగాయి. ఎల్లోరా గుహాలయాలు క్రీ.శ. 4వ శతాబ్దం నుంచి క్రీ.శ. 7వ శతాబ్దం మధ్య కాలంలో నిర్మింపబడ్డాయి.

క్రీ.శ. మొదటి మిలినియం రెండో అర్ధభాగంలో హిందు, జైన బౌద్ధ శిలాగుహాలయాల నిర్మాణము వాతాపి (బాదామి) చాళుక్యులు, వేంగిచాళుక్యులు, పల్లవులు, పాండ్యులు దక్షిణ భారతదేశమందు రాజ్యాలను స్థాపించుటతో ప్రారంభమైంది. క్రీ.శ. 6వ శతాబ్దం మొదలు 9వ శతాబ్దం వరకు వీరి కాలాలందు జరిగిన నిర్మాణాలు ముఖ్యమైనవి. ఈ విధానం 10 వ శతాబ్దం వరకు కొనసాగింది. రాజకీయాలందే గాక వాస్తు, శిల్ప, సాహిత్య, పోషణలందు కూడా వీరు, ఇతర చిన్న రాజ వంశాల వారు పోటీ పడుతున్నారు. చాళుక్య రాజైన మంగళేశ, ఇతని సమకాలీకుడు పల్లవ రాజైన ఒకటో మహేంద్ర వర్మలతో గుహాలయాల నిర్మాణం దక్షిణ దేశంలో ప్రారంభమైంది. క్రీ.శ. 578లో బాదామిలో మొదట విష్ణు గుహాలయాన్ని మంగళేశ నిర్మించాడు. ఒకటో మహేంద్రవర్మ మండగపట్టు యందు త్రిమూర్తుల కొరకు తన మొదటి గుహాలయం నిర్మించాడు. మంగళేశ మౌర్యుల కాలము నుంచి వాడుకలో నున్న మెతువు రాళ్ళయిన ఇసుకరాయి (sand stone), సున్నపురాళ్ళలో (trop or lime -stone) గుహాలయ

నిర్మాణాలు చేయగా మహేంద్రవర్మ (క్రీ.శ. 580-630) కఠిన శిల లేక నల్ల రాళ్ళలో నిర్మించాడు. మహేంద్ర వర్మ అశోకుని తరవాత మొదట తన కాలమందు ఇటుక, కలప, లోహాలు లేని "లక్షితం" లేక దేవ గృహం త్రిమూర్తులకు నిర్మించినట్లు చెప్పుకొన్నాడు. కావున పల్లవులు కఠిన శిలలందు, చాళుక్యులు మెతువు శిలలందు గుహాలయాలు రూపొందించే రెండు విధానాలను దక్షిణ దేశమందు ప్రారంభించారని చెప్పవచ్చును. ఇట్టి శిలా సాంప్రదాయాలు విజయ నగర కాలం వరకు కొనసాగాయి.

పల్లవ రాజైన మొదటి మహేంద్రవర్మ (క్రీ.శ. 580-630) కాలానికి చెందిన గుహాలయాలు ముఖ్యంగా 10 కలవు. వానిలో లక్ష్మితయాతన (మందగప్పట్టు), పంచపాండవ గుహాలయం (పల్లవరం) మొదలగునవి కలవు. ఇతని కుమారుడు మొదటి నరసింహవర్మ మామల్ల (క్రీ.శ. 630-72), ఒకటో పరమేశ్వర వర్మ (672-728) ఇతని నిర్మాణ రీతిని కొనసాగించిన ఒరగడం మండప (తిరుక్కల్ కున్రం) కోటికల్ మండప (మహాబలిపురం) మొదలగు వాటిని నిర్మించారు. మహేంద్రవర్మ కుమారుడైన మొదటి నరసింహవర్మ మామల్ల (630-668) మహేంద్ర రీతిలోని గుహాలయాతే గాక నూతనంగా తన మామల్ల రీతిలోని పరిణతి దశను తెలిపెడి గుహాలయాలను ఏకశిలారథాలను రూపొందించాడు. ఇవి చాలా వరకు మహాబలిపురమందు గలవు. తూర్పు చాళుక్యులు కూడా మెతువు శిలయందు కృష్ణకు ఇరువైపులా సుమారు 12 గుహాలయాలను నిర్మించారు. ఇవి ఉండవల్లి, మొగల్ రాజపురం, విజయవాడ, పెనమాగ, సీతారామపురం లందు గలవు. ఇవి క్రీ.శ. 7-8 శతాబ్దాలకు చెందినవి.

ఆంధ్రదేశంలో శిలా పర్వతాలను తొలిచి గుహాలయాలను ఏర్పరచడం మౌర్యుల కాలం తుది నుంచి ఆరంభమైంది. పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరునకు 25 మైళ్ల దూరం లో ఉనాన 'గుంటుపల్లి'లోని కొండను తొలిచి నిర్మించిన చైత్య గృహాలను, విహారాలను పరిశీలించినచో ఇవి మౌర్య కాలం తరవాతివని తెలుస్తున్నవి. మౌర్య వంశానంతరం ధన్యకటక, ప్రతిష్ఠానపురాలు ముఖ్య పట్టణాలుగా కలుస్తు సముద్రతీర ఆంధ్రదేశాన్ని పరిపాలించిన శాతవాహనులు వైదిక మతాన్ని అనుసరించినా ఆనాటి బౌద్ధులకు విహారాలు, చైత్య గృహాలు నిర్మించి దానం చేశారు.

విజయవాడకు తూర్పున గల మొగల్ రాజపురం కృష్ణకు దక్షిణతీరంలో గల ఉండవల్లి గుహాలను బట్టి ఈ గుహల నిర్మాణం ప్రోత్సహించిన వారు శాతవాహనులని అనవచ్చు. తరవాత వచ్చిన ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు, శాలంకాయనులు వీటిని ప్రోత్సహించారు. ఇక్ష్వాకుల తుది దశయందు పల్లవులు తాత్కాలికంగా నెల్లూరు ఉత్తరానికి వ్యాపించి కొంతకాలం ధాన్యకటకం పాలించారు.

పల్లవ రాజగు మహేంద్రవర్మ ధాన్యకటక మందు రాజప్రతినిధిగా ఉండగా ఇట్టి గుహాలయ నిర్మాణాలను గూర్చి తెలుసుకొని కలప, ఇటుక, లోహ నిర్మితాల కంటే శాశ్వతమైన వీటి నిర్మాణాలను ఆంధ్రదేశమందు ప్రోత్సహించాడు. కొంతకాలానికి పల్లవులను జయించి దక్షిణదేశానికి పారదోలి నందున పెన్న వరకు వెనకకు వచ్చి, పెన్న దక్షిణ ప్రాంతాలను

ఆక్రమించారు. అట్టి ఆక్రమణ కాలాన నిర్మించిన పర్వతగుహాలయాలకు భైరవ కొండలోని శిల్పాలే తార్కాణమని ప్రొ.ఆర్. సుబ్రమణ్యంగారి అభిప్రాయం. కాని ఇచ్చటి గుహాలయాలు క్రీ.శ. 8వ శతాబ్దానికి చెందినవిగా కొందరు శాస్త్రవేత్తలు భావించటం వల్ల, మహేంద్రవర్మ క్రీ.శ.7వ శతాబ్దం వాడు గనుక ఇవి మహేంద్ర వర్మచే నిర్మింపబడిన వనేది డా. సుబ్రమణ్యంగారి అభిప్రాయం, భేదాభిప్రాయానికి తావిస్తున్నది.

## 1. దక్కన్ – మధ్యభారత గుహాలయాలు

### 1. ఉదయగిరి గుహలు

ఉదయగిరిలో 20 హిందూ గుహాలయాలున్నాయి. వీటిఒల 10 దీర్ఘచతురస్రాకార కోష్టాలలాగ ఉన్నాయి. వీటిలో కొన్నింటిలో శిల్పాలున్నాయి. ఇందలి శిల్పాలు లోతుగా తొలిచి రూపొందింపబడి ఉన్నాయి. వీటిలో వరాహ, అనంత శాయి వంటి శిల్పాలు ముఖ్యమైనవి. మిగిలిన గుహాలయాలు గర్భగృహ, స్తంభమండపాలను కలిగి ఉన్నాయి. గర్భగృహ ద్వారాల కిరువైపులా ద్వారపాలురున్నారు. గర్భగృహ వెనుకగోడలో భాగంలో దేవతా శిల్పాలున్నాయి.

### బాదామి గుహలు

బాదామి తొలి చాళుక్యుల రాజధాని. ఇచట వీరి గుహాలయాలు, కట్టడ ఆలయాలు రెండూ గలవు. గుహాలయాలు 3 గలవు. ఇవి ఇసుక రాయి కొండలో తవ్వకం చేసినవి ఉన్నాయి. 3వ గుహ తొలిదశకు చెందినది. ఇది విష్ణు గుహాలయం. దీనిని చాళుక్యరాజు మంగళేశుడు క్రీ.శ. 578 లో రూపొందింపచేశాడు. రెండే గుహ కూడా దీని లాగ ఉంది. ఇది కూడా విష్ణు గుహాలయం. ఒకటో గుహ మధ్యమ పరిమాణానికి చెందింది. ఇది శివగృహం.

### బాదామి గుహల ముఖ్యాంశాలు

బాదామి గుహలు దీర్ఘచతురస్రాకార స్తంభ వరండాని, స్తంభ మండపాన్ని (హాలు), హాలు వెనుక గోడ భాగంలో గర్భగృహంతో ఉన్నాయి. స్తంభాలు పైన, కింది భాగాల్లో లావుపాటి ఘన చతురస్రాకారంలో ఉన్నాయి. ఈ ఘన చతురస్ర భాగాల మధ్య (flooted) నిలువు పటీలు లేక ఫలకల విభాగం ఉంది. స్తంభాలకు తరంగ ఉంది. 3వ గుహ వరండా స్తంభాలకు (figure brackets) మదనిక గలవు. వరండా పక్క కుడ్యాలపైన, స్తంభాల పైన గల దూలాల పైన, పై కప్పు భాగంలోను శిల్పాలున్నాయి. స్తంభాలకు తరంగ పట్టా (corbel) గలదు.

### ఒకటో గుహాలయం

ఒకటో గుహాలయానికి వరండా, మండప, గర్భగృహాలున్నాయి. వరండా ప్రక్క గోడలపై హరిహర, అర్థనారీశ్వర, 18 చేతుల మహిషమర్ధనీ శిల్పాలున్నాయి. దూలాలపై అనేక వరసల్లో కోష్ట డిజైన్లున్నాయి. వీటిపై వ్యాళ ముఖాలున్నాయి. పై కప్పులో భాగంలో నటరాజ శిల్పముంది. ఈతనికి సర్ప శరీరముంది, మానవ శిరస్సున్నది. గరుడుని పైనున్న విష్ణుశిల్పం కూడా ఇచటే గలదు.

### రెండో గుహ

దీనికి ఒక స్తంభ వరండా ఒక మండపం (హాలు), హాలు వెనుక గోడలో గర్భగృహాలున్నాయి. హాలులో 4 స్తంభాల వరసలు రెండున్నాయి. వరండాలో 4 స్తంభాల వరసున్నది. వరాహ, త్రివిక్రమ ద్వారపాలుర శిల్పాలు ఈ గుహలో ఉన్నాయి.

### మూడో గుహాలయం

పై రెండింటి కన్నా ఇది ఎక్కువ పరిమాణంలో ఉంది. ఇందులో కూడా వరండా, స్తంభ మండప (హాలు), గర్భ గృహాలు ఉన్నాయి. దీని హాలులో 4 స్తంభాల వరసలు మూడున్నాయి. గుహ కుడ్యాలపై విరాట పురుష త్రివిక్రమ, స్థానక విష్ణు, హరిహర, వరాహ నరసింహ శిల్పాలున్నాయి. వరండా కొసభాగంలోని స్తంభాలకు స్తంభపాదం చూరులను కలిపే రీతి శిల్పాలు (figure brackets) ఉన్నాయి. వీటిలో అందమైన జంటలలు పాదలు కింద నిలుచొని ఉన్న శిల్పాలు ముఖ్యమైనవి. బాదామి గుహాలయంలోని దేవదేవీల శిల్పాలు బరువైన శరీరాలతో పెద్దవిగా గుండ్రంగా (in high relief) రూపొందించబడి ఉన్నాయి.

## 3. ఎల్లోరా రాష్ట్రకూట గుహాలయాలు

### 14వ గుహాలయం (రావణఖై)

దీనికి ఒకే మండపముంది. ఇందే గర్భగృహ, దాని చుట్టూ ప్రదక్షిణా పథ ఉన్నాయి. మండపం 87 అ. పొడవు, 52 అ. వెడల్పుంది. దీనిలో మూడింట రెండు వంతుల స్థంభాల హాలు, మూడింట ఒక భాగం గర్భగృహ, దాని చుట్టూ గల ప్రదక్షిణా పథ గలవు. హాలులో 12 స్తంభాలున్నవి. స్తంభాలకు పూర్ణకుంభ శీర్షిక (capital) గలదు. గర్భగృహలో దుర్గ ప్రతిమ ఉంది. ఉత్తర కుడ్యం పై అనేక వైష్ణవ శిల్పాలున్నాయి. దక్షిణ కుడ్యంపై శైవ శిల్పాలున్నాయి. ఇవన్నియు లోతుగా గుండ్రంగా రూపొందింపబడ్డాయి. దక్షిణ కుడ్యంపై మహిషమర్ధని, శివపార్వతులు దాయాలాడుచు, పార్వతీ సమేతుడైన నటరాజు భృంగితో ఉండుట, కైలాసాన్ని కదలించుచున్న రావణుడు, భైరవుడు, యముడు, కలి, సప్తమాతృకలు ఉన్నారు. ఉత్తర కుడ్యంపై దుర్గ, గజలక్ష్మి, వరాహ, శ్రీదేవి, భూదేవిల సమేతుడైన విష్ణు, లక్ష్మీ సమేతుడైన విష్ణు ఉన్నారు.

### 15వ గుహాలయం (దశావతార గుహాలయం)

దీనికి ఏకశిలా ప్రవేశ మార్గముంది. ఈ మార్గం ద్వారా ప్రాంగణంలోనికి వెళ్ళవచ్చు. కాని ప్రాంగణం పద్ధతిగా రూపొందింపబడలేదు. ప్రాంగణంలో 4 స్తంభాల నంది మండపముంది. దీని వెనుక రెండు అంతస్తుల గుహాలయముంది. కింది అంతస్తు 97 అ. పొడవు, 50 అ. వెడల్పుంది. దీనికి ఒక మండప (హాలు) ముంది. ఇందు 14 ఘన చతురస్రాకార స్తంభాలున్నాయి. హాలు వెనుక భాగంలో గర్భగృహంలో శివలింగముంది. పై అంతస్తు 109 అ. పొడవు, 99 అ. వెడల్పుంది. దీని మండపం (హాలు) లో 54 ఘన చతురస్రాక స్తంభాలున్నాయి. ఈ గుహల్లో ఒక వైపు ..ష్ణవ శిల్పాలు, మరొక వైపు శైవ శిల్పాలున్నాయి.

ఇవి (high relief) గుండ్రంగా చెక్కబడి ఉన్నాయి.

**16వ గుహ (కైలాస ఆలయం)**

ఇది సంపూర్ణ కట్టడ ఆలయం లాగ ఏకశిలా ఖండంలో నిర్మింపబడి ఉంది. దీనిలో గోపుర ద్వారం, నంది మండప, ముఖమండప, అంతరాళ, గర్భగృహ, ప్రదక్షిణాపథ, ప్రదక్షిణాపథలో పరివార దేవతా గృహాలు ఆలయం చుట్టూ ప్రాంగణం, ఆలయం చుట్టూ స్తంభాల వసారా ఉన్నాయి. ఈ ఆలయానికి 25 అ. ఎత్తైన అధిష్ఠానముంది. అధిష్ఠానం పై పెద్ద ఏనుగుల శిల్పాలున్నాయి. ఇవి ఆలయాన్నంతటిని మోస్తున్నట్లు రూపొందింపబడి ఉన్నాయి. గర్భగృహ, అంతరాళాల కుడ్యాలపై కుడ్యస్తంభాలున్నాయి. వీటికి తరంగ పట్ట కార్బెల్స్ (corbels) గలవు. పల్లవ కార్బెల్స్‌ను ఇవి జ్ఞప్తికి తెస్తాయి. కుడ్యాలపై దేవతా శిల్పాలుగల దేవకోష్ఠాలు కూడా గలవు. కోష్ఠాలపై తోరణాలున్నాయి. తోరణాల్లో మకరం బదులు నడుంపై భాగం వరకు మగరూపాన్ని నడుం కింది శరీర భాగం నెమలిపింఛరూపం లాగ ఉన్న మానవ శిల్పాలున్నాయి. విమాన భాగంలో కూట, పంజర, శాల, హారముల వరస ఉన్నాయి. శిఖరం ఆరు ముఖాలుగా ఉన్నది. ఇది ద్రావిడ రీతిని తెలియజేస్తుంది. స్తంభాల వసారా కుడ్యాలపై అనేక శిల్పాలున్నాయి. వీటిలో గజలక్ష్మి, కైలాస పర్వతాన్ని పెకలిస్తున్న రావణుడు, గంగాదేవి శిల్పాలు ముఖ్యమైనవి.

**21వ గుహాలయం (రామేశ్వర గుహాలయం)**

దీనిలో పెద్ద ప్రాంగణం, అందు మధ్యలో నంది మండపం ఉన్నాయి. గుహాలయానికి స్తంభ వరండా, స్తంభ మండప (హాలు), గర్భగృహ, దీని చుట్టూ ప్రదక్షిణా పథ ఉన్నాయి. వరండాలోని స్తంభాలు మొత్తం 4 ఉన్నవి. పొట్టిగా, లావుగా ఉన్నాయి. వీటిపై భాగంలో పూర్ణకుంభ రూపమున్నది. అందమైన స్త్రీల శిల్పాలున్నాయి. గుహాముఖ భాగంలో అద్భుతమైన గంగా శిల్పముంది. ఈ గుహ హాలు (మండపము) 69 అ. పొడవు, 29 అ. వెడల్పుంది. గర్భగృహంలో శివలింగముంది. మండప కుడ్యాలపై మహిష మర్దని, దాయాలాడుచున్న శివపార్వతులు, నంది, గణాలు, నటరాజు, విష్ణు, ఆసనలక్ష్మి, గణేశ, శివులతో ఉన్న సప్తమాతృకల శిల్పాలున్నాయి.

**29వ గుహాలయం: (ధుమార లీవ గుంఫ)**

ఇది పెద్ద హాలు లాగ ఉంది. దీనికి మూడు వైపులా ప్రవేశ మార్గాలున్నాయి. ఈ మార్గాల ముందు భాగంలో వరండాలున్నాయి. హాలు మధ్య భాగంలో చతురస్రాకార గర్భగృహ ఉంది. దీనికి నాల్గు వైపులా ప్రవేశమార్గాలున్నాయి. ఈ మార్గాల ముందు భాగంలో వరండాలున్నాయి. హాలు మధ్య భాగంలో చతురస్రాకార గర్భగృహ ఉంది. దీనికి నాల్గువైపులా ప్రవేశ మార్గాలున్నాయి. దీని చుట్టూ ప్రదక్షిణా పథ లాగా హాలు నాల్గువైపులా గల భాగాలు ఉపయోగపడుచున్నాయి. గర్భగృహ ప్రవేశమార్గాల కిరువైపులా పెద్ద పెద్ద సతీసమేతులైన ద్వార పాలుర శిల్పాలున్నాయి. పద్మపాణి, వజ్రపాణి ఇచటి ద్వారపాలురు. గర్భ గృహ మధ్య శివలింగముంది. హాలు కుడ్యాలపై అంధకాసుర సంహారమూర్తి, రావణానుగ్రహ మూర్తి, ఇద్దరు

నాగులు కాడను పట్టుకొని ఉన్న రెండురెక్కల తామర పుష్పంపై కూర్చొని ఉన్న శివుడు అనగా లకులీశుడు దాయాలాడుచున్న శివపార్వతులు, శివపార్వతుల కళ్యాణం, వెలుపలి గోడలపై ఉన్న గంగా యమునల శిల్పాలు ముఖ్యమైనవి.

**4. ఎలిఫెంటా గుహాలయాలు**

ఎలిఫెంటా బొంబాయి వద్ద గల ఒక దీవి ప్రాంతం. ఇచటి గుహాలు శిల్పాలకు ప్రసిద్ధి. ముఖ్యంగా మహేశ శిల్పం ప్రసిద్ధి గాంచింది. ఇచటి గుహ కొండశిల పొడుగునా తొలచబడి ఉంది. దీనికి పెద్ద స్తంభాల మండపముంది.

**గణేశగుంఫా**

దీనికి 30 అ. పొడవు, 6 అ. వెడల్పు స్తంభ వరండా ఉంది. ఇందు అనేక శిల్పాలున్నాయి. అవి: మూడు శిరస్సుల మహేశుడు, అర్ధనారీశ్వర, ద్వారపాలురు, శివపార్వతుల కళ్యాణం, భైరవుడు, నటరాజు, కైలాస పర్వతాన్ని పెకలించు రావణుడు, దేవతల పూల వర్షంలో ఉన్న శివపార్వతుల శిల్పాలు ముఖ్యమైనవి. మూడు శిరస్సుల శివుని శిరస్సు తత్పురుష, వామదేవ, అఘోర రూపాలను తెలుపుతున్నాయి. ఈ మూడు రూపాలు సృష్టి, జీవనం (sustenance) నాశనాలను తెలుపుతున్నాయి.

**5. జోగేశ్వరి గుహాలయం**

సాల్సెటీ దీవిలోని ఒక ప్రాంతం పేరు జోగేశ్వరి. ఇది ఎలిఫెంటా గుహాలయం వలెనే ఉంది. దీని హాలు ఎల్లోరాలోని ధుమార్లేను హాలును పోలి ఉన్నది. దీనికి కూడా మూడు ప్రవేశాలున్నాయి. హాలులో 20 స్తంభాలున్నాయి. ఇచటి శిల్పాలన్నీ శిథిలమై ఉన్నాయి. ఇవన్నీ క్రీ.శ. 8వ శతాబ్దానికి చెందినట్టివి.

## II ఆంధ్ర గుహాలయాలు

**విజయవాడ అక్కన్న, మాదన్న గుహాలయం**

విజయవాడ వద్ద గల ఇంద్రకీల పర్వతపు తూర్పు, పశ్చిమ వాలు భాగాల్లో గల గుహాలయాల్లో తూర్పు భాగాన గల అక్కన్న మాదన్న మండపమనెడి రెండే గుహాలయం ముఖ్యమైనది. ఇది పెద్దది, అందమైనది. ఇది ముందు భాగాన ఒక స్తంభ వరండా తో దాని వెనుక భాగంలో మూడు దేవ గృహాలతో ఉంది. శిల్ప రూపాలు మొదలైనవేవియు లేకుండా ఉంది. స్తంభాలను అష్టకోణాకార విభాగం ఉంది. ఈ స్తంభాలు పల్లవేతర వాస్తు రీతిని తెలుపుతున్నాయి. కాని గ్రౌండ్‌ప్లాను పల్లవ రీతిలో ఉంది. ఈ గుహ ప్రాంతీయ పోషణతో ఏర్పరచబడిందని భావించటం కూడా గలదు. ఇచటి క్లుప్త శాసనంలోని "ఉత్పత్తి పిడుగు" అనెడి బిరుదు బట్టి ఇది క్రీ.శ. 7వ శతాబ్దానికి చెందినదిగా తెలుసుకొనడానికి ఉపయోగపడుతుంది.

## 2. మొగలు రాజపురం గుహాలయాలు

మొగల్‌రాజపురం గుహాలయాలు విజయవాడకు తూర్పున మూడు మైళ్ల దూరంలో ఉత్తర దక్షిణాలుగా ఉన్న కొండల్లో గలవు. మొగల్ రాజపురం గ్రామంనకు ఆగ్నేయంలో గల పర్వతం ఒకటో గుహాలయం, పర్వత దక్షిణ భాగాన రెండో, మూడో గుహాలయాలు, అచటనే (దుర్గ దేవాలయంనకు పశ్చిమాన) రెండు ఫర్లాంగుల్లో గల మరొక పర్వత ఉత్తరభాగాన నాల్గో గుహాలయం, దీనికి వాయవ్యాన గల మరో కొండపై ఐదో గుహాలయం గలవు.

ఒకటో గుహాలయానికి మూడు దేవ గృహాలు ఉన్నాయి. వీటి ముందు అన్నింటికి కలిసి ఒక వరండా ఉంది. ఇది ముఖ భాగంలో రెండు స్తంభాలతో మండపం ఎడమ కుడి కొసల్లో రెండు అర్థ స్తంభాలతో ఉంది.

రెండో గుహాలయం సుమారు 7 అ. 6 అం. చతురస్రం గల ఒకే దేవగృహాన్ని గలిగి దాని ముందు దేవ గృహానికన్నా రెండింతలు గల దీర్ఘచతురస్రాకార వరంగా కలిగి ఉంది. దీని ముఖ భాగానికి ఆధారంగా రెండు సాధారణ స్తంభాలు, వరండాకు ఎడమ కొసల్లో రెండు స్తంభాలు ఉన్నాయి.

మూడో గుహాలయం చాలావరకు రెండో గుహాలయం లాగ ఉంది. కాని దేవగృహం చిన్నదిగా ఉన్నది. సుమారు 6 చ.అ. ఉంది. దీని ముందుగల మండపం సుమారు 12 అ. 9 అం. చతురస్రాకారం ఉంది. కానీ దీని ముఖభాగం కపోత (కార్నిస్)ను, అందు చైత్య కూడులను మూడింటిని కలిగి ఉండుటే గాక దీని వెనుకగా పై అంతస్తు గుహాలయ అంతర పట్టికలును, సాదా లూపములను కలిగి ఉంది. ఈ గుహ స్తంభాలు ఘన చతురస్రాకార, అష్టాగనల్ సెక్షన్ విభాగాలను కలిగి ఉంది. ఇచటి దేవగృహాలో వెనుక కుడ్యముఖ భాగాన మొరటుగా రూపొందివ దుర్గ ప్రతిమ ఉంది.

# 12

# హిందూ కట్టడ దేవాలయాల ప్రాచీనత – వర్గీకరణ

భారతదేశమందు దేవాలయాల నిర్మాణము ప్రతిమారూపంలో దేవుని పూజించే విధానంతో ప్రారంభమైంది. అతి ప్రాచీనకాలంలో ప్రకృతి ఆరాధన ఉండేది. కొంతకాలానికి ఆ ప్రకృతి శక్తులను చిహ్నరూపంలో ఆరాధించటం ప్రారంభమైంది. ఈ చిహ్నరూపాల స్థానంలో మరికొంత కాలంకు ప్రకృతి దేవతలను ప్రతిమారూపంలో మానవాకారంలో ఆరాధించటం ప్రారంభమయ్యింది. ఇటువంటి దేవతా ప్రతిమలు మొదటి దశలో జమ్మి, రావి, విప్పవృక్షాల కింద ప్రతిష్ఠించబడి పూజింపబడేవి. మానవునిలాగ దేవునికి కూడ ప్రశాంతమైన నివాసం అవసరమని భావించుటే ఇట్టి ఆచారానికి కారణం. కొంతకాలానికి ఈ దేవతా ప్రతిమలున్న ప్రాంతంచుట్టూ కంచె వంటిది ఏర్పాటుచేసే వారు. ఇదే కాలమందు సర్పాలు, చెట్లు, పుట్టలు మొదలైన ప్రకృతి శక్తులను కూడా మానవుడు పూజించేవాడు. దేవతలకు ఒక హర్మ్యం (గృహం) నిర్మించాలని తరవాత తలంచాడు. అందువల్ల మూడువైపుల ఎత్తైన బండలను నిల్పి వాటిపై మరో పలుచటి బండను పరచి ఒక చిన్న దేవ గృహంలాగ ఏర్పచే వారు. కొన్ని సందర్భాల్లో ఇట్టి గృహాల చుట్టూ ప్రాకారం నిర్మించే విధానం ఉండేది. అటు తరవాత మరికొంత కాలమునకు గుహాలయాలు దేవతలకు నిర్మించెడి విధానమేర్పడినది. ఇది పెద్ద పర్వత ప్రాంతాల్లోని శిలలయందు తప్ప పల్లపు ప్రాంతాల్లో ఏర్పరుచుటకు వీలులేకున్నది. దీని వలన కట్టడ దేవాలయాల నిర్మాణం ప్రారంభమయింది.

ఇంతవరకు మనకు లభించిన ఆధారాలబట్టి దేవాలయాలనిర్మాణం గుప్తకాలానికి ముందే ప్రారంభమైనట్లు తెలియుచున్నది. కాని గుప్తులకుముందు నిర్మించబడ్డ దేవాలయాలు సరిగా లభించుటలేదు. గుప్తకాలంనుంచియే దేవాలయాలు పరిపూర్ణదశలో మనకు లభించుచున్నాయి. ఇట్టి పరిణతి దశకు చెందిన దేవాలయాలు మనకు లభించుటబట్టి గుప్తులకు ముందే దేవాలయాల నిర్మాణం లేకుండినచో ఇంతటి పరిపూర్ణమైన నిర్మాణాలు వెలసి ఉండటానికి అవకాశంలేదు. తమకు పూర్వముండిన గుహాలయాలు దేవాలయాలను మార్గదర్శకంగా తీసుకొని గుప్తులు తమ దేవాలయ నిర్మాణాలను ప్రారంభించినట్టు తెలుస్తున్నది. కొంతమంది వాస్తు శాస్త్రజ్ఞులు దేవాలయాలు బౌద్ధ స్థూపాలను మార్గదర్శకంగా తీసుకొని నిర్మించారని భావించారు. మరికొందరు

హైందవ మతమందలి యజ్ఞవేదికలను మూలంగా ఉంచుకొని నిర్మించినట్లు అభిప్రాయపడ్డారు. దేశమందు ఎచట మొదటి దేవాలయాలు నిర్మింపబడినవో, ఏది దీని నిర్మాణానికి మార్గదర్శకమో దృఢంగా చెప్పడం కష్టం.

ప్రాచీనకాలమందు మనదేశమందలి దేవాలయాలను హర్మ్యం, ప్రాసాదం, మందిరం, దేవయానం, విమానం, దేవాలయం అని పలు పేర్లతో పిలిచేవారు. ఈ పేర్ల అర్థం ప్రాచీన కాలమందు ఒకటేఅయినా కాలక్రమాన ఇందలి కొన్ని పేర్లు ఇతర అర్థాలలో వాడేవారు. కడకు దేవాలయం అనే పదం స్థిరంగా నిలచింది.

## దేవాలయ వర్గీకరణ

మన దేశమందలి దేవాలయాలను వాస్తు శిల్ప శాస్త్రజ్ఞులు రెండు విధాలుగా వర్గీకరించారు. అవి భౌగోళికపరమైన విభాగం, నిర్మాణరీతి విభాగం. వాస్తు శిల్ప శాస్త్రములైన ఐశాన గురుదేవ పద్ధతి, తంత్రసముచ్చయ, శిల్పరత్న, కామికాగమ, సుప్ర భేదాగమలనెడి గ్రంథాలు కూడా భౌగోళికపరమైన దేవాలయ వర్గీకరణం తెలుపుచున్నాయి. ఈ గ్రంథాల ప్రకారం దేశమందలి ఒక్కొక్క ప్రాంతంలోగల దేవాలయాలకు ఒకొక్క పేరుగలదని తెలుస్తుంది. హిమాలయాలకు దక్షిణంగా వింధ్య పర్వతములకు ఉత్తరాన ఉన్న దేవాలయాలు 'నాగర' దేవాలయాలని ఈ గ్రంథములు తెలుపుతున్నాయి. వింధ్య పర్వతాలకు దక్షిణాన, కృష్ణానదికి ఉత్తరాన ఉన్న దేవాలయములను 'వేసర' దేవాలయాలంటారు. కృష్ణానదికి దక్షిణాన ఉన్న వాటిని 'ద్రవిడ' లేక 'ద్రావిడ' దేవాలయాలంటారు. ఈ విధంగా దేశమందలి దేవాలయాలను భౌగోళిక పరంగా, ప్రాంతపరంగా, నాగర, వేసర, ద్రావిడదేవాలయాలని వర్గీకరింపవచ్చు.

రెండో వర్గీకరణం ప్రకారం దేశమందలి ఆయాదేవాలయాల నిర్మాణ విధానాన్నిబట్టి నిర్ణయింపవచ్చు. ఒక దేవాలయం మూలంనుంచి (కింది విభాగం నుంచి) స్తూపి (పైవిభాగము) వరకు చతుర్ముఖము లేక చతుర్వకారంలో ఉన్నచో అట్టివాటిని నాగరరీతికి చెందిన దేవాలయాలంటారు. కొన్ని సందర్భాలందు దేవాలయాల పైభాగాన శిఖరం చతురస్రాకారంలో ఉంటుంది. అట్టి వాటిని కూడా నాగర దేవాలయాలనటం శాస్త్ర సమ్మతం. ఆయతాస్ర లేక గజపృష్ఠ ఆకారంలోగల ఆలయం లేక శిఖరం అట్టి దేవాలయాలను వేసర రీతి దేవాలయాలంటారు. శిఖరం అష్టముఖంగా ఉంటే అట్టి వాటిని ద్రావిడ తెగ దేవాలయాలంటారు. కాని ఇట్టి వర్గీకరణం అన్ని శాస్త్రాలందు ఒకే విధంగా చెప్పబడలేదు. కొన్ని గ్రంథాలందు దేవాలయమంతయు చతుర్ముఖంగా నిర్మింపబడి ఉంటే నాగర దేవాలయమని, మరికొన్ని గ్రంథాలందు చతుర్ముఖ శిఖరం ఉంటే కూడా అవి నాగర దేవాలయాలని చెప్పబడి ఉంది. అంతేగాక విష్ణుప్రతిమ గర్భ గృహమందున్నచో అట్టి దేవాలయాలు కూడా నాగర దేవాలయాలని కొన్ని వాస్తు శాస్త్రాలందు చెప్పబడి ఉంది. కాని వాస్తుశాస్త్ర గ్రంథాలు అధిక సంఖ్యలో పై మూడు వర్గీకణాలనే ఎక్కువగా తెలుపుచున్నాయి.

ఫెర్గూసన్ అను పురావస్తు శాస్త్రజ్ఞుడు భారతదేశంలోని దేవాలయాలను ఇండో - ఆర్యన్,

చాళుక్యన్, ద్రవిడియన్ అను తెగలుగా వర్గీకరించాడు. ఈ అభిప్రాయానే పెర్సీబ్రౌన్, కజిన్స్ అను వాస్తు శాస్త్రజ్ఞులు కూడా వెలిబుచ్చారు. వారి అభిప్రాయంలో ఇండో ఆర్యన్ దేవాలయాలనగా ఉత్తర భారతదేశ దేవాలయాలని అర్థం. చాళుక్యన్ దేవాలయాలనగా చాళుక్యుల దేవాలయాలు. దక్షిణ భారత దేశంలోని దేవాలయాలను ఇతడు ద్రవిడియన్ దేవాలయాలని పిలిచాడు. ఇతని ఉద్దేశం ప్రకారం ఇండో ఆర్యన్ నాగరజాతికి, చాళుక్యన్ వేసర జాతికి, ద్రవిడియన్ ద్రావిడ జాతికి చెందిన దేవాలయాలు. ఇతని వర్గీకరణంలో పేర్లు వేరైనను భావం ఒక్కటే. కాని కుమారస్వామి, ఎన్.కె.సరస్వతి మొదలైన వారు ఫెర్గూసన్ అభిప్రాయాలను విమర్శించారు. ఎన్.కె.సరస్వతి దేవాలయ వర్గీకరణానికి 'మానసార' అను వాస్తు శాస్త్ర గ్రంథం ప్రమాణమైంది. దీని ప్రకారం నాగర, వేసర, ద్రావిడ అను దేవాలయాలు కలవని, కాని అట్టి విభజన ఇతర వాస్తు శాస్త్రాలచే సరిదిద్దబడినదని భావిస్తున్నారు. దేశమందు నాగర, ద్రావిడరీతి దేవాలయాలు మాత్రమే కలవని, వేసర తెగ అనునది ఒక ప్రత్యేకంగాలేదని వీరు అభిప్రాయపడుతున్నారు. కాని వీరి అభిప్రాయం సరియైనది కాదని భావించుట కూడా గలదు. ఎందుకనగా ఐహొలే, పట్టదకల్, ఆలంపూర్ మొదలైన ప్రాంతాలందు తొలి చాళుక్య దేవాలయాలను గమనించినచో నాగర, ద్రావిడ తెగకు చెందిన ఒక నూతన రీతికి చెందిన దేవాలయాలను మనం గమనింపవచ్చు. వీటినే వేసర దేవాలయాలంటారు.

# దక్షిణ భారతదేశ దేవాలయాల ముఖ్యాంశాలు

భారతదేశమందలి దేవాలయాల్లో దక్షిణదేశమందలి ద్రవిడ దేవాలయాలు ఒక ప్రముఖ స్థానాన్ని కలిగిఉన్నాయి. గుప్తుల దేవాలయ నిర్మాణాలను, ఆనాటికే వెలసిఉన్న గుహాలయాలను కొంతవరకు మార్గదర్శకంగా తీసుకొని దక్షిణ భారతదేశమందు ఒకవైపు పశ్చిమ చాళుక్యులు కర్ణాటక ప్రాంతమందు గుహాలయాల నిర్మాణంతోబాటు దేవాలయాల నిర్మాణం ప్రారంభించగా మరొక వైపు అదే కాలమందు తమిళ ప్రాంతమున పల్లవులు విజయవాడ దాని పరిసర ప్రాంతాలందు ఆ నాటికే ఉన్న విష్ణు కుండినుల గుహాలయాలు, దక్కన్‌లోని గుహాలయాల ప్రభావంతో దేవాలయాల నిర్మాణం కూడ చేసారు. పశ్చిమ చాళుక్యులు, పల్లవుల తరవాత చోళులు, కళ్యాణీ చాళుక్యులు, వేంగి చాళుక్యులు, కాకతీయులు, హొయసాలులు, విజయనగర రాజులు అనేక దేవాలయాలను నిర్మించారు. వీరందరి దేవాలయాలు చాలావరకు వాస్తు శాస్త్రాల ఆధారంగా నిర్మించడం జరిగింది.

దక్షిణ భారతదేశ దేవాలు శాస్త్రబద్ధమైన అంగాలు ఉన్నాయి. అవి : గర్భగృహ, ప్రదక్షిణాపథ, అంతరాళ (అర్ధమంటప), వసారా (porch)ముఖమండప, మహామండపం, పరివార దేవతా గృహాలు, అమ్మాళ్ దేవగృహములు, బహుస్తంభ మండపాలు, ప్రాంగణం, ప్రాకారం, గోపుర ద్వారం మొదలైనవి. అంతేగాక ప్రతి దేవాలయం అధిష్టానం (లేక ఉపపీఠం, అధిష్టానాలు), కుడ్యభాగం, కపోత, విమానం, గ్రీవ, శిఖర, కపురి అను విభాగాలను వరుసగా ఊర్ధ్వముఖంగా ఉన్నాయి. ఒక్కొక్క విభాగ నిర్మాణ రూపాలు కింది విధంగా ఉన్నాయి.

1. దక్షిణ భారతదేశ దేవాలయాలన్నీ అధిష్టానం (base) అనే విభాగాన్ని, గర్భగృహా అంతరాళ, ముఖమండప మొదలగు ప్రాంతాలందు కలిగి ఉన్నాయి. ఈ అధిష్టానాలన్నీ సాధారణంగా పట్టి, త్రివట్టి, గళ మొదలైన విభాగాలున్నాయి. ఈ విభాగాల ముఖ భాగాలపై కొన్ని దేవాలయాల్లో దేవతా, చారిత్రిక, ప్రకృతి సంబంధమైన చిత్రాలు చెక్కబడి ఉన్నాయి. ఈ అధిష్టానం సాధారణంగా రెండు అడుగుల ఎత్తు మొదలు 5 అడుగుల ఎత్తు కలిగి ఉన్నాది. ఉదాహరణకు మహాబలిపురం యందలి తీరదేవాలయం అధిష్టానం సుమారు 4 అడుగుల ఎత్తుకలదు. కాని దీనిపై చిత్రాలు లేవు.

2. దక్షిణ భారతదేశ దేవాలయాల అధిష్టానంపై కుడ్యభాగం నిర్మింపబడిఉంది. ఈ కుడ్యమందు దేవకోష్టాలు (niches) గలవు. ఈ దేవకోష్టాలకిరువైపుల కుడ్యస్తంభాలు (pilastors) కలవు. దేవ కోష్టాలందు సాధారణంగా దేవాలయంలోని ముఖ్య దేవునికి సంబంధించిన పరివార దేవతా ప్రతిమలు ప్రతిష్టించడం జరిగింది. ఈ దేవకోష్టాలపై భాగాన కొన్ని సందర్భాల్లో మకర

తోరణ చిత్రరూపం రూపొందిచి ఉంది. కుడ్య స్తంభాలు మూలం (base) అండం (shaft), శీర్షం అనే విభాగాలను ఉంది. కుడ్యస్తంభాల శీర్షనందు (corbel) అను విభాగం ఉంది. ఒక్కొక్క రాజవంశం కాలంలో ఇది ఒక్కొక్క రూపాన ఉంది. పల్లవులు, పశ్చిమ చాళక్యుల కాలమందు ఇవి సాధారణంగా సామాన్య (simple), తరంగ, తరంగపట్ట అనే మూడు రకాల్లో ఏదో ఒక రకానికి చెందినవిగా ఉన్నాయి. కాని చోళుల కాలమందు (corbel) విభాగంలో ముందుకు చొచ్చుకొని వచ్చినట్లున్న ఒక విభాగముంది. దీన్నే ముక్కులాంటి ఉబ్బు (Tenon-like projection) అంటారు. ఇటువంటి ఆకారం విజయనగర కాలం నాటికి పుష్పభితిక ఆకారాన్ని (Inverted lotus shape) పొందింది. స్తంభ మూలం, శీర్షికలను కలుపునట్లు దుముకుచున్న సింహాలను (Rampent or rearing lion) కలిగిఉన్న కుడ్యస్తంభాలు కూడా మనకు పల్లవ దేవాలయాలందు కనపడతాయి. కొన్ని కుడ్యస్తంభాల మూలవిభాగాన కూర్చుని ఉన్నట్లు ఉన్న సింహాల ప్రతిమలు ఉన్నాయి. వీటనే సింహపాద స్తంభాలంటారు. మహాబలిపురం నందలి తీరదేవాలయం, కాంచీపురమందలి వైకుంఠ పెరుమాళ్ దేవాలయాలందు మనం ఈ విధానం గమనించవచ్చును. కాని సాధారణంగా జంతువుల శిల్పాలు లేకుండా ఉండే స్తంభాలు అధికసంఖ్యలో కనపడతాయి.

3. కుడ్యభాగానికి పైభాగంలో దేవాలయం చుట్టూ అర్థ చంద్రాకారంగల కపోత(cornice) అనే విభాగం దక్షిణ భారతదేశ దేవాలయములందున్నది. వీటి ముఖభాగములందు కూడు లేక చైత్య డిజైను (gable designs) అనే చిత్ర రూపాల వరస ఉంది. ఈ కూడుల పైభాగంలో కొన్ని దేవాలయాలందు 'లలాటం' (spade head top) అను భాగం ఉన్నది. ఉదాహరణకు మహాబలిపుర తీర దేవాలయకూడు. కొన్ని దేవాలయాలందు కపోత పైభాగంలోగల లోతుగోడ (shallow wall or recess) అనెడి విభాగం ఉంది. ఇందు సాధారణంగా మరుగుజ్జు శిల్పాలు, సింహాలు, ఏనుగులు ఉన్నాయి.

4. కపోత పైన అనేక తలాలతో కూడిన (అంతస్థులు) విమానం ఉంది. విమానం నందలి ప్రతి తలం నందు కూట, పంజర, శాల అను హారాల వరస దేవాలయం చుట్టూ నిర్మింపబడి ఉంది. కూట అనెడి విభాగం విమానం మూలలందు ప్రతివైపున నిర్మింపబడి ఉన్నది. విమానం ప్రతివైపున ప్రతి తలం యొక్క మధ్య భాగాన శాలం అనెడి విభాగం ఉంది. మధ్యనున్న శాల అను విభాగానికి, మూలగానున్న కూట విభాగంనకు మధ్య పంజర అను నిర్మాణం ఉన్నది. కొన్ని దేవాలయాలందు ఈ హారాలపైన కలశాలు నిర్మించే విధానం కూడా ఉంది. ఈ హారాల మధ్యనున్న ఖాళీస్థలాలందు దేవతా ప్రతిమలు, దేవతా వాహనాలు ప్రతిష్ఠించే సాంప్రదాయం గూడా గమనించవచ్చును. సాధారణంగా ఒకటి మొదలు ఐదు తలాలుగల విమానాలున్నాయి. విమానం గర్భగృహ పైభాగంలో మాత్రమే నిర్మించడం జరిగింది. ఉత్తర భారతదేశ దేవాలయాల్లో లాగ అర్ధమండప, ముఖమండప మొదలగు వాటిపైన విమాన నిర్మాణం దక్షిణ భారతదేశ దేవాలయాల్లో కనపడదు. ఈ విభాగాలన్నీ చదరపు పైకప్పును కలిగిఉన్నాయి.

5. విమానం పైభాగాన గ్రీవ (Neck) అనెది 8 ముఖాలుగల ఒక విభాగం ఈ దేవాలయాలందు నిర్మింపబడి ఉంది. దీనిపైన 8 ముఖాలుగల గుండ్రటి ద్రావిడ శిఖరముంది. శిఖరం పైభాగంలో కలశం అనెడి విభాగం నిర్మింపబడి ఉంది. కలశం కొన్ని దేవాలయాల్లో నల్లటి శిలతోను, మరికొన్ని దేవాలయాలందు బంగారు లేక వెండి పూతగలిగిన లోహ నిర్మాణాలుగా ఉన్నాయి.

6 బహుస్తంభ మండపాలను దేవాలయ ప్రాంగణాలందు నిర్మించే విధానం గూడా ఈ దేవాలయాలందు ఉంది. ఈ మండపాలు అనేక వరసలుగల కళాత్మకమైన స్తంభాలను కలిగి, కుడ్యవిభాగం అనేది లేకుండా నిర్మింపబడి ఉంది. ఇటువంటి మండపాలు చోళుల అఖరి దశకాలంలో ప్రారంభమై విజయనగర కాలమందు అధిక వ్యాప్తిని పొందాయి. ఉదాహరణకు విజయనగర రాజులచే నిర్మింపబడ్డ హంపి యందలి "శత స్తంభమండపం".

7. ప్రతి దక్షిణ భారతదేశ దేవాలయానికి సాధారణంగా ముందువైపునున్న ప్రాకారగోడ మధ్య భాగంలో గోపుర ద్వారం నిర్మింపబడి ఉంది. గోపుర ద్వారాలు నిర్మించే విధానం పల్లవుల కాలమందు ప్రారంభమైనది. మహాబలిపురమందలి తీర దేవాలయం, కాంచీపురంనందలి కైలాసనాథ దేవాలయమునందలి గోపుర ద్వారాలు వీటి తొలిదశ నిర్మాణ విధానాన్ని తెలుపుతున్నాయి. ఇవి అయతాశ్రత లేక గజపృష్ఠి (oblong) అకారంలో సుమారు 4 అడుగుల ఎత్తు, 10 అడుగుల పొడవు కలిగి ఉన్నాయి. కాని కొంతకాలం తరవాత ఈ గోపురాలు ఎత్తుగా నిర్మించే అచారం ప్రారంభమైంది. ఈ తొలి పరిణామ దశలో గోపురాలు ముఖ్య దేవుని గర్భగృహంపై ఉన్న విమానం కన్నను తక్కువ ఎత్తు కలిగి ఉన్నాయి. ఈ విధానం చోళుల అఖరిదశ వరకు కొనసాగింది. అటు తరవాత విమానం కన్నను గోపురం ఎత్తు ఎక్కువగా నిర్మించే విధానం ప్రారంభమైంది. ముఖ్యంగా విజయనగర రాజుల కాలంలో గోపురాలు అత్యధికమైన ఎత్తుగా నిర్మించే సాంప్రదాయం ఏర్పడింది. తంజావూరు నందలి బృహదీశ్వర దేవాలయ గోపురం ఎత్తైన గోపురాలలో ఒక ఉదాహరణగా చెప్పవచ్చును. తిరువణ్ణామలై, జంబుకేశ్వరంలోని గోపురాలు కూడా చాలా ఎత్తైనవి. కొన్ని గోపురాలు శిల్పాలతో నిండి ఉన్నాయి. గోపురాలపైన సాధారణంగ కలశాల వరుస ఉంది.

8. దక్షిణ భారతదేశ దేవాలయాలు గర్భగృహ చుట్టుగాని లేక గర్భగృహ అంతరాళలు రెండింటిచుట్టుగాని, ప్రదక్షిణా పథ అనెది విభాగాన్ని కలిగి ఉంది. ఈ విభాగాలందు కొన్ని సందర్భాల్లో దేవతా ప్రతిమలుగాని, చిత్ర లేఖనాలుగాని ఉన్నాయి. తంజావూరునందలి బృహదీశ్వర దేవాలయం చిత్ర లేఖనాలకు ఒక ఉదాహరణగా చెప్పవచ్చు.

9. ఈ దేవాలయాలు కొన్నింటిలో ముఖ్యదేవుని సతికి ప్రత్యేక దేవతాగృహ నిర్మాణం చేసే సాంప్రదాయం కూడా ఉంది. ఇట్టి దేవీ గృహాలను అమ్మాళ్ దేవీ గృహా లంటారు. ప్రత్యేక దేవీ గృహాలను నిర్మించే విధానం చోళుల మూడో దశ కాలంలో ప్రారంభమైంది. అటు

తరువాత ఇతర రాజవంశాల వారు తమ దేవాలయ నిర్మాణాల్లో కొనసాగించారు.

10. దేవాలయ ప్రాంగణం చుట్టూ ప్రాకార నిర్మాణం చేసే సాంప్రదాయం మనం ఈ దేవాలయాల్లో గమనింపవచ్చు. కొన్ని దేవాలయాలందు ప్రాకారం ఒకదానియందు మరొకటి నిర్మించే సాంప్రదాయం కనిపించకా, మరి కొన్నింటి యందు ఒకదానిచుట్టూ మరొకటి నిర్మించే సాంప్రదాయం ఉంది.

11. కొన్ని దేవాలయాల ప్రాకారం లోపలి ముఖభాగమందు పరివార దేవతా ప్రతిమలను దేవకోష్టాలందు (దేవగృహాలందు) నిర్మించే విధానం ఉంది. ఉదాహరణకు కాంచీపురమందలి కైలాసనాథ దేవాలయం లోపలి ప్రాకారం లోపలి ముఖభాగంలో పరివార దేవతా గృహాలు అనేకంలు వరసగా దేవాలయం చుట్టూ నిర్మింపబడి ఉన్నాయి.

12. ఈ దేవాలయాలన్నియు పుష్కరిణి అను వాటిని ఉన్నాయి. దేవతా సంబంధమైన కొన్ని ప్రత్యేక ఉత్సవాల కోసం, భక్తుల అభ్యంగన స్నానాల కొనం వీటిని నిర్మించే వారు. ఈ విధంగా దక్షిణ భారతదేశ దేవాలయాలు అనేక ముఖ్యాంశాలను కలిగి ఉన్నాయి. అంగరూపంలో, నిర్మాణ విధానాలు ఇవి ఉత్తర భారతదేశ నాగర తెగ దేవాలయాలకు భిన్నంగ ఒక ప్రత్యేక శైలిలో ఉన్నాయి.

# తొలిచాళుక్యుల ఆలయ వాస్తు, శిల్పం

తొలిచాళుక్యులు కర్ణాటక ప్రాంతాన్ని, ఆంధ్రలోని కొన్నిప్రాంతాలను కలుపుకొని క్రీ.శ.543 నుంచి క్రీ.శ.753 వరకు బాదామి రాజధానిగా పరిపాలించారు. వీరిని బాదామి చాళుక్యులని, వాతాపి చాళుక్యులని, తొలిచాళుక్యులని పలుపేర్లతో పిలుస్తారు. ఈ వంశానికి చెందిన రాజుల్లో ఒకటో పులకేశి, ఒకటో కీర్తివర్మ, రెండో పులకేశి, విజయాదిత్యుడు, విక్రమాదిత్యుడు అనువారు ముఖ్యులు.

వీరి నిర్మాణాలు పలుప్రాంతాల్లో ఉన్నాయి. ఇవి రెండు రకాలుగా ఉన్నాయి. అవి : గుహాలయాలు (2) కట్టడ ఆలయాలు. గుహాలయాల్లో హైందవ, జైన గుహాలయాలు గలవు. బాదామి యందలి మూడవ విష్ణు గుహాలయం, రెండవ విష్ణు గుహాలయం, ఒకటవ శైవ గుహాలయం, జైన గుహాలయం ఈ తెగకు ముఖ్య ఉదాహరణలు. ఈ గుహాలయాలగూర్చి గుహాలయాల అధ్యాయంలో వివరంగా చర్చించటం జరిగింది. తొలిచాళుక్యుల కట్టడ ఆలయాలు పలుప్రాంతాల్లో ఉన్నప్పటకీ ఐహొళె (అయ్యవోలు), బాదామి, పట్టదకల్, మహాకూటేశ్వర, అలంపూర్‌లందలి దేవాలయాలు ముఖ్యమైనవి. కాని వీటిలో కొన్ని ద్రవిడరీతిలో నిర్మింపబడి ఉండగా, మిగిలినవి ఉత్తరభారతదేశపు రీతిలో ఉన్నాయి. ఐహొళెలోని లాడ్‌ఖాన్, కొంటిగుడి, దుర్గ, హుచిమల్లిగడి, మెగుతి దేవాలయాలు, బాదామిలోని మాలెగిత్తి శివాలయం, మల్లికార్జున దేవాలయం,మహాకూటేశ్వర ఆలయం, పట్టదకల్‌యందలి సంఘమేశ్వర, విరూపాక్ష, మల్లికార్జున దేవాలయాలు ద్రావిడ రీతి దేవాలయాలు. పట్టదకల్‌లోని పాపనాథ, గళగన్నాథ, కాడసిద్ధేశ్వర, కాశివిశ్వేశ్వర దేవాలయాలు, ఆంధ్రలోని అలంపూర్ యందలి నవబ్రహ్మ దేవాలయాలనే గరుడబ్రహ్మ, బాలబ్రహ్మ, అర్కబ్రహ్మ, పద్మబ్రహ్మ, విశ్వబ్రహ్మ, తారకబ్రహ్మ, బాలబ్రహ్మ, కుమారబ్రహ్మ, స్వర్గబ్రహ్మ దేవాలయాలు, జంబులింగేశ్వరాలయం ఉత్తరభారతదేశ రీతికి చెందిన ఆలయాలుగా చెప్పవచ్చు. తొలి చాళుక్య ఆలయాలను ఐహొళె, బాదామి, పట్టదకల్, మహాకూటేశ్వర, ఆంధ్రప్రాంతాల ఆలయాలుగా విభజించి అధ్యయనం చేయవచ్చు.

ఐహొళె ప్రాంతంలో ఒకటో పులకేశి లాడ్‌ఖాన్ కొంటగుడి, దుర్గదేవాలయాలను నిర్మించాడు. బాదామిలో ఒకటో కీర్తివర్మ మాలెగిత్తి శివాలయాన్ని నిర్మించాడు. ఇచటే రెండో పులకేశి మెగూతి ఆలయాన్ని నిర్మించాడు. పట్టదకల్‌లో విజయాదిత్యుడు సంఘమేశ్వర, పాపనాథ దేవాలయాలను నిర్మించగా, రెండో విక్రమాదిత్యుడు విరూపాక్ష, మల్లికార్జున దేవాలయాలను నిర్మించాడు.

తొలిచాళుక్యుల దేవాలయాల్లో ఉత్తరభారతదేశంలో అనాటికే నిర్మింపబడిఉన్న గుప్తదేవాలయాల ప్రభావం కనపడుతుంది. కాని అదేకాలమందు నిర్మింపబడ్డ పల్లవదేవాలయాలందు ఇట్టి గుప్త ప్రభావం కనపడదు. తొలి చాళుక్యుల దేవాలయాలు రెండురకాలుగా కనపడుతున్నాయి. కొన్ని గర్భగృహంను మాత్రమేగలిగి పైన విమానాన్ని కలిగిఉన్నాయి. మరికొన్నింటికి గర్భగృహ, అంతరాళ, ప్రదక్షిణాపథ; ముఖమండప, వసారా (porch) అను విభాగాలను, విమానం, ప్రకార, గోపురాలు ఉన్నాయి. వీరి ఆలయాలు కొన్నింటిలో గర్భగృహలోపల నాలుగుమూలలందు స్తంభాలు నిర్మించే విధానం ఉంది. ఇట్టి విధానం ద్రావిడ ఆలయాల్లో గాని, ఒరిస్సా ఆలయాల్లో గాని కనపడదు. కాని ఈ రీతి అలంపూర్ ఆలయాల్లో కనపడుతుంది. వీరి దేవాలయాల గర్భగృహ ద్వారానికి ఇరువైపులా చట్రాల (frames) నిర్మాణం కన్పిస్తుంది ద్వారంపైన లిటెల్ విభాగాన గరుడుని ప్రతిమ ఉన్నది. ద్వారాల కిరుపైపులా కొన్ని ఆలయాల్లో గంగ-యమున ప్రతిమలున్నాయి. ఆలయ కుడ్యాల వెలుపలి ముఖభాగాల్లో దేవ కోష్టలు గలవు. వీటి పైభాగంలో మకరతోరణ లేక కూడు రూపణలున్నాయి. వీరి ఆలయాల విమానాలు కొన్ని ద్రవిడ రీతికి చెందినవి కాగా, మిగిలినవి ఉత్తరభారతదేశ రీతికి చెందినవి. ఉత్తరభారత విమానాల్లో రాహుపాగ, అనురాహాపాగ, కొనికాపాగ అను విభాగాలు గలవు. కొనికాపాగలలో తలములు తెలుపుటకు భూమిఅమలకలు నిర్మింపబడి ఉన్నాయి. విమానంముందు కొన్ని ఆలయాల్లో సుఖనాస విభాగంగలదు. వీటి ముఖభాగంలోగల కూడులో సాధారణంగా నటరాజ ప్రతిమ ఉన్నది. వీరి ద్రవిడ విమానాల్లో కూట, పంజర, శాల హారాల వరసలతో కూడిన అనేక తలాలు ఉన్నాయి. వీరి ఆలయాల్లోని స్తంభాలు సాధారణంగా లావుగాను, ఘన చతురస్రంగాను ఉన్నాయి. వీటి శీర్షిక (capital) భాగంలో తరంగపట (corbel) గలదు. కొన్ని (corbel) లకు ముందుకు చొచ్చుకొనిఉన్న (projected) ఒక శిలావిభాగం గలదు. వీరి ఆలయాల కుడ్యాల్లోని దేవకోష్టలలో దేవతాప్రతిమలు గలవు. మిధున శిల్పాలు కూడా కొన్నింటిలో ఉన్నాయి. వీరి వాస్తు శిల్పకళలో కొంత పల్లవసాంప్రదాయం కూడా కనపడుతుంది. దీనికి కారణం ఈ రెండు వంశాలమధ్య ఉన్న శత్రుత్వమే కారణం. ఈ శత్రుత్వ కారణంగా రెండో పులకశి వంటివారు పల్లవరాజ్యంపై దండయాత్ర చేసారు. ఈ దండయాత్రలకాలంలో పల్లవ రాజ్యంలోని ఆలయాల వాస్తు శిల్పాలను చూసి అట్టివాటిని రూపొందించదలచి ఆ రాజ్యంనుండి పల్లవ శిల్పులను తెచ్చి విరూపాక్షాలయంవంటి ఆలయాలను నిర్మింపచేశారు.

## ఐహొలె దేవాలయాలు

ఐహొలె ప్రాంతం కర్ణాటకలోని బిజాపూర్ జిల్లాలో ఉంది. ఐహొలె అనుపేరు ఆర్యపురం లేక అయ్యావోలు అను శబ్దం నుంచి పుట్టిందని కొందరి అభిప్రాయం. ఇచ్చట లాడ్‌ఖాన్, కోంట్‌గుడి, దుర్గ, హుచిమల్లిగుడి, మొగుతి దేవాలయాలు ఉన్నాయి.

**లాడ్‌ఖాన్ దేవాలయం :** తొలిచాళుక్యుల దేవాలయాల్లో అతి ప్రాచీనమైంది లాడ్‌ఖాన్ దేవాలయం. దీని నిర్మాతలు, నిర్మాణ కాలం విషయాల్లో భేదాభిప్రాయాలు ఉన్నాయి. ఇది క్రీ.శ 480 లో గుప్తులచే నిర్మింపబడిందని కొందరి అభిప్రాయం. మరికొందరు ఇది క్రీ.శ.550 లో తొలిచాళుక్యులచే

నిర్మింపబడిందని భావించుచున్నారు. కాని అధికులు ఇది తొలిచాళుక్యులదని అభిప్రాయపడుచున్నారు.

ఈ దేవాలయం ఒక దీర్ఘచతురస్రాకార హాలును గలిగి దాని వెనుక భాగందగ్గరలో (మధ్యభాగాన్ని అనుకొని) చతురస్రాకారంగల గర్భగృహ ఉంది. ఈ గర్భగృహ అన్నివైపులా యాభై అడుగుల కుడ్యం ఉంది. ఈ ఆలయంపైన మరో గర్భగృహ నిర్మింపబడి ఉండుట ఇచ్చటి ప్రత్యేకత. ఈ రీతి నాచ్‌నకుధార యందలి గుప్తుల పార్వతీ దేవాలయంలాగ ఉంది. గర్భగృహ కుడ్యాల వెలుపలి ముఖభాగంలో మూడు దేవకోష్టలున్నాయి. అందొకదాని యందు విష్ణుప్రతిమ గలదు. కింది గర్భగృహ ముందుభాగంలో కొంత దూరములో హాలుమధ్య నాలుగు ఎత్తైన స్తంభాలుగలవు. ఇవి వీటిపైనగల చదరపు పైకప్పునకు రక్షణనిచ్చుచున్నాయి. ఈ స్తంభాలకు ఇరువైపులా హాలుప్రక్క గోడలకు దగ్గరగా రెండువరుసల స్తంభాలు ఉన్నాయి. ఇవి లావుగా, తక్కువ ఎత్తుగా, తరంగ కార్బెల్‌ను కలిగి ఉన్నాయి. ఇవి ఏటవాలుగాఉన్న పైకప్పునకు రక్షణ కల్పిస్తున్నాయి. ఈ హాలు గోడలో రంధ్రాల కిటికీలు (perforated windows) చేప అకులు (fish spokes), దేవ కోష్టలు, దేవతాప్రతిమలు, రేఖాడిజైన్లు (geometrical design) మొదలైనవి గలవు. హాలు ముందుగా ఆలయ ప్రవేశమార్గం వెలుపలగా ఒక స్తంభవసారా (open pillared porch) ఉంది. ఈ స్తంభాలపైననే గంగాయమునల గుప్తరీతిలోని శిల్పాలు ఉన్నాయి. ఈ ఆలయంపైన విమానం లేదు.

**కోంట్‌గుడి :** కోంట్ అనగా త్రిశూలం. శూలం తీసుకొని ఊరంతా ఉత్సవాలకాలంలో తిరిగెడి ఆచారం ఉండుటచే ఈ ఆలయానికి కోంట్‌గుడి అనిపేరు వచ్చింది. ఐహొళె ఆలయాల్లో ఇది ఒక ముఖ్యమైంది. ఈ ఆలయంకూడా కొంతవరకు లాడ్‌ఖాన్ దేవాలయాన్ని పోలిఉంది. ఇందుకూడా పెద్దహాలు యొక్క వెనుక గోడకు దగ్గరగా గర్భగృహ నిర్మింపబడిఉంది. గర్భగృహపైన కూట, పంజర, శాల హారాల వరసతో కూడిన ఏకతల విమానం గలదు. విమానం నాలుగు వైపులాగల దేవకోష్టాలందు వరుసగా శివ, వరాహ, బ్రహ్మ, వామనుల ప్రతిమలు ఉన్నాయి. గర్భగృహలో శివలింగం ప్రతిష్ఠింపబడి ఉంది. గర్భగృహ ద్వారానికి ఇరువైపులా ఐదు చట్రాలు (frames) ఉన్నాయి. వీటిపై దంపతుల చిత్రాలు ఉన్నాయి. ద్వారంపైనగల లింటెల్ విభాగాన గరుడుని ప్రతిమ ఉన్నది. హాలుయొక్క పైకప్పులోపలి ముఖభాగాన అష్టదిక్పాలకుల చిత్రాలు ఉన్నాయి. వీరందరూ బ్రహ్మచుట్టూ ఆయాదిక్కుల్లో ఉన్నట్లు చూపటం జరిగింది.

**దుర్గ దేవాలయం :** ఐహొళె ఆలయాల్లో దుర్గ దేవాలయం ఒకటి. ఇది ఒక దుర్గం (కోట)లోపల నిర్మింపబడి ఉంది. ఇది క్రీ.శ.560 లో నిర్మింపబడిందని కొందరి అభిప్రాయం. మరికొందరు ఇది క్రీ.శ. 8వ శతాబ్దానికి చెందినదని భావిస్తున్నారు. కాల నిర్ణయంలో విభేదాలున్నను ఇది తొలిచాళుక్యుల నిర్మాణమని అధికుల అభిప్రాయం.

ఈ ఆలయానికి గజపృష్ఠ అకారంలో (apsidal) నిర్మించిఉన్నారు. ఆలయ గర్భగృహ చుట్టూ రెండు గజపృష్ఠఆకార కుడ్య నిర్మాణాలు ఉన్నాయి. ఈ రెండింటిముందు ఆలయానికి ముందుగా

వసారా (porch) నిర్మింపబడి ఉంది. ఆలయంచుట్టూ ఒకపెద్ద ప్రాకారం గలదు. దీనిముందు గోడమధ్యలో గోపురద్వారం నిర్మింపబడి ఉంది. గర్భగృహ పైభాగాన ఉన్న విమానం శిథిలమై ఉన్నది. ప్రస్తుతం ఒక తలం మాత్రమే కలిగి ఉంది. ఈ విమానం నాగర రీతికి చెందింది. విమానమందు రాహాపాగ, కోనికాపాగ అనువిభాగాలు ఉన్నాయి. చైత్యరూపాలు కూడా ఉన్నాయి. గర్భగృహ చుట్టూగల గజపృష్ట నిర్మాణం యొక్క పైకప్పు ఏటవాలుగా నిర్మాపబడి ఉంది. ఈ విభాగం చుట్టూగల మరో ఆకార నిర్మాణం మరికొంత పటవాలుగా ఉన్న పైకప్పు ఉంది. ఈ రెండో నిర్మాణం కొనల్లో పిట్టగోడ అందులో అచట అచటా పొట్టి స్తంభాలు ఉన్నాయి. గర్భగృహ ద్వారానికి ఇరువైపులా రెండు బహుచక్రాల నిర్మాణం ఉంది. ద్వారంపైన లింటెల్ భాగంలో గరుడుని ప్రతిమ ఉంది. గర్భగృహ చుట్టున్న రెండో గజపృష్ట ఆకార కుడ్యమందుగల దేవకోష్ఠలలో దుర్గ, వరాహ విష్ణు, అర్ధనారీశ్వర, నరసింహ, కైవల్యమూర్తి ప్రతిమలు ఉన్నాయి. ఆలయం ముందుగల వసారాలోని స్తంభాలపై మిధున, తామర పథకాలు, గళ చిత్రాలున్నాయి. వీటి (corbel) సాదా వంపు ఉన్నాయి. ఆలయ గోపుర ద్వారంపై రెండో విక్రమాదిత్యుని శాసనం ఉంది.

**హుచిమల్లి గుడి ;** ఇది గర్భగృహ, అంతరాళ, మండప, వసారా అను విభాగాలు ఉన్నాయి . వసారా పైకప్పు లోపలి ముఖభాగంలో కార్తికేయుని చిత్రం, అతని పరివార దేవతల చిత్రాలు ఉన్నాయి. ఈ దేవాలయ విమానం నాగర రీతిలో ఉంది. ఈ ఆలయ స్తంభాలు ఘనచతురస్రాకారంగా ఉన్నాయి. వీటికి సాధారణవంపుగల కార్బెల్ ఉంది.

**మొగూతి ఆలయం :** ఇది ఒక జైన ఆలయం. దీని మొదటి పేరు మాలిన గుడి. దీనికి గర్భగృహ, ప్రదక్షిణ, అంతరాళ లేక అర్ధమండప, ముఖమండప అను నిర్మాణ భాగాలు ఉన్నాయి. గర్భగృహ చతురస్రంగా ఉంది. దీనిపైన మరొక గర్భగృహ ఉంది. ఇది నాచ్నకుధార పార్వతీ దేవాలయ రీతిని తెలుపుతున్నది. గర్భగృహచుట్టూ ఎనిమిది విభాగాలు ఉన్నాయి. వీటిలో వెనుకగా కుడిఎడమల కొనల్లో చిన్న దేవగృహాలున్నాయి. వీటిముందు గల రెండు భాగాలు అర్ధమండపగా, ఉపయోగపడుచున్నాయి. వీటిముందు, ముఖ్యదేవగృహ ముందుగా మూడు విభాగాలు ముఖమండపగా ఉపయోగపడుతున్నాయి. గర్భగృహ చుట్టూగల ఎనిమిది విభాగాలపైకప్పు ఏటవాలుగా ఉంది. వీటి కుడ్యాల్లో దేవకోష్ఠలు, రంధ్రాలకిటికీలు, కుడ్యస్తంభాలు ఉన్నాయి. కుడ్యస్తంభాలకు సాధారణవంపుగల (corbel) గలదు. ఇది పల్లవ మహేంద్రవర్మ (corbel) లాగ ఉంది. ఈ ఆలయంలో రవికీర్తి రచించిన శాసనం ఉంది.

## బాదామి దేవాలయాలు

తొలి చాళుక్యుల రాజధానియైన బాదామి, దాని పక్కనే ఉన్న ముక్తేశ్వర్ యందు తొలిచాళుక్య దేవాలయాలు ఉన్నాయి. బాదామిలోని మాలెగిత్తి శివాలయం, మహాకూటేశ్వర్ ఆలయ సమూహంలోని మహాకూటేశ్వర, మల్లికార్జున ఆలయాలు ముఖ్యమైనవి.

**మాలెగిత్తి శివాలయం :** పూలహారాలు అమ్మే (స్త్రీ) పేరుమీదుగా ఈ ఆలయానికి మాలెగిత్తి శివాలయమని పేరువచ్చింది. ఈ ఆలయానికి గర్భగృహ , మండప, వసారా (porch) అను విభాగాలు ఉన్నాయి. గర్భగృహ లో శివలింగముంది. గర్భగృహ ద్వారానికి ఇరువైపులా కుడ్యస్తంభాలు, వాటిపైన కేసిన్ అను రాక్షసుని చంపుతున్నట్లున్న కేశుని చిత్రం ఉంది. ద్వారంపైన లిటెల్ విభాగాన గరుడుని ప్రతిమ ఉంది. గర్భగృహ, మండపాల కుడ్యాల వెలుపలి ముఖభాగంలో దేవకోష్ఠలు, రంధ్రాల కిటికీలు ఉన్నాయి. మండప ప్రవేశమార్గం వెలుపలి కుడి ఎడమ కుడ్యాల్లో ఆయుధాలు ధరించిన ఇద్దరు వీరుల ప్రతిమలు ఉన్నాయి. వీరు బహుశా దేవాలయ దాతలై ఉంటారని అభిప్రాయం ఉంది. సదాశివరాయల శాసనం ఒకటి ఈ ఆలయంలో ఉంది. మండప ఉత్తర కుడ్యంలో విష్ణు, దక్షిణ కుడ్యంలో శివుని ప్రతిమలు గలవు. వీరు ఆయుధ పురుషులుగల ఆయుధాలను ధరించిఉన్నారు. వీరికి చతుర్భుజాలున్నాయి. ఈ ఆలయ అధిష్ఠానంలో పైవిభాగాన పట్ట, త్రిపట్టలు గలవు. ఆలయ కుడ్యంపైనగల కపోత ముఖభాగాన మానవతలలు గలిఉన్న కూడులు న్నాయి. కపోతపైన దుముకుచున్నట్లున్న సింహాల వరుస గలదు. గర్భగృహ పైన రెండు తలాల విమానం గలదు. దీనిపైన చతుర్ముఖ నాగర శిఖరం గలదు. ఈ ఆలయం దగ్గరలోనే కిందిశివాలయం. పైశివాలయం అను మరిరెండు ఆలయాలు ఉన్నాయి.

**మహాకూటేశ్వర ఆలయం :** బాదామి పక్కనున్న మహాకూటేశ్వర్‌లోని ఆలయాల సముదాయంలో మహాకూటేశ్వర ఆలయం ముఖ్యమైనది. ఇది క్రీ.శ. 6వ శతాబ్దానిది. ఇది పలు మార్పులను పొందింది. దీనికి గర్భగృహ , ప్రదక్షిణాపథ, మండప విభాగాలు ఉన్నాయి. దీని కుడ్యాల్లో దేవ కోష్ఠలు, రంధ్రాల కిటికీలు, కుడ్యస్తంభాలు ఉన్నాయి. కుడ్యంపైన కపోత, రెండు తలాల విమానం, అందు హారాల వరుసలు ఉన్నాయి.

**మల్లికార్జునాలయం :** మహాకూటేశ్వర్ ఆలయ సముదాయంలో మల్లికార్జునాలయం ఒకటి. ఇది మహాకూటేశ్వర్‌లాగా ఉంది.

## పట్టదకల్ దేవాలయాలు

పట్టదకల్ యందు పది తొలిచాళుక్య దేవాలయాలు ఉన్నాయి. వీటిలో నాలుగు నాగరరీతివి. మిగిలినవి ద్రావిడ రీతివి. సంఘమేశ్వర, విరుపాక్ష, మల్లికార్జున దేవాలయాలవంటివి ద్రావిడ రీతిలకి చెందినట్టివి. పాపనాథ, గళగనాథ, కాశీవిశ్వేశ్వర, కాడ్‌శిద్ధేశ్వర దేవాలయాలు నాగర రీతికి చెందినవి.

**సంఘమేశ్వర దేవాలయం :** దీన్ని రెండో పులకేశి నిర్మించినట్లు తెలుస్తుంది. దీనికి గర్భగృహ , అర్ధమండప, ప్రదక్షిణాపథ మహామండపాలు ఉన్నాయి. మండపాల కుడ్యాలలో దేవకోష్ఠాలు, రంధ్రాలకిటికీలు ఉన్నాయి. పశ్చిమ కుడ్యంలో నాలుగు శివప్రతిమలు, రంధ్రాలకిటికీలు ఉన్నయి. దక్షిణ కుడ్యం పతనమై ఉంది. మండప స్తంభాలకు శీర్షికభాగాన సాధారణవంపుగ(corbels) ఉన్నాయి. స్తంభాలు చతుర్ముఖంగా ఉన్నాయి.

**విరూపాక్ష దేవాలయం :** పట్టదకల్ దేవాలయాల్లో విరూపాక్ష దేవాలయం ముఖ్యమైంది. ఇది చాళుక్య రాజైన రెండో విక్రమాదిత్యుని (క్రీ.శ.733 - 746) రాణిచే నిర్మింపబడింది. ఇతడు పల్లవ రాజధానిని ముట్టడించి, విజయాన్ని సాధించి, ఆనగరంలోని కైలాసనాథ ఆలయాన్ని చూసి, ఆదేవిధమైన ఆలయాన్ని తన పట్టదకల్ రాజధానిలో(తాత్కాలికం) నిర్మింపదలచి కాంచీపురమందలి 'గుండ' అను వాస్తునిపుణుని తనతోబాటు తెచ్చి విరూపాక్ష ఆలయాన్ని నిర్మించినట్లు తెలుస్తున్నది. దీనికి కూడా గర్భగృహ , అంతరాళ ప్రదక్షిణాపథ, ముఖ (స్తంభ) మండప ఉన్నాయి. ఆలయం చుట్టూ ప్రాకారం ఉంది. దీని తూర్పు కుడ్యంమధ్య గోపుర ద్వారం ఉంది. గర్భగృహ లో శివలింగం ప్రతిష్ఠింపబడి ఉంది. గర్భగృహ ద్వారానికి ఇరువైపులా చిత్రాలు, పైవిభాగన మకరతోరణ చిత్రరూపాలు ఉన్నాయి. మకరతోరణాలు రెండింటి మధ్యా ఒక పెద్ద కూడు (gable) డిజైన్ గలదు. వీటిపైన ఒక వరుస కూడులున్నాయి. ఈ వరుసపై మరొక కూడు డిజైను ఉంది. దీనికి లలాటం (spede-head-top) ఉన్నది. దీనిమధ్య మానవ శిల్పాలున్నాయి. ఈ ఆలయ అధిష్ఠానమందు పట్ట, గళ మొదలైన విభాగాలున్నాయి. అధిష్ఠానంపైనగల కుడ్యమున ముందుకు చొచ్చుకొనియున్న (projected) దేవకోష్ఠాలు ఉన్నాయి. వీటిపైన ద్వితల ద్రావిడరీతి విమానాలు ఉన్నాయి. వీటికిరువైపూ మకరతోరణాలున్నాయి. దేవకోష్ఠలలో విష్ణు, వామన శివ పార్వతి మొదలగువారి శిల్పాలున్నాయి. దేవకోష్ఠల మధ్య లోతుకుడ్యభాగల్లో (recesses) సాదా కుడ్యస్తంభాలు ఉన్నాయి. కుడ్యంపైనగల కపోత రెండు విభాగంలుగా ఉంది. కింది విభాగాలో మానవతలలుగల కూడుడిజైన్‌లు, పైవిభాగంలో వ్యాళలు ఉన్నాయి. కపోతపైనగల విమానం నాల్గుతలలను కలిగి ద్రావిడరీతి కూట, పంజర, శాల హారాలవరుసలను ప్రతి తలంలో కలిగి ఉంది. విమాన తూర్పు ముఖభాగాన సుఖసాన నిర్మాణం ఉంది. ఆలయ మండపమందు నాలుగువరుసల స్తంభాలున్నాయి. ఒక్కొక్క వరుసలో ఐదు స్తంభాలున్నాయి. ఇవి ఘనచతురస్రంగా ఉన్నాయి. తరంగపట్టి (corbel) ను కలిగి ఉన్నాయి. ఈ స్తంభాలపై రామాయణ, మహాభారత కథా శిల్పాలు ఉన్నాయి. వీటిలో జటాయువు ఉదంతం, శూర్పణక ఉదంతం ఉన్నాయి. మండప పెకప్పులోపలి ముఖభాగంలో ఏడు అశ్వాలతో ఉన్న సూర్యుని చిత్రం ఉన్నది. మండపం మూడువైపుల మూడు వసారాలు (porches)నిర్మింపబడి ఉన్నాయి. ఆలయ అంతరాళకు దగ్గరగా మండప మూలల్లో దుర్గ, గణేశ దేవగృహాలు ఉన్నాయి. ఆలయ ప్రాకార లోపలి ముఖభాగాన్ని అనుకొని పది ప్రాకార దేవతా గృహాలున్నాయి.

**మల్లికార్జున దేవాలయం :** రెండో విక్రమాదిత్యుడు పట్టదకల్ ప్రాంతమందు మల్లికార్జున దేవాలయాన్ని నిర్మించినాడు. ఇది ఇతని రాణి పేరుమీదుగా నిర్మింపబడింది. కావుననే దిన్ని త్రైలోక్య మహాదేవి ఆలయం అనికూడా పిలుస్తారు. ఇతని ఆకస్మిక మరణం వలన ఇది అసంపూర్ణంగా నిలిచిపోయింది. విరూపాక్ష దేవాలయం లాగ దీనికి కూడా గర్భగృహ, అంతరాళ, ప్రదక్షిణాపథ, స్తంభమండప, వసారా (porch) ఉన్నాయి. గర్భగృహ ద్వారంపైన గరుడుని ప్రతిమ ఉన్నది. గర్భగృహపైన నాలుగుతలాల విమానం ఉన్నది. దీనిపైన వేసర శిఖరం ఉంది. విమానం ముందు సుఖనాస నిర్మాణం ఉంది. ఆలయం ముందు నందిమండపం ఉంది. ఆలయంలోపల భగవద్గీతలోని పలు ఘట్టాలతో కూడిన శిల్పాలు ఉన్నాయి.

## ఉత్తరభారతరీతి దేవాలయాలు

**పాపనాథ దేవాలయం :** పట్టధకల్ యందలి ఉత్తరభారతరీతి (వేసరరీతి) దేవాలయల్లో పాపనాథ దేవాలయంముఖ్యమైంది. ఇది తొలుత వైష్ణవ ఆలయమని తరవాత శైవ ఆలయంగా మార్చబడిందని తెలియుచున్నది. ఇది గర్భగృహ, ప్రదక్షిణ, అంతరాళ లేక ముఖమండప, స్తంభమండప, వసార (porch), అను విభాగాలు ఉన్నాయి. గర్భగృహ చతురస్రాకారంగా ఉన్నది. దీని ద్వారానికి ఇరువైపులా చట నిర్మాణం గలదు. ద్వారంపైన గల లిటెల్ భాగంలో నాగుపాములను పట్టుకొనిఉన్న గరుడుని చిత్రం ఉంది. గర్భగృహ చుట్టున్న ప్రదక్షిణాపథ గోడల వెలుపలి ముఖభాగాం ఆలయం మూడువైపులా పెద్దఉబ్బెత్తు కూడలు (projected miches ) ఉన్నాయి. ముఖమండపం మధ్య అష్టముఖ స్తంభాలు నాలుగు ఉన్నాయి. దీని పైకప్పు లోపలిముఖభాగాన దిక్పాలకుల చిత్రాలు ఉన్నాయి. మండప స్తంభాలలో కొన్ని ఘనచతురస్ర, అష్టముఖ విభాగాలుగల స్తంభాలున్నాయి. పోర్చి స్తంభాలపై గణ, దేవత, పథక చిత్రాలు ఉన్నాయి. ఈ స్తంభాలకు తరంగపట్ట విభాగం కార్బెల్ (corbel) విభాగం ఉంది.

ఈ ఆలయ అధిష్టానం తక్కువ ఎత్తుగా ఉన్నది. కుడ్యభాగాలలో దేవకోష్ఠలు, రంధ్రాల కిటికీలు, దేవకోష్టలకు ఇరువైపులా కుడ్యస్తంభాలు, వీటిపైన కూడు (goble) డిజైను ఉన్నాయి. కోష్టలలో దేవత, మానవ శిల్పాలున్నాయి. కుడ్యం పైభాగానగల కపోత రెండు విభాగాలుగా ఉంది. కిందివిభాగం ఉబ్బెత్తుగా ఉంది. దీని ముఖభాగాన కూడు డిజైన్లున్నాయి. పైవిభాగం లోతుగా (recess) ఉంది. ఇందు వ్యాళ, గజాల చిత్రాలున్నాయి. కపోతపైన కూట, పంజర, శాల హార [redacted] వరుసలు ఉన్నాయి. దీనిపైన ఉత్తరభారత రీతి విమాన నిర్మాణం ఉన్నది. విమానాన హుపాగ, కొనికాపాగ లను విభాగాలు ఉన్నాయి. అనురాహాపాగ లేదు. ప్రస్తుతం మూడు తలాల విమానం మాత్రం ఉంది. మిగిలిన విభాగమంతయు పతనమై ఉంది. కొనికాపాగ యందు భూమిఅమలకలు విమాన తలాలను తెలుపు చున్నాయి. విమానం ముందుభాగాన సుఖనాస లను నిర్మాణం ఉంది. దీని ముఖభాగాన ఒక పెద్ద కూడు (gable) డిజైను ఉంది. దీనిలో నటరాజు ప్రతిమ ఉంది.

**గళగనాథ దేవాలయం :** ఈ ఆలయ గర్భగృహ వెలుపలి కుడ్య ముఖభాగం మూడు ఉబ్బెత్తు వసారాలలాగ ఉంది. త్రిరథ శిఖరం ఈ దేవాలయంలో ఉంది. విమాన కొనికాపాగలో భూమి అమలకలు విమానతలాలను తెలుపుతున్నాయి.

**కాశీవిశ్వేశ్వర దేవాలయం :** దీని విమానం కూడా పైరీతిలోనే ఉంది. ఈ ఆలయానికి గర్భగృహ, మండపలు ఉన్నాయి. గర్భగృహ తో శివలింగమున్నది. మండప పైకప్పు లోపలి ముఖభాగ [redacted] శివపార్వతులు, వారిచుట్టూ దిక్పాలురు గల చిత్రముంది. గర్భగృహ ద్వారంపైనెగల లిటెల్ భాగాన గరుడుని ప్రతిమ ఉన్నది. మండప లిటెల్ భాగాన నటరాజు ప్రతిమ ఉంది.

**కాడసిద్ధేశ్వర దేవాలయం :** దీన్ని కూడా వేసర విమానమున్నది. గర్భగృహ వెలుపలి కుడ్యభాగంలో దేవకోష్ఠలున్నాయి. ఉత్తకుడ్య కోష్టయందు దేవిప్రతిమ ఉంది. దేవి చేతుల్లో పద్మం, వృషభం

శిరస్సు ఉన్నాయి. పశ్చిమ కుడ్య కోష్టంలో విష్ణుప్రతిమ ఉంది. ఆలయ విమానం ముందు సుఖనాస నిర్మాణం ఉన్నది. ఇందు నటరాజు ప్రతిమ ఉంది.

**ఆంధ్రలోని నవబ్రహ్మ ఆలయాల సమూహం :** ఆంధ్రప్రాంతంలో ఆలంపూర్ యందు నవబ్రహ్మ ఆలయాలనెడి తొమ్మిది దేవాలయాలు ఉన్నాయి. వీటిలో ఒకే ప్రాంగణంలో ఆరు నిర్మిపబడి ఉన్నాయి. ప్రాకారం వెలుపల మూడు దేవాలయాలు ఉన్నాయి. ఇన్నీ క్రీ.శ 8వ శతాబ్ద ప్రారంభాన నిర్మింపస్తున్నట్లు తెలిన్నది. ఈ దేవాలయాలన్నింటికి పేరు కొసన బ్రహ్మలనెడి పదమున్నది. ఈ ఆలయాలను గరుడబ్రహ్మ, బాలబ్రహ్మ, అర్కబ్రహ్మ, పద్మబ్రహ్మ, విశ్వబ్రహ్మ, తారకబ్రహ్మ, వీరబ్రహ్మ, కుమారబ్రహ్మ, స్వర్గబ్రహ్మ దేవాలయాలని పిలుస్తారు. ఇవన్నీ ఒకే రీతిలో ఉన్నాయి. అన్నింటికీ గర్భగృహ , అంతరాళ, ప్రదక్షిణ మండప అను విభాగాలు ఉన్నాయి. విశ్వబ్రహ్మ ఆలయాన్ని నవబ్రహ్మ ఆలయాలకు ఉదాహరణగా తెలుసుకొన వచ్చును. ఇది 55 అడుగుల పొడవు, 35 అడుగుల వెడల్పు ఉంది. దీనికి గర్భగృహ , అంతరాళ, ప్రదక్షిణాపథ, స్తంభమండపాలు ఉన్నాయి. గర్భగృహలో శివలింగమున్నది. గర్భగృహ కుడ్యం వెలుపలి ముఖభాగాన దేవకోష్టలు ఉన్నవి. ప్రదక్షిణ కుడ్యాల్లో కూడా ఇదేరీతిగా ఉన్నది. ఆలయ అధిష్టానం నందు గల గళవిభాగంపై అనేక మానవ చిత్రాలున్నాయి. గర్భగృహ ద్వారంపైనగల లిటెల్‌నందు సర్పాలను పట్టుకొని ఉన్న గరుడుని ప్రతిమ ఉంది. ద్వారాలకిరువైపులా చత్రాలు, వాటిపైన గంగాయమునల చిత్రాలు ఉన్నాయి. మండప స్తంభాలకు చోళులరీతి కార్బెల్ ఉంది. మహానంది, కర్నూలు, చేబ్రోలు, పంచలింగాల ప్రాంతాల్లో కూడా వీరి ఆలయాలు ఈ రీతిలో ఉన్నాయి.

## తొలిచాళుక్యుల శిల్పకళ

తొలిచాళుక్యులు పశ్చిమదక్కన్ ప్రాంతాలనేగాక ఆంధ్రప్రాంతాన్ని కూడా క్రీ.శ.543 నుంచి క్రీ.శ.753 వరకు పరిపాలించారు. ఈ వంశరాజల్లో మంగళేశ, రణరాగ, రెండో పులకేశి విక్రమాదిత్యుడు ముఖ్యులు. వీరి వాస్తు శిల్పకళలు రెండు రకాలుగా ఉన్నాయి. అవి : (1) గుహాలయాలు (2) కట్టడ ఆలయాలు. కర్ణాటకలోని బిజాపూర్ జిల్లాలోని బాదామియందు వీరి గుహాలయాలున్నాయి. ఇవి. సాదాగా ఉన్నాయి. వీటికి స్తంభమండప, దీని వెనుక కుడ్యంలో దేవగృహం ఉన్నాయి. ఇచటి ఒకటో రెండో గుహలు చిన్నవి. మూడో గుహ పెద్దది. వీటి స్తంభాలు లావుగా ఉన్నాయి. తరంగపట్ట (corbel) ను కలిగిఉన్నాయి. వీటిలోని శిల్పాలు ప్రసిద్ధిగాంచినాయి. ఇచట శైవ, వైష్ణవ శిల్పాలు రెండూ ఉన్నాయి. ఇవి తొలిచాళుక్యుల శిల్పకళారీతిని తెలుపుతున్నాయి. వీరి కట్టడ ఆలయాలు ఇదివరకే తెలిపినట్లు ఐహోలె, బాదామి, పట్టడకల్, మహాకూటేశ్వర్, ఆలంపూర్, మహానంది, సత్యవోలులలో ఉన్నాయి. బాదామి గుహాలయాల్లో ఒకటో గుహ, ద్వారంవద్ద నటరాజ శిల్పం, గర్భగృహలో అర్థనారీశ్వర శిల్పం, పైకప్పుభాగంలో నటరాజ శిల్పాలు ఉన్నాయి. రెండో గుహలో వరాహ, త్రివిక్రమ, హరిహర ఉన్నారు. మూడో గుహలో త్రివిక్రమ, విష్ణు, వరాహ హరిహర నరసింహ శిల్పాలున్నాయి.

ఈ గుహల్లోని ముఖ్య దేవతా శిల్పాలు. మనిషి ఎత్తుకు రెండితల ఎత్తుగాను, లావుగాను

ఉన్నాయి. సారనాథ్ శిల్పాలలో బాదామి శిల్పాలు అర్థాన్ని, ప్రాముఖ్యాన్ని (importance) తెలియజస్తున్నాయి. మానవాతీత శక్తికి స్వశక్తికి నిలయాలుగా ఉన్నాయి. ఇచ్చటి మూడో గుహాలయం పెద్దదిగా ఉండుటేగాక శిల్పాలతో నిండిఉన్నది. అనంతపై ఆసీనుడైఉన్న పెద్ద విష్ణుప్రతిమ, వరాహ, త్రివిక్రమ, నరసింహ శిల్పాలు ఇచట ఆకర్షణీయంగా రూపొందింపబడి ఉన్నాయి. ఈహాలు కొనలోని స్తంభాలు శీర్షికభాగంలో అందమైన శిల్పాలు (figure craclets) ఉన్నాయి. ఈ శిల్పాలు తరువాతికాలపు శిల్పాలకు మార్గదర్శకమైనవి. ఇట్టి ప్రభావం కురువెట్టిలో కనపడతాయి. కాకతీయ శిల్పాల్లో కూడా వీటి ప్రభావం కనపడుతుంది.

వీరి కట్టడ ఆలయాల్లో కూడా అద్భుత శిల్పాలు కనపడతాయి. వీరి తొలి ఆలయాల్లో దుర్గ, లాడ్‌ఖాన్, కోంట్‌గుడి, మొగూతి ఆలయాలు ముఖ్యమైనవి. దుర్గ ఆలయంలో శివ, నరసింహ, మహిషమర్ధని, విష్ణు, వరాహ మొదలగు శిల్పాలు గర్భగృహ చుట్టూ ఉన్నాయి. దీని మండప స్తంభాలపై కూడా అద్భుత శిల్పాలున్నాయి. దీని పైకప్పు భాగంలో ఎగురుచున్న దేవతల శిల్పాలున్నాయి. లాడ్‌ఖాన్ ఆలయంలోని స్తంభాలపై అందమైన శిల్పాలున్నాయి. దీని వసారా (porch) స్తంభాల్లో మిధున శిల్పాలున్నాయి. కోంట్‌గుడిలో విష్ణు, బ్రహ్మ, శివులకు చెందిన ఐదు శిల్పాలున్నాయి. మొగూతి ఆలయంలో అంబిక శిల్పం ఉంది. పట్టడకల్ ఆలయాల్లో పల్లవ ప్రభావం కనపడుచున్నది. విరూపాక్ష ఆలయం ఈ ప్రభావానికి ముఖ్య ఉదాహరణ. ఇది పల్లవుల కంచిలోని కైలాసనాథ ఆలయ ప్రభావాన్ని ఉన్నది. విరూపాక్ష ఆలయ శిల్పాల్లో గంగాదేవి కథ, అమృతమదనం, అహల్యప్రేమ, ఇంద్ర, బాణాలపాన్పుపై ఆఖరి శ్వాసలోయున్న భీష్ముడు మొదలగు శిల్పాలు ముఖ్యమైనవి పట్టడకల్‌లోని పాపనాథ ఆలయంలో అందమైన మిధున, త్రిపురాంతక, రామాయణ కథా శిల్పాలు ఉన్నాయి. ఇచటి శిల్పాలు మానవాకారంకన్నా చిన్నవిగను, తక్కువ లోతుగా చెక్కబడిన విగను (lower in relief) ఉన్నాయి. బాదామి శిల్పాలకు భిన్నంగా ఉన్నాయి. ఇచటి కోష్టల్లో లింగోద్భవ, నటరాజ, జటాయు, రావణ, నృత్యగణపతి, భిక్షాటన మూర్తి, హరిహర, వరాహ, అర్ధనారీశ్వర, త్రివిక్రమ మొదలగు వారి శిల్పాలు ఉన్నాయి. వలలవంటి కిటికీలు వీరి శిల్పకళలో ఒక అద్భుతం. పర్ణం, స్వస్తిక మొదలగు డిజైన్లు కూడా వీటిలో ఉన్నాయి.

# 15

# పల్లవుల ఆలయ వాస్తు శిల్పం

పల్లవులు కాంచీపురాన్ని రాజధానిగా క్రీ.శ.550 నుంచి క్రీ.శ.898 వరకు పరిపాలించారు. ఈ నవీన పల్లవ వంశ స్థాపకుడు సింహవిష్ణు (క్రీ.శ.550 - 580). ఇతని తరవాత ఇతని కుమారుడు "విచిత్ర చిత్త" బిరుదాంకితుడు ఒకటో మహేంద్రవర్మ (క్రీ.శ. 580 ' 630), మనుమడు "మామల్ల" (మహామల్ల) బిరుదాంకితుడు ఒకటో నరసింహవర్మ (క్రీ.శ. 630 - 672), మునిమనుమడు ఒకటవ పరమేశ్వరవర్మ (క్రీ.శ. 672 - 700) వరసగా పల్లవ రాజ్యాన్ని పాలించారు. ఆ తరవాత పరమేశ్వరవర్మ కుమారుడు రాజసింహ బిరుదాంకితుడైన రెండో నరసింహవర్మ (క్రీ.శ. 700 - 728), రెండో పరమేశ్వరవర్మ పాలించారు. తరవాత పల్లవ రాజుల్లో, రెండో నందివర్మ, ధంతివర్మ, మూడవ నందివర్మ ముఖ్యులు. కడపటివాడు అపరాజితుడు క్రీ.శ. 898లో చోళాదిత్యుని చేతిలో ఓడుటతో ఈ వంశం అంతరించింది.

## పల్లవుల వాస్తుకళ

పల్లవుల కాలంలో వాస్తు, శిల్పకళ పరిమళాలు వెదజల్లుచు వికసించింది. అధ్యయనం కొరకు దీనిని రెండు దశలుగా విభజించవచ్చు. మొదటి దశలో నిర్మాణాలన్నీ ఏకశిలా నిర్మితాలు. రెండో దశకు చెందినవన్నీ కట్టడ నిర్మాణాలు.

మొదటి దశవన్నీ పర్వత, శిలాఖండాలలో రూపొందించబడ్డవి. వీటిని నిర్మాణరీత్యా మూడు భాగాలుచేయవచ్చు. అవి : (1) పర్వత శిలలో తొలచి రూపొందించిన (cut-in-caves) గుహాలయాలు ( లేక మంటపాలు), (2) పెద్ద శిలాఖండంలో రూపొందించిన ఏక శిలా రథాలు (cut-out-mondiths) , (3) పెద్ద శిలాఖండంపై చెక్కబడ్డ శిల్పాల సమూహం. రెండో దశవన్నీ కట్టడ (structural) ఆలయాలు.

ఈ రెండు దశల నిర్మాణాలను తిరిగి వాస్తు శిల్పరీతా విడివిడిగా రెండు రెండు విభాగాలుగా అధ్యయనం చేయవచ్చు. క్రీ.శ. 600 - 630 మధ్య రూపొందించబడ్డ గుహాలయాలు (లేక మడంపాలు) మహేంద్ర (వర్మ) రీతి (style) గను, క్రీ.శ. 630 - 690 మధ్య నిర్మింపబడ్డ గుహాలయాలు, ఏకశిలా రథాలు "మామల్ల" రీతిగను మొదటి దశలోని ఏకశిలా నిర్మాణాలను విభజించవచ్చును. క్రీ.శ. 700 - 800 మధ్య నిర్మింపబడ్డ కట్టడ ఆలయాలు (structural temples) రాజసింహ రీతిగను, క్రీ.శ. 800 - 900 మధ్య నిర్మింబడ్డ కట్టడ ఆలయాలను నందివర్మరీతిగను రెండో దశలోని కట్టడ ఆలయాలుగా విభజించవచ్చును.

ధర్మరాజమంటప, కోటికల్‌మంటప, వరాహమంటప (ప్రారంభ దశతుత్ర) అనే గుహాలయాలు మహేంద్రరీతికి చెందినాయి. ఒకటో నరసింహవర్మ నిర్మించిన త్రిమూర్తి మంటప, మహిషాసురమర్ధని మంటప, వరాహమంటప ( ఒకటి, రెండు), త్రివిక్రమ మంటప, పంచపాండవ రథాలు (ధర్మరాజ, భీమసేన, అర్జున, నకుల - సహదేవ (ద్రౌపది రథాలు), గోవర్ధన శిల్పాలు, గంగావతరణ లేక అర్జున తపస్సు అనెడి పెద్ద శిల్ప ఖండం, ఒకటవ పరమేశ్వరవర్మ నిర్మింపజేసిన రామానుజ మండప, గణేశ రథముల మామల్ల రీతికి చెందినవిగా చెప్పవచ్చును. (పై గుహాలయాలు, రథాల గూర్చి వివరంగా హిందూ గుహాలయాల అధ్యాయంలో తెలుపబడి ఉన్నది). ఇక రాజసింహరీతికి తీరదేవాలయం, కైలాసనాథ దేవాలయంవంటివి, నందివర్మరీతికి వైకుంఠ పెరుమాళ్, పరశురామేశ్వర వంటి ఆలయాలు ఉదాహరణలుగా చెప్పవచ్చును.

ఒకటవ నరసింహవర్మ (మామల్ల) కాలంవరకు పల్లవ నిర్మాణాలన్నీ పర్వత ప్రాంతాలలోనే గాయి. ఈ నిర్మాణాలు కాంచీపురంవంటి పర్వతాలులేని పల్లవు ప్రాంతాలలోను సముద్ర తీరాలలోను నిర్మించుటకు వీలుపడలేదు. ఈ పరిస్థితిని తొలగించి కంచివంటి ప్రాంత ప్రజలకు కూడా దేవతా ఆలయాలు ఏర్పరచుటకై కట్టడ ఆలయాల నిర్మాణాన్ని రెండవ నరసింహవర్మ చేపట్టెను. ఇదే కాలానికి కర్ణాటక ప్రాంతాలలో పశ్చిమ (బాదామి లేక వాతాపి) చాళుక్యులు గుప్త (ఉత్తరభారతదేశం) ఆలయాలను కొంతవరకు మార్గదర్శకంగా ఉంచుకొని తమ కట్టడ ఆలయాల నిర్మాణాన్ని సాగించుచున్నారు. కాని పల్లవులు ఒక ప్రత్యేకరీతితో తమ ఆలయాలను నిర్మించారు. తమ రథాలను చాలవరకు తమ కట్టడ ఆలయాల నిర్మాణానికి వీరు మార్గదర్శకంగా ఉంచుకొన్నట్లు కనపడుచున్నది. రెండవ నరసింహవర్మ నిర్మించిన వాటిలో మహాబలిపురమందలి తీర దేవాలయం (shore temple) , కాంచీపురమందలి కైలాసనాథ దేవాలయం ముఖ్యమైనవి. ఇతని నిర్మాణరీతినే రాజసింహరీతి అంటారు. ఇతని తరువాత వాడు నందివర్మ కాంచీపురంలో వైకుంఠ పెరుమాళ్, మాతంగేశ్వర, ఐరావతేశ్వర, దేవాలయాలు, గుడిమల్లంలోని పరశురామేశ్వరాలయం, ఓరగడంలోని వేదమల్లీశ్వరాలయాలను నిర్మించాడు. పల్లవుల ఏకశిలా నిర్మాణాలు కాకిరాయి (granite)తో రూపొందించబడగా, కట్టడ ఆలయాలు ఇసుకరాయి (sand stone)తో నిర్మింపబడ్డాయి.

**తీరదేవాలయం**

మహాబలిపురంలోని తీరదేవాలయం పల్లవ కట్టడ ఆలయాలలో మొదటిది. ఇది సముద్రానికి అతి దగ్గరలో ఉండుట వలన దీనికి తీర దేవాలయం అని పేరువచ్చింది.

రెండవ నరసింహవర్మ లేక రాజసింహుడు తలపెట్టిన కట్టడ ఆలయాలలో ఇది మొదటిది. ఇందు మూడు దేవగృహాలున్నాయి. ఒకటి తూర్పుముఖంగల శివాలయం. దీనినే క్షత్రియ సింహ పల్లవేశ్వర గృహం అని కూడా అంటారు. రెండవది పశ్చిమముఖ శివ దేవగృహ. దీనినే రాజసింహ పల్లవేశ్వర దేవగృహ అంటారు. మూడవది అనంతశాయి దేవగృహ. దీనిపై రెండు దేవగృహాలమధ్య నిర్మించారు. ఈ దేవాలయ సముదాయానికి తూర్పున ఒక గోపుర ద్వారం, పడమటివైపున రెండు ఆవరణాలు ఉన్నాయి. ఈ ఆవరణాలలో పడిపోయిన నిర్మాణాలు మండపాల అవశేషాలున్నాయి. రెండుప్రాకారాలున్నాయి.

తూర్పుముఖ శివదేవగృహం లోనికి తూర్పుప్రాకారం మధ్యలో కంచి కైలాసనాథ ఆలయంలో లాగ గజపృష్ఠ ఆకార గోపుర ద్వారం ఉన్నది. దీనిగుండా అవరణలోనికి ప్రవేశించినచో తూర్పుముఖ శివదేవగృహం ఎదురుగా కనపడుతుంది. దీనినే క్షత్రియ సింహ పల్లవేశ్వర గృహం అంటారు. దీనికి గర్భగృహ, అర్ధమండప (లేక అంతరాళ), ఈ రెండిటిచుట్టూ ప్రదక్షిణాపథ, దీని ఉత్తర, దక్షిణ, తూర్పులలో ఎత్తైన పిట్టగోడలు ఉన్నాయి. ఈ దేవగృహానికి అదిష్ఠానం, కుడ్యం, కపోత, హారాల వరుసలుగల ద్రావిడ విమానం, గ్రీవ, శిఖర లేక స్తూప ఊర్ధ్వముఖంగా ఉన్నాయి.

అధిష్ఠానం 4 1/2 అ!! ఎత్తున్నది. ఉపాన, పట్ట, త్రిపట్ట, గళ వంటి విభాగాలు దీనికి ఉన్నాయి.

అధిష్ఠానం పైనగల కుడ్యభాగంలో దేవకోష్ఠాలు ఉన్నాయి. వీటికిరువైపులా దుముకుచున్న సింహాలున్నాయి (rearing lions), క్షుద్యస్తంభాలు ఉన్నాయి. ముఖ్యదేవునికి సంబంధించిన దుర్గ, పార్వతివంటి శిల్పాలు దేవ కోష్ఠలో ఉన్నాయి. కోష్ఠలపైన మకరతోరణ రూపం ఉన్నది. ఈ కాలంలో ప్రత్యేక దేవగృహాల నిర్మాణం లేదు.

కుడ్యంపైన కపోత విభాగం ఉన్నది. దీని ముఖభాగంపై మానవ తలలుగల 'కూడు'ల జంటల వరుసలున్నాయి. వీటికి స్పేడ్‌హెడ్‌టావ్‌ఉన్నది. కపోతపైన (recess) విభాగం ఉన్నది. ఇందు వ్యాళల వరుస ఉన్నది.

కపోతపైన నాలుగు తలాలుగల విమానమున్నది. ప్రతి తలకిందగల ఫలక ముఖభాగంపై 'కూడు' లు ఉన్నాయి. మొదటి తలం నాలుగు మూలలో కూర్చొనిఉన్న సింహాలున్నాయి. కూట పంజర శాల హారాలు లేవు. రెండవ, మూడవ తలాలలో కూట, పంజర, శాల హారాలున్నాయి. నాల్గవ తలం మూలల్లో భూత గణాలు కూర్చొని ఉన్నారు. వీరు పొడవైన బాకాలను ఊదుచున్నారు. ఇవి నాదస్వరాలలాగ ఉన్నాయి. కొందరు ఈ దేవగృహానికి 5 తలాలున్నాయని రాశారు. కానీ ఇది పూర్తిగా తప్పు. 4 తలాలు మాత్రమే ఉన్నాయి.

నాల్గవతలం యొక్క మధ్య గ్రీవ (neck octagonal) ఆకారంలో నిర్మింపబడి ఉన్నది. దీనిపైన 8 ముఖాల ద్రవిడ శిఖరమున్నది. దీనిపైన నల్లరాతి కలశ లేక స్తూపి ఉన్నాయి.

ఈ దేవగృహం యొక్క లోపలి వివరాలు పరిశీలించినచో ఈ దేవగృహముందు భాగంలో అర్ధమండపలోనికి మెట్లు ఉన్నాయి. అంతరాళ గోడలపై శిథిలమైన దుర్గవంటి శిల్పాలున్నాయి. ఈ అర్ధమండపం 3 అ!! వెడల్పు 5 అ!! పొడవు ఉన్నది. గర్భగృహాలో 16 ముఖాలుగల ఎత్తైన నల్లరాతి (granite stone) శివలింగమున్నది. దీనికి పానవట్టం లేదు. కానీ నేలపై పానవట్ట ఆకారం గలదు. శివలింగం వెనుకగల గోడ లోపలిముఖభాగంపై సోమస్కంద శిల్పరూపమున్నది.

పశ్చిమముఖ శివదేవగృహం కూడా తూర్పుముఖ శివదేవగృహ లాగ ఉన్నది. కాని

పరిమాణంలో చిన్నది, మూడు తలాలను మాత్రమే కలిగి ఉన్నది. దీనికి రాజసింహ పల్లవేశ్వర గృహమని కూడా పేరు. దీనికి గర్భగృహ, అంతరాళ ఉన్నాయి. గర్భగృహాల్లో ప్రస్తుతం శివలింగం కూడా లేదు. ఒకప్పుడుండేది. దీని వెనుక గోడ లోపలి ముఖ భాగంలో కూడా సోమస్కంద శిల్పరూపం ఉంది. ఇందు కూడా శివుడు, ఉమాదేవి (పార్వతి) కుమారుడైన స్కందుడు ఉన్నారు. ఈ శిల్పం పైన వీరికిరువైపులా బ్రహ్మ, విష్ణువులు ఉన్నారు.

ఈ దేవగృహం అదిష్టానం కూడా తూర్పుగృహ అదిష్టానంలాగ ఉపాన, పట్ట, త్రిపట్ట గళలను ఉంది. కాని పరిమాణం చిన్నది.

అదిష్టానంపైన కుడ్యం గలదు. దీనిపై దేవకోష్టలున్నాయి. వీటికిరువైపులా కుడ్యస్తంభాలు, వీటి మూలంలో (base) దుముకుచున్న (raring) సింహాలు, దేవకోష్టలపైన మకరతోరణాలు, దేవకోష్టలలో దేవతా శిల్పాలు ఉన్నాయి.

కుడ్యంపైన కపోత ఉన్నాయి. దీని ముఖభాగంపై కూడా 'కూడు' లున్నాయి. వీటిలో మానవ తలలు, వీటిపైన లలాటాలు (spade-head-top) ఉన్నాయి. కపోలపైనగల (recess) లో వ్యాళలున్నాయి.

కపోత, (recess)లపైన మూడుతలల విమానముంది. మొదటి తలంలో 'హార' ములు లేవు. కాని ఈ 'తల' నాల్గు మూల్లో నాదస్వరం ఊదుచున్న గణాలున్నారు. ఈ శిల్పాల మధ్య శిలకోష్ట కుడ్యస్తంభాలు ఉన్నాయి. రెండో తలం 'ఫలకో'పై ముఖంపై 'కూడు' 'వ్యాళ' చిత్రాల వరుస ఉంది. ఫలకపైన 'హారాల' వరుస ఉంది. మూడవ 'తలం' 'ఫలక' (పీఠం) ముఖాన కూడా 'కూడు'ల వరుస ఉంది. ఈ తలం నాల్గు మూలలో భూతగణాలున్నాయి. ఈ తలం మధ్యలో అష్టముఖ గ్రీవ, దానిపైన అష్టముఖ ద్రావిడ 'శిఖర', దీనిపైన కలశ ఉన్నాయి.

తూర్పు పశ్చిమ ముఖ శివదేవగృహాలను పశ్చిమం నుంచి చూసినచో పశ్చిమ గృహం ఎత్తు తక్కువగా కనపడుతుంది.

తూర్పు, పశ్చిమ దేవగృహాల మధ్య తూర్పుముఖంగా ఒక అనంతశాయి విష్ణు దేవగృహం ఉన్నది. దీనినే నారపతి సింహ పల్లవేశ్వర దేవగృహం అని కూడా పిలుస్తారు. దిన్ని పళ్ళికొండేరులయ దేవగృహం అని కూడా పిలిచేవారు. దీనికి దీర్ఘచతురస్రాకార గర్భగృహ చిన్న అంతరాళ ఉన్నాయి. దీని గర్భగృహాల్లో శయనభంగిమలోని విష్ణువు ఒక పెద్దబండపై రూపొందిపబడి ఉన్నారు. ఈయన ఆదిశేషుడు స్పష్టంగా లేడు. ఈ శిల్పంలో బ్రహ్మ, విష్ణు, లక్ష్మి శిల్పాలు లేవు. ఇది రాజసింహ కాలానికి ముందుదని కూడా అంటారు.

ఈ దేవగృహ అంతరాళ దక్షిణ కుడ్యంలో గజేంద్రమోక్షం, ఉత్తర కుడ్యంలో కాళీయ కృష్ణ శిల్పాలున్నాయి. ఇది వైష్ణవగృహం కావున ఇవి ఉన్నాయి.

పై మూడు దేవగృహాలు గల ఈ తీరదేవాలయం చుట్టు ఎత్తు తక్కువగల రెండు ప్రాకారాలున్నాయి. వీటిపైన వరుసగా నంది ప్రతిమలున్నాయి. వీటిప్రాకారం దాదాపు పూర్తిగా అదృశమైనది. లోపలిది చాలవరకు ఉంది. లోపలి ప్రకారం లోపల పశ్చిమ ముఖ దేవగృహముందు కొంత దూరంలో చతురస్ర, దీర్ఘచతురస్ర మండపాలున్నాయి. నేడు, వీటి అధిష్టానాలు మాత్రమే నిలిచి ఉన్నాయి. లోపలి ప్రాకార పశ్చిమ కుడ్యం మధ్య గోపుర ద్వారం ఉండేది. నేడు లేదు. ప్రాంగణంలో బలిపీఠం ఉంది.

## కైలాసనాథ దేవాలయం

కాంచీపురంలోని కైలాసనాథ దేవాలయాన్ని రెండో నరసింహవర్మ నిర్మించాడు. దీనికి తీర దేవాలయానికి రెండు ప్రాకారాలున్నాయి. లోపలి ప్రాకారం మధ్య ఆలయం నిర్మింపబడి ఉంది. ఈ ఆలయానికి గర్భగృహ, ప్రదక్షిణాపథ, స్తంభమండప లేక అంతరాళ, మండప అను విభాగాలున్నాయి. వెలుపలి ప్రాకారం ముందు కుడ్యం మాత్రం నేడు నిలచిఉంది. దీని మధ్యనే గోపురద్వారం నిర్మింపబడి ఉంది. ఇది గజపృష్ఠ ఆకారంలో ఉన్నది. ఈ గోపురానికి ఎడమవైపు ఆరు ప్రాకార దేవగృహాలు, కుడివైపు రెండు ప్రాకార దేవగృహాలు నేడు ఉన్నాయి. గోపురం ద్వారా లోనికి ప్రవేశించినచో ఎదురుగా లోపలి ప్రాకార కుడ్యం మధ్య మహేంద్రవర్మేశ్వర దేవగృహం ఉంది. ఇది రెండో నరసింహవర్మ కుమారుడు మహేంద్రవర్మ పేరుమీదుగా నిర్మింపబడింది. దీనికి గర్భగృహ, అంతరాళ, (porch)ఉన్నాయి దీని స్థానంలో ఒకప్పుడు గోపురం ఉండేదని అభిప్రాయం ఉన్నది. ఈ దేవగృహకు ఇరువైపులా లోపలి ప్రాంగణంలోనికి మార్గాలున్నాయి. ఈ ప్రాంగణంలోనే దేవాలయ నిర్మాణం ఉంది. దీని గర్భగృహ, ప్రదక్షిణ, అంతరాళ, మండపలలో ఆఖరుది విజయనగర కాలానిది.

ఈ ఆలయ అదిష్టానంలో పట్ట, త్రిపట్ట, గళలున్నాయి. అదిష్టానంపైగల కుడ్యం వెలుపలి ముఖభాగంల్లో దేవ కోష్టలున్నాయి. వీటిలో దేవతా ప్రతిమలున్నాయి. వీటికిరువైపులా కుడ్య స్తంభాలున్నాయి. వీటి మూలంలో (base) దుముకుచున్న సింహాలున్నాయి (rampent lion brackets). కుడ్యస్తంభాలకు తరంగపట్ట(corbel) ఉన్నది. కోష్టాలపైన మకర తోరణం ఉండి దేవ కోష్టాల్లోని ప్రతిమల్లో దుర్గ, నటరాజు, విష్ణు, గంగాధరమూర్తి ఉన్నారు. కుడ్యంపైన కపోత ఉంది. దీని ముఖభాగంపై కూడులు ఉన్నాయి. కపోతపైన విమానమున్నది. దీనికి నాలుగు తలాలున్నాయి. ప్రతి తలంలో కూట, పంజర, శాల హారాలున్నాయి. విమానంపైన గ్రీవ, శిఖర, కపురి ద్రావిడ రీతిలో నిర్మింపబడి ఉన్నాయి. ఈ ఆలయంలో గర్భగృహ, ప్రదక్షిణల ముందు భాగంలోని అంతరాళంలో 6 విజయనగర స్తంభాలు ఉన్నాయి. మండపలో 12 పల్లవరీతి స్తంభాలున్నాయి. వీటిలో ఒకదానిపై చాళుక్యరాజైన రెండో విక్రమాదిత్య శాసనం ఉన్నది, పల్లవులపై విజయానికి గుర్తుగా దీనిని ఇతడు చెక్కించాడు. లోపలి ప్రాకారం లోపలి ముఖభాగంలో పరివార దేవతాగృహాలు, వీటి మధ్యగల స్థలాల్లో శైవ చిత్ర లేఖనాలు (శిథిలదశలో) ఉన్నాయి.

## వైకుంఠ పెరుమాళ్ దేవాలయం

ఈ దేవాలయాన్ని పల్లవరాజైన రెండో నందివర్మ కాంచీపురంలో నిర్మించాడు. ఇతడు వైష్ణవ

మతాభిమాని. ఇతని పూర్వులు శైవ మతాభిమానులు. ఈ దేవాలయం దీర్ఘచతురస్రాకార ప్రాకారమధ్యగల ప్రాంగణంలో నిర్మింపబడి ఉన్నది. ప్రాకార ముందు కుడ్యం మధ్య గోపుర ద్వారం ఉన్నది. ఈ ఆలయానికి గర్భగృహ, అంతరాళ అను విభాగాలు ఉన్నాయి. ఇందు రెండు ప్రదక్షిణా పథలు ఒకదాని చుట్టూ మరొకటి నిర్మింపబడి ఉన్నాయి. వీటిన్నింటిచుట్టూ కొద్దిదూరంలో స్తంభాల వరండా (corridor) ఉంది. ఈ ఆలయం ముందు విభాగంగా ఒక స్తంభమండపమున్నది. దీనిముందుగల ప్రాంగణంలో గరుడమండపం ఉంది.

ఈ ఆలయం గర్భగృహపైన మరిరెండు గర్భగృహాలున్నాయి. కింది గర్భగృహలో ఆశీన విష్ణు, మధ్య గర్భగృహలో శయన విష్ణు, పైనున్న గర్భగృహలో స్థానక విష్ణు ప్రతిమలున్నాయి. కింది గర్భగృహచుట్టూ గల వెలుపలి ప్రదక్షిణాపథ కుడ్యభాగం మధ్య గర్భగృహ కింది భాగంవరకు నిర్మింపబడి ఉన్నది. ఈ కుడ్యపైభాగాలలో కూట, పంజర, శాల హారాలవరుస గలదు. ఈ హారాలు ఆలయ విమాన మొదటి తలంగా ఉపయోగపడుచున్నాయి. లోపలి ప్రాకారంచుట్టూగల కుడ్యం పైనున్న మూడో దేవగృహం కిందిభాగం వరకు నిర్మింపబడి ఉన్నది. దీని పైభాగాలలో కూట, పంజర, హారాల వరుసలున్నాయి. ఇవి ఆలయ విమాన రెండో తలంలాగ ఉపయోగపడుతున్నది. కింది గర్భగృహ కుడ్యం పైనున్న మూడో గర్భగృహ పైభాగం వరకు నిర్మింపబడియున్నది. దీని పైభాగాల్లో కూట, పంజర, శాల హారాలవరుసలున్నాయి. ఇవి ఆలయ విమాన మూడో తలంలాగ ఉపయోపడుతున్నవి. ఈ గర్భగృహపైన (తలంపైన) గ్రీవ, ద్రావిడ శిఖర, లోహ కలశాలు ఉన్నాయి. కింది గర్భగృహ నుండి, మరియు కింది గర్భగృహ వెనుక భాగం నుంచి లోపలి ప్రదక్షిణా పథ భాగంలో పైనున్న దేవగృహాలకు మెట్ల మార్గాల నిర్మాణం ఉన్నాయి. మెట్లలోని ఖాళీప్రాంతాల్లో దేవతా శిల్పాలుగల కోష్ఠాలు ఉన్నాయి. వీటికిరువైపులా కుడ్యస్తంభాలు ఉన్నాయి. ఈ ఆలయంలోని స్తంభవరండా కుడ్యభాగంలో రెండు వరుసలుగల అనేక చారిత్రక చిత్రలేఖనాలు ఉన్నాయి. ఇవి పల్లవుల వంశావళిని అతిప్రాచీన కాలంనుంచి రెండో నందివర్మకాలం వరకు తెలుపుతున్నాయి.

### కాంచీపురంలోని ఇతర ఆలయాలు

కాంచీపురంలోని అఖరుదశ ఆలయాలలో ముక్తేశ్వర, మాతంగేశ్వర, ఐరావతేశ్వర, త్రిపురాంతకేశ్వర ఆలయాలు ముఖ్యమైనవి. నిర్మాణ రీతిలో ఇవన్నీ ఒకేరకంగా ఉన్నాయి. వీటికి గర్భగృహ, స్తంభమండపలు (porch) ఉన్నాయి. కుడ్యభాగంలో దుమికే సింహాలున్న కుడ్యస్తంభాలున్నాయి (rampent lion brackets). వీటిమధ్య దేవతా శిల్పాలుగల కోష్ఠాలున్నాయి. కోష్ఠంపై మకర తోరణాలున్నాయి. వీటికి ఒకటి లేక రెండు తలాలు ఉన్నాయి. ప్రతి తలంలో కూట, పంజర, శాల హారాల వరుసలున్నాయి. ముక్తేశ్వర, మాతంగేశ్వరాలయాలకు ఏకతల విమానం గుండ్రటి వేసర శిఖరం ఉన్నాయి. ఐరావతేశ్వరాలయానికి రెండు తలాల విమానం, ద్రావిడ శిఖరం ఉన్నాయి. త్రిపురాంతకేశ్వరాలయానికి ఒకతల విమానం, చతుర్ముఖ నాగర శిఖరం ఉన్నాయి.

### పరశురామేశ్వరాలయం

తిరుపతి సమీపంలోని రేణిగుంట దగ్గరలోని మల్లాం (గుడిమల్లాం)లో ఈ ఆలయం ఉన్నది.

దీన్ని నందివర్మ నిర్మింపజేసారు. దీనికి (apsidal) గర్భగృహ, అంతరాళ, ముఖమండప, ప్రదక్షిణాపథ, (porch) అను నిర్మాణ భాగాలున్నాయి. ఈ ఆలయంచుట్టూ ఒక ప్రాకారం ఉంది. దీని పశ్చిమ కుడ్యం మధ్య గోపుర ద్వారం ఉన్నది. ఆలయం చుట్టూ ప్రాకారంలోపలగల ప్రాంగణంలో దేవగృహ, సూర్యగృహ, కుమారగృహ, నందిగృహ నిర్మింపబడి ఉన్నాయి. ఈ ఆలయ గర్భగృహ, అంతరాళలు పల్లవుల కాలంలో నిర్మింపబడ్డాయి. వీటి కుడ్యాల్లో వెలుపలి ముఖభాగంలో ఐదు దేవకోష్ఠాలున్నాయి. కోష్ఠలకిరువైపులా కుడ్యస్తంభాలున్నాయి. వీటికి తరంగపట్ట (corbel) ఉన్నది. కోష్ఠలపైన మకరతోరణం ఉన్నది. కోష్ఠల్లో బ్రహ్మ, విష్ణు, దుర్గ, గణపతి, దక్షిణామూర్తి ప్రతిమలున్నాయి. ఈ దేవాలయంలోని ముఖమంపడ, స్తంభప్రదక్షిణ చోళుల కాలంలో నిర్మింపబడ్డాయి. ముఖమండప, ప్రదక్షిణల వెనుక కుడ్యంలో రంధ్రాల కిటికీలున్నాయి. ముఖమండపానికి నురుగా వెలుపల ఒక స్తంభాల (porch) నిర్మింపబడి ఉంది. ఇది విజయనగర కాలనిది. ఈ ఆలయ గర్భగృహాలో క్రీ.శ. ఒకటో శతాబ్దానికి చెందిన శివలింగం ప్రతిష్ఠింపబడి ఉంది. గర్భగృహపైనగల విమానం (apsidal) ఆకారంలోని విమానమున్నది. దీని ముఖభాగంలో ఒక పెద్ద 'కూడు' నిర్మింపబడి ఉన్నది. దీని మధ్య ఒక పెద్ద 'కూట' ఉంది. దీనిపైన సింహలలాటం ఉంది. ఆలయ ప్రాంగణంలోని దేవగృహాలు చోళుల మూడోదశ కాలానివి. ఈ ఆలయంలోని కుడ్యస్తంభాల మూలంలో (base) సింహపాదాలు లేక అశీన సింహాలు (squatting lion brackets) ఉన్నాయి. ఈ ఆలయ గోపురద్వారం పతనమై ఉంది.

పల్లవ దేవాలయాలు తిరుత్తణిలో కూడా ఉన్నాయి. ఇచ్చటి విరట్టానేశ్వర దేవాలయం పల్లవరాజైన అపరాజితునిచే నిర్మింపబడింది. దీనికి గర్భగృహ, అంతరాళ, స్తంభముఖ మండపం ఉన్నాయి. దీని కుడ్యంలోని దేవ కోష్ఠల్లో బ్రహ్మ, విష్ణు, దుర్గ, గణపతి, దక్షిణామూర్తి ఉన్నారు. ద్రావిడ విమానము, (apsidial) శిఖరాలు గర్భగృహపై ఉన్నాయి.

## పల్లవుల శిల్పకళ

పల్లవుల శిల్పకళలో ప్రధానంగా రెండు దశలు కనపడతాయి. తొలిదశ శిల్పకళపై వేంగీశిల్పకళా ప్రభావం, మలిదశ శిల్పకళపై తొలిచాళుక్యుల శిల్పకళా ప్రభావం కనబడుతుంది. తొలిదశకు మహాబలిపురం, మలిదశకు కాంచీపురం ముఖ్య కేంద్రాలు.

పల్లవరాజు సింహ విష్ణు కుమారుడు ఒకటో మహేంద్రవర్మ వాస్తు శిల్పకళలో నూతన ప్రక్రియను తమిళ ప్రాంతాల్లో ప్రవేశపెట్టాడు. అదే గుహాలయాల నిర్మాణం. అందుకే అతనికి "విచిత్ర చిత్త" అను బిరుదు వచ్చింది. ఇతడు విష్ణుకుండిన రాజైన వీరమహేంద్రుని మనుమడైనందున (కుమార్తె కుమారుడు) విజయవాడ దగ్గరలోని కృష్ణానదీ తీరమందలి మొగల్ రాజపురం వంటి ప్రాంతాల్లోని విష్ణుకుండినుల గుహాలయాల వాస్తు శిల్ప ప్రభావం ఇతనిపై బహుశా చిన్నతనం నుంచే పడుతుంది. అందుకే అట్టి గుహాలయాలను మహాబలిపురంవంటి ప్రాంతాల్లో రూపొందింపజేశాడు.

మహేంద్రవర్మ గుహాలయాల్లో కనవడు ఒక ప్రధాన అంశం ద్వారపాలకులు. వీరి రూపాలు ఆకర్షణీయంగా ఉన్నవి. వీరికి నిండైన శిరోజాల కుచ్చులు వీపుపైగా ఉన్నట్లు ముఖానికి ఇరువైపులా ఉన్నాయి. వీరి నడుముకు వడ్డాణం ఉన్నది. గదను ధరించి ఉన్నారు. చేతులు పైకెత్తి భయాన్నే ఆశ్చర్యాన్నో కల్గించు చున్నారు. యజ్ఞోపవీతాన్ని ధరించి ఉన్నారు. ఇది కుడిభుజం మీదుగా ఎప్పటికుండిన, తొలిచాళుక్యుల శిల్పాల్లో లాగ ఉంది.

వీరి గుహాలయాల్లోని ఎప్పవు కిరీటం ఎత్తుగా పీపాలాగ ఉంది. నిండైన, బరువైన టున్నలున్నాయి. నడుం మందంగా ఉంది. లోపలి వస్త్రం 'హస్తిసొండిక' రీతిలో ఉన్నది.

తొలి దశ శిల్పాల్లో ప్రాముఖ్యమైనవి తిరుచినాపల్లి, తిరుక్కళ్ కున్రం, కిల్‌కిల్ మావిల మొదలగు ప్రాంతాలలో ఉన్నాయి. తిరుచినాపల్లిలోని గంగాధర శిల్ప ఖండం ఒక అద్భుతమైంది. గర్వంగల గంగానదిని శివుడు దర్పంతో తన రెండు కురుల్లోనికి లెక్కచేయకుండా ఆహ్వానిస్తున్నట్లు ఇది రూపొందింపబడి ఉంది. తిరుక్కళ్ కున్రం మహేంద్రవర్మ గుహలో ఆకర్షణీయమైన యువరాజు శిల్పముంది.

మహాబలిపురంలో కిరాతార్జునీయ కథాసారం శిల్పమందు అద్భుతంగా చిత్రీకరింపబడి ఉంది. సుమారు 90 అ!! పొడవు. 23 అ!! ఎత్తుగల శిలాఖండంలో లోతుగానిలిచి దాదాపు గుండ్రంగా ఉన్నట్లు (in high relief) ఇచ్చటి శిల్పాలు రూపొందించబడి ఉన్నాయి. ఈ చిత్రశిల్పం శిల్పకళా చరిత్రలో ఒక మహాఅద్భుతం. శిలాఖండం చివరివరకు శిల్పం రూపొందింపబడి ఉన్నది. భాజ, ఉదయగిరి వంటి ప్రాంతాల్లో కూడా ఇట్టి పెద్ద శిల్పకళాఖండాన్ని రూపొందించుటకు ప్రయత్నం జరిగినప్పటికీ ఈ ప్రక్రియ మహాబలిపురంలో ఉన్నత స్థానాన్ని పొందింది. ఇచటి శిల్పసముదాయంలో వలుపరిమాణాలల్లో పురుషులు, జంతువులు, దేవతలు, ఋషులు,నాగదేవతలు, అర్ధదైవాలు (semi-divine) ఉన్నాయి. ప్రతి శిల్పం అత్యందంగా రూపొందింపబడి ఇంతకుమించి శిల్పాన్ని మెరుగుపరచుట సాధ్యం కాని రీతిలో ఉన్నాయి. ఈ చిత్రశిల్ప ఖండంలో ప్రతి శిల్పం తుల్యరీతిలో సమికృతం కాబడి ఉన్నాయి. ఎల్లోరాలో లాగా సూచన ప్రాయాలు, గట్టి కదలికలు లేదు. ఇచటి శిల్పాల సముదాయమంతా నిగ్రహంతో కూడిన కదలికను కలిగిఉన్నందున ప్రతిశిల్పంగాని, శిల్పాలసముదాయంగాని దర్పాన్ని అందాన్ని కలిగి ఉన్నాయి. శిల్పాలు శిలాఖండ ముఖభాగం దర్పాన్ని అందాన్ని కలిగి ఉన్నాయి. శిల్పాలు శిలాఖండముఖభాగం నుంచి ఉద్భవించుచున్నవా అన్నట్లున్నాయి. శిల్పాలన్నింటిలో ఆహ్లాదం కనపడుతుంది. అన్నీ సహజత్వాన్ని నింపుకొని ఉన్నాయి. వృద్ధుడైన ఋషి పుంగవుడు దేవగృహం ముందు ప్రణామం చేస్తున్నట్లున్న శిల్పంలోను, ఒక్కకాలిపై నిమగ్నంగా తపస్సుచేయుచున్నట్లున్న శిల్పంలోను, ఆకాశంలోను ఎగురుతున్న జంటలు, దేవతలు, మానవులు మొదలైనవన్నీ అంతులేని అద్భుతమైన సహజత్వంగా రూపొందింపబడి ఉన్నాయి. జంతువుల రూపణలో శిల్పి తన కళాశక్తి అంచులను దాటెనని పించుచున్నది. భక్తితోకొలుచుచున్న ఏనుగుల గుంపు, వెనుక కాళ్ళపై నిలుచొని ఉన్న పిల్లి, జింకల జంట,, గోవుపాలు పితుకు చుండగా అదితన బిడ్డ వెనుక భాగాన్ని ప్రేమగా నాకుచుంటం, కోతుల కుటుంబ శిల్పాలు భారత శిల్పచరిత్రలో

మహోన్నత శిల్ప ఖండాలని చెప్పవచ్చు.

ఇట్టి శిల్పఖండమే దీని దగ్గరలో, మరొకటి ఉంది. దీన్నె గోవర్ధన శిల్పం మంటారు. ఇందు కృష్ణుడు గోవర్ధన పర్వతాన్ని ఎత్తుచున్నట్లు చూపబడి ఉంది. కృష్ణునితోబాటు గోపాలురు, గోపికలు ఉన్నారు.

వరాహ గుహలో గజలక్ష్మి మహిషమర్ధని గుహలో శేషసాయి విష్ణు, మహిషమర్ధని శిల్పాలు ఉన్నాయి. ఇవి క్రీ.శ. 7వ శతాబ్దం నాటివి. నరసింహవర్మకాలానివి. మహిషమర్ధని శిల్పం అద్భుతముగా ఉంది. దీని ప్రభావంతో ఎల్లోరాలో ఇట్టి శిల్పం రూపొందించబడింది. వరాహ గుహలో పల్లవ రాజైన సింహవిష్ణు, ఒకటో మహేంద్రవర్మ, వారి రాణుల శిల్పాలున్నాయి. ధర్మరాజరథంపై ఒకటో నరసింహవర్మ శిల్పాలు ఉన్నాయి.

పల్లవ రథాలపైగల కుడ్యస్తంభాల మధ్య భాగాల్లో అనేక శిల్పాలున్నాయి. ఇవి ఎత్తుగా, సన్నగా, అందంగా ఉన్నాయి. వాస్తుక్రమాన్ని (రూపాన్ని)బట్టి శిల్పరూపం నిర్ణయించబడి శిల్పానికి శోభతెచ్చి పెట్టబడి ఉన్నది. ఈ రీతి స్త్రీ, పురుష, సమూహ శిల్పాలనే భేదం లేకుండా అనుసరించబడి ఉన్నది.

పల్లవ శిల్పాల్లో నిలువు (ఎత్తు), సన్నటి శరీర రూపాలకు ప్రాధాన్య మివ్వబడి ఉన్నది. ఈ రీతి కొంతవరకు వేంగి శిల్పరీతి ప్రభావమని చెప్పవచ్చు. పల్లవ శిల్పంలో క్రమరూపం కనపడుతుంది. ఇది వెడల్పాటి భుజాలుగల ఎత్తైన పురుష శిల్పాలలో స్పష్టంగా కనపడుతాయి. అంతేగాక వీటిలో మానసిక ఒత్తిడి కనపడదు. స్త్రీలు తమ భర్తలపై వాలినట్లు రూపొందింపబడి నిలువుగా ఉన్నారు. సన్నటి నడుం, పరిమిత వక్షోజాలు, పరిమిత ఆభరణాలు, దుస్తులు ధరించి భర్తకు అనుగుణంగా నడచుకొనే స్త్రీల్లాగా ఉన్నారు. ఈ గుణాలు మానవ, దేవతా శిల్పాలలో సమానంగా కనపడుతాయి.

మహాబలిపుర శిల్పాలు దక్షిణ భారతదేశ శిల్పకళలో ఒక ఉన్నతస్థాయి దశకు చెందినవిగా చెప్పవచ్చును. కాంచీపురంలోని కైలాసనాథ దేవాలయంలోని శిల్పాలు (క్రీ.శ. 8వ శతాబ్దం). ఈ ఉన్నత స్థాయి కళారీతి తరుగుదలను చూపుతున్నాయి. ఇవి మధ్య దశకు చెందినవిగా చెప్పవచ్చు. దీనికి ఉదాహరణగా దుర్గ శిల్పాన్ని చెప్పవచ్చును.

మలిదశ పల్లవ శిల్పాలలో ఎక్కువ పనితనపు వివరం తేలికైన శరీరభాగాలు, మేలైన శిల్ప సమాప్త (finishing) రీతి కనపడుతుంది. కాంచీపురంలోని వైకుంఠ పెరుమాళ్, ఐరావతేశ్వర, ముక్తేశ్వర, మాతంగేశ్వర మొదలగు ఆలయాలు, గుడిమల్లంలోని పరశురామేశ్వరాలయం, తిరుత్తణిలోని విరాట్టానేశ్వరాలయాలలోని శిల్పాలు మలిదశ శిల్పకళారీతికి ముఖ్య ఉదాహరణలు, సతమంగళం సప్తమాతృకులు, వీరభద్ర, యోగ దక్షిణామూర్తిరూపంలోని శివుని శిల్పాలు కూడా ఈదశకు చెందినవే. ఈ శిల్పాలు సన్నటి శరీరాలను పొడవైన ముఖాలను, సన్నటి యజ్ఞోపవీతాన్ని

కలిగి ఉన్నాయి. పల్లవకాల సంస్కృతిని తెలిపెడి అనేక శిల్పాలు రేఖాప్రాయంగా వైకుంఠ పెరుమాళ్ దేవాలయంలో చెక్కబడి ఉన్నాయి. నగర జీవనం, యుద్ధాలు, అశ్వమేధయాగాలు, పట్టాభిషేక మహోత్సవాలు, చక్రవర్తి ఎంపిక, ఆలయాల నిర్మాణం మొదలైన వివరాలు తెలిపే శిల్పాలెన్నో ఉన్నాయి.

పల్లవ శిల్పాల్లో ప్రతిమాలక్షణ వివరాలు పుష్కలంగా ఉన్నాయి. మలిపల్లవ శిల్పకళలో కావేరిపాక్కం శిల్పాలు ఒక నూతన రీతికి చెందినవిగా కనపడతాయి. ఇవి రాష్ట్రకూట - పల్లవ శిల్పరీతుల ప్రభావానికి లోనైవిగా కనపడతాయి. తాత్కాలికంగా పల్లవ రాజ్యాన్ని రాష్ట్రకూటులు ఆక్రమించి పాలించుటే ఇందుకు కారణంగా కనపడుతుంది. పల్లవ శిల్పకళలోకి పద్మం, వజ్రాల అలంకరణతో కూడిన యజ్ఞోపవీతం, సింహపుతలగల చేతికడియం మొదలైనవి రాష్ట్రకూట, చాళుక్య శిల్పకళలలో నుంచి ఈ కాలంలో ప్రవేశించినట్లు కనపడుతుంది.

పల్లవ ఆలయాలు దాదాపు అన్నింటిలోను గర్భగృహాలోని శివలింగానికి వెనుకగల కుడ్య లోపలి ముఖభాగంపై సోమస్కంద శిల్పరూపం కనపడుతుంది. ఇది పల్లవుల అభిమాన శిల్పం. ఇట్టిది తీరదేవాలయంలో కూడా కనపడుతుంది.

బ్రహ్మ, విష్ణు, శివులతో కూడిన త్రిమూర్తి ఆలయ విధానం పల్లవుల కాలంలో కనపడుతుంది. జావావంటి ప్రాంతాలలోకి కూడా ఈ రీతిప్రాకింది.

# చోళుల ఆలయ వాస్తుశిల్పం

తంజావూరు రాజధానిగా చోళులు క్రీ.శ.9వ శతాబ్దం నుంచి 12వ శతాబ్దం వరకు పరిపాలించారు. వీరు దక్షిణ భారత దేశమందంతటా తమ అధికారాన్ని నెలకొల్పుకొనడమేగాక ఉత్తరాన గంగానది వరకు రాజ్యవ్యాప్తి చేశారు. అంతేగాక సింహళం, మలయా, బర్మా ప్రాంతాల్లోను అంగ్లేయమందలి పలు దీవులందు తమ అధికారం ఏర్పరచుకొన్నారు. ఈ ప్రాంతాల్లో, ముఖ్యంగా దక్షిణ భారతదేశంలో వీరు రాజ్యవిస్తరణతోబాటు దేవాలయాల నిర్మాణం చేశారు. రాజ్య విస్తరణతోబాటు వీరి నిర్మాణాలలో కూడ మార్పు కనపడుతుంది. చోళవంశాన్ని సుమారు క్రీ.శ 850 ప్రాంతంలో విజయాలయుడు స్థాపించినాడు. ఇతని కుమారుడైన ఆదిత్యుడు మనుమడైన పరాంతకుడు తమ పాలనా కాలంలో అనేక దేవాలయాలను నిర్మించారు. చోళరాజుల్లో పదో శతాబ్దానికి చెందిన ఒకటో రాజరాజు రాజ్యవిస్తరణలోనేగాక దేవాలయాల నిర్మాణమందు కూడా ముఖ్యుడు. ఇతడు క్రీ.శ 985 నుంచి క్రీ.శ 1012 వరకు పరిపాలించాడు. తంజావురునందలి బృహదీశ్వర (రాజరాజేశ్వర) దేవాలయాన్ని ఇతడు నిర్మించాడు. ఇతని తరువాత ఇతని కుమారుడు రాజేంద్రచోళుడు (క్రీ.శ.1012 - 1044) కూడా అనేక దేవాలయాలను నిర్మించాడు. ఇతని నిర్మాణాల్లో గంగైకొడచోళపురమందలి బృహదీశ్వర దేవాలయం ముఖ్యమైనది. ఇతని తరవాత ముఖ్యమైన చోళరాజుల్లో రాజేంద్రచోళుడు, రెండో కుళోత్తుంగుడు, రెండో రాజరాజు (1150 - 73) మూడో కుళోత్తుంగుడు ముఖ్యులు. రెండో రారాజు ఐరావతేశ్వర దేవాలయాన్ని నిర్మించినట్లు తులుస్తున్నది.

తొలిచాళుక్యులు, పల్లవుల కాలాల్లో ఆగమశాస్త్రాల సూత్రాల ప్రాకారం ఆలయ నిర్మాణాలు జరిగాయి. చాళుక్యులు, పల్లవులాగ చోళులుకూడా సాధారణంగా తమ దేవాలయాల్లో గర్భగృహ, ప్రదక్షిణ, అంతరాళ, ముఖమండప, వసారా (porch) అను విభాగాలను నిర్మించారు. చోళుల ఆలయాల్లోని గోపురం పల్లవుల కాలపు గోపురం కన్నను పెద్దవిగ, ఆకర్షణీయంగా నిర్మింపబడి ఉన్నాయి. వీరు తమకు పూర్వం పరిపాలించిన వంశరాజుల వాస్తు సాంప్రదాయాలను అనుసరించినప్పటికీ అందు అనేక మార్పులు కూడా చేశారు. వీరి ఆలయాల కుడ్యం మధ్యభాగంపై కుంభపంజర, కోష్టపంజర నిర్మాణభాగాలు ఉన్నాయి. వీటికి ఇరువైపులా కుడ్యస్తంభాలు ఉన్నాయి. వీరి స్తంభాలు, కుడ్యస్తంభాల శీర్షిక (capital) విభాగమందలి కార్బెల్ పల్లవుల కార్బెల్‌లాగ ఉంది. కాని దీనిక ముక్కువంటి ఉబ్బుభాగం (tenon-like-projection)కలదు. కొంత ముఖభాగంపై కూడు ఉన్నది. వీటికి సింహాలలాటం ఉన్నాయి. పల్లవుల కాలంలోలాగ చోళకాలంలో కూడ ద్వారపాలకులు ఉన్నారు. కాని చతుర్భజాలను, భయంకర రూపాలను కలిగి ఉన్నారు. ప్రత్యేక మండపాల నిర్మాణ విధానం వీరి కాలంలో ప్రారంభమైంది. ప్రత్యేకదేవి గృహాల నిర్మాణం కూడా మూడో దశ పల్లవుల నిర్మాణాల కాలంలో జరిగింది. వీరి విమానం, శిఖర, కపొరి

విభాగాలు ద్రావిడ రీతిలో ఉంవి.

చోళ దేవాలయాలను అధ్యయనం కొరకు తొలిదశ రెండో మూడో దశకు చెందిన ఆలయాలని మూడు విభాగాలు చేయవచ్చు.

తొలిదశ దేవాలయాలు పలుప్రాంతాల్లో ఉన్నాయి. చిత్తూరు జిల్లాలో పుంగనూరు వద్దగల లద్దింగం ప్రాంతమందలి ఇరుంగోలీశ్వర దేవాలయం తొలిదశకు చెందింది. ఇది గర్భగృహ, అంతరాళ, ముఖమండప అను విభాగాలను కలిగి ఉంది. కాళహస్తివద్ద తొండమనాడు నందు ఆదిత్యేశ్వర లేక కోందండరామేశ్వర దేవాలయం ఉన్నది. ఇది గర్భగృహ, అంతరాళ, వసారా (porch) అను విభాగాలను కలిగి ఉంది. పుదుక్కోట్టై జిల్లా(తమిళనాడు)లోని నార్తమలై ప్రాంతంలో ఒకటవ ఆదిత్యునిచే నిర్మింపబడ్డ విజయాలయ చోళేశ్వర దేవాలయం ఉంది. ఇది కొంత ప్రత్యేకంగా నిర్మింపబడి ఉన్నది. వెనుకభాగం గుండ్రంగా ఉండునట్లు నిర్మింపబడి ఉంది. ఈ రూపం అధిష్టానం మొదలు శిఖరం వరకు ఉంది. వేసర నిర్మాణరీతిలో ఉంది. దీనిచుట్టూ ఒక చతురస్రాకార కుడ్యనిర్మాణం ఉంది. ఆలయ కుడ్యానికి, ఈ కుడ్యానికి మధ్యగల భాగం ప్రదక్షిణాపథగా ఉపయోగపడుతుంది. విజయాలయ చోళేశ్వర దేవాలయం లాగా శ్రీరంగంలోని రంగనాథ దేవాలయం నిర్మింపబడి ఉంది. దీనికికూడా గుండ్రటి గర్భగృహ, దానిచుట్టూ ప్రదక్షిణాపథ ఉన్నాయి. ఆలయంచుట్టూ గల ప్రాంగణంలో 7 పరివార దేవతాగృహాలు ఉన్నాయి. ఇవన్నీ గర్భగృహవైపు ముఖద్వారాలు ఉన్నాయి. ఒకటో ఆదిత్యునిచే నిర్మింపబడ్డ భిల్లైయూర్ దేవాలయం అతని కుమారుడైన పరాంతకునిచే నిర్మింపబడ్డ మేలప్పలువూర్‌లోని శివుని, ఆలయం, తిరుక్కత్తలూర నందలి శివదేవాలయం ఇట్టి పరివార దేవతాగృహాలుఉన్నాయి.

రాజ్య విస్తరణతోపాటు ఆలయాలుకూడా విశాలంగా నిర్మింపబడ్డవని చెప్పడానికి పుదుక్కోట జిల్లాలోని కుడుంబటూరు నందలి, మూవర్‌కోయిల్ ఒక ముఖ్య ఉదాహరణ. ఇది త్రిమూర్తులకు నిర్మింపబడ్డ దేవాలయం. కావుననే దీనికి ఈ పేరు వచ్చింది. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు విడివిడిగా ఒకదానిప్రక్క మరొకటిగా మూడు దేవగృహాలు ఈ ఆలయంలో నిర్మింపబడి ఉన్నాయి. దీనిని చోళరాజైన రెండో పరాంతకుడు (క్రి.శ 956 - 73). ఇందలి దేవగృహ ప్రతిది 21 చదరపు అడుగులు గల గర్భగృహ, 18 చదరపు అడుగులు గల అంతరాళ ఉన్నాయి. ఈ మూడు దేవగృహాలకు ముందు 8 అడుగుల దూరంలో 91 అడుగల పొడవు 41 అడుగుల వెడల్పుగల ఒకపెద్ద స్తంభాలముఖ మండపం ఉంది. ఈ మండపం ముందు ఒక పెద్ద నందిగృహం, బలిపీఠం ఉన్నాయి. దీని దేవాలయం చుట్టూ ఒక ప్రకార నిర్మాణం ఉన్నది. దీని లోపలి ముఖభాగంలో 15 ప్రాకారదేవతా గృహాలు ఉన్నాయి. వాటిలో సూర్యుడు, సప్తమాతృకలు మొదలైన వారి ప్రతిమలు ఉన్నాయి. ఈ ఆలయ ప్రవేశముందు ఒక గోపుర ద్వారం నిర్మింపబడి ఉంది.

రెండో దశ దేవాలయాల నిర్మాణం ఒకటో రాజరాజుతో ప్రారంభమైంది. ఉత్తార్కాడు జిల్లాలోని మాలెపాడి యందలి రెండు దేవాలయాలు, చిత్తూరు జిల్లాలోని లద్దింగం యందలి శివ దేవాలయాలు, తిరువత్తోతి జిల్లాలోని తిరువలేశ్వరం నందలి శివాలయం, తిరుచి జిల్లాలోని తిరుమన్‌వాడియందలి

వైద్యనాథ దేవాలయం, మాలెపాడిలోని అరంజయేశ్వర దేవాలయం. రెండవదశ చోళ దేవాలయాలకు ముఖ్య ఉదాహరణలు. అరంజయేశ్వరాలయాన్ని రాజరాజు తన తాతగారి సమాధిపై నిర్మించాడు. సమాధులపై ఆలయాలను నిర్మించుట వీరికి అలవాటు. తొండమనాడు ఆలయాన్ని ఒకటో పరాంతకుడు తన తండ్రి సమాధిపై నిర్మించాడు. రెండేదశ లేక మధ్యదశ చోళదేవాలయాల్లో తంజావూరునందలి బృహదీశ్వర దేవాలయం, గంగైకొండ చోలపుర మందలి బృహదీశ్వర దేవాలయం ముఖ్యమైనవి.

తంజావూరునందలి బృహదీశ్వర లేక రాజరాజేశ్వర దేవాలయాన్ని ఒకటో రాజరాజు (క్రీ.శ.985 - 1012) నిర్మింపజేశాడు. దీని నిర్మాణం క్రీ.శ.1003లో ప్రారంభమై క్రీ.శ.1010 లో ముగిసింది. ఇది వాస్తుశిల్ప కళకేగాక చిత్రలేఖనాలకు కూడా ప్రసిద్ధిగాంచింది. రాజరాజు శైవమతాభిమాని. కావుననే శివపాద శేఖర అనే పేరుకూడా పెట్టుకొన్నాడు.

ఈ దేవాలయంచతురస్రాకారం గల గర్భగృహను, దానిచుట్టూ ప్రదక్షిణాపథను, ఈ రెండింటి ముందు అర్ధమండప, మహామండప లేక ముఖమండప, స్థపన, నాట్య, వాద్య మండపాలు వరసగా నిర్మింపబడి ఉన్నాయి. ఈ దేవాలయం ఒక దీర్ఘచతురస్రాకార పాంగణమందు నిర్మింపబడి ఉంది. ఆలయ ప్రాంగంణంలోనికి ప్రవేశించుటకు లోపలి ప్రాకారంయొక్క తూర్పు కుడ్యమందు ఒక గోపుర ద్వారం ఉంది. ఈ గోపురానికి ఇరువైపులా ఇద్దరు ద్వారపాలకులు ఉన్నారు. ఈ గోపురమందు అనేక శైవమత సంబంధమైన ప్రతిమలు ఉన్నాయి. ఈ గోపురానికి తూర్పుగాగల మరొక ప్రాంగణం మూడువైపులా మరొక ప్రాకారం ఉంది. దీని తూర్పు కుడ్యం మధ్య మరొక గోపురద్వారం నిర్మింపబడి ఉన్నది. ఇది లోపలి ప్రాకారమందలి గోపురంకన్నా ఎత్తుగాను అద్భుతంగను నిర్మింపబడి ఉంది. ఈ గోపురానికి ఇరువైపుల కూడా ద్వారపాలకులు ఉన్నారు. ఈ గోపుర ద్వారానికి ముందుగా గూడు (arch) ఆకారంలోని మరొక ప్రవేశమార్గం ఉంది. దీనికి ఇరువైపులా కొంత దూరంలో గణపతి, కుమార దేవగృహాలు ఉన్నాయి. ఈగూడు వంటి ప్రవేశమార్గం ద్వారా లోనికి ప్రవేశించినచో వెలుపలి, లోపలి గోపురాలమధ్యగల ప్రాంగణంలో బృహన్నాయకి దేవగృహం, నందిగృహం నిర్మింపబడి ఉన్నాయి. లోపలి ప్రాకారం లోపలి ముఖభాగంలో (ఆలయంచుట్టూ)అనుకొని ఒక స్తంభవసారా నిర్మింపబడి ఉన్నది. ఇందు అనేక ప్రాకారదేవతా గృహాలు నిర్మింపబడి ఉన్నాయి. లోపలి ప్రాంగణంనందు వెనుకభాగంలో ఉత్తర, దక్షిణాలలో కుమార, గణపతి దేవగృహాలు ఉన్నాయి. ముఖ్యదేవాలయం లోనికి ప్రవేశించుటకు వాద్యమండపం ముందుభాగంలో ఉత్తర దక్షిణాలలో మెట్ల నిర్మాణం ఉన్నది. దీని ద్వారానికి ఇరువైపులా ఇద్దరు ద్వారపాలురు, వారి ప్రక్కనయున్న కోష్ఠాలలో ఇద్దరు వీరులైన యువరాజుల ప్రతిమలు ఉన్నాయి. ఇచటి స్థపన, నాట్య, వాద్య మండపాలు చోళులకాలంలో నిర్మింపబడ్డవి కావు. ఇవి నాయక రాజుల కాలంలో నిర్మింపబడినవని తెలియుచున్నది. దేవీగృహం పాండ్యుల కాలంలో క్రీ.శ. 13వ శతాబ్దంలో నిర్మింపడినట్లు చెప్పబడుచున్నది. ఇందలి సుబ్రమణ్య, గణేశ దేవగృహాలు కూడా నాయక కాలానివి. ఈ దేవాలయం యొక్క ముఖ్యదేవగృహం అధిష్ఠానం అన్నివైపులా 150 అడుగుల కొలత కలిగి ఉంది. అధిష్ఠానంపై గల కుడ్యం అన్నివైపులా 100 అడుగులు కొలత ఉంది. గర్భగృహ చుట్టూ గల ప్రదక్షిణాపథ అనేక శిల్పాలను, చిత్రలేఖనాలను కలిగి ఉంది. ఇచటి చిత్రలేఖనాల్లో దక్షిణామూర్తి, నటరాజు, చిదంబరమందలి దేవాలయ హాలులో

నాట్యమాడుచున్న నటరాజు, త్రిపురాంతక మూర్తి, రాజరాజు తనగురువైన కరువూర్‌దేవర్‌తో ఉన్న చిత్రలేఖనాలు ముఖ్యమైనవి. ఈదేవాలయం గర్భగృహ ప్రాంతంలోని కుడ్యం రేండు విభాగాలుగా "సంధర" పద్ధతిలో నిర్మింపబడి ఉంది. కుడ్యం యొక్క కింది వి ాగంలో ఉత్తర, దక్షిణ, పశ్చిమ కుడ్యాలలో అర్ధనారీశ్వర గంగాధర, వీరభద్ర, గణేశ, విష్ణు, శ్రీదేవి, భూదేవి, హరిహర, చంద్రశేఖర మొదలైన దేవతా శిల్పాలు దేవకోష్ఠాలలో ఉన్నాయి. కుడ్యంయొక్క పైవిభాగంలో అలయం చుట్టూ త్రిపురాంతకమూర్తి శిల్పాలతో కూడిన దేవకోష్ఠాల వరస ఉంది. ఈ అలయ గర్భగృహపైనగల విమానం 216 అడుగల ఎత్తు ఉన్నది. ఇంతటి ఎత్తుగల విమానం బహు అరుదు. విమానం 16 తలాలను కలిగి ప్రతి తలంలో కూట, పంజర, శాల హారాల వరుసలను కలిగి ఉన్నాయి. ఇచటి విమానంపైన గల ద్రావిడ శిఖరం 80 టన్నుల బరువు ఉంది. శిఖరపైన బంగారుపూతగల కపురి ఉంది.

గంగైకొండ చోళపురమందు రాజరాజు కుమారుడైన ఒకటవ రాజేంద్రుడు (క్రీ. శ.1012 - 1044) బృహదీశ్వర లేక గంగైకొండ చోళేశ్వర లేక రాజరాజేశ్వర అలయం అను పలుపేర్లతో పిలువబడే దేవాలయాన్ని నిర్మించాడు. ఇతడు తండ్రిలాగ అనేక యుద్ధాలు చేసి ఉత్తరాన గంగానది వరకు తన రాజ్యాన్ని వ్యాప్తిచేసి తన రాజధానిని తంజావూరు నుంచి గంగైకొండ చోళపురానికి మార్చి ఈ అలయాన్ని అచట నిర్మింపజేశాడు. రాజరాజు నిర్మించిన దేవాలయం పురుష అందాన్ని (masculine beauty) ఉండగా రాజేంద్రుని అలయం స్త్రీ అందాన్ని (feminine beauty) ఉందని అభిప్రాయం ఉన్నది. అనగా రాజరాజు దేవాలయం వాస్తు రీత్యా అద్భుతంగను, రాజేంద్రుని దేవాలయం వాస్తులోను, వాస్తు మించిన రీతిలో శిల్పంలోను అద్భుతంగా ఉన్నదని అర్థం. గంగైకొండ దేవాలయం చాల వరకు తంజావూరు దేవాలయాన్ని నిర్మాణరీత్యా పోలిఉన్నది. దీనికి గర్భగృహ, దక్షిణ అర్ధమండప (లేక అంతరాళ), ముఖమండప, మండప అనెడి విభాగాలున్నాయి. ఈ అలయంచుట్టూ ఒక ప్రాకారం ఉంది. దీని తూర్పు కుడ్యంమధ్య గోపురద్వారం ఉంది. ప్రాకారంలోపల అలయానికి ఎదురుగా ప్రాంగణంలో నంది మండప, బలిపీఠం ఉన్నాయి. ప్రాకారం ముందు కొంత దూరంలో మరో ప్రాకార నిర్మాణం ఉంది. దీని తూర్పు కుడ్యమందు మరొక గోపురద్వారం ఉన్నది. ఇది ప్రస్తుతం శిథిలపైఉంది. అలయ మండపంయొక్క ఉత్తరదక్షిణాలలో అలయ ప్రవేశానికి మెట్లనిర్మాణం ఉంది. అర్ధ మండప, ముఖమండపల ఉత్తర, దక్షిణాలలో కూడా ప్రవేశానికి మెట్లు ఉన్నాయి. ఈ అలయ అధిష్ఠానంపై పలు సింహాల (squatting lions) వరస ఉంది. అదిష్ఠానంపైగల కుడ్యం రెండు విభాగాలుగా ఉంది. కింది, పై వరుసలలో గర్భగృహ మూడువైపులాగల కుడ్యమధ్యలో పెద్ద దేవకోష్ఠాలు ఉన్నాయి. వీటికిరువైపులా రెండు చిన్నతరహా దేవకోష్ఠాలు ఉన్నాయి. వీటిలో భిక్షాటన మూర్తి, గంగధర మొదలగు శైవ సంబంధ దేవతా శిల్పాలు ఉన్నాయి. ఈ అలయ కుడ్యం తంజావూరు దేవాలయ కుడ్యంకన్నా తక్కువ ఎత్తు కలిగిఉంది. అలయ కుడ్యంపైన విమానం ఉంది. దీనికి ప్రతి తలయందు కూట, పంజర, శాల హారాల వరుస ఉన్నాయి. విమానంపైన శిఖర, కపురి ఉన్నాయి. అలయం 180 అడుగుల ఎత్తు ఉన్నది. లోపలి ప్రాకారం లోపలి ముఖభాగాన్ని అనుకొని అనేక పరివారదేవతా గృహాలు నిర్మింపబడి ఉన్నాయి. ఈ దేవాలయంలోని మండప నిర్మాణం విజయనగర కాలంనాటి వేయి స్తంభాల మండపాల నిర్మాణానికి మార్గదర్శక మైనవని శాస్త్రజ్ఞుల అభిప్రాయం.

మూడోదశకు చెందిన చోళ దేవాలయాల్లో రెండవ రాజరాజు నిర్మించిన (క్రీ.శ.1146 - 1173) దారాసూరంలోని ఐరావతేశ్వర దేవాలయం, మూడో కుళోత్తుంగ చోళుడు (క్రీ.శ.1178 - 1223) నిర్మించిన త్రిభువనం నందలి కంపహరేశ్వర దేవాలయాలు ముఖ్యమైనవి. ఈ రెండు తంజావూరు, గంగైకొండ చోళపురంలందలి ఆలయాలను పోలి ఉన్నాయి. మూడో దశ చోళదేవాలయాలపై చాళుక్య రాష్ట్రకూట, పల్లవ వాస్తు రీతుల ప్రభావం కనపడుతుంది. అంతేగాక కొన్ని నూతన పద్ధతులు కూడా గమనించవచ్చును. మూడో దశ ఆలయాలకు కూడ గర్భగృహ, ప్రదక్షిణాపథ, అంతరాళ, ముఖమండప, మహా మండప,ప్రవేశవసారా (porch) అను విభాగాలు ఉన్నాయి. కాని తంజావురు, గంగైకొండలలో లాగ బహుస్తంభ మండపాలు లేవు. ధారా సూరమందలి మహామండపం రథం లాగ నిర్మింపబడి ఉంది. ఇట్టి రీతిలో మండపాలు నిర్మించుట ఒకటో కుళోత్తుంగునిచే ప్రారంభించబడే జరిగింది. దారా సూరం, త్రిభువనం దేవాలయాలకు కూడ గంగైకొండ తంజావూరు ఆలయాలకు లాగ రెండు ప్రాకారాలు ఒకదానిముందు మరొకటిగా నిర్మింపబడి ఉన్నాయి. ఈ ప్రాకారాల లోపలి ముఖభాగాన్ని అనుకొని ప్రాకార దేవతగృహాలు ఉన్నాయి.

దారా సూరం, త్రిభువనం ఆలయాల ప్రాంగణాల్లో కూడా గంగైకొండ, తంజావూరు ఆలయాల్లో లాథ ప్రత్యేక దేవీ గృహాలు నిర్మింపబడి ఉన్నాయి. ఆలయ ముఖ్యదేవుని సతికి ప్రత్యేక దేవీగృహాలు ప్రాంగణంలో నిర్మించెడి సాంప్రదాయం మూడోదశ చోళ నిర్మాణాల కాలమందే ప్రారంభమైంది. అంతకు మునుపు గర్భగృహ కుడ్యం వెలుపలి ముఖభాగమందు దేవకోష్ఠాలలో దేవీ ప్రతిమలు మొదలయినవి ప్రతిష్టించెడి ఆచారం కనపడుతుంది.

దారా సూరం, త్రిభువనం ఆలయాల అధిష్ఠానాలు కూడ చాలవరకు తంజావూరు, గంగైకొండ ఆలయాల అధిష్ఠానాలను పోలి ఉన్నాయి. కాని వీటి ఎత్తు తక్కువగా ఉండుటేగాక వీటి ముఖభాగాలపై వ్యాళ, గణ, భూతగణ మొదలైన అర్ధ శిల్పాలు ఉన్నాయి. అధిష్ఠానంపైన గల కుడ్యం రెండు విభాగాలుగా ఉన్నది. ప్రతి విభాగమందు ఉబ్బెత్తు భాగాలు (projected niches), లోతు విభాగాలు (Recesses) కుడ్యం యొక్క అన్నివైపుల కలవు. ఉబ్బెత్తు గూళ్ళ ఇరువైపుల కుడ్య స్తంభాలు నిర్మింపబడి ఉన్నాయి. గర్భగృహ కుడ్యం యొక్క వెలుపలి ముఖభాగం మధ్య ఒక పెద్ద ఉబ్బెత్తు విభాగం దేవకోష్ఠం ఉంది. దేవ కోష్ఠల మధ్యగల కుడ్య భాగాలలో కుంభపంజర నిర్మాణం ఉన్నది. దేవకోష్ఠలలో శైవ మత సంబంధమైన అర్ధ నారీశ్వర, వీరభద్ర, దక్షిణామూర్తి, త్రిపురాంతకమూర్తి మొదలైన దేవతా ప్రతిమలు ఉన్నాయి. కుంభపంజర రూపం మధ్య చోళ వాస్తురీతి కాలంనుండే ప్రారంభమైంది.

వీటి విమానాలు తంజావూరు, గంగైకొండ విమానాల కన్నా తక్కువ ఎత్తుగా ఉన్నాయి. దారా సూరం ఆలయానికి నాలుగు తలాల విమానం, త్రిభువనం ఆలయానికి ఆరు తలాల విమానం ఉన్నాయి. వీటి ప్రతి తలయందు కూట, పంజర, శాలహారాల వరస ఉంది. విమాన భాగమ అనేక దేవతా ప్రతిమలున్నాయి.

ఆఖరి దశ చోళ దేవాలయాల్లోని స్తంభముల నాలుగు రకాలుగా ఉన్నాయి. అవి :1. పల్లవుల

కాలం నాటి సింహ పాద (squatting lion based) స్తంభాలు, 2. ఐదు సమాన ఘన చతురస్రాకారపు విభాగాలు ఉన్న స్తంభాలు (వీటి ముఖభాగాలపై దేవతా శిల్పాలు ఉన్నాయి). 3. మూడు ఘన చతురస్ర విభాగాలు కలిగి, ప్రతి రెండు విభాగాల మధ్య అష్టముఖ (Octogonal) విభాగాన్ని కలిగిఉన్న స్తంభాలు వీటి ఘన చతురస్ర విభాగాల ముఖభాగముపై కూడ దేవతా శిల్పాలు ఉన్నాయి. 4. ఉపస్తంభాలు (Offsets or Pillarets) గల స్తంభాలు వీరీ కాలపు ఉపస్తంభాల విధానం విజయనగర కాలమందు హంపిలోని సంగీత మండపం వంటి వాటిలో అనుసరించ బడింది.

మూడేదశ చోళ దేవాలయాలలోని స్తంభాల శీర్షిక (Capital) విభాగంలో గల (corbel) 'భోధికష విధానంలో రూపొందించబడి ఉంది. విజయనగరకాలమందు ఇది పుష్పభితిక అను పేరుతో పరిపూర్ణతను పొందింది.

ఐరావతేశ్వర ఆలయ ప్రాంగణంలో దేవాలయం ముందుగా ఒక బలిపీఠం, నంది మండప నిర్మింపబడి ఉన్నాయి. ఈ ఆలయానికి కూడా రెండు గోపుర ద్వారాలు ఉన్నాయి.

## చోళుల శిల్పకళ

చోళుల శిల్పకళ వాస్తుకళకు సహకారాన్ని ఇచ్చురీతిలో ఉన్నాయి. పల్లవ శిల్పకళలో లాగ వాస్తు సమ్మిళతంగా కాక వాస్తు సమ్మిళిత రహితంగా వీరి శిల్పకళ ఉంది. వీరి కాలంలో పల్లవ కాలంకన్నా శిల్పరూప విధానంలో నైపుణ్యం కనపడుతుంది. సుమారు మూడువందల సంవత్సరాల శిల్పరూపణా వారసత్వాన్ని చోళులు పొందగలినందున వీరి శిల్పంలో స్వేచ్ఛారీతి కనపడుతుంది.

పల్లవ ఆలయాలకు కుడ్యాలపై శిల్పాలు నిండుకొని ఉన్నట్లు కనపడుతంది. కాని చోళుల కుడ్యాలలో శిల్పాలు పరిమితంగా ఉన్నాయి.

పల్లవ కట్టడ ఆలయాల్లో శిల్ప సమూహాల రూపణ ఇసుక రాతితో (Sand stone) చేయబడి ఉండగా చోళుల ఆలయాల్లో శిల్పాలు విడివిడిగా కాక రాతితో (hard granite) రూపొందించి ఉండటం కనపడుతుంది.

చోళుల అర్ధ శిల్పాలు చాలవరకు పల్లవ శిల్పాల లాగ కనపడుతున్నా వీరి పరిపూర్ణ శిల్పాలు (Sculpture in round) తేడా ఉన్నాయి. కాని కుంభకోణం, శ్రీనివాస నల్లూరుల్లోని చోళుల అర్ధశిల్పాలు శిలను లోతుకొట్టి శిల్పం గుండ్రంగా ఉన్నట్లు రూపొందించబడి ఉన్నాయి. వీరి శిల్పాల్లో శిల్ప చాతుర్యం కనపడుటేగాక స్వేచ్ఛా శిల్ప రూపణలోని పరిణామం కనపడుతుంది. వీరి శిల్పంలో పల్లవ శిల్పంకన్నా మేలు రీతి కనపడుతుంది.

చోళ శిల్పాల దేహ రూపంలో పైభాగం కొంత చదరంగను మోకాళ్ళు కొంత ముందుకు చొచ్చుకొని ఉన్నట్లుకనపడుతుంది. ఇతర శరీర భాగాలలో కూడ ఈ తేడా కనపడుతుంది. శిల్పాల

పాదాలు రూపొందించుటలో వీరు శ్రద్ధకనపరచలేదు.

చోళ శిల్పాల్లో మానవతా వాదం కనపడుతుంది. పల్లవ శిల్పంలోని సంక్షిప్తరీతికి భిన్నంగా వీరి శిల్పాలకు తేడా కనపడుతుంది. పల్లవ శిల్పంలో దేవ దేవీలకు, రాజు, రాణులకు తేడా కనపడదు. కాని చోళుల శిల్పాలు ఆకర్షణీయమైన రూపాలతో, సాంప్రదాయ భిన్నంగా ఉన్నాయి. వీరి శిల్పం సొంత ఆలోచనా ధోరణిలో ఉత్పన్నమైంది.

చోళ, పల్లవ శిల్పాల భంగిమలలోని స్వేచ్ఛలో తేడా కనపడుతుంది. చోళ శిల్పాల్లో పల్లవుల మహాబలిపుర శిలాఖండ అర్ధ శిల్పాల్లో లాగ పరిమాణం, భంగిమలలో సాంప్రదాయ విధానాలకు కట్టుబడి ఉంబటం కనపడదు. పల్లవ శిల్పంలో ముడుచుకొన్న(stiff), బరువుతో కూడినట్లు అసమాన పరిమాణాలు ఉన్నట్లు కనపడగా, చోళుల శిల్పాల్లో మృదుత్వ(soft), (suple form) మెత్తటి గుణం కనపడుతుంది. ఈ తేడాను మనం మహాబలిపురమందలి పల్లవుల వరాహమండప, ద్రౌపతి రథాలలోని దుర్గ ప్రతిమలను, కుంభకోణం, తిరువళ్లూరు, పుంజై మొదలైన ప్రాంతాల్లోని దుర్గ ప్రతిమలను పోల్చిచూసినచో కనపడుతుంది. పల్లవ దుర్గ పైవిభాగం సన్నగను, కింది అర్థభాగం (clumsy) గను ఉన్నాయి. చోళుల దుర్గ సమాన అర్ధభాగం పరిమాణాలను (elegant) గా ఉన్నది.

తొలి చోళ శిల్పాలలో సహజమైన, వివరణాత్మకమైన నగలు, దుస్తులు కనపతాయి. పల్లవ శిల్పం నగలు, దుస్తులు మృదువైన గీతలతో చూపబడి శిల్పంలో కలిసిపోయాయి. పల్లవ శిల్ప దుస్తుల మడతలు శిల్ప ఆకృతి (contours) లోనికి అదృశ్యమూనవి. చోళ శిల్పాలు గుండ్రంగాను లేక అర్ధ గుండ్ర శిల్పాలుగను రూపొందించబడి, దుస్తులు, నగలు పరిపూర్ణంగా చూపబడి ఉన్నాయి.

చోళ తొలి శిల్పాల్లో రెండు రకాలు కనపడతాయి. ఒకటో రకంలో ఎత్తుగా, సన్నగా ఉన్న శరీరాలు, కోల ముఖాలు, ముందుకున్న కటి భాగం, మూడు వంతులుపక్కకున్న భంగిమలతో వీరి శిల్పాలు పటమందు (frame) రూపొందించబడి ఉన్నాయి. రెండో రకమందు శిల్పాలు వెడల్పు ముఖాలను, స్పష్టమైన కనుబొమలను(in high relief), ఆరోగ్యకరమైన ఉన్నాయి.

రాజరాజు నిర్మించిన గంగైకొండ చోళపుర దేవాలయంలో శివుని వీరోచిత సంఘటనలను తెలిపే త్రిపురాంతక మూర్తి, కాళారిమూర్తి వంటి రూపాలతో కూడిన శివుని శిల్పాలు ఉన్నాయి. ఇచట గంగాధరమూర్తి శిల్పం ప్రధాన్యతను సంతరించుకొని ఉంది. రాజేంద్రుడు ఉత్తర భారత రాజులను ఓడించి, సామంతులనుచటి కప్పంగా గంగానదీ జలాన్ని తన రాజధానికి తెచ్చితినని గర్వంగా చెప్పుకొన్నాడు. కావున ఈ శిల్పంనకు ప్రాధాన్యత ఇవ్వడం జరిగింది.

**తంజావూరు బృహదీశ్వరాలయ శిల్పాలు**

ఈ ఆలయ గర్భగృహ, అర్ధమండపాల కుడ్యాలలోని కోష్టల్లో విష్ణుఅనుగ్రహామూర్తి, భిక్షాటనమూర్తి, వీరభద్ర, దక్షిణమూర్తి, కళారిమూర్తి, హరిహర, అర్ధనారీశ్వర,

చండేశానుగ్రహమూర్తి, గంగాధర, ఆలింగచంద్ర శేఖర, గణపతి, దేవీలతోయున్న స్థానకవిష్ణు, మహిషమర్ధని వంటి శిల్పాలు అనేకం ఉన్నాయి. ప్రదక్షిణపథ భాగాల్లో 108 శిల్పాలు ఉన్నాయి. కడపటి 27 తప్ప మిగిలినవన్నీ భరతుని నాట్యశాస్త్రరీత్యా రూపొందించిన పలు భంగిమల్లోని శివుని శిల్పాలు.

**గంగై కొండచోళపుర బృహదీశ్వరాలయ శిల్పాలు**

ఈ ఆలయ గర్భగృహ, అంతరాళ, ముఖమండపాల కుడ్యభాగంలో రెండువరుసల్లోని కోష్ఠల్లో పలు శిల్పాలు ఉన్నాయి. వీటిలో నటరాజు, గంగాధర ముఖ్యమైనవి. గంగాధర శిల్పంలో శివుడు పార్వతిని శాంతపరచటానికి ప్రయత్నిస్తున్నాడు. గంగను తన శిరోజాల్లో ధరించినందున పార్వతి కోపగించగా ఆమెను శివుడు బ్రతిమాలు చున్నాడు. ఈ శిల్పకోష్ఠం ప్రక్కలలో భగీరథుని తపోఘట్టాలున్నాయి. ఈ కుడ్యాలలో లింగోద్భవ, దేవీలతోఉన్న విష్ణు, విష్ణుకంటిని పుష్పంగా స్వీకరించుచున్న ఉమాసహిత, శివుడు, నందితోబాటు ఉన్న అర్ధనారీశ్వరుడు, హరిహరుడు, పక్కకోష్ఠల్లో మార్కండేయుడి కథాఘట్టాలతోఉన్న కాళాంతకుడు, మదనాంతక శివుడు మొదలైన శిల్పాలున్నాయి.

**దారా సూరం దేవాలయ శిల్పాలు**

దారా సూరం ఆలయ కోష్ఠల్లో త్రిముఖుడు అష్టభుజుడైన అర్ధనారీశ్వరుడు, త్రిముఖ అష్టభుజ భయంకర రూపుడైన అఘోరమూర్తి, నరసింహుని తుదముట్టిస్తున్న శరభేశ్వరమూర్తి, జ్ఞానసంబంధర్ శిల్పాలున్నాయి. అంతేగాక అప్పర్, తిరుములార్, తిరుక్కరిప్పుత్తోందార్ మొదలైన శైవ ఋషుల జీవిత గాథలను తెలిపే శిల్పాలు ఉన్నాయి.

దారా సూరం శిల్పాల్లో శాంతి, అనంతానందం, సుభిక్షత కనిపిస్తుంది. నిత్యవినోదం కొరకై ఇచట నృత్య, సంగీత కార్యక్రమాలు జరిగేవని తెలిపే శిల్పాలు ఉన్నాయి. కోష్ఠల్లోని ఋషుల శిల్పాలు, వాటిపైగల తోరణాలు ప్రశాంతతను తెలుపుతున్నాయి.

**లక్ష్మింగం ఆలయ శిల్పాలు**

ఈ ఆలయంలో ఆశీన బ్రహ్మ, ఇంద్ర, విష్ణు, శివ, స్థానిక గణపతి, త్రిముఖబ్రహ్మ, దక్షిణామూర్తి, యోగ నరసింహ శిల్పాలు ఉన్నాయి.

**వార్తమలై ఆలయ శిల్పాలు**

వార్తమలైలోని విజయాలయ చోళేశ్వర ఆలయమందు దుర్గ, సప్తమాతృకలు, గణేశ చండేశ, చంద్ర, జేష్ఠ, శని శిల్పాలు ఉన్నాయి.

# తూర్పు (వేంగీ) చాళుక్యుల ఆలయాల వాస్తు శిల్పం

చాళుక్యుల్లో మూడు వంశాలున్నాయి. అవి : తొలి చాళుక్యుక్యులు, మలి చాళుక్యులు, తూర్పు చాళుక్యులు. తొలి చాళుక్యులను బాదామి, వాతాపి చాళుక్యులని కూడా అంటారు. మలి చాళుక్యులను కళ్యాణి చాళుక్యులని, పశ్చిమ చాళుక్యులని కూడా అంటారు. తూర్పు చాళుక్యులను వేంగీ చాళుక్యులని కూడా పిలుస్తారు. తొలి చాళుక్యులు కర్ణాటకలో బాదామి రాజధానిగా క్రీ.శ.550 - 753 మధ్య పాలించారు. ఈ వంశరాజు రెండో పులకేశి కోస్త ఆంధ్రను ఆక్రమించి సోదరుడు కుబ్జ విష్ణువర్ధనునికిచ్చాడు. ఇతడే తూర్పు చాళుక్య వంశ స్థాపకుడు. ఇతని వంశీయులు వేంగి రాజధానిగా పాలించారు. ఈ వంశీయుడే రాజరాజనరేంద్రుడు. వీరు చోళుల సమకాలికులు. ఈ వంశం క్రీ.శ.1070లో చోళ రాజ్యంలో కలసిపోయింది. వీరి ఆలయాలుపలుచోట్ల ఉన్నాయి.

## బిక్కవోలు దేవాలయాలు

తూర్పు గోదావరిజిల్లాలోని బిక్కవోలులో వేంగి చాళుక్యుల దేవాలయాలు ఆరు ఉన్నాయి. వీటిలో మూడు ఒక ప్రాకారం లోపల ఉన్నాయి. మిగిలిన మూడు ప్రాకారం వెలుపల బిక్కవోలు గ్రామంలో ఉన్నాయి. వీటిని వేంగీ చాళుక్యరాజు గుణగవిజయాదిత్యుడు (క్రీ.శ.848 - 891) నిర్మింపజేశాడు. ఈతని బిరుదైన 'బిరుదాంకన భీమ' నుండే బిక్కవోలుకు బిరుదాంకనవ్రోలు అను పేరువచ్చింది. దీనినుండే బిక్కవోలు పేరు పుట్టింది. ఇచటి ఆరు ఆలయాలలో కాన్సరగుడి, నక్కల గుడి, మరొక గుడి తొలి దశ ఆలయాలుగా చెప్పవచ్చును. మిగిలిన మూడు గోలింగేశ్వరాలయం, చంద్రశేఖరాలయం, రాజరాజేశ్వరాలయం మలిదశకు చెందినట్టివి. తొలిదశవన్నీ చతురస్రంగా ఉన్నాయి. వీటికి మూడు తలాలు ఉన్నాయి. మలిదశ గోలింగేశ్వరాలయానికి గర్భగృహ, అంతరాళ, రెండుమండపాలు ఉన్నాయి. దీని కుడ్యాలపైగల కోష్టలలో సూర్య, అగ్ని, విష్ణు, శివ, బ్రహ్మ, చాముండి, బిక్షాటనమూర్తి, అర్ధనారీశ్వర ప్రతిమలున్నాయి. ఆలయానికి రెండు తలాల విమానం, నాగర శిఖరలున్నాయి. చంద్రశేఖరాలయానికి చతురస్రాకార గర్భగృహ ఉంది. ఈ ఆలయం రాజ రాజేశ్వరాలయ పోలికలో గలదు. ఈ ఆలయంలో మిధున శిల్పాలున్నాయి. రాజరాజేశ్వర ఆలయం గర్భగృహ, వరండా (porch) లను ఉంది. కుడ్య శిల్పాలు శిధిలమై ఉన్నాయి. కుడ్యంలో దేవకోష్టలు, కుడ్యస్తంభాలు ఉన్నాయి. కోష్టలలో కుమార, కుబేరలున్నాయి. ఆలయ విమానం రెండుతలాలను, నాగర శిఖరను, ప్రతితలంలో కూట పంజర, శాల హారాలు ఉంది.

ఈ ఆలయాలన్నీ క్రీ.శ.950 - 1050 మధ్య కాలానివి. కడపటి రాజరాజకాలానిదందురు.

## చేబ్రోలు దేవాలయం

గుంటూరు జిల్లాలోని చేబ్రోలులో భీమలింగేశ్వరాలయం ఉంది. దీనిని ఒకటో చాళుక్య భీముడు (క్రీ.శ.892 - 922)లో నిర్మించాడు. ఇది రెండంతస్తుల ఆలయం. ఇచట కింద, పైన కూడా గర్భగృహాలున్నాయి. కింద చతురస్రాకారగర్భగృహ, దానిచుట్టూ ప్రదక్షిణాపథ, దీనిముందు ముఖమండప, ముఖమండప ముందుగా (porch) ఉన్నాయి. గర్భగృహ ఎత్తైన శివలింగమున్నది. పైఅంతస్తులో కూడా శివలింగముంది. ఇది నేటికీ పైఅంతస్తులో పూజలందుకొంటుంది.

## పంచారామాలు

ఆంధ్రలోని పంచారామాలనే ఆలయాలను ఒకటో చాళుక్యభీముడు నిర్మించాడు. ద్రాక్షారామం, కుమారారామం (నేటి భీమవరం), క్షీరారామం (నేటి పాలకొల్లు), సోమారామం (నేటి పాతిపల్లి లేక సోమవరం) అమరారామం (నేటి అమరావతి)అనే శైవ పుణ్యక్షేత్రాలను పంచారామాలంటారు.

దాక్షారామం నేటి తూర్పు గోదావరి జిల్లాలో ఉంది. ఇది శైవ పుణ్యక్షేత్రం. ఇచటనే త్రిలింగాల మధ్యగల ఆంధ్రలోని త్రిలింగాలలో ఒకటి ఉంది. ద్రాక్షారామంలోని భీమేశ్వరుడు, శ్రీశైలంలోని మల్లికార్జునుడు, కాళేశ్వరంలోని కాళేశ్వరుడు త్రిలింగాలుగా ప్రసిద్ధిగాంచారు. శ్రీనాధ మహాకవి భీమేశ్వరునికి అంకితమిచ్చిన తన భీమేశ్వరపురాణమందు ద్రాక్షారామాన్ని గూర్చి ప్రస్తావించాడు. రాజమండ్రి పాలకులైన రెడ్డిరాజుల వంశజుడైన పెపెదకోమటి వేముని ఆస్థానంలో శ్రీనాధుడు ఉన్నాడు. దీనినిబట్టి దాక్షారామం ఆలయాన్ని ఒకటవ చాళుక్య భీముడు నిర్మించాడని చెప్పవచ్చును. ఈ ఆలయాన్ని పలురాజులు పోషించారు. కనుకనే కొత్త నిర్మాణ భాగాలు ఏర్పరచడం జరిగింది. శివుడు విరిచిన త్రిపురాసురుని కుటుంబ శివలింగంలోని ఐదు ముక్కలలో దాక్షారామ శివలింగం ఒకటని ఇచటి స్థలిపురాణం తెలుపుతున్నాయి. ఐదు ముక్కలుపై పంచారామాల్లో ప్రతిష్ఠింపబడ్డాయని తెలుస్తుంది. వీటి ఆరాధనకే దేవతలు గోదావరిని తెచ్చారని భావించడం జరిగింది.

దాక్షారామ ఆలయం రెండంతస్తులుగా ఉంది. ప్రతి అంతస్తు (తలం)లో గర్భగృహ ఉన్నది. ఆలయంచుట్టూ రెండు ప్రాకారములున్నాయి. ఆలయ కింది అంతస్తులో గర్భగృహ దానిచుట్టూ ప్రదక్షిణాపథ, ముఖమండప, వరండా (porch) ఉన్నాయి. గర్భగృహలో ఎత్తైన శివలింగమున్నది. ఇది పైఅంతస్తు గర్భగృహలోనికి చొచ్చుకొని ఉంది. ఇది బహుశా బౌద్ధ స్తూపాలలోని అయకస్తంభమై ఉండవచ్చునని ఒక అభిప్రాయం ఉంది. ఇచటికి తెచ్చి దీనిని శివలిగం ప్రతిష్ఠించి

ఉండవచ్చును. పైఅంతస్తులో గర్భగృహ, స్తంభాల ప్రదక్షిణాపథ, అంతరాళ రెండు మండపాలున్నాయి. ఇచటి గర్భగృహ చతురస్రంగా ఉన్నది. దీని నాల్గువైపులా ద్వారాలున్నాయి. వీటిలో ముందువైపుదే వాడబడుచున్నది. ఇచటి శివలింగం గుంతలాగ ఉంది. ఇది ఆయక స్తంభాన్ని గుర్తుచేయుచున్నది. ఈ ఆలయ పశ్చిమాన గోపురమున్నది. దీనికి ఏడు తలాలున్నాయి. ఇవి ఇటుకతో నిర్మింపబడ్డాయి. దీని తలాల మధ్యలో ద్వారమున్నది. ఆలయ ప్రాంగణంలో చిన్న ఏకశిలా దేవగృహం గలదు. ఈ ఆలయంలో పైఅంతస్తులో శివలింగ పూజ జరుగుచున్నది.

కుమారారామాన్నే నేడు పశ్చిమ గోదావరిజిల్లాలో గల భీమవరంగా లేక భీమారామంగా పిలుస్తారు. ఇచటి భీమేశ్వరాలయం ఉన్నది. ఇది కూడా రెండు అంతస్తులుగా రెండు గర్భగృహాలను కలిగి ఉన్నది. దిన్ని చాళుక్య భీముడు నిర్మించాడు.

క్షీరా రామాన్ని నేడు పాలకొల్లు అంటారు. ఇచట రామలింగేశ్వరాలయం ఉన్నది. ఇచట ఒకేప్రాంగణంలో ఐదు దేవగృహాలున్నాయి. వీటిలో మధ్యగల ఆలయాన్నే అమరలింగేశ్వరాలయం అంటారు. ఇచటి స్థలపురాణం ఈ ఆలయ శివలింగాన్ని శ్రీరాముడే ప్రతిష్ఠించాదని తెలుపుచున్నది. అందుచేతనే దీనికి రామలింగేశ్వరమని పేరొచ్చెనని ప్రతీతి.

సోమారామమునే నేడు పోతిపల్లి అంటారు. ఇచటి ఆలయాన్ని సోమేశ్వరాలయం అంటారు. ఇది రెండంతస్తుల ఆలయం.

అమరారామాన్ని నేడు అమరావతి అంటారు. ఇది నేటి గుంటూరు జిల్లాలో ఉన్నది. ఇచట ఒకే ప్రాంగణంలో శివాలయం, బాలచాముండిక దేవి ఆలయాలు ఉన్నాయి. దేవి ఆలయం పమకాలీనమైనదో కాదో సరిగా తెలియుట లేదు. ఈ ఆలయంలో అనేక శాసనాలున్నాయి. ఇవి క్రి.శ.1129 - 1626 మధ్య కాలానివి. ఇవన్నీ ఆలయానికిచ్చిన పలురాజుల దానాలను తెలుపుచున్నాయి. ఇచటి ఆలయం దాక్షారామ ఆలయంలాగ రెండంతస్తులుగా ఉంది. ఇది ఒకదానిలోపల మరొకటిగా మూడు ప్రాకార కుడ్యాలు ఉన్నాయి. దీని గర్భగృహాలో 15 అడుగుల ఎత్తుగల తెల్లచలువరాయి లింగమున్నది. ఇది కూడా ఆయక స్తంభమై ఉండవచ్చు. ఈ ఆలయంలో కోట నాయకులు, రెడ్డి రాజులు, విజయనగర రాజుల శాసనాలు ఉన్నాయి.

# మలి (పశ్చిమ లేక కళ్యాణి) చాళుక్యుల ఆలయ వాస్తు శిల్పం

మలి చాళుక్యులను పశ్చిమ చాళుక్యులు, కళ్యాణి చాళుక్యులు అనికూడా పిలుస్తారు. వీరు క్రీ.శ.973 నుంచి 1200 వరకు పరిపాలించారు. వీరి ఆలయాలు అధికంగా కర్ణాటక ప్రాంతంలో ఉన్నవి.

ధార్వార్‌జిల్లాలోని నవలింగ దేవాలయాల సమూహం వీరి తొలి నిర్మాణాలు. ఇవి క్రీ.శ. 10వ శతాబ్దం నాటివి. మూడు మండపాలచుట్టూ 9 దేవగృహాలు నిర్మింపబడి ఉండుట ఈ నవలింగ ఆలయంలోని విశేషం. ఇవన్నీ ఒకే అధిష్ఠానంపైన నిర్మింపబడి ఉన్నాయి. వీటికి గర్భగృహచుట్టూ ప్రదక్షిణాపథ లేదు. వీటికి ఉపపీఠం లేదు. వీటి కుడ్యాలపై విమాన స్తంభాలు ఉన్నాయి. ఇవి ఒకదానిపై మరొకటిగా పైనున్న పిట్టగోడవరకు నిర్మింపబడి ఉన్నాయి. ఇవి వీరిముందు కాలాల్లో కనపడవు. వీటిని తరవాతి రాజులైన హొయసాలులు, విజయనగర రాజులుఅనుసరించారు. ఈ ఆలయ విమానభాగంలో సుఖనాస విభాగమున్నది. ఇందు దేవతా ప్రతిమ లేదు. ఈ ఆలయ నిర్మాణానికి ముదురు అకుపచ్చ నలుపు క్లోరైట్‌సిస్ట్ (chlorite scist) వాడారు. ఇందు వాస్తు సమానంగా శిల్పం ప్రాధాన్యాన్ని పొంది ఉంది. ఈ ఆలయంలోని స్తంభాలు, ద్వారాలు, పైకప్పుల్లు మెరుస్తున్నాయి. స్తంభాలకుముందు చొచ్చుకొని ఉన్న భాగాలు, లోతుగా ఉన్న భాగాలు అనేకం ఉన్నాయి. ఈ ఆలయ దేవగృహాలకు రెండు లేక మూడు తలాల విమానాలు ఉంది.

కుక్కనూర్‌లోని కొల్లేశ్వరాలయం కూడా వీరి కాలానిది. ఇది కొంతవరకు పట్టదకల్‌లోని విరూపాక్ష దేవాలయాన్ని పోలి ఉంది. దీనికి గోపుర ద్వారాలు, ప్రాకారాలు, ప్రాకార దేవతాగృహాలు లేవు. గర్భగృహ, అంతరాళ మండప అను నిర్మాణ భాగాలున్నాయి. మండప ముందు నంది మండపం ఉంది. ఒక హాలుచుట్టూ అనేక దేవగృహాలున్నట్లు నిర్మింపబడ్డ ఇతర మలి చాళుక్యుల ఆలయాల లాగకాక దీనికి ఒకే దేవగృహ ఉంది. ఈ ఆలయ కుడ్యాలపై దేవకోష్టలు, కుడ్యస్తంభాలు, విమాన స్తంభాలు ఉన్నాయి. కుడ్యంపైన మూడు తలాల విమానం ఉన్నది. ఇందు సుఖనాస ఉంది. మండప స్తంభాలు గుండుగానున్నగా ఉన్నాయి. ఈ ఆలయం చిన్న రాళ్లతో నిర్మింపబడింది. దీనిలో నంది మండప, గణపతి, దుర్గ దేవగృహాలు ఉన్నాయి.

లక్కుండి ప్రాంతంలో ఒక జైన ఆలయం ఉన్నది. ఇది 11వ శతాబ్దం నాటిది. మృదువైన (chlorite scist) తో నిర్మింపబడింది. దీనికి గర్భగృహ, అంతరాళ, నవరంగ మండప, మండప ఉన్నాయి. దీని స్తంభాలు సన్నగా ఉన్నాయి. ఈ ఆలయానికి నాలుగు తలాల విమానమున్నది.

చతురస్ర శిఖరం ఉన్నది. చౌదరంపూర్ ముక్తేశ్వరాలయం, హావేరి శిద్ధేశ్వరాలయం, హరల్‌హల్ సోమేశ్వరాలయం, దొడ్డగడ్డవళ్ళి లక్ష్మీదేవి ఆలయం కూడా వీరి కాలానికి చెందినవి.

క్రీ.శ. 12 వ శతాబ్ద తరవాత కాలంలో నిర్మింపబడ్డ వీరి నిర్మాణాలు పరిణతి దశకు చెందిన ఆలయాలుగా చెప్పవచ్చు. వీటిలో లక్కుండిలోని కాశీవిశ్వేశ్వరాలయం ఒకటి. దీనిలో అద్భుత శిల్పాలున్నాయి. వీటి ద్వారాలపై అల్లికవంటి కళా నైపుణ్యాన్ని ప్రదర్శించే శిల్పాలు ఉన్నాయి. దీని కుడ్యాలు పిట్టగోడ విమాన తలాలు శిల్పాలతో నిండి ఉన్నాయి.

ఇత్తగిలోని మహాదేవ ఆలయంకూడా ఈ కాలంలో నిర్మింపబడింది. (క్రీ.శ.1112). దీనికి గర్భగృహ, అంతరాళ నవరంగ, అగ్రమండప లేక మండప (శత స్తంభ మండప) ఉన్నాయి. గర్భగృహపైన 5 తలాల విమానం ఉంది. హళేబీడు ఆలయం తరవాత ఇదే కర్ణాటకలోని అద్భుత ఆలయంగా చెప్పవచ్చును.

బళ్ళారి జిల్లాలోని కురవట్టిలో మల్లికార్జునాలయం ఉన్నది. దీనికి గర్భగృహ, అంతరాళ, విజయనగర కాలాలలోని నందిమండపలు ఉన్నాయి. పల్లవ, చోళ, విజయనగర కాలాలలో నందిమండప నిర్మాణం సర్వసామాన్యం. కంచికైలాసనాథ్ పల్లవనంది, తంజావూరు చోళులనంది లేపాక్షి విజయనగర నంది ప్రసిద్ధిచెందాయి.

ధార్వార్ జిల్లాలోని దొడ్డబసప్ప దేవాలయం నక్షత్ర ప్లానులో నిర్మింపబడి ఉంది. ఈ విధానం (graduated projection) గ్రాద్యుయేటెడ్ విధానంలో మెరుగైంది. ఈ ఆలయంలో గర్భగృహ, మండపలు నక్షత్ర ప్లానులో నిర్మింపబడి ఉన్నాయి. సాధారణంగా హొయసాలులు ఆలయాల గర్భగృహ నక్షత్ర ప్లానులోను మండప (graduated projection) గ్రాద్యుయేటెడ్ విధానంలోను నిర్మింపబడి ఉన్నాయి. కాని దొడ్డ బసప్ప ఆలయంలో రెండూ నక్షత్ర ప్లానులో ఉన్నాయి. ఈ విధానం కుడ్యాలు విమాన భాగాలవరకు అనుసరించబడి ఉన్నాయి.

# హొయసలుల ఆలయ వాస్తు శిల్పం

ద్వార సముద్రాన్ని రాజధానిగా చేసుకొని పరిపాలించిన హొయసల రాజుల ఆలయాలు కర్ణాటక ప్రాంతంలో ఉన్నాయి. ఇవి దాదాపు 80 ఉన్నాయి. వీరి ఆలయాల ముఖ్యాంశాలు కింది విధంగా ఉన్నాయి.

1. హొయసలుల వాస్తు శిల్పరీతిలో కళ్యాణి చాళుక్యుల రీతి కొనసాగించడం కనపడుతుంది. కానీ అనేక కొత్త విధానాలు కూడా వీరి కాలంలో ప్రవేశించాయి.

2. వీరికాలం నాటి ఆలయాల్లో మధ్యగా ఒక మండపం దానిచుట్టూ బహు (అనేక) దేవగృహాల నిర్మాణ పద్ధతి కనపడుతుంది. ఈ విధానం మండపానికి రక్షణ కల్పింస్తున్నది.

3. పశ్చిమ చాళుక్యుల కాలంనాటి నక్షత్ర ప్లానులోని గర్భగృహ నిర్మాణరీతి వీరి కాలంలో కనపడుతుంది.

4. వీరి గర్భగృహ వెలుపలి కుడ్యభాగాల్లో చిన్న చిన్న దేవగృహాలు ఉన్నాయి. కాకతీయుల రీతిలో పాలంపేట రుద్రేశ్వరాలయం, హనుమకొండ వేయిస్తంభాల ఆలయం వంటి వాటిలో కూడా ఇది కనపడుతుంది.

5. హొయసలుల ఆలయాలకు (బేలూరు దేవాలయం వంటివి) విమాన భాగంలో సుఖనాస విభాగం ఉంది.

6. హొయసలుల ఆలయాలకు ఉపపీఠం ఉన్నది. పల్లవుల మహాబలిపుర రథాలలో కూడా ఉపపీఠం కనపడుతుంది. కాని పల్లవ, చోళ, కళ్యాణి చాళుక్య కట్టడ ఆలయాల్లో ఇది కనపడదు.

7. హొయసలుల ఆలయాల ఉపపీఠ పైభాగం (terrace) సుమారు 10 నుంచి 12 అడుగుల వెడల్పుగా ఉండి ప్రదక్షిణాపథవలె ఉపయోగపడుచున్నది. దీనికి సాదా పట్టీలు, లోతు భాగాలు ఉన్నాయి. వీరి ఆలయాల గర్భగృహ, అంతరాళల చుట్టూ మూసిన (covered) ప్రదక్షిణాపథ లేదు.

8. వీరి ఆలయాల శిల్ప రూపణలో అత్యధిక శ్రద్ధ కనపరిచారు. వీరి వాస్తురీతిని

వాస్తు, కమరుల వాస్తు అంటారు. వీరి నిర్మాణాల్లో విపరీతంగా అలంకార శిల్పం కనపడుతుంది. ఈ పద్ధతి దేవతా ప్రతిమల్లో కూడా కనపడుతుంది. ఈరీతిలో శిల్పం రూపొందించడానికి. శిల్పుల చాతుర్యమే గాక వారు వాడిన సబ్బురాయి (soap stone) కూడా ముఖ్య కారణం. ఈ శిల కర్ణాటకలో హసన్, మధ్య కర్ణాటక, తుంపూర్ ప్రాంతాల్లో లభింస్తున్నది. శిల్పాలు చెక్కుటకు ఇది చాలా అనువుగా ఉంది. బేలూర్, హలేబీడ్, నుగ్గణ హళ్ళి ఆలయాలలో వాడిన (dark talacose)కూడా ఇట్టిదే. ఇది మెతువురాయి. (Black Red grey granite) నలుపు ఎరుపు, బూడిద వర్ణంగల కాకిరాళ్ళు శిలలు కోలార్, హసన్, బెంగుళూరు జిల్లాలలోని ఆలయాల్లో వాడటం జరిగింది.

9. హొయసలుల ఆలయాల అధిష్ఠానం 9 నుంచి 10 అడుగుల ఎత్తు ఉన్నాయి. ఇవి అర్ధపట్టీలలాగ రూపాన్ని కలిగి ఉన్నాయి. ప్రతిపట్టీపై జంతువులు, పూలు మొదలగు శిల్పాలు ఉన్నాయి. ఈ పట్టీల మధ్య లోతుగల పట్టీలున్నాయి (deep recess). వీరి అధిష్ఠానాల్లో దక్షిణ భారతదేశ అధిష్ఠానాలలోని పట్ట, త్రివట్ట, కుముద మొదలైనవి శిల్పాల ప్రాముఖ్యాన్ని చాటుట. వీటిపై ఏనుగులు, గణాలు, అశ్వాలు, సింహాలు మొదలైనవి పలు భంగిమల్లో రూపొందింపబడి ఉన్నాయి.

10. వీరి ఆలయాల కుడ్యాలు రెండు విభాగాలుగా ఉన్నాయి. కింది విభాగంలో దేవతా ప్రతిమలు, పౌరాణిక వీరులు (అర్జునుడు, రాముడు మొదలగువారు), అప్సరసలుమొదలగు వారి శిల్పాల వరసలు ఉన్నాయి. ప్రతి శిల్పం లేక ప్రతి శిల్ప సమూహం ఆకులపందిరి (foliated canopy) కింద ఉన్నట్లు చూపబడింది. గర్భగృహ కుడ్యాలలైఅనేక శిల్పాలున్నాయి.

కుడ్యం పైవిభాగంలో కుడ్యస్తంభాలు, చిన్న విమానాలుగల చిన్న దేవగృహాలు, మదనిక శిల్పాలు ఉన్నాయి. మదనిక శిల్పాలు కుడ్యస్తంభాల పైవిభాగాలకు కపోతకు మధ్యగా రూపొందించి ఉన్నాయి. అందాన్ని చూసుకొనుచున్న మదనిక శిల్పం, కాలునుంచి ముల్లు తీసుకొనుచున్న స్త్రీ, తన చీరకుచ్చిళ్ళను కదలించుచున్న స్త్రీవంటి అనేక శిల్పాలు స్తంభయూలం, చూరులను కలిపే రీతిలో (bracket) శిల్పాలు ఉన్నాయి.

11. వీరి ఆలయాల కపోత. కుడ్య, విమానాల మధ్యగా ఆలయం చుట్టూ నేరుగా వంపు గలిగి ఉంది.

12. ఒక కేంద్రమండపం చుట్టూ మూడువైపులా దేవగృహాలు నిర్మించెడి విధానం వీరి ఆలయాల్లో కనపడుతుంది. కొన్ని ఆలయాల్లో ఒక హాలు వెనుక భాగంలో ఒకే దేవగృహ నిర్మించెడి విధానం కూడా ఉన్నది.

13. విమాన భాగంలో కూట, పంజర, శాల హారాలతో కూడిన అనేక తలలు ఉన్నాయి. విమాన

ముందుభాగంలో అంతరాళ విభాగ పైవిభాగాన సుఖనాస విభాగం ఉంది.

14. విమానంపై వికసించు పద్మాలవంటి తలాలతో అర్ధచంద్రాకార రూపంలో ఉన్నాయి. దీనిపై కలశం ఉంది.

**విమర్శ**

హొయసలుల ఆలయాలు ఎత్తు తక్కువగా, వెడల్పు ఎక్కువగా ఉన్నాయి. వాస్తురీత్యా ఇవి ఆకర్షణీయంగా లేవు. ఇవి స్థపకుల (architect) నిర్మాణాలుగా కనిపించవు. శిల్పుల నిర్మాణాల్లుగా అనిపిస్తాయి. ప్రతి ఆలయంలో శిల్పాలు, నగిషీలు అధికంగా ఉన్నాయి. ఇందుకు హాలేబీడు ఆలయం ఒక ఉదాహరణ. దీని అదిష్టానం, కుడ్యం, కపోత, మండప, కాక్షాశనం రంధ్రాల కిటికీలు మొదలగువన్నీ శిల్పాలు, నగిషీలతో నిండి ఉన్నాయి. హొయసలుల శిల్పుల చాతుర్యానికి పోలికలేదు. శిల్పులు ఎంత శ్రమ, ఓపిక, చాతుర్యాన్ని చూపిరో ఊహించుటకు కూడా అందదు. కావుననే హొయసలుల ఆలయాలు శిల్పుల వాస్తు నిర్మాణం అంటారు. వీరి శిల్పాలు నగీషీలతో ఉన్నందున ఇవి కమ్మరి నిర్మాణాలంటారు. కాని వీరి శిల్పాల్లో భావప్రాధాన్యం సరిగా కనపడదు. శిల్పాలు చచ్చుగా, నగల ముంపుతో ఉన్నాయి.

**చెన్నకేశవాలయం**

బేలూరులోని ఈ ఆలయాన్ని క్రీ. శ.1170 లో హొయసలుల విష్ణువర్ధనుడు నిర్మించాడు. ఇది ఒక పెద్ద ప్రాకారం మధ్యగల ప్రాంగణంలో నిర్మింపబడి ఉన్నది. ప్రాకారం ముందుగోడ మధ్యభాగంలో గోపురద్వారం ఉంది. గోపురం ద్వారా ప్రాంగణంలోనికి ప్రవేశించినచో అందు అనేక పరివార దేవతాగృహాలు ఉన్నాయి. రామ, కృష్ణ, దేవి, భాష్యకార్లు, వీరాంజనేయ మొదలగు వారికి ఈ దేవగృహాలున్నాయి. ముఖ్య దేవగృహానికి నక్షత్ర ప్లానులోని గర్భగృహ, అంతరాళ, స్తంభమండప లేక నవరంగ ఉన్నాయి. ఇవన్నీ ఒక నక్షత్ర ప్లానులోని ఉపపీఠంపై నిర్మింపబడి యున్నాయి.

ఈ ఆలయ గర్భగృహ, మండపాలకు ఒకేరకమైన అధిష్ఠానమున్నది. అధిష్ఠాన విభాగాలపై రామాయణ, మహాభారత ఘట్టాలతో కూడిన శిల్పాలు, జంతువులు మొదలైనవి ఉన్నాయి.

నవరంగకు మూడు ప్రవేశ మార్గాలున్నాయి. వీటి ముందుగా ఉపపీఠం నుంచి మెట్ల నిర్మాణముంది. ఈమెట్లకిరుపైపులా చిన్న దేవగృహాలున్నాయి. వీటికి అన్ని ఆలయాలకున్నట్లే చిన్న పరిమాణంలోని శివలింగాలున్నాయి. పల్లవ కాలంలోలాగ ఈ నవరంగ ద్వారాలపైనగల భాగంలో ద్వారం ఇరువైపులా వ్రేలాడుచున్న మకరతోరణం ఉంది. వీటిపై సార్వీచేయు వాడు ఉన్నాడు. నవరంగ కుడ్యభాగం ఒక పిట్టగోడలాగ ఉంది. దీనినే కాక్షాసనం అంటారు. నవరంగ కొనభాగంలో ఇది ఉంది. కాక్షాసనం పైన అక్కడక్కడా స్తంభాలున్నాయి. ఒక స్తంభానికి మరొక స్తంభానికి మధ్యగల ఖాళీ స్థలాలలో వలలున్నాయి (screens). కాక్షాసనంపైనగల స్తంభాలకు ఆనుకొని మదనిక శిల్పాలున్నాయి. వలలపై కూడా శిల్పాలు ఉన్నాయి. వీటిపై విష్ణువర్ధనుని

దర్బారు, బలికథ, వామనుని కథ మొదలైనవి ఉన్నాయి.

నవరంగ లోభాగంలో నాలుగు స్తంభాలున్నాయి. వీటికి మదనిక శిల్పాలున్నాయి. నవరంగ మధ్య పైకప్పు ఎత్తుగాను, అర్ధచంద్రాకారం (dome) గాను ఉంది. దీని లోపలి ముఖభాగంలో అనేక రేకులు గల పెద్ద పద్మం ఉంది. ఇది పద్మశిలకు ఉదాహరణ.

గర్భగృహ మూడువైపులా ఒకదానిపై మరొకటిగా రెండు దేవగృహాలున్నాయి. మిగిలిన గర్భగృహ కుడ్యభాగాల్లో విమానస్తంభాలు, కుడ్యస్తంభాలు, 80 దేవతా శిల్పాలు ఉన్నాయి. శిల్పాలలో వామన, వరాహ, బలరామ, అంధకాసురసంహారమూర్తి, గజాసురసంహారమూర్తి, హరిహర, దుర్గ, రతి, మన్మధ, గణపతి, చంద్ర, సరస్వతి, కృష్ణ, అర్జున మొదలైనవి ఉన్నాయి. ఇవి కుడ్యస్తంభాల మధ్యభాగాల్లో ఉన్నాయి. విష్ణు పలుఅవతారాల్లో చూపబడి ఉన్నాడు. శిల్పాల కింద వీటిని రూపొందించిన శిల్పుల పేర్లున్నాయి. వీరిలో దాసోజ, మల్లోజ, నాగోజ ఉన్నారు.

ఈ ఆలయ కుడ్యంపైనగల కపోత ఉబ్బెత్తుగా చదరంగా ఉంది. దీని ముఖభాగంపై 'కూడు' ఉన్నాయి. గర్భగృహపైన ఉండిన విమానం నేడు పూర్తిగా పతనమై ఉంది.

ఆలయ ప్రాంగణంలోని ప్రత్యేక పరివారదేవతా గృహాలు సమకాలీనమైనవో కావో స్పష్టంగా తెలిటం లేదు. ఇవి బహుశః తరువాతి కాలానివై ఉండవచ్చును.

**హొయసలేశ్వర దేవాలయం**

కర్ణాటక రాష్ట్రంలోని హాసన్ జిల్లాలోని హళేబీడ్ నందలి హొయసలేశ్వర దేవాలయం క్రీ.శ.1150 లో నిర్మింపబడింది. హళేబీడ్ ప్రాచీనమైన పేరు. ద్వారసముద్రం. ఇది హొయసల రాజుల రాజధానిగా ఉండేది. ఇచ్చటి హొయసలేశ్వర ఆలయం జంట ఆలయంగా నిర్మింపబడి ఉంది. రెండు ఆలయాలు ఇచట పక్కపక్కగా నిర్మింపబడి, రెండింటినీ కలుపుతూ ఒక మండపం వంటి ప్రవేశ మార్గమున్నది. ఈ రెండు ఆలయాలకూ ఒకే నక్షత్ర ఉపపీఠం, ఒకే అధిష్ఠానం ఉన్నాయి. ప్రతి ఆలయానికి గర్భగృహ, అంతరాళ, మండప ఉన్నాయి. ఈ మండపాలకు మూడు ద్వారాలున్నాయి. వీటిని ద్వారపాలకులు రక్షింస్తున్నారు. ఈ మండపాలు రెంటినీ కలుపుతూ మండపంవంటి మార్గం నిర్మింపబడి ఉంది. రెండు ఆలయాల ముందుగా ఎదుటి దిక్కులోని ఉపపీఠ కొస భాగంలో నంది మండపాలున్నాయి. ఉత్తరవైపు ఆలయానికి ఎదురుగా ఉన్న నంది మండప ముందుగా ప్రాంగణంలో సూర్యదేవగృహం ఉంది. ఉపపీఠం కుడిఎడమ కొసభాగాల్లో మెట్ల నిర్మాణం ఉంది.

అధిష్ఠానంలో తొమ్మిది పట్టీలున్నాయి. ప్రతి పట్టీపై శిల్పాలున్నాయి. ఒకటోపట్టీపై (కింది [illegible] 200 ఏనుగులు వివిధ భంగిమల్లో ఉన్నాయి. రెండో పట్టీపై రెక్కల సింహాల వరుస [illegible] వలయాల అలంకారముంది. నాల్గోపట్టీపై అశ్వికులుగల అశ్వాల [illegible] వలయాల అలంకారం, ఆరోపట్టీపై వివిధ భంగిమలలోని మానవ

శిల్పాలు, ఏడో పట్టీపై అసహజ సింహాలు (mythical lions), ఎదో పట్టీపై అసహజహంసలు (mythical swans) తొమ్మిదో పట్టీపై వలయాల అలంకారాలు ఉన్నాయి.

అధిష్ఠానంపైనగల కుడ్యభాగంలో ఆరు చిన్న దేవగృహాలు విమాన స్తంభాలు, దేవతా శిల్పాలు ఉన్నాయి. దేవతా శిల్పాల్లో నృత్య సరస్వతి, యజ్ఞవరాహ, శివపార్వతులు, లక్ష్మీనారాయణ, వృషభారూఢ, మత్స్యయంత్రాన్ని ఛేదిస్తున్న అర్జునుడు ఉన్నాడు. ఈ శిల్పాలక్రింద ఏటిశిల్పుల పేర్లున్నాయి. ఈ పేర్లు బేలూరు దేవాలయంలో ఉన్నవే.

రెండు గృహాల గర్భగృహాలపై ఒకప్పుడు ఉన్న విమానాలు నేడు లేవు. తాను ఈ ఆలయాన్ని చూసినపుడు విమానం ఉండేదని ఫెర్గూసన్ తెలిపాడు.

**కేశవాలయం**

కర్ణాటకలోని శ్రీరంగపట్నానికి 20 మైళ్ల దూరంలోని సోమనాథపురం వద్ద కేశవాలయం ఉంది. దీన్ని హొయసల రాజైన మూడో నరసింహుని అధికారాన సోమనాథుడు క్రీ.శ.1268లో నిర్మించాడు. దీన్ని ప్రసిద్ధిగాంచిన జక్కనాచార్య శిల్పి (దక్షిణాలచారి) నిర్మించాడని ప్రతీతి.

ఈ ఆలయం 215 అడుగుల పొడవు, 177 అడుగుల వెడల్పుగల ప్రాకారంలోపలగల ప్రాంగణం మధ్య నిర్మితమై ఉంది. ప్రాకారం లోపలి ముఖభాగంలో 64 ప్రాకారదేవతా గృహాలున్నాయి. వీటిలో పలు విష్ణు అవతార ప్రతిమలు ఒకప్పుడు ఉండేవి. కాని నేడు ప్రతిమలు లేవు. ప్రాకారపు మూడు కుడ్యాలమధ్య గోపురద్వారం ఉంది. ఈ ఆలయంమూడు దేవగృహాలు ఉన్నాయి. ఈ మూడు ఒక పెద్ద హాలుకు (మండపం) మూడుపైపులా నిర్మింపబడి ఉన్నాయి. ఈ ఆలయం నక్షత్ర ప్లానులోని ఉపపీఠంపైన మధ్యలో నిర్మింపబడి ఉంది. నక్షత్ర ఉపపీఠంపై నక్షత్ర అధిష్ఠానం ఉంది. ఇచటి ప్రతి దేవగృహానికి గర్భగృహ, అంతరాళ ఉన్నాయి. అంతరాళ ముందు ఒకే (common) మండపం ఉన్నది. ఈ మండపముందు నవరంగ నిర్మింపబడి ఉంది.

ఈ ఆలయ అధిష్ఠానంలో ఆరుపట్టీలున్నాయి. వీటిపై ఏనుగులు, అశ్వాలు, వలయాలు, పయనించు సైన్యం మొదలగు శిల్పాలున్నాయి.

ఆలయ కుడ్యభాగంలో మండప విభాగముందు కుడ్యస్తంభాలు, రంధ్రాల కిటికీలు ఉన్నాయి. గర్భగృహ విభాగంలో కుడ్యస్తంభాలు, దేవతా ప్రతిమలు, సింహాలలాటం పైనగల దేవతా ప్రతిమలు ఉన్నాయి. మండప పైకప్పు కొనలలో ఇటుకతో నిర్మించిన 'కూడులు' (arches), వాటిలో దేవతా ప్రతిమలు ఉన్నాయి. ఇట్టి రీతిని విజయనగర రాజులు కూడా అనుసరించారు.

ప్రతి దేవగృహం విమానంలో మూడు తలాలున్నాయి. ప్రతితలంలో కూట, పంజర, శల హారాలున్నాయి. విమానం ముందుభాగంలో సుఖనాస విభాగం ఉంది. ఇందు 'కూడు' డిజైన్ ఉంది. ప్రతి దేవగృహం అధిష్ఠానం మొదలు శిఖరం వరకు నక్షత్ర ప్లానులో నిర్మింపబడి ఉంది.

ఇచటి మూడు దేవగృహాల కుడ్యాలపై 194 దేవతా శిల్పాలున్నాయి. వీటిలో 114 దేవీ శిల్పాలు. ఇచట నరసింహ, వరాహ, వేణుగోపాల, బ్రహ్మ, శివ, మహిషమర్ధని, ఇంద్ర, మన్మథ, లక్ష్మి, సరస్వతి మొదలగు శిల్పాలున్నాయి. వీటి కింద బేలూరు, హాలేబీడు ఆలయాల్లో లాగే శిల్పుల పేర్లున్నాయి. వీరిలో మల్లితమ్మ, మసనితమ్మ, బలేయ, చందేయ, బమయ ఉన్నారు.

ఇచటి తూర్పుముఖ ఆలయ గర్భగృహాలో కేశం లేక చెన్నకేశం (అందమైన విష్ణు) శిల్పముంది. కాని నేడు లక్ష్మీనారాయణ, దేవీల శిల్పాలున్నాయి. మిగిలిన రెండు ఆలయాల గర్భగృహాల్లో జనార్ధన, వేణుగోపాల శిల్పాలున్నాయి.

## హొయసల శిల్పకళ

ద్వారసముద్రాన్ని రాజధానిగా ఏర్పరచుకొని పరిపాలించిన హొయసల రాజులు తొలుత పశ్చిమ (కళ్యాణి) చాళుక్యుల సామంతులుగా ఉన్నారు. దీనివల్ల ఈ చాళుక్యుల ప్రభావం శిల్పకళపై కనపడుతుంది.

హొయసల శిల్పాలు పొట్టిగా ఉన్నాయి. కొంత ఆశీన రూపంలో ఉన్నట్లున్నాయి. కమ్మరి నగిషీలను, నిండైన ఆభరణాలుఉన్నాయి. కాని చూచుటకు ఆహ్లాదాన్నిస్తున్నాయి. కావుననే హొయసల శిల్పకళను కమ్మరి శిల్పకళగా పొగుడుతున్నారు.

కర్ణాటక ప్రాంతంలో అద్భుత వాస్తు శిల్పకళాఖండాల నిర్మాణానికి విష్ణువర్ధన అని పేరుగాంచిన హొయసల రాజైన బిత్తిగ రాజు కారకుడు. ఇతడు రామానుజుని వలన క్రీ.శ.12వ శతాబ్దంలో వైష్ణవ మతాన్ని స్వీకరించుటచే ఇతనికి విష్ణువర్ధనుడని పేరు వచ్చింది. హాలేబీడు (ద్వారసముద్రం), బేలూరు సోమనాథ్‌పూర్, అరిసికెరె మొదలగు ప్రాంతాల్లో ఆలయాల అధిష్టానాలు కుడ్యాలు, పైకప్పులు, స్తంభాలపై అనేక శిల్పాలున్నాయి. అధిష్టాన పట్టీలపై పొడవైన ఏనుగుల వరుసలు, మకరాలు హంసలు, మిథున మొదలగు శిల్పాలు నిండుకొని ఉన్నాయి. స్తంభాల పాదం కుడ్యచూరులను కలిపే శిల్పాలుగా (bracket figures) గా అనేక భంగిమలలోని మదనిక శిల్పాలు, అద్దంలో అందాన్ని చూసుకొనిమురిసిపోవుతున్న స్త్రీ శిల్పం, తనచేతి మణికట్టుపై రామచిలుక ఉన్న స్త్రీ శిల్పం, స్నానమాచరించి తన దుస్తులను సవరించుకొంటున్న స్త్రీ శిల్పం, నాట్యమాడి విశ్రాంతి తీసుకొనే స్త్రీ శిల్పం, వీణ తీగలను మీటుతున్న స్త్రీ శిల్పం, సువాసనా పుష్పాలను కోయటానికి కదంబ వృక్షం కింద నిలుచొని ఉన్న స్త్రీ శిల్పం ఉన్నాయి. హాలేబీడ్‌లోని నృత్య గణపతి, గజేంద్రమోక్ష ఘట్టం, నాట్య సరస్వతి, గజాసుర సంహారమూర్తి శిల్పాలు కూడా ప్రసిద్ధిగాంచినాయి.

మలిచాళుక్యుల శిల్పకళ హొయసల కాలంలో పరిపూర్ణతను పొందింది. హొయసల శిల్పకళలో అలంకరణ, ఆభరణాల ప్రాధాన్యం కనపడుతుంది. వీరి రీతి మలిచాళుక్యుల కాలంలో [illegible]. కొన్ని హొయసల శిల్పాలు ఐహొళెలోని శిల్పాలను పోలిఉన్నాయి. వీరి [illegible] (greenish chlorite scist) శిలను వాడిరి. దీనికి శిల్పరూపణకు మెత్తగా ఉండి

కాలక్రమంలో గట్టిపడే స్వభావం ఉంది. రామాయణం, మహాభారతం, భగవద్గీతలోని ఘట్టాలతో కూడిన శిల్పాలు వీరి ఆలయాల్లో కనపడతాయి. కొన్నింటిలో ముఖకవళికలు సరిగా లేవు, వీరి శిల్పకళలోని జంతువులు, (bracket figure) లు, పెద్ద శిల్పాలు ఊపిరాడని రీతిలో గోడలపై నింపబడి ఆభరణాలు, అలంకారాలతో ముంచివేయబడి ఉన్నాయి. కానీ బేలూరులోని కొన్ని బ్రాకెట్ శిల్పాలు (brackedt figure) లు ఈ రీతికి కొంత భిన్నంగా కూడా ఉన్నాయి.

హొయసలుల కాలంలో శిల్పాల కింద శిల్పులపేర్లు చెక్కే సాంప్రదాయం కనపడుతుంది. తొలి హొయసలుల శిల్పుల్లో బల్లిగవె దాసోజు ఒకడు. ఇతడు హొయసల రాజు విష్ణువర్థనుని ఆస్థాన శిల్పి. ఇతని పేరుగల శిల్పాలు నాలుగు బేలూరులోని కేశవాలయంలో ఉన్నాయి. మొదటి దానిలో ఒకకోతి ఒకస్త్రీ దుస్తులను లాగుతున్నట్లుంది. రెండో దానిలో ఒక స్త్రీ తన పొడవైన శిరోజాలను అలంకరించుకొంటుంది. ఇలాంటి శిల్పమే ఆలయ నవరంగ భాగంలో కూడా ఉన్నది. మరొక శిల్పంలో భైరవుడు పుర్రెగదపై గల త్రిశూలం, గిన్నె కలిగి ఉన్నాడు. కృష్ణరాజపేట దగ్గరలోని కిక్కేరిలో ఉన్న నాలుగు అడుగుల ఎత్తుగల కేశవశిల్పం కూడా ఇతడే రూపొందించాడు ఉంది. ఇది ప్రస్తుతం న్యూయార్క్ మెట్రోపాలిటన్ మ్యూజియంలో ఉంది. హాలేబీడులోని హొయసలేశ్వర ఆలయంలోని ఒక స్త్రీశిల్పం కూడా ఇతడే రూపొందించాడు.

దాసోజు కుమారుడు చవనుడు కూడా నాలుగు (bracket figure) లను చెక్కాడు. వీటిలో బేలూరు కేశవ ఆలయంలోని నవరంగ యందలి నాట్యసరస్వతి ఒకటి. వేటాడుచున్న స్త్రీ శిల్పం మరొకటి. ఇందలి స్త్రీ సన్నటి నడుం గలిగి ఉన్నది. మరొక దానిలో పిల్లనగ్రోవిని ఊదుచున్న ఒక పురుష శిల్పం 'ఉన్నది.

గదగ్ వాడూన నాగోజ మరొక ముఖ్యమైన శిల్పం. భరతనాట్య భంగిమలోని ఒక నాట్యగత్తె శిల్పాన్ని ఇతడు రూపొందిచాడు. ఈమె కుడిమడమ పైకెత్తబడి ఉన్నది. పైనున్న తోరణంలో అద్భుతమైన నగిషీలున్నాయి. వీటిలో పూలమొగ్గల గుత్తులున్నాయి. ఈ పూలమొగ్గలలో ఒకదానియందు తేనేటీగ తేనెను జుర్రుకొను చున్నది.

మాబ అనువాడు మరొక శిల్పి. ఇతడు హాలేబీడులోని శిల్పాలను చెక్కాడు. కేతన అను మరొక శిల్పి హాలేబీడు ఆలయంలో 8 అడుగుల పొడవుగల కిరాతార్జునీయ ఘట్టంతో కూడిన శిల్ప ఖండమున్నది.

అమృతపురంలో క్రి.శ.1196 లో నిర్మించిన అమృతేశ్వర ఆలయం మొక్క ముఖమండప చుట్టూగల 'జగతి' యందు మహాభారత, భగవద్గీతల శిల్పాలున్నాయి. కృష్ణుని జన్మ విషయాన్ని కంసునికి తెలియకుండా చేయుటకు అతని తండ్రి వాసుదేవుడు గాడిదకాళ్ళు పట్టుకొని అరవవద్దని బ్రతిమాలుచున్నట్లున్న శిల్పమున్నది. ఇచటి పిట్టగోడ ప్రక్కనే రామాయణ కథా శిల్పాలున్నాయి.

# కాకతీయుల ఆలయ వాస్తుశిల్పం

కాకతీయుల దేవాలయాలు ఆంధ్రలోని హనుమకొండ ఓరుగల్లు (వరంగల్లు), ఘనపూరు, పిల్లలమర్రి మొదలగు ప్రాంతాలందు ఉన్నాయి.

1. కాకతీయ దేవాలయాలు రెండు రకాలుగా ఉన్నాయి. కొన్ని గర్భగృహం, అంతరాళ, ముఖమండప అను నిర్మాణ భాగాలను ఒకదానిముందు మరొకటిగా కలిగిఉండగా, మరికొన్ని ఒక పెద్ద ముఖమండపాన్ని కలిగి దాని మూడువైపులా మూడు దేవగృహాలను కలిగి ఉన్నాయి. దీనిని బట్టి వీరి ఆలయాలు కొంతవరకు పశ్చిమ చాళుక్యులు, హొయసలుల దేవాలయాల నిర్మాణ ప్రభావాన్ని కలిగిఉన్నాయి. పాలంపేట యందలి రామప్ప దేవాలయం మొదటి రీతికి చెందింది. కాగా హనుమకొండ యందలి వేయిస్తంభాల దేవాలయం రెండవ తెగలకు చెందింది. ఈ రెండు వరంగల్లు జిల్లాలో ఉన్నాయి. పాలంపేట ఆలయం క్రీ.శ. 1215 లోను, హనుమకొండ ఆలయం క్రీ.శ. 1162 లోను, పిల్లలమర్రి ఆలయం క్రీ.శ.1208 లోను నిర్మింపబడ్డాయి.
2. వీరి ఆలయాల అధిష్ఠాన విభాగం రెండు భాగాలుగా ఉన్నది. కింది విభాగం, ఉపపీఠమని, పైవిభాగం అదిష్ఠానమని అంటారు. ఉపపీఠం సుమారు పదిపన్నెండు అడుగుల వెడల్పుగల పైభాగాన్ని కలిగి దేవాలయంచుట్టూ ప్రదక్షిణాపథకుఉపయోగపడుచున్నది. అధిష్ఠాన భాగం పట్టీలాగ (gands) నిర్మించబడి ఉన్నది. దీని ముఖభాగాలపై అనేక దేవతా అర్ధశిల్పాలేగా ప్రకృతి సంబంధమైన పుష్పాలు, జంతువులు మొదలైనవి కూడా చెక్కబడి ఉన్నాయి.
3. కాకతీయుల కాలంలో చోళ, హొయసలుల దేవాలయాలలోలాగ కుడ్యభాగం అనేక శిల్పాలతో నిండిఉండుట కనపడదు. వీరి ఆలయాల కుడ్యాలలో ఉబ్బెత్తు విభాగాలు (projections), లోతుభాగాలు (recesses) గలవు. ఉబ్బెతు భాగాలలో రెండు మొదలు నాల్గు కుడ్యస్తంభాలు నిర్మింపబడి ఉన్నాయి. లోతు భాగాలలో కూడా కుడ్యస్తంభాలు ఉన్నాయి. కాని వీటి పైభాగంలో (capital) విభాగం లేదు. దీని బదులు చిన్నతరహా, విమానం రూపొందింపబడి ఉన్నది. గర్భగృహ కుడ్యం వెలుపలి ముఖభాగం కుడ్యంమధ్య చిన్నతరహా దేవగృహాలు ఉన్నాయి. వీటిపైన ఒకటి లేక మూడు విమానాలు చిన్న పరిమాణంలో నిర్మింపబడి ఉన్నాయి. పాలంపేట దేవాలయమందు ఇటువంటి దేవగృహాల పైన మరిరెండు దేవగృహాలు నిర్మింపబడి ఉన్నాయి. వీటిపైన నాగర శిఖరం ఉన్నది.
4. కాకతీయ ఆలయాల కుడ్యాలపైన గల కపోత భాగం (corrugated) ఆకారంలో ఉన్నది.
5. వీరి ఆలయాల విమానాలు కూడ ప్రతి తలమందు కూట, పంజర, శాల హారాల వరుసను కలిగి ఉన్నాయి. కూట, పంజర, శాల హారాల వరుసను బహుశ అవి పతనమై ఉండవచ్చును. ఉదాహరణకు హనుమకొండ దేవాలయానికి విమానం లేదు. పాలంపేట,

పానుగల్లు దేవాలయాలు విమానాలను కలిగి ఉన్నాయి. తొలి చాళుక్యులు, మలిచాళుక్యులు, హొయసలుల దేవాలయాల విమానాల ముందుభాగాలలో నిర్మింపబడిఉన్న సుఖనాస అను నిర్మాణం కాకతీయ దేవాలయాలలో కూడా కనపడుతుంది.

## వేయిస్తంభాల దేవాలయం

వరంగల్లు జిల్లాలోని హనుమకొండ ఈ వేయిస్తంభాల దేవాలయం ఉంది. దీనికి రుద్రేశ్వర దేవాలయమని కూడా పేరు ఉంది. దీనిని కాకతీయ రాజైన రుద్రేశ్వరుడు క్రీ.శ.1162 లో నిర్మించాడు. ఈ ఆలయంలో ఒక మండపం (ముఖమండప) మూడువైపుల మూడు దేవగృహాలు నిర్మింపబడి ఉన్నాయి. ఈ మూడింటియందు శివుడు, వాసుదేవుడు (విష్ణు), సూర్యుని ప్రతిమలు ఉన్నాయి. ఈ మూడు దేవగృహాలకు గర్భగృహ, అంతరాళ అనే విభాగాలు ఉన్నాయి. వీటిన్నింటికిగల (common) ముఖమండప ముందుభాగంలా నందిగృహ నిర్మింపబడి ఉన్నది. ఈ మొత్తం పీఠం పైభాగం ప్రదక్షిణాపథలాగ ఉపయోగపడుతుంది. ఉపపీఠంపై ఆలయ అధిష్టానం, దానిపైన కుడ్యం ఉన్నాయి. కుడ్య విభాగం ఉబ్బెత్తు, లోతు (graduated projections) విభాగాలను ఉన్నాయి. ఉబ్బెత్తుభాగాలలో కుడ్యస్తంభాలు ఉన్నాయి. ఉబ్బెత్తుల మధ్యగల లోతువిభాగాలలో (recesses) కూడా కుడ్యస్తంభాలున్నాయి. కాని వీటి శీర్షిక (capital) విభాగంలో చిన్నతరహా విమాన నిర్మాణం ఉంది. గర్భగృహ కుడ్యం వెలుపలి ముఖభాగమందు కుడ్యంమధ్యగా చిన్నతరహా దేవగృహం నిర్మింపబడి ఉన్నది. ఈ చిన్నదేవగృహంపైన ఒక విమాన నిర్మాణం ఉన్నది. దేవాలయ మందలి ఒకే (common) ముఖమండప యందు సుమారు 300 స్తంభాలున్నాయి. ఇవి అద్భుతంగా చెక్కబడి ఉన్నాయి. ఈ ఆలయ స్తంభాలు, కుడ్యస్తంభాల శీర్షిక (capital) విభాగంలో తరంగ (roll) (corbel) కార్బెల్ ఉంది. ఇచటి మూడు దేవగృహాల అంతరాళ ద్వారంపైన మకరతోరణ నిర్మాణం ఉంది. ఈ ఆలయం ముందు కొంతదూరంలో ప్రవేశమార్గం తెలియజేయుచు స్వేచ్ఛాతోరణ నిర్మాణాలు (free-standing toramas) ఉన్నాయి. ఈ దేవాలయంలోని అన్ని దేవగృహాలపైన విమానం లేదు. అవి పూర్తిగా నాశనమై ఉన్నాయి.

## రామప్ప దేవాలయం

వరంగల్లుజిల్లా పాలంపేట యందలి దేవాలయాల్లో రామప్ప దేవాలయం ముఖ్యమైంది. కాకతీయ నిర్మాణాలకు ఇది ఒక ముఖ్య ఉదాహరణ. ఇది క్రీ.శ. 1215 లో నిర్మింపబడింది. దీనికి గర్భగృహ, అంతరాళ (అర్ధమండప) ముఖమండప (నవరంగ) అను నిర్మాణ విభాగాలు ఉన్నాయి. దేవాలయం ముందుభాగంలో నందిమండపం ఉంది. ఈ దేవాలయం ఒక ఎత్తైన ఉపపీఠంపై నిర్మింపబడి ఉంది. ఈ ఉపపీఠం హనుమకొండ ఆలయంలోలాగ గ్రాడుయేడెట్ ప్రాజెక్షన్ (graduated projections) ను ఉంది. ఉపపీఠం ప్రదక్షిణాపథగా ఉపయోగపడుతుంది. ఆలయ అధిష్టానంపైనగల కుడ్యం ఉబ్బెత్తు (projection) లోతు (reces) విభాగాలను కలిగి ఉన్నాయి. ఉబ్బెత్తులలో కుడ్యస్తంభాలు లోతుభాగాలలో విమానాలు, స్తంభాలు ఉన్నాయి. గర్భగృహ కుడ్యం వెలుపలి ముఖభాగాన్ని ఆనుకొని కుడ్యంమధ్యగా చిన్నతరహా దేవగృహాలు నిర్మింపబడి ఉన్నది. ఇది గర్భగృహ మూడువైపులా ఒకదానిపై మరొకటి ఉన్నట్లు మూడు దేవగృహాలు ఉన్నాయి. ఈ దేవగృహాలపైన చతురస్రాకార శిఖరం ఉన్నది. ఆలయ గర్భగృహంపైన కూట, పంజర, శాల

హారాల వరుసగల అనేక తలాల విమానం గలదు. కాని విమానమందు కూట విభాగాలు ఎక్కువ సంఖ్యలో ఉన్నాయి. విమానంపైన గ్రీవ, శిఖర నిర్మాణాలు గలవు. ఆలయం ముందు భాగమునగల మండపము మధ్యభాగాన నాల్గు స్తంభాలు ఉన్నాయి. మండపం చుట్టూ సుమారు నాలుగడుగుల ఎత్తుగల కుడ్యం ఉన్నది. ఈ కుడ్యంలో 32 కుడ్యస్తంభాలు ఉన్నాయి. ఈ మండప కుడ్యం (కాక్షాసనం) నందుగల స్తంభాలలో 12 స్తంభాలు స్త్రీ శిల్పాలను(female figure brackets), మిగిలినవి దుముకుచున్న వ్యాల (సింహం)ల శిల్పాలను (rearing lion bractes) కలిగి ఉన్నాయి. ఇవి స్తంభాల (capital) మొదలు మండప కపోత విభాగం వరకు ఎత్తుగా ఉన్నాయి. ఇచటి స్త్రీ ప్రతిమలు హొయసలుల కాలంలోలాగ మితిమీరిన అలంకరణను లేదు. అతి తక్కువ అలంకరణను కలిగి సహజమైన ఎత్తును కలిగి అందంగా రూపొందించబడి ఉన్నాయి. మండపమందలి స్తంభాలు ఘనచతురస్రాకార విభాగాలను కలిగిఉన్నాయి. వీటి ముఖభాగాలపై సంగీత విద్వాంసులు, నాట్యగత్తెల శిల్పాలు ఉన్నాయి. గర్భగృహ, అంతరాళ ద్వారాలపైన మకరతోరణాలు ఉన్నాయి. మండపం నాల్గుమూలలందు నాలుగుజతల పరివార దేవతా గృహాలు కాక్షాసనం దగ్గరగా నిర్మింపబడి ఉంది.

**పిల్లలమర్రి ఆలయాలు**

నల్గొండజిల్లాలోని పిల్లలమర్రిలో అనేక కాకతీయ ఆలయాలు ఉన్నాయి. వీటిలో ఎరాకేశ్వర, సోమేశ్వర దేవాలయాలు ముఖ్యమైనవి. ఇవి క్రీ.శ.1208లో నిర్మించబడింది. ఇది చాలవరకు పాలంపేట ఆలయాన్ని పోలిఉంది. దీనికి గర్భగృహ, అంతరాళ, ముఖమండప అను విభాగాలు ఉన్నాయి. ఈ ఆలయం ఒక ఎత్తైన ఉపపీఠపై నిర్మింపబడి ఉంది. ఉపపీఠం ప్రదక్షిణకు ఉపయోగపడుచున్నది. అధిష్టానంపైగల కుడ్యంనందు ఉబ్బెత్తులు ఉన్నాయి. గర్భగృహ మూడువైపులాగల కుడ్యం మధ్యభాగాన వెలుపలి ముఖభాగంలో పెద్ద ఉబ్బెత్తు (projection) ఒకచిన్న దేవకోష్ఠంలాగ నిర్మింపబడి ఉంది. ఉబ్బెత్తులమధ్యగల లోతుభాగం (recess) నందు విమానస్తంభాలు ఉన్నాయి. గర్భగృహపైన ఒకప్పుడు విమానం ఉండేది. ప్రస్తుతం విమానం ముందుభాగాన నిర్మింపబడి ఉన్న సుఖనాస విభాగం మాత్రం ఉంది. సుఖనాసనుబట్టి ఈ ఆలయ విమానం నాల్గు తలాలు ఉండేదని చెప్పవచ్చును. ముఖమండప మూడుపైపులా మెట్ల నిర్మాణాలు ఉన్నాయి. దీని మధ్య నాల్గు స్తంభాలు ఉన్నాయి.

పిల్లలమర్రిలో మరోచోట నామేశ్వర దేవాలయం ఉంది. ఇది క్రీ.శ.1202లో నామిరెడ్డిచే నిర్మింపబడింది. దీనికి కూడా గర్భగృహ, అంతరాళ, ముఖమండప విభాగాలు ఉన్నాయి. ముఖమండప ముందుభాగాన ప్రవేశ వసారా (porch) ఉంది. ఈ ఆలయంలో ఉపపీఠం లేదు. ఈ ఆలయం దగ్గరలో కచ్చేశ్వరముక్కంటి శివదేవాలయం అనే మూడు దేవగృహాల నిర్మాణం ఉంది. ఇది కూడా కాకతీయ అధికారి నామిరెడ్డిచే నిర్మించడే జరిగింది.

వరంగల్ జిల్లాలోని ఘనాపూర్ యందు కాకతీయుల శివదేవాలయం ఉంది. ఇది పాలంపేట దేవాలయంలాగ ఉంది. వరంగల్లు కోటలో కూడా సుమారు 12 దేవాలయాలు ఉన్నాయి. కాని ఇవి పెద్ద నిర్మాణాలు కావు.

# 21

# విజయనగర రాజుల ఆలయ వాస్తు శిల్పం

కర్ణాటక, ఆంధ్ర, తమిళనాడు ప్రాంతాల్లో పలుచోట్ల విజయనగర దేవాలయాలు ఉన్నాయి. ముఖ్యంగా రాయలసీమ హంపి (విజయనగరం) ప్రాంతాల్లో వీరి దేవాలయాలు అధికంగా ఉన్నాయి. రాయలసీమలోని అనంతపూర్ జిల్లాలో పెనుగొండ, తాడిపత్రి, కదిరి, గోరంట్ల మొదలైన ప్రాంతాలందు, చిత్తూరు జిల్లాలో నాగాలాపురం, నారాయణవనం, సోమపాళెం మొదలగు చోట్ల, కర్నూలు జిల్లాలో శ్రీశైలం, మార్కాపురం, వెంకటరెడ్డిపల్లి మొదలగుచోట్ల, కడప జిల్లాలో రాయచూరి, పుష్పగిరి మొదలగుచోట్ల వీరి దేవాలయాలు ఉన్నాయి. కర్ణాటకలోని హంపి యందలి దేవాలయాలు వీరి నిర్మాణాలకు ముఖ్య ఉదాహరణలుగా చెప్పవచ్చు. తమిళనాడులో వెల్లూరు, విరంజపురం మొదలైన చోట్ల వీరి దేవాలయాలు ఉన్నాయి.

1. కర్ణాటక, ఆంధ్ర మొదలైన దక్కన్ ప్రాంతాలందు వీరి దేవాలయాలకు చాళుక్య హొయసల, కాకతీయ నిర్మాణ రీతుల ప్రభావం ఉంది. తమిళనాడు మొదలైన విజయనగర సామ్రాజ్య దక్షిణ ప్రాంతాల్లో దేవాలయాలు పల్లవ, చోళ, పాండ్య నిర్మాణరీతుల ప్రభావాన్ని కలిగి ఉన్నాయి. ఇచట విజయనగర దేవాలయాలన్నీ నల్లటి కఠినశిలా (granite) నిర్మితాలు. కాని సామ్రాజ్య ఉత్తర భాగమందలి దేవాలయాల నిర్మాణానికి కొంతవరకు ఇసుకరాయి వాడబడింది. వీరి నిర్మాణాలు చాల వరకు అనేక నిర్మాణ విభాగాలను కలిగి విశాలమైన ప్రాంతాన్ని ఆక్రమించి, చాల ఎత్తైనవిగా నిర్మితమై ఉన్నాయి.
2. వీరు తమ ముందు కాలాల్లో నిర్మింపబడ్డ వాస్తు సాంప్రదాయాలను కొంతవరకు అనుసరించటమే గాక అనేక నూతన వాస్తు సాంప్రదాయాలను ప్రవేశపెట్టారు. హొయసల రాజుల కాలంలో శిల్పకళ ఉన్నతస్థానాన్ని పొందగా విజయనగరరాజుల కాలంలో వాస్తు కళ తారస్థాయిని చేరుకొంది. విజయనగర కాలం హిందూమత పునరుజ్జీవన కాలమని చరిత్రకారుల అభిప్రాయం. ఇస్లాంమతం, దక్షిణ ప్రాంతాలకు వ్యాప్తి కాకుండా చేయుటకై హిందూమత వ్యాప్తి చేసి, దాని రక్షణకై కంకణం కట్టుకొన్నారు. స్వతఃగా వీరు హిందూ మతాభిమానులు. కావుననే పెద్దపెద్ద దేవాలయాల నిర్మాణం చేసి ప్రజలకు ఆకర్షణీయంగా ఏర్పరచి మతవ్యాప్తికి దోహదపడ్డారు. పల్లవులు, చోళులు, చాళుక్యులు మొదలైన రాజుల కాలమందువలె వీరి దేవాలయాల్లో కూడా గర్భగృహ, ప్రదక్షిణాపథ, అంతరాళ,

ముఖమండప అనే విభాగాలు ఉన్నాయి. ఇవేగాక వేయిస్తంభాల మండపాలు, కళ్యాణమండపం, యజ్ఞశాల, ఎత్తైన గోపుర ద్వారాలు, ప్రాకారం, ప్రాంగణాలు, దేవీ గృహాలు మొదలైనవి కూడా ఉన్నాయి.

3. విజయనగర కాలమందలి అధిష్ఠానాలు సుమారు 6 అడుగులు మొదలు 12 అడుగులు ఎత్తు ఉన్నాయి. ఈ అధిష్ఠానాలకు పట్ట, త్రిపట్ట, గళ విభాగాలు ఉన్నాయి. హొయసల రాజుల దేవాలయాల అధిష్ఠానాల్లో లాగ వీరి అధిష్ఠానాలపై కూడా అనేక అర్ధశిల్పాలు ఉన్నాయి. కాని ఇవి హొయసల ఆలయాల్లో లాగ మితిమీరి లేవు. కొన్ని విజయనగర ఆలయాల అధిష్ఠానాలపై శాలకోష్ఠాలు ఉన్నాయి. ఇవి అధిష్ఠానంలోని ఒక విభాగాన్ని మరో విభాగాన్ని కలుపునట్లు రూపొందింపబడి ఉన్నాయి. ఉదాహరణకు హంపి యందలి వైతాళ దేవాలయమందలి సంగీత మండప అధిష్ఠానం ఈ పద్ధతిలో ఉంది.

4. వీరి ఆలయాల కుడ్యభాగం రెండు పద్ధతుల్లో కనపడుతుంది. వీరి తొలిదశకు చెందిన దేవాలయాలు గృహ అంతరాళ విభాగములందలి కుడ్యం వెలుపలి ముఖభాగం దేవకోష్ఠాలతో నిండి ఉన్నాయి. వీటిలో దేవతా ప్రతిమలున్నాయి. ఇట్టి సాంప్రదాయం పెనుగొండ దేవాలయంలో గమనించవచ్చు. కాని కొంతకాలానికి ఈ విధానం వదలి వేయబడింది. వీటి బదులు ప్రత్యేక దేవతాగృహాలు పరివార దేవతలకు నిర్మించే ఆచారం ప్రారంభమైంది. రెండో దశకు చెందిన దేవాలయాలు కుడ్యభాగమందు ఉబ్బెత్తు భాగాలు (projections) లోతు భాగాలు (recesses) ఉన్నాయి. ఉబ్బెత్తు భాగాల్లో శాలకోష్ఠలు, కుడ్యస్తంభాలు ఉన్నాయి. లోతుభాగాల్లో కుంభపంజర నిర్మాణాలు ఉన్నాయి. ఈ దశకు చెందిన దేవాలయాల కుడ్యభాగం చాల వరకు సాదాగా (శిల్పరహితంగా లేక plain గా) ఉన్నాయి. కాని తాడిపత్రి దేవాలయం వంటి కొన్ని ఆలయాల కుడ్య భాగమందు రామాయణ, మహాభారత గాథలను తెలిపెడి శిల్పాలు ఉన్నాయి.

5. వీరి దేవాలయాల కపోత రెండు రకాలుగా ఉంది. గర్భగృహ ప్రాంతమందలి కపోత చోళుల కాలమందలి కపోత లాగ ఉంది. దీని ముఖభాగంపై సింహాలలాటం 'కూడు' లు వాళలు, గణలు మొదలగు వాటి వరుసలున్నాయి. కాని మండపభాగమందలి కపోతవద్మం (Cymarecta) ఆకారంలో ఉంది. కపోతపైన నిర్మింపబడియున్న పై కప్పు అంచుభాగాల్లో మండప చుట్టూ ఇటుకలతో నిర్మింపబడి ఉన్న చిన్నదేవగృహాల వంటి వాటి వరుస ఉంది. ఇట్టి నిర్మాణాల వరస హంపియందలి సంగీత మండపమందు ఉన్నాయి.

6. విజయనగర దేవాలయాల విమానాల్లో కూడా ప్రతి తలం నందు కూట, పంజర, శాల హారాల వరస ఉన్నవి. విమానం పైన గ్రీవ, శిఖర, కపురి నిర్మాణ భాగాలు ద్రావిడ రీతిలో ఉన్నాయి. విజయనగర రాజులు గర్భగృహపై ఉన్న విమానం కన్నను ఆలయ ప్రవేశమార్గాలందు గల గోపుర ద్వారాలను ఎక్కువ ఎత్తుగా నిర్మించేవారు. కాని పల్లవులు, చోళుల కాలమందు గోపురం విమానం కన్ననూ తక్కువ ఎత్తును కలిగి ఉండేవి. కొన్ని దేవాలయాల్లో విమానం ముందు భాగంతో సుఖనాస అను విభాగ నిర్మాణం కనపడుతుంది. ఇట్టిది హంపిలోని హజారరామ దేవాలయంలో ఉన్నది. కాని ఈ సాంప్రదాయం పరిమితంగా వాడుకలో ఉంది.

7. వీరి కాలంలో కూడా గోపుర ద్వార నిర్మాణ కనపడుతుంది. గోపుర ద్వార నిర్మాణ విధానం పల్లవుల కాలంలో తీర దేవాలయం, కైలాసనాథ దేవాలయం వంటి వాటిలో ప్రారంభమైంది. పల్లవులు, చాళుక్యులు, చోళులు, కాకతీయుల కాలాలలో గోపురం విమానం కన్నా తక్కువ ఎత్తుగా ఉండగా వీరి కాలంలో దీన్ని చాలా ఎత్తుగా నిర్మించే వారు. ఇది దాదాపు 12 అంతస్థులను కలిగి ఉంది. కావుననే వీటిని రాయగోపురాలంటారు.

8. చోళుల కాలంలో లాగ వీరి కాలమందు కూడ దేవాలయ ప్రాంగణంలందు దేవీగృహం ప్రత్యేకంగా నిర్మించెడి సాంప్రదాయం ఉంది. ఈ విధానంలో వీరు చోళులను అనుసరించారని చెప్పవచ్చు.

9. వేయిస్తంభాలు, శతస్తంభాల మండపాలు కూడా వీరిచే నిర్మించబడ్డాయి. ఇట్టి మండపాల నిర్మాణానికి చోళుల గంగైకొండ బృహదేశ్వర ఆలయంలోని బహుస్థంభ మండపం మార్గదర్శకమై ఉండవచ్చునని చెప్పవచ్చును. వీరి ఆలయాల ప్రాంగణాల్లో యజ్ఞశాలల, కళ్యాణమండపాలు, సామగ్రి నిల్వ గదులు మొదలైనవి కూడా నిర్మింపబడి యుండుట కనపడుతుంది.

10. వీరి కాలంలో ప్రాకారాల్లో రెండు రకాలుగా నిర్మింపబడేవి. కొన్ని ఆలయాల్లో ఒకే ప్రాకారం ఉండగా మరి కొన్నింటికి ఒకటికన్నా ఎక్కువ ప్రాకారాలు ఉన్నాయి. బహు ప్రాకారాల నిర్మాణ విధానంలో వీరు వీటిని ఒక దాని చుట్టూ మరొకటిగా గాని, ఒకదాని ముందు మరొకటిగా గాని నిర్మించెడి వారు.

11. కుడ్యభాగాలను నిర్మించెడి కుంభపంజర అనే సాంప్రదాయం కూడా వీరి ఆలయ నిర్మాణాల్లో కనపడుతుంది.

12. వీరి ఆలయాల్లోని స్తంభాలు మూడు రకాలుగా ఉన్నాయి. మొదటి రకం స్తంభాల అందం (shaft) విభాగంలో మూడు ఘనచతురస్రాకార విభాగాలు, వీటి మధ్య 16 ముఖాలుగల విభాగం ఉన్నాయి. ఘనచతురస్ర విభాగ ముఖభాగంపై దేవతా అర్ధశిల్పాలు ఉన్నాయి. ఇట్టి స్తంభాలు హజారరామ దేవాయల ముఖమండప మధ్యభాగాన ఉన్నాయి. రెండో రకానికి చెందిన స్తంభాలకు కోపంతో దుముకుచున్నట్లున్న సింహాల శిల్పాలున్నాయి(rampent lion brackets). మూడేరకం స్తంభాలకు ఉపస్తంభాలు (pillarats) ఉన్నాయి. ఇవి నాలుగు మొదలు పద్నాలుగు సంఖ్య వరకు ఉన్నాయి.

13. చోళుల కాలమందలి ముక్కుంటిఉబ్బు (tenon-like projection) గల కార్బెల్ విజయనగర కాలపు తొలిదశకు చెందిన నారాయణ వనమందలి ఆలయం వంటి వాటిలో ఉన్నది. కాని తరవాత వీరి కాలంలో పుష్పభితిక కార్బెల్ వాడుకలోకి వచ్చింది. చోళుల దారాసూరం కార్బెల్ దీనికి మార్గదర్శకమైందని భావించవచ్చు.

విజయనగర కాలపు స్తంభాలకు గల కోపంతో దుముకుచున్న సింహాల శిల్ప(rampant lion bracket) నేటియందలి కదలెడి (తీయుటకు వీలులేని)శిలా బంతుల నిర్మాణం శిల్పకళలో ఒక అద్భుతం.

హిందూ ముస్లిం వాస్తు రీతుల మిశ్రమంతో కూడిన నిర్మాణాలు కూడా వీరి కాలంలో నిర్మింపబడ్డాయి. హంపిలోని పద్మమహల్ (Lotus Mahal) చంద్రగిరి, పెనుగొండ లోని రాజభవనాలు, హంపిలోని గజశాల ఈ తెగకు చెందిందే.

## విఠల (వైఠాళ) దేవాలయం

హంపియందలి విఠల దేవాలయం క్రి.శ. 1513 లో కృష్ణదేవరాయలచే నిర్మాణ ప్రారంభం చేయబడింది. కాని ఎందువల్లనేగాని క్రి.శ. 1565 నాటి రాక్షసి-తంగడి (తళ్ళికోట) యుద్ధకాలం నాటికి కూడా సంపూర్ణంగా నిర్మించలేదు. ఈ దేవాలయానికి గర్భగృహ, అంతరాళ, మూతగల ప్రదక్షిణాపథ (closed pradakshinpatha), ముఖమండప, సంగీత మండప అనే నిర్మాణ విభాగాలు ఉన్నాయి. ఈ ఆలయం ఒక దీర్ఘచతురస్రాకారపు ప్రాకారం మధ్య గల ప్రాంగణంలో నిర్మింపబడి ఉంది. ప్రాకార కుడ్యం లోపలి ముఖభాగాన్ని అనుకొని ఒక స్తంభాల వరండా నిర్మితమై ఉన్నది. ప్రాకారం మూడువైపుల గల కుడ్యాల్లో గోపుర ద్వారాలు ఉన్నాయి. ఆలయ ముఖమండప రెండు వైపుల వసారాలు (porches) నిర్మింపబడి ఉన్నాయి. ఈ మండపం ముందు భాగంలోనే ప్రఖ్యాతి గాంచిన సంగీత మండపం ఉన్నది. ఇది గ్రాడ్యుయేటెడ్ ప్రొజెక్షన్ల (graduated projections) విధానంలో నిర్మింపబడి ఉన్నది. ఈ మండపంలోని ప్రతి స్తంభం, ఉపస్తంభాలు ఉన్నాయి. గర్భగృహ ప్రాంతమందలి కుడ్యం వెలుపలి ముఖభాగమందు కుడ్యస్తంభాలు, శాలకోష్టలు, కుంభపంజరలు ఉన్నాయి. సంగీతమండపానికి కొంతముందుగా గరుడ వాహనం ఉంది. దీన్నే శిలారథం అంటారు. ఇది ఒక రథం ఆకారంలో శిలతో నిర్మింపబడి ఉంది. ఈ రథంపై భాగం నేడు నాశనమై ఉంది. ఈ భాగం ఇటుకతో నిర్మింపబడి ఉంది. ఇది కూడా గర్భగృహ, అంతరాళ ముఖమండప అను విభాగాలను కలిగి ఉన్నది. మూడు బహుస్తంభ మండపాలు కూడా ఈ ఆలయ ప్రాంగణంలో ఉంద.

## హజారరామ దేవాలయం

హజారరామ దేవాలయం హంపియందు శ్రీకృష్ణదేవరాయలచే నిర్మింపబడింది. ఇది 200 అడుగుల పొడవు, 110 అడుగుల వెడల్పుగల ప్రాకారం మధ్య గల ప్రాంగణంలో నిర్మింపబడి ఉన్నది. ప్రాకార ముందు గల కుడ్యమందు గోపుర ద్వారం ఉంది. ఈ ఆలయానికి గర్భగృహ, అంతరాళ, ముఖమండప, కుడ్యరహిత స్తంభమండప ఉన్నాయి. ముఖమండప యొక్క మూడువైపులా ప్రవేశ వసారాలు (porches) నిర్మింపబడి ఉన్నాయి. ముఖమండప మధ్య గల నాలుగు స్తంభాలు ఘనచతురస్రాకారపు బ్లాకులను కలిగి ఉన్నాయి. వీటి ముఖ భాగాలందు అనేక దేవతా చిత్రాలు ఉన్నాయి. ఈ ఆలయ అధిష్ఠానం పట్ట త్రిపట్ట మొదలగు విభాగాలను కలిగి ఉన్నాయి. గర్భగృహ కుడ్యం యొక్క వెలుపలి ముఖభాగమందు శాలకోష్ఠ, కుంభపంజర, కుడ్య స్తంభాలు ఉన్నాయి. అంతేగాక ఈ గోడల మీద రామాయణ గాథలను తెలిపెడి మూడు వరుసలు గల అర్ధశిల్పాలున్నాయి. గర్భగృహపై గల విమానం రెండు తలాలను, చతుర్ముఖ

శిఖరాన్ని, సుఖనాస విభాగాన్ని కలిగి ఉన్నది. ఆలయ ప్రాంగణంలో గల దేవీ గృహం గర్భగృహ, అంతరాళ, ముఖమండప, ఏకతల ద్రావిడ విమానం, ఆయతాస్ర శిఖరలను కలిగి ఉంది.

## అచ్యుతరాయ దేవాలయం

ఈ దేవాలయం క్రీ.శ. 1539లో నిర్మింపబడినట్లు తెలియుచున్నది. కాని క్రీ.శ. 1565 నాటి రాక్షసి - తంగడి యుద్ధకాలంలో ఇది కొంతవరకు ముస్లింలచే నాశనం చేయబడింది. ఈ ఆలయం చాలావరకు విఠలాలయాన్ని పోలిఉంది. కాని ఇందు రెండు ప్రాకారాలు ఒకదాని చుట్టూ మరొకటిగా నిర్మింపబడి ఉన్నాయి. ముఖ్య దేవాలయం, దేవీగృహం లోపలి ప్రాకారం మధ్య గల ప్రాంగణంలో నిర్మింపబడి ఉన్నాయి. ముఖ్య దేవాలయం గర్భగృహ, అంతరాళ, వాటి చుట్టూ మూతగల ప్రదక్షిణాపథ (closed pradakshinapatha) లు ఉన్నాయి . వీటి ముందు ముఖమండప, మహామండపలు ఉన్నాయి. విఠల దేవాలయంలో మహామండపను సంగీత మండపమంటారు. కాని ఈ ఆలయంలో మహామండపమనియే పిలుస్తారు. దేవాలయ ప్రాంగణంలోని ప్రత్యేక దేవీగృహం కూడా గర్భగృహ, అంతరాళ ముఖమండప అను విభాగాలను కలిగి ఉన్నది. ఈ ఆలయ మందలి రెండు ప్రాకారాల మూడు వైపులా గోపుర ద్వారాలు ఉన్నాయి. లోపలి ప్రాకారం యొక్క లోపలి ముఖభాగం ఆనుకొని ఒక స్తంభ వరండా ఉంది. వెలుపలి ప్రాకారం లోపలి భాగంలో వాయవ్య మూలలో ఒక పెద్ద స్తంభమండపం ఉంది. ఆలయ గర్భగృహ పైన విమానం ఉండేది, కాని నేడు లేదు.

## విరూపాక్ష దేవాలయం లేక పంపాపతి దేవాలయం

ఇది క్రీ.శ. 1336 లో విజయనగర సామ్రాజ్యం స్థాపించక ముందే హంపిలో నిర్మింపబడినట్లు కొందరి అభిప్రాయం. నేటికీ ఇది శిథిలం కాకుండా నిలచి ఉన్నది. దీనికి గర్భగృహ, అంతరాళ, ముఖమండప, మహామండప అను నిర్మాణాలు ఉన్నాయి. దేవాలయ ప్రాంగణంలో దేవీ గృహం కూడా నిర్మింపబడి ఉన్నది. ఈ ఆలయంలో అనేక చిత్రలేఖనాలు ఉన్నాయి. శంకరాచార్యుల తరవాత మఠాధిపతియైన విద్యారణ్యుడు రాజమర్యాదలతో విరూపాక్ష దేవాలయానికి తీసుకొని వెళ్ళుచుండెడి ఒక చిత్ర లేఖనం ఇచటి చిత్రలేఖనాల్లో ఒక ముఖ్యమైంది.

## ఇతర దేవాలయాలు

విజయనగర రాజులకు చెందిన తొలి దేవాలయాల్లో కర్ణాటక యందలి చిక్కమగుళూర్ జిల్లాలోని శృంగేరి ప్రాంతంలోని విద్యాశంకర దేవాలయం ఒక ముఖ్యమైనది. విద్యారణ్యస్వామి కోరిక మీద విద్యాశంకరుని జ్ఞాపకార్థం హరిహర, బుక్కరాయలు ఈ దేవాలయాన్ని నిర్మించారు. గ్రంథ ఆధారాల బట్టి ఇది క్రీ.శ. 1338లో నిర్మింపబడింది. కాని శృంగేరిలోని శాసనం బట్టి ఇది క్రీ.శ. 1356లో నిర్మింపబడ్డట్లు తెలియుచున్నది. విజయనగర స్థాపన జరిగిన కొద్దికాలానికే

ఇది నిర్మింపబడ్డట్లు తెలియుస్తుది.

తొలి దేవాలయాల్లో ఇది పెద్దది. దీనికి గర్భగృహ, స్తంభమండప, మూడు తలాల విమానం ఉన్నాయి.

హంపియందు గల పట్టాభిరామ దేవాలయం అచ్యుతరాయలచే (క్రీ.శ. 1530-1542) నిర్మింపబడింది. దీన్ని ఇతడు క్రీ.శ. 1539లో నిర్మించాడు. ఇది రెండు ప్రాకారాలను, రెండు గోపురాలను, దేవగృహాన్ని, మండపాలను దేవీగృహం ఉంది.

తాడిపత్రిలో కూడా విజయనగర రాజులకు చెందిన ఆలయాలు ఉన్నాయి. వీటిలో బుగ్గరామలింగేశ్వర దేవాలయం ముఖ్యమైంది. ఇది కాళహస్తి దేవాలయంవలె ఒక ప్రముఖమైందిగా చెప్పబడుతోంది. ఈ ప్రాంతమందలి ఒక విష్ణు దేవాలయాన్ని చింతల వెంకటరమణ దేవాలయం అంటారు. ఇది గర్భగృహ, అంతరాళ, ముఖమండప, మహామండపాలను ప్రాకారం, గోపురద్వారం, దేవగృహాలు ఉన్నాయి. ఇందు అనేక రామాయణ, మహాభారత గాధలతో కూడిన చిత్రాలు ఉన్నాయి.

విజయనగర కాలపు ఆలయాల్లో అనంతరపురం జిల్లాలోని లేపాక్షియందలి వీరభద్రాలయం ఒకటి. దీన్ని క్రీ.శ. 1533 ప్రాంతంలో అచ్యుతరాయల కాలంలో ఈతని పెనుగొండ కోశాధికారియైన విరూపణ్ణ నిర్మించినట్లు తెలుస్తుంది. ఇది లేపాక్షికి దక్షిణానగల కూర్మశైలం అనే పర్వతంపై ఉత్తరాభిముఖంగా నిర్మింపబడి ఉంది. ఇది రెండు ప్రాకారాల మధ్య గల ప్రాంగణంలో ఉంది. దీని మొదటి ప్రాకారంలో మూడు ప్రవేశమార్గాలున్నాయి. ఉత్తరవైపుది గోపురద్వారం. ఈ ప్రాకార కుడ్యలోపలి ముఖభాగాన్ని ఆనుకొని ఒక స్తంభాల వసారా ఉంది. ఈ ప్రాకారం లోపలనే ఒక స్తంభాల మండపం ఉన్నది. ఈ ఆలయానికి గర్భగృహ, అంతరాళ ప్రదక్షిణాపథ, ముఖమండపం, వెలుపలి వసారా, నాట్యమండపాలు ద్వితల విమానం గలవు. ఆలయ ప్రాంగణంలో తూర్పు ముఖంగా విష్ణు దేవగృహం పశ్చిమముఖంగా పాపవినాశేశ్వర దేవగృహం ఉన్నాయి. శయనాగారం, పార్వతీ దేవిగుడి, రామలింగ, భద్రకాళి, పంచముఖలింగ, నవగ్రహాల గుడులు కూడా ఈ ఆలయంలోని ప్రాంగణంలో ఉన్నాయి. ఇచటి నాట్యమండపం రమణీయమైంది. ఇందు 70 స్తంభాలున్నాయి. వీటిపై అద్భుత శిల్పాలున్నాయి. దీని పై కప్పు లోపలి ముఖభాగంపై పలు చిత్రలేఖనాలున్నాయి. స్తంభాల వసారా పై కప్పు లోపలి ముఖభాగంలో కూడా అనేక చిత్రలేఖనాలు ఉన్నాయి. ఈ ఆలయంలోని నంది, నాగలింగాల శిల్పాలు ప్రసిద్ధిగాంచాయి. లేపాక్షి ఆలయ వాస్తు, శిల్ప,చిత్రలేఖనాల వివరాలతో కూడిన పలు గ్రంధాలను ప్రొఫెసర్ వి. కామేశ్వరరావుగారు రచించారు.

విజయనగర కాలం హిందూమత పునరుజ్జీవన కాలంగా చెప్పవచ్చు. వీరి వాస్తు శిల్పకళ ఈ పునరుజ్జీవనాన్ని ప్రతిబింస్తున్నాయి. అంతేగాక ఇవి వీరి కాలంలో తారస్థాయికి చేరుకున్నాయి.

వీరి కాలంలో కోష్ఠలలో దేవతా శిల్పాలు నెలకొల్పేది విధానం అదృశ్యమైంది. కుడ్యభాగాల్లో నాదా కుడ్య స్తంభాలు అలంకార కుంభపంజరలు, సాదాగా ఉన్న లోతు గల కోష్ఠాలు ఉన్నాయి. కుడ్యాలు చాల వరకు శిల్ప రహితంగా ఉన్నాయి. కొన్ని ఆలయాల్లో మాత్రమే కుడ్యాలపై శిల్పాలున్నాయి. అవి కూడా అతి తక్కువ. హంపిలోని హజారరామాలయం, స్తంభాల మధ్య గల కుడ్య భాగాల్లోను కథా శిల్పాలున్నాయి. కోష్ఠాశిల్పాలు బదులు కథా శిల్పాలు వీరి కాలంలో ఆలయ కుడ్యాలలో చోటు చేసుకొన్నాయని దీన్ని బట్టి చెప్పవచ్చు.

వీరి కాలంలో వాస్తుకి శిల్పానికి తుల్యత లేదు. వాస్తు అవసరాలను తీర్చేదిగా మాత్రమే శిల్పకళ ఉన్నది. వాస్తుకి ప్రాధాన్యత ఇవ్వబడి ఉంది. కానీ శిల్పం నిరాదరింపచలేదు. స్తంభాలు, కుడ్యాలు విమానం, గోపురాలు, అధిష్ఠానాలపై శిల్పాలు చెక్కబడి ఉన్నాయి. స్తంభాలకు (bracket) శిల్పాలున్నాయి. విజయనగర శిల్పి నైపుణ్యానికి వ్యాళల నోటిలోని కదలే శిలా బంతులు (తీయుటకు వీలులేనివి) ముఖ్య ఉదాహరణగా చెప్పవచ్చు. ఇది శిల్పకళలో ఒక అద్భుతం.

హంపియందు వీరి కాలపు భారీ శిల్పాలు గూడా ఉన్నాయి. కృష్ణ దేవరాయల కాలపు ఉగ్రనరసింహ, గణేశ శిల్పాలు వీటిలో ముఖ్యమైనవి. తిరుపతి చక్రతీర్థంలోని రంగనాథ శిల్పం మరొకటి.

తాడిపత్రి యందు గల రామలింగేశ్వరాలయం, లేపాక్షిలోని వీరభద్రాలయాల్లో కూడా అద్భుత విజయనగర శిల్పాలు ఉన్నాయి. లేపాక్షిలో కేవలమూర్తి, నటరాజు, కళ్యాణసుందరమూర్తి, వృషభావతారమూర్తి, పాసుపత దానమూర్తి, గజాసుర సంహారమూర్తి, భిక్షాటన మూర్తి, గణపతి, విష్ణు శిల్పాలు ఉన్నాయి.

హంపిలోని హజారరామాలయం, పెనుగొండ విష్ణు ఆలయాల వంటి వాటిలో రామాయణం, భగవద్గీత కృష్ణలీలల కథావివరణ శిల్పాలు (narrative sculptures) ఉన్నాయి.

# 22

# కేరళ ఆలయాల వాస్తు శిల్పం

నేడు కేరళలో క్రీ.శ. 10వ శతాబ్దం తరవాత నిర్మింపబడ్డ దేవాలయాలు మాత్రమే ఉన్నాయి. అంతకు పూర్వం నిర్మింపబడ్డవన్నీ శిథిలమయ్యే కొయ్యవంటి వాటితో నిర్మింపబడ్డవి కావున నేడు అవి లేవు. వాటి శిలా అధిష్ఠానాలు, దేవతా శిల్పాలు, ద్వారపాలుర శిల్పాలు వంటివి మాత్రమే ఉన్నాయి. కాని నేడు నిలచి ఉన్న పదవశతాబ్ది తరవాతి ఆలయాలు చాలావరకు అంతకు ముందు కాలపు దేవాలయాల వాస్తు శిల్ప సాంప్రదాయాన్నే చాల వరకు కలిగి ఉన్నాయని చెప్పవచ్చును.

కేరళ రీతి దేవాలయాలు దక్షిణాన కన్యాకుమారి, ఉత్తరాన గోవా, కెనరాల మధ్య గల ప్రాంతాలలో ఉన్నాయి. ఈ ప్రాంత దేవాలయాలను శ్రీకోయిల్ అని కూడా అంటారు.

## ముఖ్యాంశాలు

కేరళ దేవాలయాలు దక్షిణభారతదేశ ఇతర ప్రాంతాలలోని ఆలయాల లాగ కాక అధిష్ఠానం కాకిరాయితోను, కుడ్యం కాకిరాయి (granite stone) లేక ఇటుక లేక బొంతరాతి (laterite) తోను, పై కప్పు కొయ్య, పెంకు, తగరపు రేకులు లేక గడ్డి ఆకులతోను నిర్మింపబడి ఉన్నాయి. ఇవి అధికంగా కొయ్య నిర్మితాలు.

కేరళ ఆలయాలకు ఊర్ధ్వముఖంగా ఇతర దక్షిణ దేశ ఆలయాల్లో లాగ ఆరు విభాగాలు బదులు నాలుగు విభాగాలు మాత్రమే ఉన్నాయి. అవి అధిష్ఠానం (base), భిత్తి (wall), శిఖర (roof), స్థూపి (finial). ఇతర దక్షిణ దేశ ఆలయాలకు ప్రస్తర లేక కపోత (cornice), గ్రీవ (neck) అను విభాగాలు కూడా ఉన్నాయి.

ఈ ప్రాంత ఆలయాల్లో గర్భగృహ, ప్రదక్షిణాపథ లేక ఇడైనలి, మండపాలు, ప్రాకారం, గోపుర ద్వారాలు లేక పాడిప్పురాలు అను నిర్మాణ విభాగాలు ఉన్నాయి. గర్భగృహ పలురకాలుగా ఉన్నది. అవి చతురస్రం, గుండ్రం, అండాకారం దీర్ఘచతురస్రం పీటి అధిష్ఠానం నందు ఇతర దక్షిణ దేశ ఆలయాల అధిష్ఠానాలలోని విభాగాలు ఉన్నాయి. కుడ్యం laterite లేక ఇటుక

రాయి నిర్మాణం కావున మొరటు (rough) ముఖభాగాన్ని కలిగి ఉన్నాయి. వీటికి గచ్చుపూత వేయబడి వీటి ముఖభాగాన పలురకాల రంగుల చిత్రలేఖనాలు వేయబడి ఉన్నాయి. కుడ్యంపైన గల శిఖరం కాని ద్వితల, త్రితల శిఖరాన్ని గలిగి ఉన్న ఆలయాలు కూడ ఉన్నాయి. ఏకకుడ్యం (నిరంధర) ఏక తలంగల శిఖరాలకు సుఖనాస లేక కిలివాసల్ లేదు. రెండు కుడ్యాలు (సంధర), ద్వితల లేక త్రితల శిఖరాలకు సుఖనాస విభాగాలు ప్రతి తలంలో ఉన్నాయి. తలచందన లేక మూడు తలాలకన్నా ఎక్కువ తలాలుగల శిఖరాన్ని గల ఆలయాలు కేరళ ప్రాంతంలో నిర్మింపబడలేదు. ఇచటి పడమటి కనుమల్లో వర్షాలు ఎక్కువగా ఉన్నావంటే ఇందుకు కారణము. పెద్ద నిర్మాణాలు అచటి వాతావరణానికి నిలువలేవని ఆ ప్రాంతీయులు భావించి అట్టి నిర్మాణాలు చేయలేదు. ఈ ఆలయాల ప్రతి తలం గేబుల్ (గూడు) ఆకార ఏటవాలు పై కప్పు గలదు. ఇది కుడ్యానికి బిగించి ఉన్న కొయ్యల సపోర్టు కలిగి కుడ్యంపై ఆని ఉన్నది. ఈ ఏటవాలు కప్పు కొయ్య పలకలు పరుచబడి దానిపై పెంకు తగరపు రేకులు, రాగి రేకులు వంటివి కప్పబడి నీరు ఆలయం లోపలకు దిగకుండా (water proof) చేయబడి ఉన్నది. బహుతలాల శిఖరంలో హారాల వరసలు కూడా కనపడతాయి. ఈ శిఖరాలు గర్భగృహ ప్లాను బట్టి పిరిమిడ్ ఆకారంలో గాని, గొట్టపు ఆకారంలో గాని ఉన్నాయి. శిఖరంపైన స్తూపి ఉన్నది.

కేరళ దేవాలయాల గర్భగృహలోనికి సాధారణంగా తూర్పునగాని, పశ్చిమాన గాని ప్రవేశమార్గమున్నది. ఈ ప్రవేశమార్గానికి ముందు ఎదురుగా సోపాన మార్గం (stone-steps flanked by stone side slabs) ఉన్నది. కొన్ని ఆలయాల్లో కుడి ఎడమలలో కూడా మరి రెండుసోపాన మార్గాలు ప్రవేశమార్గానికి ముందుగా ఉన్నాయి. వీటి ప్రక్కలలోని బండలపై వ్యాళ ఏనుగు శిల్పాలుంటాయి. ద్వారమునకు ఇరువైపులా ద్వారపాలురుంటారు. కొన్ని ఆలయాల్లో తూర్పు, పశ్చిమాలలో రెండు ద్వారాలుంటాయి. ఇట్టి సమయాల్లో రెండు దైవప్రతిమలుంటాయి. రెండింటి మధ్య గర్భగృహలో అడ్డుగోడ వంటిది ఏర్పరచబడి గర్భగృహ రెండు విభాగాలుగా ఉండును. గర్భగృహ ఉత్తర భాగంలో వెలుపలి ముఖభాగాన ప్రణల (Water outlet) విభాగం ఉన్నది. ఇది వ్యాళ నోటి నుంచి ఉద్భవించు ఏనుగు తొండం లాగ ఉన్నది. దీని ప్రక్కలలో గణ ప్రతిమలు ఉన్నాయి. కేరళ ఆలయాలందు భాగంలో విడిగా నమస్కార మండప అనేడి నిర్మాణం, ప్రాంగణంలో రంగశాల లేక కుట్టాంబలం అనెడి నాట్య, నృత్యాల కొరకు నిర్మింపబడ్డ మండపాలు ఏటవాలు పై కప్పులతో అగుపడును. ఈ ఆలయాల చుట్టూ గాని, దాని ముందు మరొకటిగా గాని లో వైపు వసారా గలిగి యున్న ప్రాకారాలు ఉన్నాయి. వీటిని 'మలికన', 'నలంబాలం', చుట్టంబాలం' అని పలుపేర్లతో పిలుస్తారు. ప్రాకారాల ముందు కుడ్యంలోగాని, నాల్గు వైపులా గల కుడ్యాలలో గాని గోపుర ద్వారాలు లేక పాడిప్పురలు ఉన్నాయి.

ఇంతవరకు కేరళ ఆలయాల వెలుపలి వివరాలు చర్చించటం జరిగింది. దేవాలయాల లోపలి భాగం పరిశీలించినచో వీటి గర్భగృహపైన 'కదలికకరణ' రీతిలో ఆలయ శిఖర నిర్మాణం లోపలి భాగంలో రూపొందించి ఉన్నారు. గర్భగృహం మధ్య దైవప్రతమ 'పిఠిక' (Pedestal) దీని చుట్టూ గల గర్భగృహ లోపలి భాగాన్ని 'విధిక' అంటారు. గర్భగృహ కుడ్యాన్ని (లోపలి

భాగాన్ని) 'అంతరమండల' అంటారు. ఈ భాగంలో అంతరహార అను స్తంభాల వరస ఉన్నది. అంతరహార చుట్టూ 'అంతరభిత్తి' (inner wall) ఉన్నది. ఈ 'అంతర భిత్తి'కి 'బాహ్యాభిత్తి'కి (outer wall) మధ్య సంధర రీతిలో ప్రదక్షిణాపథ లేక 'ఇద్రైనలి' ఉన్నది. అంతరభిత్తి, బాహ్యాభిత్తి మధ్య గల ప్రవేశ మార్గమందలి ప్రాంత అర్ధమండప రూపాన్ని పొంది ఉన్నది. ఈ విభాగం పైన సుఖనాస విభాగం ఉన్నది.

కేరళ దేవాలయాల్లో త్రిచూర్‌లోని వదక్కునాథ దేవాలయం, త్రివేంద్రంలోని పద్మనాభేశ్వర దేవాలయం, గురువాయూర్ దేవాలయం, కొజికోడ్ లోని తెలి దేవాలయం, తిరువేంగడ్‌లోని రామాలయం, త్రిచ్చంబరం లోని కృష్ణాలయం, తిరువిల్ వామలైలోని రామ లక్ష్మణాలయం, తిరుప్రయార్‌లోని రామాలయం, తిరువన్నూర్‌లోని శివాలయం, కొడుంగల్లూర్‌లోని దుర్గాలయం, కన్యాకుమారిలోని గుహనాథ స్వామి దేవాలయం, కెనరా దేవాలయాలు ముఖ్యమైనవి.

త్రిచూర్‌లోని వదక్కునాథ దేవాలయాన్ని తెన్ కైలాసం, శ్రీమూలనాథ ఆలయాలని కూడా అంటారు. ఇది క్రీ.శ. 12వ శతాబ్దంలో నిర్మింపబడినట్లు తెలియుచున్నది. ఇది పశ్చిమ ముఖంగా ఉన్న మూడు దేవ గృహాలను ప్రక్కప్రక్కగా (ఉత్తర దక్షిణాలుగా)కలిగి ఉన్నది. ఈ దేవగృహాలు 'నల్అంబలం' లేక లోపలి మలిక ప్రాకారం మధ్య నిర్మింపబడి ఉన్నాయి. ఉత్తర కొసలోని వదక్కునాథ దేవగృహం గుండ్రముగా ఉన్నది. దీని పశ్చిమ అర్ధభాగంలో శివప్రతిమ, తూర్పుఅర్ధభాగంలో పార్వతీదేవి ప్రతిమ ఉన్నాయి. శివగృహం ముందు మెట్లు, వాటి ముందు విడిగా యున్న నమస్కారమండపం ఉన్నాయి. దేవీగృహభాగానికి తూర్పున ప్రవేశం ఉన్నది. అధిష్ఠానం పైన 'సంధర' వెలుపలి కుడ్యం, దాని ప్రస్తర విభాగాలలో కుడ్య స్తంభాలు, కూట, శాల, పంజర హారాలతో కూడిన దేవగృహాలు ఉన్నాయి. ఈ ఉత్తర దేవగృహంపై ఏట వాలుగాను పీపాలాగాను ఉన్న రేకుతో రూపొందింపబడిన శిఖరం, లోహపు 'స్తూపి' ఉన్నాయి. దక్షిణ కొసలోని దేవగృహం రాముని ప్రతిమను కలిగి ఉన్నది. ఈ దేవగృహం చతురస్రంగా ఉన్నది. దీని కుడ్యం పైభాగాల దగ్గరలో కూట, పంజర, శాల హారాలు ఉన్నాయి. కుడ్యంపై పరివార దేవగృహాలు, జంట కుడ్య స్తంభాలు ఉన్నాయి. దేవగృహంపైన పిరమిడ్ ఆకారంలోని శిఖరం, స్తూపి గలవు. ఇవి లోహ నిర్మితాలు. శిఖరం నాలుగు వైపులా నాసికలు ఉన్నాయి. ఇచటి శివ, రామ దేవగృహాల మధ్య శంకరనారాయణ లేక హరిహర దేవగృహం ఉన్నది. ఇది గుండ్రటి ఆకారంలో ఉన్నది. రెండు అంతస్తులుగా ఉన్నది. వడక్కునాథ ఆలయానికి దక్షిణాన ప్రాంగణమందు సప్తమాతృకలున్నారు. త్రిచూర్ ఆలయాలోని మూడు దేవగృహాలకు పశ్చిమాన ముఖమండపాలు ఉన్నాయి. శివ, హరిహర దేవగృహాల మధ్య గణపతి దేవగృహం కూడా ఉన్నది. త్రిచూర్ ఆలయ కుడ్యాలపై అనేక చిత్ర లేఖనాలు ఉన్నాయి. కొయ్య భాగాలపై చిత్రాలున్నాయి. నల్అంబలం లేక స్తంభాల వసారా ఒకటి దేవగృహాల చుట్టూ ఉన్నది. ఇచటే ప్రదక్షిణాపథ ఉన్నది. ప్రాంగణంలో కృష్ణ, పరశురామ మొదలగు పరివార దేవగృహాలున్నాయి. త్రిచూర్ ఆలయం చుట్టూ ప్రాకారం అందు నాలుగు వైపులా నాలుగు అంతస్తుల గోపుర ద్వారాలు ఉన్నాయి.

త్రివేంద్రంలోని పద్మనాభేశ్వర ఆలయాన్నే అనంతశయనం దేవాలయం అంటారు. ఇది పునర్నిర్మితమైనది. గర్భగృహ అష్టముఖంగా నిర్మింపబడి ఉన్నది. అందు అనంతసాయిన్ విష్ణుప్రతిమ ఉన్నది. దీని విమానం రెండు అంతస్తులుగా ఉన్నది. దీని కుడ్యాలపై అనేక చిత్రలేఖనాలు ఉన్నాయి. కృష్ణ, క్షేత్రపాల, నరసింహ మొదలగువారి పరివార దేవతా గృహాలు ఉన్నాయి. ఆలయం చుట్టూ స్తంభాల మండపం, గోపుర ద్వారాలు ఉన్నాయి.

గురువాయూర్‌లోని కృష్ణాలయం చతురస్రంగా ఉన్నది. దీనిపై రెండంతుస్తుల లోహరేకుల శిఖరం ఉన్నది. దీని చుట్టూ చుత్తుంబలం, ప్రాకారం ఉన్నాయి.

తిరువంచికలం, తెలి, తెలిపరంబ, తిరుప్రంగోడ్, పెరుమానం, త్రిక్కందియూర్, త్రిత్తల, శుకపురంలలో శివాలయాలు, త్రిచ్చంబరం, తిరునావెలలో రామాలయాలు కొడుంగల్లూర్‌లో భగవతి ఆలయం ఉన్నాయి. తిరువంచికలం దేవాలయం చతురస్రాకార దేవగృహాన్ని రెండంతస్తుల శిఖరాన్ని కలిగి ఉన్నది. రెండు కుడ్యాలను, ద్వితల శిఖరాన్ని కలిగి ఉన్నది. తెలి దేవాలయం కూడా ఇదే విధంగా ఉన్నది. తిరువేంగడ్‌లోని రామాలయం దీర్ఘచతురస్రంగా ఉన్నది. దీనిపైన గల శిఖరం యొక్క కింది విభాగం వాలుగా ఉన్న (pent) కప్పును, పై విభాగం కూదుఆకార కప్పును కలిగి ఉన్నాయి. శిఖరంపైన స్తూపి ఉన్నది. శిఖరం రాగిరేకుతో నిర్మింపబడింది. ఆలయంముందు ముఖమండపం ఉన్నది. త్రిచంబరం, తిరువిల్వమలై, తిరుప్రయార్, తిరువన్నూర్, కొడుంగల్లూర్, కన్యాకుమారి, కెనరాల్లలో కూడా కేరళరీతి ఆలయాలు ఉన్నాయి.

## 23

# ఉత్తర భారతదేశ దేవాలయాల ప్రాచీనత, ముఖ్యాంశాలు - గుప్తుల దేవాలయాలు

భారదేశం నందు అతి ప్రాచీన కాలం నుంచి మానవుడు ప్రకృతి దేవ, దేవీలను పూజించెడి సాంప్రదాయం ఉన్నది. చరిత్ర పూర్వయుగమందు మానవుడు ప్రకృతి దేవతలైన సూర్యుడు, చంద్రుడు, అగ్ని మొదలైన వారిని పూజించెడి వాడు. సింధూ నాగరకత కాలం నాటి మానవుడు ప్రకృతి దేవతను పూజించే వాడు. ఆర్యుల కాలమందు కూడా ప్రకృతి దేవతలైన సూర్యుడు, చంద్రుడు, అగ్ని మొదలైన వారిని పూజించే వాడు. అంతేగాక ఈ కాలమందు ఇంద్రుడు, వరణుడు, యముడు, మొదలైన దేవతలు కొలువబడుచుండేవారు. వేదకాలమందు దేవతల ప్రతిమల నిర్మాణం జరిగి ఉండవచ్చును. బహుశా అవి అశాశ్వత వస్తువుచే రూపొందించబడ్డాయి. కావున మనకెట్టి ఆధారాలు ఈనాడు లేవు. వేదకాలమందు దేవతలకు కొయ్యతో నిర్మితమైన దేవాలయాలు ఉండి ఉండవచ్చును. హిందూ దేవాలయాలు హోమ మండపంల ఆధారంతో రూపొందించబడ్డాయని సెల్లా క్రమారిష్ భావించారు. మలి వేదకాలం నాటికి పూర్వమే దేవతలను మానవ ఆకార భావంతో పూజించుట ప్రారంభమయింది. కాని కుషాణ కాలమందే బౌద్ధ శిల్ప ప్రభావంతోనే ప్రతిమారూపంలో దేవుని ఆరాధించుట హిందూ మతంలో వ్యాప్తి గాంచింది. దేవుని ఆరాధించుట హిందూ మతంలో వ్యాప్తి గాంచింది. కుషాణుల కాలం నాటికి హిందూ మత వ్యాప్తికై అధికంగా కృషి చేసింది. బౌద్ధ మత ప్రాబల్యాన్ని తగ్గించి హిందూ మత ఉన్నతిని సాధించుటకై ఈ తెగ వారు కృష్ణుడు, విష్ణువు, దుర్గ మొదలైన వారిని ప్రతిమా రూపం విధానంతో ఎక్కువగా వ్యాప్తి చేయుటకై కృషి చేయసాగారు. ఇట్టి విధానం వలన బౌద్ధమతం యొక్క ధాటికి హిందూమతం నిలబడి భక్తి విధానంతో వ్యాప్తి చెందసాగింది. ఇట్టి భక్తి విధానం హిందూమతం నందు వ్యాప్తి చెందు కాలమందే హిందూ శిల్పకళ కూడా వృద్ధి చెందసాగింది. ఇట్టి శిల్పకళకు మధుర కేంద్రమైంది. భక్తి విధానంతో దేవతా ప్రతిమలను పూజించెడి విధానం అభివృద్ధి చెందుటతో పాటు ఆ ప్రతిమలను స్థాపించుటకై దేవాలయ నిర్మాణం చేయవలసి వచ్చింది. దేవునికి మానవుని లాగ గృహమవసరమయ్యింది. మొదట కొయ్య, ఆకులతోను తరవాత శిలయందు, ఆ తరవాత శిల్ప, ఇటుక, కొయ్యల కట్టడాలతోను ఇవి నిర్మించుట ప్రారంభమయ్యింది.

సమాధుల నిర్మాణ పద్ధతి నుంచి దేవతా గృహాల నిర్మాణ విధానం ఏర్పడినదని కొందరు వాస్తు నిపుణుల అభిప్రాయం. ఉత్తర భారత దేశం నందు నిజమైన దేవాలయాల నిర్మాణం

గుప్తుల కాలంతో ప్రారంభమైంది. కాని మౌర్యుల కాలానికే దేవాలయాల నిర్మాణం ప్రారంభమైంది. కానీ ఆనాడు అతి తక్కువ దేవాలయాల నిర్మాణం జరిగింది. అవి కూడా పరిణితి చెందని దశకు చెందాయి. రాజస్థాన్ లోని జయపూర్ జిల్లాయందలి బైరత్ ప్రాంతమందలి క్రీ.పూ. 3వ శతాబ్దం నాటి ఇటుక, కొయ్యతో నిర్మింపబడ్డ గుండ్రటి దేవాలయం సాంచి యందలి 40వ నంబరు గజపృష్ఠ శిలా దేవాలయం, క్రీ.పూ. 2వ శతాబ్ద నాటి సాంచిలోని 18వ నంబరు గజపృష్ఠ శిలా ఆలయం, రాజస్థాన్‌లోని ఉదయపూర్ జిల్లా యందలి నగరిలోని సంకర్షణ వాసు దేవ ఆలయం (అండాకారం), సాంచి దగ్గరలోని బెస్‌నగర్ నందలి భాగవత (వైష్ణవ) దేవాలయం మౌర్య కాలపు ఆలయాలుగా చెప్పవచ్చును. బెస్‌నగర్ ఆలయం ముందు గ్రీకు రాయబారి హెలియొడొరస్ గరుడ స్తంభం ఉన్నది. ఉత్తర భారత దేశమందు గుప్తులతో దేవాలయ నిర్మాణాలు ప్రారంభం కాగా ఆంధ్రదేశమందు ఇక్ష్వాకులతో వీటి నిర్మాణం ప్రారంభమైంది. ఇక్ష్వాక రాజులు హిందూమత వ్యాప్తికై దేవాలయ నిర్మాణాలతో కృషి చేయగా వారి రాణులు బౌద్ధ గుహాలయాలను నిర్మించి బౌద్ధమత వ్యాప్తికి కృషి చేశారు. ఆంధ్రదేశమందలి నాగార్జుని కొండయందు అతి ప్రాచీనమైన అష్టభుజ స్వామి దేవాలయం, కార్తికేయ దేవాలయం మొదలైనవి కనుగొన బడ్డాయి. ఈ ప్రాంతమందలి దేవాలయాలు ఇటుకలతో నిర్మింపబడ్డాయి.

ఉత్తర భారత దేశ దేవాలయాలను నాగర తెగ దేవాలయాలంటారు. హిమాలయాలకు దక్షిణాన, వింధ్య పర్వతాలకు ఉత్తరాన గల దేవాలయాను నాగర దేవాలయాలంటారు. వీటికి గర్భగృహ, ఆ విభాగంమందు ఉబ్బెత్తు రథా విభాగాలు (Matha Projections) ఉన్నాయి. గర్భగృహ ముందు వసారా (porch) లేక ఇతర విభాగాలైన జగ్‌మోహన, నాట్‌మంటప, భోగ మంటపాలు ఉన్నాయి. తరవాత కాలంలో గర్భగృహ చుట్టూ ప్రదక్షిణా పథ ఏర్పడింది. వీటి విమానాలు గర్భగృహ భాగమందు రాహాపాగా, అనురాహాపాగా, కోనికాపాగా అను విభాగాలను కల్గి ఉన్నాయి. విమానం యొక్క తలాలు తెలుపుటకై కోనికాపాగలందు భూమి ఆమలకాలు ఉన్నాయి. కొన్ని సందర్భాల్లో ఈ విమాన భాగాలందు గేబుల్ డిజైన్లు ఒక దానిపై మరొకటి రూపొందించబడి ఉన్నాయి. విమానం పై భాగాన ఆమలక శిఖరం ఉన్నది. విమానానికి, శిఖరానికి మధ్య గ్రీవ అను విభాగాన్ని ఇవి కలిగి ఉన్నాయి. శిఖరం పై భాగంలో స్థూపి లేక కలశ విభాగం వీటి ఉన్నది. దక్షిణ భారతదేశ దేవాలయాలందు లాగ గాక ఉత్తర భారత దేశ దేవాలయాలందు స్తంభాలు చాలా వరకు లేవు. అవి నిర్మాణమందే కలసి ఉన్నాయి. విడిగా కనపడవు. గర్భగృహ తప్ప మిగిలిన విభాగం పైన జగ్మోహన, నాట్‌మంటప, భోగమంటప విభాగాలపై స్టెప్డ్ విమానాలను ఉత్తర భారతదేశ దేవాలయాలు కలిగి ఉన్నాయి.

నేటికి నిలచి ఉన్న ఉత్తర భారతదేశ దేవాలయాల్లో అతి ప్రాచీనమైనవి గుప్తుల కాలానికి చెందినట్టివి. గుప్తుల కాలం వాస్తు శిల్ప కళాభివృద్ధికి సాహిత్య చిత్ర లేఖనాల ఉన్నత దశకు స్వర్ణయుగంగా చెప్పబడుతున్నది. హిందూ మత మందలి భక్తి ఉద్యమమే ఆనాటి వాస్తు శిల్పకళాభివృద్ధికి కారణమని చెప్పవచ్చును. భక్తి ఉద్యమం కృష్ణ, వాసుదేవ, బలరామ, స్కంధ, వరాహ, శివ, బుద్ధ, విష్ణు దేవతలను పూజించెడి విధానాన్ని ప్రచారం చేసింది. వీరి కాలమందు హిందూ మతం బౌద్ధ మత వ్యాప్తిని వెనుకకు నెట్టి విస్తృత వ్యాప్తిని చెందసాగింది. గుప్త

రాజులు హిందూ మతాన్ని ముఖ్యంగా వైష్ణవ తెగను ప్రోత్సహించారు. మత వ్యాప్తితో బాటు, దేవతా ప్రతిమల వ్యాప్తి జరిగి వాటి స్థాపనకై దేవాలయ నిర్మాణాలు వీరి కాలమందు ప్రారంభమైనవి. దేవాలయ నిర్మాణాల విధానం ఏ విధంగా చరిత్రలో మార్పు చెందుచూ వచ్చిందో పెర్సీబ్రైన్ అను వాస్తు శాస్త్ర నిపుణుడు కింది వాక్యాల్లో తెలుపుచున్నాడు.

"First a leafy bower then a red hut and afterwards a cell of wood and brick", He also remarks "this anthropomarphic conception of a deity naturally called for some habitation and so a structural shrine came in to being".

క్రీ.శ. 400 నుంచి క్రీ.శ. 700 మధ్య కాలమందు గుప్తుల దేవాలయాల నిర్మాణం జరిగింది. ఈ కాలమందలి దేవాలయాల నిర్మాణంలో మార్పు వచ్చింది. దేవతలకు బౌద్ధులచే ప్రారంభించబడిన శిలా గుహాలయాల రూపణ విధానం దాదాపు తగ్గిపోయి దేవతా గృహాలను శిలలతో ఇటుకలతో కట్టెడి విధానం ప్రారంభమైంది. గుప్తుల దేవాలయాల గూర్చి ఆ కాలం నాటి గ్రంథాలు, హుయాన్‌త్సాంగ్ రచనలు అనేక విషయాలను తెలుపుచున్నాయి.

వీరి కాలమందలి దేవాలయాలు తొలి దశయందు చతురస్రాకారపు గర్భగృహను కలిగ అందు దేవతా ప్రతిమ ప్రతిష్ఠింపబడి ఉన్నది. ఆ దశయందే కొంత కాలానికి గర్భగృహ ముందు ఒక చిన్న స్తంభ వసారా (pillared porch) నిర్మించే విధానం ఏర్పడింది. వీరి దేవాలయాలు ఎత్తుగా నిర్మించబడ్డ ఒక వేదిక (platform) మీద నిర్మించబడ్డాయి. వీటికి నాలుగు వైపులా మెట్లుండేవి. తొలి దశయందలి దేవాలయం చదరపు పై కప్పును కలిగి ఉన్నాయి. కాని తరవ్వాత కాలంలో గర్భగృహపైన విమాన నిర్మాణం చేయుట సాంప్రదాయమైంది. మొదటి దశలోని దేవాలయ గోడలు ఎటువంటి అలంకరణ లేకుండా ఉన్నాయి. గర్భగృహద్వారాలపై గంగ, యమున మొదలైన దేవీల చిత్రాలు ఉన్నాయి. గర్భగృహ చుట్టూ ప్రదక్షిణా పథ నిర్మించెడి విధానం కూడా మలిదశ కాలంలో ఉన్నది. వీరి ఆలయాల ప్లాను, ఆలయ స్తంభాలు, ద్వారాల అలంకరణలు, గణ, మిథున, విద్యాధర, ద్వారపాల, గరుడ, నాగవంటి వాటిలో వచ్చుచున్న మార్పులు వీరి ఆలయాల పరిణామ దశలను తెలియజేయుచున్నాయి.

సాంచి లోని 17వ దేవాలయం, తిగావ లోని దేవాలయం, ఎరాన్‌లోని విష్ణుదేవాలయం, సకోర్ శివ దేవాలయాలు తొలి దశ గుప్త దేవాలయాలుగా చెప్పవచ్చును. సాంచి, ఎరాన్ ఆలయాలకు గర్భగృహ, వసారా, చదరపు పై కప్పు, సాదా గోడలు, చిన్న పరిమాణం ఉన్నాయి. ఇవి ఉదయగిరి (సాంచి వద్ద) లోని ఒకటో గుహ ప్రభావంతో నిర్మింపబడ్డట్లు తెలియుచున్నది. సకోర్ ఆలయానికి మండపం కూడా (closed) ఉన్నది.

**రెండో దశ గుప్త దేవాలయాలు**

భుమార (సత్నజిల్లా) ప్రాంతమందలి శివదేవాలయం, నాచన్‌కుథార (పణ్ణజిల్లా, మధ్యప్రదేశ్) యందలి పార్వతీ దేవాలయం, బాంగ్లాదేశ్‌లోని దినాజ్‌పూర్ జిల్లా యందలి బైగ్రామ్‌లోని దేవాలయం, ఐహొలే యందలి లాడ్‌ఖాన్ దేవాలయం గుప్తుల రెండో దశ

దేవాలయాలుగా చెప్పవచ్చును. కానీ లాడ్‌ఖాన్ దేవాలయం తొలి చాళుక్యులకు చెందినదని. కాదని ఒక అభిప్రాయం ఉన్నది. కాని ఇది గుప్త ప్రభావాన్ని కలిగి ఉన్నది.

**నాచ్న పార్వతీ దేవాలయం**

ఈ ఆలయం మధ్యప్రదేశ్‌లోని పన్నా జిల్లాలోని నాచ్న కుథారయందు ఉన్నది. ఇది చిన్న చతురస్రాకారపు గర్భగృహాను, దాని చుట్టూ మూసివేయబడిన ప్రదక్షణను కలిగి ఉన్నది. ఈ ప్రదక్షిణ ముందు భాగమందు స్తంభాలు ఉన్న వసారా (porch) ఉన్నది. గర్భగృహా, ప్రదక్షణల యందు వెలుతురు కొరకై కిటికీల నిర్మాణం చేసిఉంది.

**భుమార శివ దేవాలయం**

ఇది మధ్య ప్రదేశ్‌లోని సత్నా జిల్లాలోని భుమార యందు ఉంది. దీనికే పంచాయాతన లేక పంచదేవ గృహదేవాలయం అనిపేరు. దీనికి 35 చదరపు అడుగుల గర్భగృహాను, వసారా (porch) ప్రదక్షణా పథాలు ఉన్నాయి. దీని గర్భగృహ పైన మరొక గర్భగృహ ఉన్నది. ఈ దేవాలయం ఎర్రటి ఇసుకరాతితో నిర్మించబడి పై కప్పు భాగమందు అనేక చిత్రాలు ఉన్నాయి. గర్భగృహ ద్వారం అనేక రకాలైన చిత్రాలతో నిండి ఉంది. దీనిపై ఉన్న చిత్రాల్లో గంధర్వులు, మిథున, గణ చిత్రాలు ముఖ్యమైనవి. ద్వారంపై ఉన్న లింటెల్ పై భాగమందు లలాట బింబ చిత్ర రూపం ఉంది. ద్వారం ఇరువైపులా ద్వారపాలకులు, గంగా, యమున దేవీల చిత్రాలు రూపొందించబడి ఉన్నాయి. ప్రస్తుతం ఈ దేవాలయం ప్రదక్షణ, పోర్చ్ శిథిల దశలో ఉన్నాయి. గర్భగృహలో ఏకముఖ శివలింగం ఉంది. కాని ఈ రెండో దశ ఆలయాల గర్భగృహ పై కూడా విమాన నిర్మాణం లేదు. ఇది మూడో దశలోనే ప్రారంభమైంది.

**ఐహోలే యందలి లాడ్‌ఖాన్ దేవాలయం**

నాచ్నకుథార యందలి పార్వతీ దేవాలయాన్ని ఇది పోలి ఉంది. ఇందు ఒక పెద్ద దీర్ఘచతురస్రపు హాలు ఉంది. దీని వెనుక గోడ భాగంలో మధ్యగా గర్భగృహ నిర్మాణం గలదు. దీని ముందు హాలు మధ్యగా నాలుగు ఎత్తు స్తంభాలున్నవి. వీటిపైన చదరపు పై కప్పు ఉంది. దీనిపైన మరొక దేవగృహం ఉంది. హాలు, గర్భగృహ గోడల్లో వెలుతురు కొరకై చిన్న కిటికీల నిర్మాణం చేయబడి ఉంది.

## మూడో దశ గుప్త దేవాలయాలు

**దేవఘర్ దశావతార దేవాలయం**

ఈ దేవాలయం ఉత్తర ప్రదేశ్ నందలి ఝాన్సీ జిల్లాలో ఉంది. ఇది కూడా పంచాయతన (quincunx) దేవాలయం. ఇది ఎత్తైన, వెడల్పాటి వేదిక (platform) పై నిర్మింపబడి ఉంది. దీని నాలుగు వైపుల మెట్ల మార్గాలున్నాయి. వేదిక భాగమందు రామాయణ సంబంధమైన అనేక చిత్రాలు ఉన్నాయి. కుడ్య భాగమందు 3 కోష్టాలు ఉన్నాయి. వీటియందు అనంతశాయి, నారాయణ, గజేంద్రమోక్ష చిత్రాలున్నాయి. ఇవి పరిణతి చెందిన శిల్పకళకు నిదర్శనంగా ఉన్నాయి. గర్భగృహ ద్వారంలో ఎనిమిది చిత్రాలు ఉన్నాయి. ద్వారం రెండు వైపుల ద్వారపాలక

చిత్రాలు చెక్కబడి ఉన్నాయి. మిథున చిత్రాలు, ఆసనయోగి చిత్రాలు కూడా ఉన్నాయి. ఈ ఆలయంలో కృష్ణ లీలలు, రామకృష్ణ శిల్పాలు, హనుమంతుడు సంజీవిని తెచ్చుట, లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు కోయు శిల్పాలు ఉన్నాయి. కుడ్యపై భాగంలో ఉన్న కపోత రెండు పట్టీల వంటి విభాగాలు ఉన్నాయి. ఆలయ విమానం ప్రస్తుతం పతన దశలో ఉంది. విమానమందు రాహపాగ, అనురాహపాగ, కోనికపాగ అను విభాగాలు ఉన్నాయి. తలాలు తెల్పుటకై కోనిక పాగ యందు భూమి ఆమలకలు ఉన్నాయి. ఇది ఆమలక సార లేక అమ్ల శిల లేక ఆమలక శిఖరం ఉంది. శిఖరంపై భాగంలో స్థూపి ఉంది. కానీ ప్రస్తుతం ఈ రెండు విభాగాలు పతనమై ఉన్నాయి. ఈ దేవాలయం మధ్య భాగమందు ఒక గర్భగృహ, దాని చుట్టు క్లోజ్డ్ ప్రదక్షిణ, దేవాలయ నాలుగు మూలలందు నాలుగు దేవగృహాలు ఉన్నాయి. ఆలయం ముందు భాగమందు ఒక వసారా (porch) ఉంది.

**బితర్‌గాన్ శివదేవాలయం**

ఇది ఉత్తర ప్రదేశ్‌నందలి కాన్పూర్ జిల్లాలో ఉంది. దీనికి గర్భగృహ, అంతరాళ, పోర్చ్, గోపుర ద్వారం అను విభాగాలు ఉన్నాయి. ఇది ఇటుక, మట్టితో నిర్మించబడింది. దీనికి ఎటువంటి నగిషీలు లేవు. ఎత్తైన అధిష్ఠానం ఉంది. కుడ్య (జంఘ) విభాగమందు కుడ్య స్తంభాలు ఉన్నాయి. ఒక దానికి మరొక దానికి మధ్య కోష్టాలు ఉన్నాయి. వీటి యందు శైవ సంబంధమైన గాథలను తెల్పే శిల్పాలు ఉన్నాయి. కుడ్యం పై భాగమందు కపోతం రెండు పట్టాల వంటి విభాగాలు ఉన్నాయి. విమానం రధ ప్రొజెక్షన్స్ కలిగి వాటి ముఖ భాగాన చైత్య డిజైన్స్ (gable designs) ఉన్నాయి. ఆలయ శిఖరం ప్రస్తుతం పతనమై ఉన్నది.

**మహాబోధి దేవాలయం**

క్రీ.శ. 7వ శతాబ్దమందు హ్యుయాన్ త్సాంగ్ దీన్ని కనుగొని ఇది మహాబోధి విహారం అని తన గ్రంథంలో రాశాడు. అనేక పర్యాయాలు ఇది పతనదశను పొందినందున బాగు చేయుటకై ప్రయత్నాలు జరిగాయి. అట్టి ప్రయత్నకాలమందు దీని ముఖ్యాంగాలు దెబ్బతిన కుండున శ్రద్ధ తీసుకొవటం జరిగింది. ఇది కొంత వరకు దేవఘర్, బితర్‌గాన్ దేవాలయాలను పోలి ఉంది. పంచరథ పద్ధతిలో దీని నిర్మాణం జరిగింది. ఈ దేవాలయం గర్భగృహ (లేక దేవుల్), అంతరాళ లేక జగ్‌మోహన, నాట్‌మంటప, భోగమంటప, అనే విభాగాలు ఉన్నాయి. ఇది ఎత్తైన అధిష్టానం కలిగి ఉన్నది. దేవాలయం లోనికి వెళ్ళుటకు నాలుగు వైపుల మెట్ల దారి ఉన్నది. దేవాలయం నాలుగు మూలల యందు నాలుగు దేవగృహాలున్నాయి. గర్భగృహం చతురస్రాకారంగా నిర్మించబడి ఉన్నది. గర్భగృహ యందు బుద్ధుని ప్రతిమ ఉన్నది. గర్భగృహ విమానం రాహపాగ, అనురాహపాగ, కోనికాపాగా అను విభాగాలు ఉన్నాయి. కోనికపాగ యందలి 7 భూమి ఆమలకలు విమానం 7 తలాల గూర్చి తెలుపుతు ఉన్నాయి. విమానంపైన ఆమలక శిఖరమున్నది. దానిపైన స్థూపి ఉంది. జగ్‌మోహన, నాట్‌మండప, భోగమంటప, విమానాలు స్టెప్డ్ విమానాల లాగ రూపొందించబడి ఉన్నాయి.

**గుప్తానంతర దేవాలయాలు**

గుప్తానంతర దేవాలయాల్లో సిర్‌పూర్ నందలి లక్ష్మణ దేవాలయం, రాజ్‌ఘీర్ నందలి మణినాగ దేవాలయం, నలందా యందలి 3వ సంఖ్యగల స్తూప సీత దేవాలయం, ముకుందర దేవాలయం, ముండేశ్వర (మండలేశ్వర) దేవాలయం ముఖ్యమైనవి. లక్ష్మణ దేవాలయం మధ్య ప్రదేశ్‌యందు రాయ్‌పూర్ జిల్లాలోని సిర్‌పూర్‌నందు ఉంది. ఇది ఇటుకలతో నిర్మించబడి, పంచరథ విధానం ఉంది. గర్భగృహ, అతర్, స్తంభమండప అను విభాగాలు ఇందు ఉన్నాయి. ఎత్తైన వేదికపై గర్భగృహ నిర్మాణం చేసి ఉంది. దీని విమానం 4 తలాలు కలిగి రాహాపాగ, అనురాహాపాగా, కోనికాపాగా అను విభాగాలను కల్గి ఉంది. వీటిపై గేబుల్ డిజైన్లు, శిఖర రూపాలు ఒక దానిపై మరొకటిగా ఉన్నాయి. రాజ్‌ఘీర్ యందలి దేవాలయం గుండ్రటి గర్భగృహను కల్గి, దేవాలయ గోడల యందు అనేక దేవతా ప్రతిమలను కలిగి ఉన్నది. గుప్తుల కాలమందు మనం చదరపు పై కప్పు గల దేవాలయాలు, స్టెప్డ్ (stepped) విమానాలు గల దేవాలయాలు, రేఖా (curvelenior) శిఖర లేక విమానాలు గల దేవాలయాలను గమనించవచ్చు.

**ఇతర ఆలయాలు**

నలందలోని మూడో స్తూప సీత ఆలయం పలు మార్లు మార్పులు చేయబడింది. ఇది దీర్ఘచతురస్రంగా ఉన్న పంచాయతన ఆలయం. రాజస్థాన్ లోని కోట జిల్లాలోని ముకుందర ఆలయానికి గర్భగృహ, ప్రదక్షిణాపథ, చదరపు పై కప్పు, తక్కువ ఎత్తుగల వేదిక, మెట్లు ఉన్నాయి. బీహార్‌లోని షహాబాద్ జిల్లాలోని రామ్‌ఘర్ నందలి ముండేశ్వర (మండలేశ్వర) ఆలయానికి అష్టముఖ గర్భగృహ, నాలుగు ద్వారాలు ఉన్నాయి. దీని మండపం ఉంది. కాని నేడు లేదు. ఈ ఆలయం క్రీ.శ. 636 నాటిది.

# 24

# మధ్యభారత దేవాలయాలు

మధ్య భారత దేవాలయాల్లను మధ్య యుగాల్లో ప్రతిహారులు, పరమారులు, కాలచూరులు, కచ్ఛపఘటులు, చందేలులు అను రాజ వంశజులు నిర్మించారు. తొలి మధ్యయుగ కాలంలో క్రీ.శ. 8-9 శతాబ్దాల మధ్య కనూజ్ రాజధానిగా మధ్య భారత, రాజస్థాన్ ఆలయాల్లో రాజస్థాన్‌లోని ఆలయాల గూర్చి రాజస్థాన్ ఆలయాల అధ్యాయంలో వివరించటం జరిగింది. (ఒసియన్ ఆలయాలు). ఇచట మధ్య భారత ఆలయాలను గూర్చి మాత్రమే విశదీకరించబడింది. క్రీ.శ. 10-12 శతాబ్దాల మధ్య కాలంలో ప్రతిహారుల స్థానంలో మధ్య భారత తూర్పుభాగంలో దహాల రాజధానిగా కాలచూరులు, మధ్య భారత ఉత్తర భాగంలో నర్వార్, దుబ్‌కుండ్, గ్వాలియర్‌లు కేంద్రాలుగా కచ్ఛపఘటులు, మధ్య భారత పశ్చిమభాగంలో మాళవ కేంద్రంగా పరమారులు విడివిడిగా రాజ్యాలు ఏర్పరచుకొని సమకాలీకులుగా పరిపాల చేశారు. వీరి కాలపు దేవాలయాలు పరిణితి దశకు చెందినవిగా చెప్పవచ్చు.

## మధ్య భారత ఆలయాల ముఖ్యాంశాలు

మధ్య భారత దేవాలయాలకు తొలి దశలో గర్భగృహ, నడవ లేక అర్ధమండప (verstibule) ఉండేవి. తరవాత ఆకాలంలోనే వీటి ముందు వసారా (porch) నిర్మించుట వాడుకలోకి వచ్చింది. మలిదశ కాలంలో నడవ, వసారాల మధ్య మండపం నిర్మించుట ఒక వాస్తు సాంప్రదాయమైంది. మండప, వసారాలకు పక్కల్లో నేత్రకోష్ఠలు ఉండేవి. తొలిదశలో శిఖరం సాదాగా అదిమినట్లు పొట్టిగా ఉండేవి. కాని తరవాతి దశలో ఇది పంచరథ, సప్తరథ శిఖరంగా ఉండేది. దీనిపైన గ్రీవ, రెండు ఆమలసారకలు, కుండాకార స్థూపి ఉన్నాయి. మండపపైన విమానం ముందు భాగంలో సుఖనాస నిర్మాణం ఉంది. దీనిలో కోపంతో దుముకుచున్న సింహం (rampant lion) ఉంది. తొలిదశ ఆలయాల కుడ్యాల్లో ఒక పట్టీ దేవతా శిల్పాలు గల కోష్ఠాలు ఉన్నాయి. మలిదశలో రెండు పట్టీలు కనపడతాయి. మధ్య భారత ఆలయాల్లో అద్భుత శిల్పసంపద ఉంది. విమానాలలో ఉపవిమానాలు కూడా ఉన్నాయి.

## ప్రతిహారుల దేవాలయాలు

ప్రతిహారుల తొలిదేవాలయాల్లో గ్వాలియర్ దగ్గరలోని నరేసర్‌నందలి దేవాలయాల సముదాయం ముఖ్యమైనవి. వీటికి చతురస్రాకార గర్భగృహ ఉంది. దీనిపైన త్రిరథ రేఖా శిఖరం ఉంది. గర్భగృహముందు నడవ ఉంది. దీనిపై సాదా గూడు పై కప్పు ఉన్నది.

ఈ రెండింటి ద్వారాలపై కుడ్య స్తంభాలు, సర్పాలతోకలను పట్టుకొనియున్న గరుడుడు ఉన్నాయి. లింటెల్ భాగంలో గొలుసు గంట రూపంలో ఉంది. ఈ ఆలయ 'జంఘ' (కుడ్యం) సాదాగా ఉంది. కాని మధ్య ఉబ్బెత్తుల లో గణేశ, కార్తికేయ, లకులీశ, సూర్య, పార్వతి గల దేవకోష్ఠలున్నాయి. గ్వాలియర్ దగ్గరలోని ఐతేసరలోని దేవాలయం, అమ్రోలేలోని మహదేవ దేవాలయం ఒకే రీతిలో ఉన్నాయి. ఇవి కూడా కుడ్యస్తంభాలు, జంటలు మొదలగు శిల్పాలతో అద్భుతంగా ఉన్నాయి. మధ్యప్రదేశ్ లోని శివపురి జిల్లాలోని మహువ యందు శిథిలమైన శివాలయం ఉంది. దీని కుడ్యంలో దంతుల ఘనచతురస్ర కొనరూపాలు ఉన్నాయి. కుడ్య మధ్యభాగంలో దేవకోష్ఠలున్నాయి. శిఖరకు, దానిపై గల ఆమలకకు మధ్య ఆలయం చుట్టూ లోతు భాగం (recess) ఉంది. మహువ దగ్గరలోని తెహరి యందలి దేవాలయం చిన్నది, కానీ పంచరథ గర్భగృహను, వసారాను కలిగి ఉంది. గ్వాలియర్ లోని తెలిక మందిర్ ప్రతిహారుల తొలి దేవాలయాలలో పెద్దది. దీనికి పెద్ద దీర్ఘచతురస్రాకార గర్భగృహ, నడవ ఉన్నాయి. గర్భగృహపై గజపృష్ఠ శిఖరమున్నది. కుడ్యమందు దేవతలు, దేవీలు, శిఖర రూపాలు చైత్యాలు ఉన్నాయి. ఆలయ శిఖరం రెండు తలాలను కలిగి ఉంది. ఆమలకలు తలాలను తెలుపుచున్నాయి. పరివారకులు, శైవ ద్వారపాలురు ఉన్నారు. ఈ ఆలయం క్రీ.శ. 850 ప్రాంతంలో నిర్మింపబడినట్లు తెలియుచున్నది. మధ్యప్రదేశ్‌లోని గుణజిల్లాలోని ఇండోనందు శిథిలమైన శివాలయం ఉన్నది. ఇది తెలికామందిర్ లాగ ఉన్నది. అంతేగాక సమకాలీనమైంది. కాని ఇది గుండ్రటి ప్లానులో నిర్మింపబడి ఉన్నది. గర్భగృహ చుట్టూ పన్నెండు అలంకార భాగాలున్నాయి. ఈ ఆలయ కోష్ఠలలో గణేశ, కార్తికేయ, ఉమ మొదలైన శిల్పాలున్నాయి. ఝాన్సీ జిల్లాలోని బర్వసాగర్‌యందలి జరైమత్ ఆలయం, విదిశ జిల్లాలోని బదోహ్ నందలి గదర్‌మల్ దేవాలయాలు దీర్ఘచతురస్రాకార పంచరథ గర్భగృహ, శిథిలమైన శిఖర, అందమైన స్తంభాలు ద్వారాలు ఉన్నాయి. జరైమత్‌కు నడవ కూడా ఉంది. గదర్‌మల్‌కి రెండే గాక మండప వసారాలు కూడా ఉన్నాయి. ఇది ఎత్తైన వేదికపై నిర్మింపబడి ఉంది. దీని చుట్టూ ఏడు పరివార దేవతా గృహాలు ఉన్నాయి. పన్న జిల్లాలోని నాచ్‌నయందు చతుర్ముఖ మహాదేవ ఆలయం ఉన్నది. దీనికి త్రిరథ గర్భగృహ, దానిపై పంచరథ ఉత్తర రీతి శిఖర, గర్భగృహలో చతుర్ముఖ శివలింగను కలిగి ఉన్నది. విమానం (శిఖర) ఐదు తలాలు ఉన్నాయి. మధ్యప్రదేశ్‌లోని తికంఘుర్ జిల్లాలో మాన్‌ఖేడయందు సూర్య దేవాలయముంది. ఇది జరైమత్ ఆలయం లాగ ఉంది. దీనికి చతురస్రాకార పంచరథ గర్భగృహ, నడవ, వసారాలు, శిఖర, గ్రీవ, ఆమలక ఉన్నాయి. విదిశ జిల్లాలోని పఠారిలో కూటకేశ్వర దేవాలయం ఉంది. ఝాన్సీ జిల్లాలో 12, 15 సంఖ్యగల జైన దేవాలయాలున్నాయి. 15వ దేవాలయం మూడు ఆలయాల దేవాలయం. దీనికి మూడు గర్భగృహాలు, హాలు వసారాలున్నాయి. 12వ ఆలయం గర్భగృహ, నడవ, ప్రదక్షిణలను కలిగి ఉంది. గర్భగృహ పంచరథరీతిలో ఉన్నది. విదిశ జిల్లాలోని గ్యరాన్‌పూర్ యందలి మహాదేవి ఆలయం కొంత కట్టడ భాగాన్ని కొంత ఏకశిలా భాగాన్ని కలిగి ఉంది. దీనికి గర్భగృహ, నడవ, హాలు, వసారాలు ఉన్నాయి. గర్భగృహ త్రిరథరీతిలోను, దాని శిఖర పంచరథ రీతిలోను ఉంది. శిఖరపైన జంట ఆమలక, కుండాకార ఛత్ర ఉన్నాయి. హాలు, వసారాలపై పిరమిడ్ ఆకార శిఖరాలున్నాయి. జైన యక్ష, యక్షిణి శిల్పాలు మొదలైనవి ఇందు ఉన్నాయి. హిమాచల్‌ప్రదేశ్‌లోని కులు జిల్లాయందలి జగత్ సుఖ్‌యందు గల శివాలయం,

హిమాలయాల్లోని జగేశ్వర, గోపేశ్వర లఖమండల్ లోని శివాలయం, బజౌరాలోని బసేశ్వర్ మహాదేవ దేవాలయాలు కూడా ప్రతిహారుల మధ్య భారత మధ్యయుగ తొలిదశ దేవాలయాలు.

**పరమారుల దేవాలయాలు**

పరమారుల దేవాలయాలు దక్కన్‌రీతి లేక భూమిజరీతిలో నిర్మింపబడి ఉన్నాయి. ఇవి ఉదయపూర్, ఉన్, ఓన్కార్ మంధట, జమ్లి, నేమవార్‌లలో ఉన్నాయి. విదిశలోని ఉదయపూర్ ఆలయాన్ని నీలకంఠేశ్వర ఉదయేశ్వర అను పేర్లతో పిలుస్తారు. ఇది పరమార దేవాలయాల్లో పెద్దది. క్రీ.శ. 1059లో దీని నిర్మాణం ప్రారంభమై క్రీ.శ. 1080 లో ముగిసింది. దీన్ని ఉదయాదిత్యుడు నిర్మించాడు. దీనికి సప్తరథ గర్భగృహ, నడవ, హాలు, హాలుమూడు వైపులా మూడు వసారాలు ఉన్నాయి. ఆలయం చుట్టూ ఎనిమిది పరివార దేవతా గృహాలున్నాయి. ఆలయం చుట్టూ ఎనిమిది పరివార దేవతా గృహాలున్నాయి. ఆలయం పెద్ద వేదికపై నిర్మింపబడి ఉన్నది. దీనిపైకి మెట్లు ఉన్నాయి. వీటి ప్రక్కలలో శైవద్వారపాలురున్నారు. గర్భగృహ పైన ఏడు అంతస్తుల శిఖరం ఉంది. దీనిపైన ఐదు వరుసల్లో చిన్నశిఖర రూపాలు ఉన్నాయి. భూమిజరీతి ఆలయాలున్నాయి. కాని ఇవన్నీ శిథిలమై ఉన్నాయి. వీటిలో రెండు జైన ఆలయాలు, మిగిలినవి శివాలయాలు: ఉదయేశ్వర దేవాలయం లాగ ఇవన్నీ ఒకే రీతిలో ఉన్నాయి. ఓన్కార మంధట కూడా నాశనమై ఉన్నది. థర్ జిల్లాలోని జామి యందలి మహాదేవ ఆలయం చిన్నది. సాదాగా యున్న పంచరథరీతి ఆలయం. ఐదు అంతస్తుల శిఖరాన్ని కలిగి ఉంది. దేవాస్ జిల్లాలోని నేమవార్‌నందలి శిద్ధేశ్వరాలయం ఉదయేశ్వర్‌కన్నా పెద్దది. కాని మొరటుగా పతన దశను తెలుపునట్లుగా ఉంది.

**కాలచూరు దేవాలయాలు**

రేవా జిల్లాలోని బైజ్‌నాద్ యందలి వైద్యనాథ దేవాలయం, సాగర్ జిల్లాలోని బినైక యందలి దేవాలయం, షాదోల్ జిల్లాలోని అర్జుల యందలి విష్ణు దేవాలయం, సిధి జిల్లాలోని చంద్రేహి యందలి శివాలయం కాలచూరి దేవాలయాల్లో ముఖ్యమైనవి. బైజనాద్, అర్జుల ఆలయాలు క్రీ.శ. 9వ శతాబ్దానివి. పిల్లగృహాలు. చంద్రెహి క్రీ.శ. 10వ శతాబ్దానిది. దీనికి గుండ్రటి గర్భగృహ గలదు. దీని చుట్టూ 16 పిల్లగృహాలు (offsets) ఉన్నాయి. గర్భగృహమందు మెట్ల గేబుల్‌లపై కప్పు గల (stepped and gabled roof) నడవ (vestibule) దానిముందు వసారా ఉన్నాయి. ఈ దేవాలయం ఎత్తైన వేదికపై ఉంది. ఆలయం చాల వరకు సాదాగా ఉంది. రేరా జిల్లాలోని మసాన్‌యందలి శివాలయం చంద్రేహి దేవాలయం లాగ ఉంది. సత్నాజిల్లాలోని మైహర్ నందలి శివాలయం పంచరథ గర్భగృహను, ఎత్తైన శిఖరాన్ని చిన్న వసారాను కలిగి ఉంది. గర్భగృహ కుడ్యమందు రెండు వరుసల శిల్పాలున్నాయి. వీటిలో అప్సరసలు, వ్యాళలు, జంటలు మొదలైనవి ఉన్నాయి. దమోహ్ జిల్లాయందలి నోహ్‌త ప్రాంతంలో మహదేవ ఆలయముంది. దీనికి గర్భగృహ, పెద్ద స్తంభాల మండపం వసారా ఎత్తైన వేదిక ఉన్నాయి. రేవా దగ్గరలోని గూర్గియందు అద్భుత శిల్పాలను కలిగి ఉన్న తోరణముంది. దీనిపై శివకళ్యాణం శివపార్వతి మొదలైన శిల్పాలున్నాయి. ఇది క్రీ.శ. 10వ శతాబ్దానిది. జబల్‌పూర్ జిల్లాలోని

తివార్, బిల్హారి ప్రాంతాల ఆలయాలు, సత్నాజిల్లాలోని మర్హై యందలి శివాలయం, పన్నా జిల్లాలోని అజైఘర్ యందలి శివాలయం (బతాష) షాదేల్ జిల్లాలోని అమర్‌కంటక్ నందలి ఆలయాలు వీరి కాలానికి చెందినవే. అమర్ కంటక్ ఆలయాలు క్రీ.శ. 11వ శతాబ్దానివి. వీటికి గర్భగృహ, రేఖాశిఖరం, నడవ, స్తంభమండప ఉన్నాయి. ఇచటి కర్ణ దేవాలయం తప్ప మిగిలినవన్నీ పంచరథరీతి ఆలయాలు. కర్ణ దేవాలయం సప్తరథ గర్భగృహను కలిగి ఉన్నది. కాని ఇది మూడు గర్భగృహల ఆలయం. ఈ మూడింటికి ఏకమండపం ఉంది. ఆలయ కుడ్యాలలో మూడు వరసల శిల్పాలున్నాయి. షాదేల్ జిల్లాలోని సోహగ్‌పూర్ నందలి విరాటేశ్వర దేవాలయం ఖజరహో దేవాలయం లాగ ఉన్నది. తక్కువ ఎత్తు గల వేదిక, సప్తరథరీతి గర్భగృహ, దానిపై రేఖా శిఖర, అందు మూడు ఆమల సారకలు ఈ ఆలయంలో కనపడుతున్నాయి. గర్భగృహ ముందు మండప, వసారాలున్నాయి. గర్భగృహ కుడ్యమందు మూడు పట్టీల శిల్పాలున్నాయి. వీటిలో ఎగిరే దేవతలు, అష్టవాసులు, వ్యాళలు, అప్సరసలు ఉన్నారు. శిఖర పక్కల్లో ఉప శిఖరలు రెండున్నాయి. ఈ ఆలయం క్రీ.శ. 1వ శతాబ్దానిది. జబల్‌పూర్ జిల్లాలోని భేరఘట్ యందు చౌసత్ యోగిని దేవాలయం 81 ఉపాలమాలను 64 యోగిని శిల్పాలను కలిగి ఉంది. గర్భగృహలో ఉమామహేశ్వరి శిల్పముంది. రతన్‌పూర్ కాలచూరుల కడపటి ఆలయాలు చాంద జిల్లాలోని మార్కండ, బిలాన్‌పూర్‌జిల్లాలోని పాలి, జాంజ్‌ఘీర్, దృగ్ జిల్లాలోని గండై, దేవేర్‌బిజియ, బస్తర్ జిల్లాలోని నారాయణ్ పాల్ ప్రాంతాల్లో కూడా కాలచూరుల ఆలయాలు ఉన్నాయి.

**కచ్ఛపహపఘటుల దేవాలయాలు**

మధ్యప్రదేశ్ ఉత్తర భాగంలో పరిపాలించిన కచ్ఛపహపఘటుల మూడు రాజతెగల కాలంలో పలు ప్రాంతాల్లో దేవాలయాల నిర్మాణం జరిగింది. వీరి ముఖ్య కేంద్రం గ్వాలియర్. కద్వహ, సుర్వాయ మహూవ, తేరహి, సుహనియ, పఢౌలి మితౌలి, ఖేరట్ ఉపకేంద్రాలు. ఈ ప్రాంతాల దేవాలయాలు తక్కవ ఎత్తుగల అధిష్ఠానం. మధ్యరకం శిఖర, ఐదుపట్టీల ద్వారం పూర్ణఘులు రూపాలు గల పొట్టి స్తంభాలు ఉన్నాయి. వీరి సుర్వాయ దేవాలయం తొలి దశకు చెందిందిగను, సుహానియా లోని కాకన్మఢ్ దేవాలయం మధ్య దశకు చెందినవిగా చెప్పవచ్చు. సువర్య దేవాలయం క్రీ.శ. 10వ శతాబ్దానిది. సుహానియా దేవాలయం క్రీ.శ. 11వ శతాబ్ద ప్రారంభ కాలానిది. కాకన్మఢ్ దేవాలయం ఎత్తైన వేదికపై నిర్మింపబడి ఉంది. దీని చుట్టూ పరివార దేవతా గృహాలున్నాయి. దీనికి గర్భగృహ, ప్రదక్షిణాపథ, ఎత్తైన రేఖా శిఖరం, మండప, వసారా, దానికి ఎదురుగా మెట్ల నిర్మాణం ఉన్నాయి. కద్వహాలో సుమారు 30 దేవాలయాలున్నాయి. ఇవన్నీ పంచరథ ఆలయాలు. గర్భగృహ, నడవ, మండపములను కలిగి ఉన్నాయి. కచ్ఛపహపఘటుల ముఖ్య కేంద్రమైన గ్వాలియర్ యందు జట వైష్ణవాలయం ఉంది. దీనికి గర్భగృహ, నడవ, హాలు, మూడు వసారాలు, రెండు తలాల నడవ, వసారాల శిఖరలు మూడుతలాల హాలు శిఖరలున్నాయి. గర్భగృహ శిఖర అదృశ్యమై ఉంది. హాలుకు 12 పక్క భాగాలు, గుండ్రటి పై కప్పు, 4 లావు స్తంభాలు, 12 కుడ్య స్తంభాలు ఉన్నాయి. ఈ ఆలయం లోపల ప్రతి అంగుళమూ, వెలుపల ప్రతి భాగమూ శిల్పాలతో నిండుకొని ఉంది.

**చందేలుల దేవాలయాలు**

జేజకభుక్తి చందేలులు క్రీ.శ. 10-11 శతాబ్దాల మధ్య కాలంలో మధ్య భారత మధ్య భాగంలో పరిపాలించి మహెూబ, కలింజర్, అజైఘర్, దుద్దై, చాంద్‌పూర్, మదన్‌పూర్, దేవ్‌ఘర్ వంటి ప్రాంతాల్లో ఆలయాల నిర్మాణం చేశారు. కాని ఈ ప్రాంతాల్లో కన్నా ఖజురహో యందలి వీరి ఆలయాలు ప్రసిద్ధి గాంచాయి. ఖజురహో ఛతర్‌పూర్ జిల్లాలో ఉంది. ఇచట అనేక దేవాలయాలు ఉన్నాయి. వీటిలో చౌసత్ యోగిని, బ్రహ్మ, లాల్‌గాన్ మహదేవ, వరాహ, మాతంగేశ్వర దేవాలయాలు తప్ప మిగిలినవన్నీ దాదాపు ఒకే రీతిలో ఉన్నాయి. అలంకరణలు వంటి వాటిలో మాత్రమే కొంత తేడా కనపడుతుంది. ఇచటి ఆలయాల్లో శైవ, వైష్ణవ, జైన ఆలయాలున్నాయి. కానీ వాస్తు, శిల్పరీత్యా ఇవన్నీ దాదాపు ఒకే రీతిలో ఉన్నాయి.

**ఖజురహో ఆలయాల ముఖ్యాంశాలు**

1. ఖజరహో లేక మధ్య భారత ఆలయాలకు గర్భగృహ (బేద లేక దేవుల్) నడవ (అంతరాళ/అర్ధమండప లేక vestibule), మండప (హాలు), వసార (porch) అను నిర్మాణ విభాగాలు. వరసగా ఒక దానిముందు మరొకటిగా నిర్మింపబడి ఉన్నాయి. (2) ఈ విభాగాలన్నీ ఒకదానికన్నా మరొకటి కొంతఎత్తులో (in ascending order) నిర్మింపబడి ఉన్నాయి. గర్భగృహ అన్నిటికన్నా ఎత్తులో ఉన్నది. (3) ఈ విభాగాలన్నీ ఎత్తైన వేదికపై నిర్మింపబడి ఉన్నాయి. దీని పైకి వెళ్ళుటకు అందమైన మెట్ల నిర్మాణం ఉన్నది. (4) వేదికపై మూలలలో పరివార దేవతా గృహాలు గలవు. (5) వేదికపైన గల ఆలయం గర్భగృహ ప్రాంతంలో అధిష్ఠానాన్ని కలిగి ఉన్నది. ఇందు అలంకారయుత పట్టీలు (bands) గలవు. (6) ఇవి సప్తరథ ఆలయాలు. గర్భగృహ భాగంలో అన్ని నిర్మాణ విభాగాలు సప్తాంగ విధానంలో ఉన్నాయి. కుడ్యభాగం (జంఘ) నిలువు, అడ్డాలుగా రూపొందింపబడి శిల్పాలకు అందాన్నిచ్చుచున్నవి. ఉబ్బెత్తులు (projections), లోతు భాగాలు (recesses), పట్టీలు (bands), అందమైన శిల్పాలు కుడ్యాల్లో ఉన్నాయి. (7) కుడ్య భాగంలోని రథ విభాగాలు విమాన భాగంలో 'పాగ'లుగా రూపాన్ని పొంది ఎత్తుగా పొడిగింపబడి ఉన్నాయి. కుడ్యభాగంలో రథ విభాగాలెన్ని ఉన్నవో అన్నే పాగలు విమాన (శిఖర) భాగంలో ఉన్నాయి. రాహపాగలు ఆలమకశిలను దాదాపు తాకుచున్నాయి. శిఖరం చుట్టూ అంగశిఖరాలున్నాయి. కానీ ఇవి పాగలలో భాగంగా రూపొందించలేదు. వీటివలన శిఖర నిలువు రూపం దెబ్బతినుచున్నది. కాని శిఖరానికి అందాన్నిచ్చుచున్నాయి. ఇట్టి విధానం ఒరిస్సా ఆలయాల్లో కనపడదు. (8) శిఖరాలపైన అంగశిఖరాల పైన జంట అమలకలు ఉన్నాయి. (9) ఈ ఆలయాల నడవ (అంతరాళ), మండప, వసారాలపైన స్టెప్డ్ పిరమిడల (stepped pyramidal) శిఖరాలున్నాయి. మండప శిఖరం తక్కువ ఎత్తుగను, అంతరాళ శిఖరం కొంచెం ఎత్తుగను నిర్మింపబడి ఉన్నాయి. (10) ఇచటి ఆలయాల స్తంభాలు బరువైన పై కప్పుకు బలాన్నిస్తున్నాయి. స్తంభాలు, పై కప్పులు మొదలైనవి శిల్పాలతో నిండి ఉన్నాయి. కానీ ఒరిస్సా ఆలయాలు చాలవరకు శిల్ప రహితంగా కనపడతాయి. కొన్నింటిలోనే అధిక శిల్పాలున్నాయి. (11) తొలిదశ ఆలయాలకు ప్రదక్షిణ ఉండేది కాదు. శిఖరంలో అంగశిఖరాలుండేవి కావు. కాని మలి దశలో ఇవి రెండూ ఉండేవి. (12) ఆలయంలోనికి మకరతోరణం ద్వారా వసారాలోకి దాని నుండి మండప, మహామండప నడవ, గర్భగృహల

లోకి వరసగా ప్రవేశించటానికి వీలైనట్లు నిర్మింపబడి ఉన్నాయి. ఇచటి ఆలయాల లోపల ద్వారాలు స్తంభాలు, పై కప్పులు పుష్పాలు, అప్సరసలు, సాలభంజికలు మొదలగు వాటితో నిండి ఉన్నాయి.

నిర్మాణ తేడాని బట్టి ఖజురహో ఆలయాలను రెండు విభాగాలుగా అధ్యయనం చేయవచ్చు. చౌసత్ యోగిని, లాల్‌గుయాన్, బ్రహ్మ, మాతంగేశ్వర, వరాహ దేవాలయాలు తొలిదశకు చెందినవిగను, మిగిలిన వన్నీ మలిదశవిగను చెప్పవచ్చును. చౌసత్ యోగిని తప్ప మిగిలిన తొలి దేవాలయాన్ని చతురస్రాకార గర్భగృహ మెట్లతోకూడిన పిరమిడ్ ఆకారంగల (stepped pyramidal) శిఖర, నడవ, వసారాలు ఉన్నాయి. ఇవన్నీ కాకిరాయి (granite), ఇసుకరాయి (sand stone), లతో నిర్మింపబడ్డాయి. చౌసత్ యోగిని మాత్రం పూర్తిగా కాకిరాయి నిర్మాణం. దీనికి గర్భగృహ, పరివార దేవతా గృహాలు, రెండు వరుసల కుడ్యభాగం, ఎత్తైన వేదిక, మొరటు రూపం ఉన్నాయి. మలిదే ఎయాలన్నీ ఇసుకరాతి (sand stone) నిర్మాణాలు. పరిణితి రూపాన్ని కలిగి ఉన్నాయి. అద్భుతమైన ఖజురహో ఆలయాల్లో లక్ష్మణ, పార్శ్వనాథ, విశ్వనాథ, జగదాంబిభిక, చిత్రగుప్త, ఖందర్యమహదేవ ముఖ్యమైనవి. వాస్తు శిల్పం ఖందర్యమహదేవ ఆలయంలో తారాస్థాయికి చేరుకుంది. వామన, ఆదినాథ, జవరి, చతుర్భుజ దులదేవాలయాలు ఖందర్యను అనుసరించిన రీతిలో ఉన్నాయి. ఇవన్నీ ఇసుకరాతి నిర్మాణాలు. వీటిలో లక్ష్మణ, పార్శ్వనాథ, విశ్వనాథ ఖందర్యమహదేవ ఆలయాలు ముఖ్యమైనవి. అద్భుతమైనవి, పెద్దవి, పరిణతి రీతివి. వీటిలో లక్ష్మణ తొలిది. ఇది పంచరథ ఆలయం. గర్భగృహ, మండప, మకరతోరణ, పరివార దేవతా గృహాలను కలిగి ఉన్నది. చందేల రాజు యశోవర్మ క్రీ.శ. 950 ప్రాంతంలో ఈ వైష్ణవ ఆలయాన్ని నిర్మించాడు. యుద్ధ ఘట్టాలు, స్త్రీల శిల్పాలు మొదలైన శిల్పాలు ఇందు ఉన్నాయి. పార్శ్వనాథ ఆలయం లక్ష్మణ ఆలయాన్ని పోలి ఉంది. క్రీ.శ. సుమారు 950-70 ప్రాంతంలో దంగరాజుచే నిర్మింపబడింది. ఇది ఆకారగర్భగృహను, వసారాను, ప్రక్కలలో పాగలను, వెనుక చిన్న దేవగృహాన్ని కలిగి ఉంది. విశ్వనాథ ఆలయం పార్శ్వనాథ ఖందర్య మహాదేవ ఆలయాలు మధ్య తరహా రీతిలో ఉంది. దీనికి కూడా అధిష్టాన పట్టీలు ఉన్నాయి. ఖందర్య శిల్పాల వంటివే ఇచట ఉన్నాయి. శిఖరాలు కూడా రెండు ఒకే రీతివి. ఖందర్య మహాదేవ దేవాలయం ఖజురహో యందలి ఆలయాలలో పెద్దది, అద్భుతమైంది. ఇది 30.48 మీటర్ల పొడవు, ఎత్తులను, 20.12 మీటర్ల వెడల్పును కలిగి ఉంది. ఇది విశ్వనాథ ఆలయాన్ని పోలి ఉన్నది. కానీ అద్భుత వాస్తు, శిల్పాలతో నిండి ఉన్నది. మధ్య భారత రీతి ఆలయాల్లో పరిణతి రీతికి చెందింది. ఇది ఎత్తైన వేదికపై నిర్మింపబడి ఉంది. దీనికి పట్టీలు ఉన్నాయి. వీటిపై అశ్వాలు, యుద్ధవీరులు, వేటగాళ్ళు, సంగీతవిద్వాంసులు, నాట్యగత్తెలు, భక్తులు, ప్రేమజంటలు మొదలగు శిల్పాలు ఉన్నాయి. ఆలయ కుడ్యంపై దేవదేవీలు, జంటలు, వ్యాళ, నాగిని శిల్పాలు ఉన్నాయి. గర్భగృహ పై గల శిఖరం చుట్టూ 85 ఉపశిఖరాలున్నాయి. ఇది గర్భగృహ ముందు అంతరాళ, మండప, వసారాలను కలిగి ఉంది. వీటిపై సమంగలమెట్ల (horizontal stepped) శిఖరం కలిగి ఉంది. గర్భగృహ అంతరాళల చుట్టూ ప్రదక్షిణ ఉంది.

# 25

# రాజస్థాన్ దేవాలయాలు

రాజస్థాన్‌లోని ఝలవార్ జిల్లాయందలి ఝ్రాలపటణ్ దగ్గరలో ఉన్న చంద్రభాగ ప్రాంతమందలి శీతలేశ్వర దేవాలయం రాజస్థాన్ దేవాలయాల్లో మొట్టమొదటిది. ఇది క్రీ.శ. 689లో నిర్మింపబడింది. ప్రస్తుతం దీని గర్భగృహ, అంతరాళ (నడవ)లు మాత్రమే నిలచి ఉన్నాయి. దీని నిర్మాణం తరవాత 100 సంవత్సరాలకు అంతరాళ ముందుగా కట్టబడిన మండప కూడ ఉన్నది. ఈ ఆలయ పాగల (offsets)పై దేవకోష్టలున్నాయి. కుడ్యం శిల్పరహితంగా, కుడ్య స్తంభాలను కలిగి ఉన్నది. కుడ్యస్తంభాలపై పూర్ణఘట, కీర్తిముఖ పద్మాలున్నాయి. గర్భగృహ ద్వారంపై అలంకార పట్టీలు, గంగాయమున గుప్త రీతి శిల్పాలు ఉన్నాయి. అంతరాళ ఆయతాస్ర ఆకారంలో ఉంది.

శీతలేశ్వర ఆలయం రీతిలోనే కోట జిల్లాలోని కన్సువ ప్రాంతమందలి శివదేవాలయముంది. ఇది క్రీ.శ. 738లో నిర్మింపబడినట్లు తెలుస్తున్నది. జైపూర్ జిల్లాలోని అబనేరి యందు హర్షత్‌మర దేవాలయం ఉంది. ఇది శిథిలమై ఉంది. శిఖరంలేని గర్భగృహ, అతి కొద్ది శిథిల ప్రదక్షిణ మండప, వసారాలు నేడు నిలచి ఉన్నాయి. ఇవన్నీ మెట్లుగల వేదికపై నిర్మింపబడి ఉన్నాయి. గర్భగృహ పంచరథరీతిలో ఉంది. ఈ ఆలయ దేవకోష్టలలో వాసుదేవ విష్ణు, ప్రద్యుమ్న బలరామ సంకర్షణలు దక్షిణ, పశ్చిమ ఉత్తరాల్లో ఉన్నాయి. ఇది ఈ ఆలయం తొలుత వైష్ణవాలయమని తెలుపుతున్నది. ఈ ఆలయ గర్భగృహలో నేడు చతుర్భుజ హరశిద్ధి లేక హర్షత్‌మర శిల్పముంది. నృత్య, సంగీత, వనక్రీడలు, దేవదేవీలు శిల్పాలు కూడ ఆలయ కుడ్యాల్లో ఉన్నాయి.

జోద్‌పూర్ జిల్లాలోని ఒసియన్ యందు గల ఆలయాల సమూహం లో తొలిదశకు చెందిన 12 ఆలయాలు మలిదశకు చెందిన 6 ఆలయాలు ఉన్నాయి. ఒసియన్ తొలి ఆలయాలు ఎత్తైన వేదికపై నిర్మింపబడి ఉన్నాయి. వేదికకు అనేక విభాగాలు (moulding) ఉన్నాయి. వీటిపై పుష్పాలు, ఆకులు, తీగలు ఉన్నాయి. వేదిక యందలి దేవకోష్టలలో గణేశ, కుబేర, దేవదేవీలు ఉన్నారు. ఇచటి ఆలయాలు దాదాపు అన్నీ పంచాయతన రీతిలో ఉన్నాయి. వీటి 5 పాగలపై దేవకోష్ట ఉన్నాయి. ఆలయాలపై నరసింహ, త్రివిక్రమ, వరాహ, విష్ణు, హరిహర, గణేశ, సూర్య, చంద్ర, రేవంత, బ్రహ్మ, పార్వతి శిల్పాలు ఉన్నాయి. రెవ దేవాలయం, వాయవ్య దేవాలయాల్లో రుషులు, అప్సరసలు ఉన్నారు. ఒకటి నుంచి నాల్గవ ఆలయంపై కృష్ణలీలలు శిల్పాలు ఉన్నాయి. శిఖరాల భాగంలో చైత్యాలున్నాయి. శిఖరం పంచరథ రీతిలో ఉంది. ఐదు నుంచి ఏడు తలాలు ఉన్నాయి. మధ్యపాగ ఆమలకవరకు ఉంది. పైన కుండాకార

కపురి ఉంది. ఇచటి తొలి ఆలయాలకు ప్రదక్షిణాపథ ఉండేది కాదు. గర్భగృహ, అంతరాళ (మండప) వసారాలు ఉండేవి. మండప నవరంగ రీతిలో ఉండేది. గర్భగృహ ద్వారానికి 4 లేక 5 పట్టీలుండేవి. వీటిలో ఒక దానిపై నాగ శిల్పాలున్నాయి. వీటితో కలుగరుడుని చేతిలో ఉన్నాయి. అంతరాళకు వసారా ఉంది. దీనిలో 2 స్తంభాలు, 2 కుడ్యస్తంభాలు ఉన్నాయి. వీటిపై అప్సరసలు, వాసుదేవ - విష్ణు, బలరామ - సంకర్షణ శిల్పాలున్నాయి. అర్ధమండప, మండపాల స్తంభాలపై పలు శిల్పాలున్నాయి. వీటి పై కప్పు కూడా శిల్పాలంకృతమై ఉన్నాయి. వీటిలో విద్యాధరులు ఒకటి.

ఒసియన్ తొలి ఆలయాల్లో మూడు హరిహర దేవాలయం, మహావీరజైన దేవాలయం ముఖ్యమైనవి, నూతన రీతిలో ఉన్నాయి. ఒసియన్ ఆలయాల్లో హరిహర ఆలయం ప్రత్యేక రీతిలో ఉంది. దీని హాలు పై కప్పు విల్లువంపు ఆకారంలో ఉన్నది. దీని వేదిక శిల్ప రహితంగా ఉంది. గర్భగృహ దీర్ఘచతురస్రాకారంలో ఉన్నది. దీనిపై గూడు బండి ఆకార పై కప్పు ఉంది.

మహావీర ఆలయానికి గర్భగృహ, పదక్షిణ, అంతరాళ, ప్రక్కలు మూసియున్న హాలు, ప్రక్కలు లేని హాలు, వసారాలు ఉన్నాయి. ఇది ప్రతిహారవత్సరాజుచే (క్రీ.శ. 783-92) నిర్మింపబడింది. క్రీ.శ. 1016లో దీని ముందు తోరణం నిర్మింపబడింది. ఈ ఆలయ శిఖరంలో మూడు వరుసల ఉప శిఖరాలున్నాయి. ఈ ఆలయంలోని పరివార దేవతా గృహాలు క్రీ.శ. 10-11 శతాబ్దాల ఒసియన్ మలిదశ కాలానివి. వీటికి పంచరథ గర్భగృహ, అంతరాళ, మండప, వసారా ఉన్నాయి. ఇవి పరిణితి దశకు చెందాయి. వీటి శిఖరాలపై చైత్యాలు, జంట ఆమలకలు ఉన్నవి. మండప పైకప్పు విల్లు ఆకారంలో ఉన్నాయి.

క్రీ.శ. 1178లో నిర్మింపబడిన సచియమత దేవాలయానికి గర్భగృహ, ప్రదక్షిణ, పెద్ద మండపం, 8 తోరణాల, అలంకారయుత పై కప్పులు ఎత్తైన శిఖరం, రెండు వరసల ఉప శిఖరాలు, 16 (బ్రాకెట్ శిల్పాలు) ఉన్నాయి.

చితోర్‌ఘర్ యందు కలికమత దేవాలయం ఉంది. ఇది తొలుత సూర్య దేవాలయం. దీనికి పంచరథ గర్భగృహ, అంతరాళ, మండప, వసారా ఉన్నాయి. వీటన్నింటికీ పై కప్పు (నిర్మాణ కాలానిది) లేదు. ఈ ఆలయ పై పలు విభాగాలున్నాయి. కుడ్యం శిల్ప రహితంగా ఉంది. దేవ కోష్ఠల్లో మాత్రం సూర్య, చంద్ర, అశ్వినీ దేవతలు, కుడ్యస్తంభాలు ఉన్నాయి. కుడ్య స్తంభాలు, హాలు స్తంభాలు అలంకారాలతో నిండి ఉన్నాయి. ఈ ఆలయ శిల్పాల్లో గుప్త శిల్పరీతి ప్రభావం కనవడుతుంది. కలిక దేవాలయం వంటిదే మరో దేవాలయం చితోర్‌ఘర్‌లో ఉంది. దీన్నే కుంభశ్యామదేవాలయం అంటారు. ఈ ఆలయాలు రెండు క్రీ.శ. 8వ శతాబ్దానివి.

జోద్‌పూర్ జిల్లాలోని బుచ్‌కళ యందు శివ విష్ణువుల జంట ఆలయం ఉంది. ఇది క్రీ.శ. 815లో నిర్మింపబడింది. మార్వార్‌లోని పాలి జిల్లా యందలి ఆవ ప్రాంతమందు కామేశ్వర

దేవాలయం ఉన్నది. ఇది క్రీ.శ. 9వ శతాబ్దమధ్య కాలానిది. శిరోహి జిల్లాలోని వర్మన్ వద్ద సూర్య దేవాలయం ఉంది. ఇది క్రీ.శ. 9వ శతాబ్దం ఆఖరులో నిర్మింపబడింది. ఇది చాలవరకు శిధిలమై ఉంది. దీనికి గర్భగృహ, అంతరాళ, ప్రదక్షిణ, మండప, వసారా ఉన్నాయి. గర్భగృహ ద్వార ఛత్రాలపై ఐదు అలంకారయుత పట్టీలున్నాయి. ద్వారం పైన గల లింటెల్ భాగాన సూర్యుడున్నాడు. లోపలి స్తంభాల కింది భాగం శిల్పరహితంగాను, పై విభాగం కీర్తి ముఖాలు, మకర శిరస్సులు, పుష్పాలతో నిండి ఉన్నారు. పై కప్పు భాగాలు శిల్పాలతో నిండి ఉన్నాయి. వీటిలో సంగీత, నృత్యకారులు, పుష్పాలు ఉన్నాయి.

ఉదయపూర్ జిల్లాలోని బదేలి ప్రాంతంలో ఘటేశ్వర దేవాలయముంది. ఇది క్రీ.శ. 9వ శతాబ్దం ఆఖరులో నిర్మింపబడింది. దీనికి గుండ్రటి పై కప్పు పంచరథ శిఖర గల గర్భగృహ మెట్లరూపం కూదురూపాలు(stepped and gabled) పై కప్పు గల అంతరాళ, పిరమిడ్ ఆకారపై కప్పుగల మండప, ఆలయాన్ని విడిపోయి ఉన్న గంటాకార పై కప్పుగల మండప ఉన్నాయి. దీన్ని ఎత్తైన వేదికలో (podicem) సాదా విభాగాలున్నాయి. కుడ్యమందు 5 పాగలున్నాయి. వీటిపై గల దేవకోష్టల్లో అంధకాంతక, నటేశ, చాముండి వంటి శిల్పాలున్నాయి. రేఖాశిఖరపై రెండు ఆమలకలు, కుండాకార కపురి (ఛత్ర) ఉన్నాయి. గర్భగృహ ద్వారంపై 5 పట్టీలు నటేశ వంటి శిల్పాలు ఉన్నాయి. మండపమందు మకరతోరణం ఉన్నది. దీని స్తంభాలపై అప్సరసలు, ఆమలకలు, తామరలు మొదలైన శిల్పాలున్నాయి. ఇది ఖజురహో లక్ష్మణ దేవాలయానికి మార్గదర్శకమైందని చెప్పవచ్చు.

ఉదయపూర్ జిల్లాలోని జగత్ ప్రాంతాన అంబిక మఠదేవాలయముంది. ఇది పరిణితి దశకు చెందింది. క్రీ.శ. 925 లేక 961 ప్రాంతాన నిర్మింపబడినట్లు తెలియుచున్నది. దీనికి పంచరథ శిఖరం, 17 ఉపశిఖరాలు గల గర్భగృహ మెట్లరూపం కూదురూపాలు (stepped and gabled) పై కప్పు గల అంతరాళ, పిరమిడ్ ఆకార శిఖర గల మండప వసారా ఉన్నాయి. ఆలయం చుట్టూ ఏనుగు పట్టీ ఉంది. ఈ దేవాలయ కుడ్యం అలంకారయుతంగా ఉన్నది. దేవీలు, అప్సరసలు, వ్యాళలు, గజాలను అధిష్ఠించిన అప్సరసలు, మొదలైన శిల్పాలు ఉన్నాయి. ఆలయ శిఖరంపై జంట ఆమలకలు, కుండాకార ఛత్ర ఉన్నాయి. గర్భగృహ ద్వారంపై 5 పట్టీలున్నాయి. మండప పై కప్పు శిల్పాలతో నిండి ఉంది.

ఉదయపూర్ ప్రాంతంలో హాల్దిఘాట్ దగ్గరలో ఉన్న ఉన్వాన్ ప్రాంతంలో దుర్గ దేవాలయం ఉంది. ఇది క్రీ.శ. 959 నాటిది. పాలి జిల్లాలో ఘనెరావ్ దగ్గరలో మహావీర దేవాలయం ఉంది. నాగూర్ జిల్లాలో కేకింద్ ప్రాంతాన నీలకంఠేశ్వర దేవాలయం, ఉదయపూర్ జిల్లాలో ఏకలింగజి ప్రాంతాన లకులీశ దేవాలయం నాగ్దలో సాన్‌బహు అనే జంట వైష్ణవాలయాలు ఉన్నాయి. సాన్‌బహు ఆలయానికి పంచరథ గర్భగృహ, అంతరాళ మండప, వసారాలు మకరతోరణాలు ఉన్నాయి. దీని చుట్టూ 10 పరివార దేవతా గృహాలు ఉన్నాయి. ముఖ్య దేవాలయానికి ఉన్న విభాగాలన్నీ వీటికి కూడా ఉన్నాయి. ఈ ఆలయ కుడ్యాలు, స్తంభాలు, పై కప్పుల పై దేవదేవీలు, అప్సరసలు, రామాయణ శిల్పాలు మొదలైనవి ఉన్నాయి.

ఉదయపూర్ దగ్గరలోని అహర్ నందు మీర, మహావీర దేవాలయాలు బర్మేర్ జిల్లాలోని కిరడు ప్రాంతంలో సోమేశ్వర మొదలైన ఆలయాల సమూహాలున్నాయి.

క్రీ.శ. 12వ శతాబ్దం నుంచి రాజస్థాన్ దేవాలయాల రీతి క్రమంగా తన రూపాన్ని చాల వరకు కోల్పోయి గుజరాత్ సోలంకుల రీతిలో కలసి పోయాయి. ఈ పరిణామం క్రీ.శ. 10వ శతాబ్దంలోనే ప్రారంభమైంది. ఈ శతాబ్దానికే అబు ప్రాంతం సోలంకుల ఆధీనంలోనికి వచ్చాయి క్రీ.శ. 12 వ శతాబ్దానికి మార్వార్, మేవార్ మొదలైన రాజస్థాన్ ప్రాంతాలు కూడా వీరి ఆధీనమైనవి. విమలవాసహిదేవాలయం (ఆదినాథ దేవాలయం) పూర్తి సోలంకి రీతిలోఉన్నది. చంద్రవతి కుంభరియజి దేవాలయాలు సోలంకి రీతికి దగ్గరగా ఉన్నాయి. చితోర్, ఏకలింగజి, జాలర్, రాణక్‌పూర్ దేవాలయాలు కూడా సోలంకి రీతిలోని రాజస్థాన్ దేవాలయాలుగా చెప్పవచ్చు.

బనస్కాంత జిల్లాలోని కుంభరియజి యందు జైన దేవాలయాల సమూహం ఉంది. ఇవి క్రీ.శ. 11వ శతాబ్దం నుంచి నిర్మింపబడ్డాయి. ఇవి దిల్వారా, మౌంట్ అబు దేవాలయాలకు మార్గదర్శకమైనవి. ఇవి పాలరాతి నిర్మాణాలు. ప్రతి ఆలయానికి పంచరథ గర్భగృహ, అంతరాళ మండప, స్తంభవసారా, స్తంభాల వసారా ఉన్నాయి. స్తంభాల వసారాల పక్కలలో పరివార దేవతా గృహాలున్నాయి. ఆలయ ప్రాంగణం పాగల్లో దేవకోష్టలు, వాటిలో దేవతా ప్రతిమలు ఉన్నాయి. శిఖర భాగంలో ఉప శిఖరాలున్నాయి. శిఖరపై జంట ఆమలక ఉంది. మండప పై కప్పు గుండ్రంగా ఉంది. ఈ ఆలయ స్తంభాలు రాజస్థాన్ సాంప్రదాయాన్ని గలిగి ఉన్నప్పటికీ సోలంకి రీతిలో నిర్మాణాన్ని కలిగి ఉన్నాయి.

రాజస్థాన్, సోలంకి రీతుల వాస్తు శిల్పకళ మౌంట్‌అబు యందలి దిల్వారా జైన ఆలయాల సమూహంలో తార స్థాయికి చేరుకొన్నాయి. వీటిలో విమలవాసహి, లూనవాసహి ఆలయాలు ముఖ్యమైనవి. విమలవాసహి క్రీ.శ. 1031లో విమలునిచే నిర్మింపబడింది. లూనవాసహి క్రీ.శ. 1230 లో గుజరాత్ వాఘేల రాజుల మంత్రులైన వాస్తుపాల, తేజపాల అను సోదరులచే నిర్మింపబడింది. ఈ రెండు ఆలయాలకు గర్భగృహ, అంతరాళ, స్తంభవసారా (portico), పెద్ద సభామండపాలు ఉన్నాయి. వీటి చుట్టూ పరివార దేవతా గృహాలు గల స్తంభాల వసారా (corridor) ఉంది. ఈ రెండు ఆలయాలకు గర్భగృహ, అంతరాళ, స్తంభవసారా ఉంది.

విమల వాసహి ఆలయాన్నే ఆదినాథ ఆలయ మంటారు. దీనిలోని స్తంభాలు పై కప్పు కుడ్యాలపై పలు రకాల శిల్పాలున్నాయి. వీటిలో వృధ్వీపాల, విమల శిల్పాలున్నాయి. ఇవి క్రీ.శ. 1150 ప్రాంతంలో నిర్మింపబడ్డ సభామండపంలో ఉన్నాయి. తోరణ ద్వారాలు, విద్యాదేవీలు, దేవదేవీలు, నృత్యసంగీతకారులు, అశ్వారూఢులు మొదలగు శిల్పాలు ఉన్నాయి.

లూనావాసహి దేవాలయమంతా కూడా అద్భుత శిల్పాలతో అలంకరణలతో నిండి ఉంది.

సోలంకి రీతి రాజస్థాన్‌లో క్రీ.శ. 15వ శతాబ్ద కాలం వరకు కొనసాగిందని చెప్పవచ్చు. రాణాకుంభ (క్రీ.శ. 1440-1448) చితోర్‌ఘర్ యందు నాటించిన 9 అంతస్తుల కీర్తి స్తంభం, పాలి జిల్లాలోని రాణక్‌పూర్ నందలి చౌముఖ జైన దేవాలయం: ఈ విషయాన్ని ధృవీకరింస్తున్నాయి.

# 26
# గుజరాత్ దేవాలయాలు

గుజరాత్ దేవాలయాలను అధ్యయనం కొరకు రెండు విభాగాలుగా చేయవచ్చు. అవి 1) సోలంకులకు పూర్వముండిన దేవాలయాలు, (2) సోలంకుల కాలపు దేవాలయాలు.

## సోలంకుల పూర్వ దేవాలయాలు

గుజరాత్ లేక పశ్చిమ భారత దేశంలో నేటికీ నిలచి ఉన్న దేవాలయాల్లో సౌరాష్ట్రలోనిజామ్ నగర్ జిల్లాలోని గోప్ దేవాలయం మొట్టమొదటిది. ఇది క్రీ.శ. సుమారు 6వ శతాబ్దానికి చెందినది. ఇది కొంత శిథిలమై ఉంది. ఈ ఆలయం డాబా (terraced) లాగ కనపడుతుంది. డాబా కింది భాగం ఉబ్బెత్తులు (projections) లోతుభాగాల (recesses) తో కూడిన వేదిక (platform) లాగ ఉన్నది. మధ్యభాగం అధిష్టానంగా అలంకారాలతో ఉన్నవి. పై విభాగం ప్రదక్షిణా రహిత సాదా గర్భగృహ లాగ ఉన్నది. వేదిక భాగంలో అనేక విభాగాలు ప్రతిమలు గల దేవకోష్టలున్నాయి. అధిష్టానం కూడ శిల్పాలు, దేవకోష్టలు, ఉబ్బెత్తులతో ఉంది. గర్భగృహకు ఎత్తైన సాదా కుడ్యం, దానిపైన పిరమిడ్ ఆకార శిఖరం ఉన్నది. దీని ముఖభాగంలో చైత్యలు ఉన్నాయి. వీటిలో ద్విహస్త ఆశీన గణేశ, పార్వతులు ఉన్నారు. గోప్ ఆలయ రీతిలో సుమారు 50 ఆలయాలు సౌరాష్ట్రలో ఉన్నాయి. ఇవి క్రీ.శ. 6వ శతాబ్దం నుంచి కాల క్రమంలో నిర్మింపబడ్డాయి. గోప్ ఆలయ రీతిలో ఉన్న వాటిలో మూడు స్టెప్పుల శిఖరం గల హర్షత్‌మత ఆలయం (మియాని ప్రాంతం– జునాఘడ్ జిల్లా), భనసార దేవాలయం (జునాఘడ్ జిల్లా), నాలుగు స్టెప్పులు శిఖరం గల విసవాద, ఖిమేశ్వర (జునాఘడ్ జిల్లా), కల్సార్ (భావ్‌నగర్ జిల్లా) ఐదు స్టెప్పుల శిఖరం గల జాంనగర్ జిల్లాలోని పిందర, నవిద్రెవాడ్ దేవాలయాలు, ఆరు స్టెప్పుల శిఖరం గల జునాఘడ్ జిల్లాలోని బిలేశ్వర్ దేవాలయం ముఖ్యమైనవి. వీటిలో నవిద్రెవాడ్, బిలేశ్వర దేవాలయాలకు అమల సాలక, కుండాకార ఛత్ర ఉన్నాయి. క్రీ.శ. 7వ శతాబ్దానికి చెందిన వరాహి దేవాలయం ప్రభాన్‌పటన్ దగ్గరలోని కద్వార్‌లో ఉంది. దీనికి గర్భగృహ, ప్రదక్షిణ, అంతరాళ, వసారా ఉన్నాయి. గోప్ ఆలయ శిఖరం వంటిదే దీనికి ఉంది. ప్రభాన్ పటన్ దగ్గరలోని సుత్రపాద యందలి సూర్యదేవాలయం ఉత్తర భారత రీతి శిఖరం ఉంది. ఇది క్రీ.శ. 8వ శతాబ్ద మధ్య కాలానిది. సబర్ కాంత జిల్లాలోని రోడ ప్రాంతంలో క్రీ.శ. 8వ శతాబ్దానికి చెందిన దేవాలయాల సమూహం ఉన్నది. ఇవన్నీ నరేశర్ వంటి తొలి ప్రతిహార దేవాలయాలను పోలి ఉన్నాయి. వీటి త్రిరథ లేక పంచరథ గర్భగృహ, వసారా,

కొన్నింటిలో మండప ఉన్నాయి. ప్రభాన్‌పటాన్ దగ్గరలోని భీమనాథ వద్ద గల సూర్య దేవాలయం చితోర్‌ఘర్‌లోని కలికమత దేవాలయం లాగ ఉంది. ఇది క్రీ.శ. 9వ శతాబ్ద తొలి కాలానికి చెందింది. క్రీ.శ. 9వ శతాబ్ద అఖరు కాలానికి చెందిన జామ్‌నగ్ దగ్గరలోని భిమ్రాన్ దేవాలయం, కచ్‌లోని మంజల్ దగ్గరి రాణిరాజై వద్దగల శివాలయం, క్రీ.శ. 10వ శతాబ్ద ప్రారంభ కాలానికి చెందిన సురేంద్ర నగర్ జిల్లాలోని ఘుమ్లి ప్రాంతపు గణేశ దేవాలయం సోలంకుల పూర్వ దేవాలయాలు సురేంద్ర నగర్ జిల్లాలోని థాన్ దగ్గరలో త్రినేత్రేశ్వర దేవాలయం, కేరకోట్‌లోని శివాలయం, కచ్‌లోని కోట్టై యందలి సూర్యదేవాలయం క్రీ.శ. 950 ప్రాంతానివి. త్రినేత్రేశ్వర కోట్టై అలయాలకు 21 ఉపశిఖరాలు, అందమైన కుడ్యాలు ఉన్నాయి. ఇవి అంబికమత ఆలయాన్ని కొంత పోలి ఉన్నాయి. కేరకోట్ ఆలయం గ్యారస్‌పూర్ మహదేవ ఆలయాన్ని పోలి ఉన్నది. దీనికి 9 ఉపశిఖరాలున్నాయి. క్రీ.శ. 975 ప్రాంతపు ముని భవదేవాలయం థాన్‌లో ఉన్నది. ఇది ప్రభాన్ పటాన్ లోని సోమనాద్ సమకాలీనమైన ఆలయం.

## సోలంకి రీతి ఆలయాలు

### ముఖ్యాంశాలు

సోలంకుల దేవాలయాలు ఉత్తర భారతదేశ దేవాలయాల రీతినే ఉన్నప్పటికీ రాజస్థాన్ ఆలయాల రీతికి దగ్గరగా ఉన్నాయి. వీరి ఆలయాలకు గర్భగృహ, అంతరాళల, వసారలు ఉన్నాయి. పెద్ద ఆలయాల్లో ఆలయాన్ని విడిపోయి ఉన్న సంభరహిత (peristylar) హాలు ఉంది. దీని ముందు తోరణ ద్వార ప్రవేశం ఉంది. వీరి హాలు కొన్ని ఆలయాల్లో అనేక అంతస్తులను కలిగి ఉన్నది. అందమైన స్తంభాలు, విల్లు ఆకారపు పై కప్పు, తోరణాలు, ప్రక్కలో మార్గాలు ఈ హాలులకు ఉన్నాయి. ఈ అద్భుత శిల్ప సంపద వీరి ఆలయాల్లో కనపడతాయి. వీరి ఆలయాలు కింది నుంచి పైకి అదిష్టానం (socle, podium), కుడ్యం, కపోత, శిఖర భాగాలను కలిగి ఉన్నాయి.

## ఆలయాలు

పటాన్‌కు 18 మైళ్ల దగ్గరలో ఉన్న మోహ్‌సాన జిల్లాలోని మొధెర యందలి సూర్య దేవాలయం సోలంకుల దేవాలయాల్లో మొదటిది. పటాన్ ప్రాంతం గుజరాత్ సోలంకుల పాత రాజధాని. ఇది శిధిలమై ఉన్నప్పటికి సోలంకుల దేవాలయాల్లో అద్భుత కళాఖండంగా చెప్పదగింది. ఇది ఎత్తైన వేదికపై నిర్మింపబడి ఉంది. ఇది గర్భగృహ, ప్రదక్షిణా పథ, అంతరాళ, పక్కప్రవేశాలు గల మండప, వసార అనే విభాగాలు ఉన్నాయి. అంతేగాక ఆలయాన్ని విడిపోయినట్లుగా ఒక సభామండపాన్ని కలిగి ఉంది. తోరణ ప్రవేశాన్ని కలిగి ఉంది. అంతేగాక అనేక పరివార దేవతా గృహాలను కలిగి ఉన్న ఒక పెద్ద పుష్కరిణి ఉంది. మండప స్తంభాలు అలంకారాలతో ఎత్తుగా ఉన్నాయి. వీటికి తోరణాలు ఉన్నాయి. దీని ముందే పెద్ద తోరణం ఉంది. ఈ ఆలయం క్రీ.శ. 1026 ప్రాంతంలో నిర్మింపబడింది. ఈ ఆలయ పోలికలోనే ప్రభాన్ పటాన్ వద్ద రుద్రేశ్వర (కేదారేశ్వర) దేవాలయం ఉంది. గోరడ్‌లో సోమేశ్వరాలయం, సందేర్ లో శివాలయం, ధినేజ్‌లో మాత ఆలయం, దేల్‌మల్ లో లింబోజిమత ఆలయం, మాద్రొపూర్‌లో దుర్గేశ్వర మహా దేవ ఆలయం,

పవాఘుర్‌లో లకులీశ దేవాలయం ఉన్నాయి. ఇవన్నీ క్రీ.శ. 11వ శతాబ్దానివి. లకులీశ ఆలయం మాళవ ప్రాంతీయ రీతి ప్రభావం ఉంది.

సోలంకి రాజులు శిద్ధరాజ జయసింహ (క్రీ.శ. 1094-1143) కుమారపాల (క్రీ.శ. 1143-72) అను వారి కాలంలో వాస్తు కళా పోషణ ఎక్కువగా సాగింది. క్రీ.శ. 12వ శతాబ్దపు తొలి ఆలయాల్లో మెహసాన జిల్లాలోని వలం ప్రాంతమందలి శ్రీకృష్ణ దేవాలయం, సురేంద్ర నగర్ జిల్లాలోని సేజక్‌పూర్ నందలి నవలఖ దేవాలయం, మెహసాన్ జిల్లోని శిద్ధాపూర్ నందలి రుద్రమాల దేవాలయం, అహమదాబాద్ జిల్లాలోని వీరంగం ప్రాంతమందలి జంటగర్భగృహాల దేవాలయం ముఖ్యమైనవి. సేజక్‌పూర్ ఆలయం లోపల, వెలుపల అద్భుత శిల్పాలతో నిండి ఉంది. రుద్రమాల దేవాలయాన్ని శిద్ధరాజ జయసింహుడు నిర్మించినట్లు తెలుస్తున్నది. ఇది సరస్వతీ నది ఒడ్డున ఉంది. ఇది అనేక అంతస్తులను కలిగిన ఆలయం. ఈ ఆలయంలో 11 పరివార దేవతా గృహాలు ఉన్నాయి. వీటిలో 11 మంది రుద్రులు ఉన్నారు. ఒక తోరణం, రెండు వసారాలు, ఒక అంతరాళలు ఉన్నాయి. ఈ రుద్ర దేవాలయం భారతదేశ మత నిర్మాణాల్లో పెద్దది, అద్భుతమైంది. ఇది క్రీ.శ. 12వ శతాబ్ద మధ్య కాలానిది.

గర్భగృహ, మండప, వసార విభాగాలను కలిగి ఉన్న అనేక చిన్న దేవాలయాలు కూడా ఉన్నాయి. హింగ్లోజిమత (ఖందోరన్ ప్రాంతం) శివ లేక జన్‌మాల్‌నాద్ (అశోడ) మాత (కనేద), చంద్రమౌళి (కాంబోజి), శీతల మాత (పీల్యుద్ర) శివ (రుహావి), లింబోజి మత (దేల్‌మాల్), కేసర, వాద్‌నగర్, రుద్రమాల దేవాలయాలు ఈ రీతికి చెందినట్టివి.

క్రీ.శ. 10వ శతాబ్దంలో ప్రభాన్ పటాన్ ప్రాంతంలో ప్రసిద్ధి గాంచిన సోమనాథ దేవాలయం నిర్మింపబడింది. దీన్ని కుమారపాలుడు నిర్మించాడు. కాని ఇది పలుమార్లు నాశనం కాబడుట, పునరుద్ధరింపబడటం జరిగింది. గజనీమహమ్మద్ దీన్ని క్రీ.శ. 1025లో ధ్వంసం చేయగా ఒకటో భీమరాజు పునర్నిర్మాణం గావించాడు. కాని అధిక భాగం కుమారపాల కాలానిదే ఉంది. ఈ ఆలయం రుద్రమాల ఆలయాన్ని పోలి ఉంది. దీనికి గర్భగృహ, ప్రదక్షిణ, అంతరాళ, మండప, మూడు ప్రవేశ మార్గాలు ఉన్నాయి. జామ్ నగర్ జిల్లాలోని ఘుమ్లి లోని నవలేఖ దేవాలయం సోలంకుల దేవాలయాలు పతన దశను తెలుపుతుంది. ఇది క్రీ.శ. 13వ శతాబ్దానిది.

సోలంకుల కడపటి దేవాలయాలు చాల వరకు జైన మత సంబంధమైనవి. ఇవి సౌరాష్ట్రలోని శత్రుంజయ, గిర్నార్ పర్వతాల్లో ఉన్నాయి. ఇవి పలుమార్లు పునరుద్ధరించుటచే వాటి తొలి రూపాలు చాల వరకు అదృశ్యమైనాయి. కాని జైన మంత్రి వాస్తు పాలునిచే నిర్మింపబడ్డ జూనాఘుడ్‌లోని గిర్నార్ ప్రాంతాన గల మూడు గృహాల ఆధినాధ ఆలయం అద్భుత నిర్మాణం. కుమారపాలుని తరంగ ప్రాంతంలోని జైన దేవాలయం (పునర్మితమైనది), రాణక్‌పూర్ జైన ఆలయాలు ఆఖరు కాలానివి. గుజరాత్ - రాజస్థాన్ రీతుల వాస్తు కళ దాదాపు క్రీ.శ. 17 శతాబ్దం వరకు కొనసాగాయి.

27

# ఒరిస్సా దేవాలయాలు

ఒరిస్సా దేవాలయాలు క్రీ.శ. 7వ శతాబ్దం నుంచి 13వ శతాబ్దం మధ్య తూర్పు గాంగ రాజులచే నిర్మింపబడింది. కళింగ నగరం రాజధానిగా తూర్పు గాంగులు ఒరిస్సాను పాలించారు. వీరి దేవాలయాలు చాల వరకు పరిణితి దశకు చెందాయి. దక్షిణ భారత దేశమందు కాంచీ పురం దేవాలయాల నగరంగా పేరు పొందగా, ఒరిస్సా యందలి భువనేశ్వర్ ఇదే విధమైన ప్రాముఖ్యాన్ని పొందిఉంది. వీరి ఆలయాలు అధికంగా భువనేశ్వర్, పూరి, కోణార్కల్లో ఉన్నాయి.

ఒరిస్సా దేవాలయములందు, అధిష్టానాన్ని 'పభాగ' అనీ 'బరంద' అనీ విమానాన్ని 'గండి', 'శిఖరం, 'ఆమలక' అనీ స్థూపిని మస్తక ధ్వజము అను పేర్లతో పిలుస్తారు. ఒరిస్సా దేవాలయాలందు త్రిరథ, పంచరథ, సప్తరథ, నవరథాలకు చెందిన దేవాలయాలు ఉన్నాయి. వీటి విమానాలు కూడా కర్వెలీనియర్ ఆకారంలో ఉన్నాయి. అధిష్ఠాన విభాగం నందు ఏర్పడి ఉన్న రథ ప్రొజెక్షన్స్ శిఖరం వరకు కొనసాగి విమానం విభాగాలైన రాహాపగ అనురాహాపాగ, కోనికాపాగ రూపాలను పొంది ఉన్నాయి. విమాన తలాలను తెలుపుటకు కోనికాపాగ యందు భూమి ఆమలకలు నిర్మింపబడి ఉన్నాయి. గండి చుట్టూ అక్కడక్కడా బంధనలు(median bands) ఉన్నాయి.

ఒరిస్సా ఆలయాలు రేఖాదేవుల్, పిధదేవుల్, ఖాఖర దేవుల్ అను మూడు రీతులుగా ఉన్నాయి. గర్భగృహాపై రేఖాశిఖరం ఉన్నచో దానిని రేఖాదేవుల్ అంటారు. జగ్‌మోహన్ అనెడి మండపం పై పిధాలు (tiers) ఉన్నచో దానిని పిధదేవుల్ అంటారు. మలి ఒరిస్సా దేవాలయాల్లో ఈ మండపం ముందు నటమందిరం, భోగమండపం అనెడి రెండు నిర్మాణాలు నిర్మింపబడ్డాయి. ఖాఖర రీతి ఆలయాలు అరు మాత్రం భువనేశ్వర్‌లో ఉన్నాయి. ఇది దీర్ఘచతురస్రాకార నిర్మాణం. దీనిపై గజపృష్ఠ కప్పు ఉంది. ఒరిస్సా దేవాలయాలన్నీ చతురస్ర ప్లాను, స్తంభరహిత అంతర్భాగం, అలంకారయుత బహిర్భాగాలను కలిగి ఉన్నాయి. కుడ్యం, శిఖరాలు ఘన చతుర్రస్రాకారంలో కనపడతాయి. కాని శిఖరం పైన గల విభాగం మాత్రం గుండ్రముగా ఉండును. తొలి నిర్మాణాలు పరిమితమైన ఎత్తును, అదిమినట్లున్న శిఖరను కలిగి ఉండగా మలిదశ ఆలయాలు ఎత్తుగా ఆకర్షణీయంగా ఉన్నాయి.

## తొలిదశ దేవాలయాలు

### పరశురామేశ్వర దేవాలయం

ఒరిస్సా యందలి తొలి దశకు చెందిన దేవాలయాల్లో భువనేశ్వర్ యందలి పరశురామేశ్వర దేవాలయం ఒక అద్భుతమైంది. ఈ నాటికీ ఎటువంటి శిథిల దశ పొందక ఇది నిలచి ఉన్నది. ఇది సుమారు క్రీ.వ. 650 కాలానికి చెందినదని కె.సి పాణిగ్రాహి భావిస్తున్నారు. ఈ దేవాలయం త్రిరథ గర్భగృహ (లేక దివుల్), జగ్‌మోహన (లేక మండప) అను రెండు విభాగాలు ఉన్నాయి. ఇది త్రిరథ దేవాలయం. దీని 'పభాగ' మూడు విభాగాలు ఉన్నాయి. దేవాలయం మొత్తం 44 అడుగుల 42.80 మీ. ఎత్తు ఉంది. గర్భగృహ 20 చదరపు గజాలు కలిగి మొత్తం 11 దేవతా ప్రతిమలు కల దేవకోష్టాలను కలిగి ఉన్నది. దేవాలయం మొత్తం 44 అడుగుల 42.80 మీ. ఎత్తు ఉంది. గర్భగృహ 20 చదరపు గజాలు కలిగి మొత్తం 11 దేవతా ప్రతిమలు కల దేవకోష్టాలను కలిగి ఉన్నది. కోష్టాలలో విష్ణు, శివ, పార్వతి, అర్ధనారీశ్వర ఇంద్ర, యమ మొదలైన ముఖ్య వైపుల గంగ, యమున ప్రతిమలు ఉన్నాయి.

దీని జగ్‌మోహన విభాగం స్తంభాలు గల ఒక పెద్ద దీర్ఘచతురస్రాకారపు హాలు లాగ నిర్మించబడి ఉన్నది. దీని గోడలలోని రంధ్రాల కిటికీలు దేవాలయంల లోనికి వెలుగు, గాలిని ఇచ్చుచున్నాయి.

దేవాలయం యొక్క గర్భగృహ పై గల గండి (విమానం) చాల తక్కువ ఎత్తు కలో ఉంది. గర్భగృహ ఒక వైపు కొలతకు 3 రెట్లు ఎత్తుగా 'గండి' ఉంది. దేవాలయం నందలి దేకోష్టల ప్రాజెక్షన్ విభాగం శిఖరం కింద వరకు పొడిగింపబడి 'గండి' విభాగలో ఈ ప్రాజెక్షన్స్ పాగాలు అను పేర్లను పొంది ఉన్నాయి. ఈ పాగాలనే మనం, రాహా, అనురాహా , కోనికపాగలంటాం. కోనికాపాగలందు భూమి ఆమలకలు ఉన్నాయి. ప్రతి 'పాగ' విభాగంపై అనేక చతురస్రాకారపు డిజైన్లు ఒక దానిపై ఒకటి ఉన్నాయి. వీటిమధ్య భాగమందు పథకాలు ఉన్నాయి. వీటిలో అనేక దేవతా, మానవ శిల్పాలు ఉన్నాయి. కాని పరశురామేశ్వర దేవాలయ పాగాలు పరిణతి దశను పొందలేదు. దేవాలయం చుట్టూ ఒక పట్టీ లాగ కొనిన చిత్రాలు చెక్కబడి ఉన్నాయి. విమానం పైన గ్రీవ, ఆమలసారక (శిఖర) ఉన్నాయి. విమానం పై ఉన్న ఆమలక శిఖరం నాలుగు వైపుల సింహాల ఆధారాన్ని పొందుచున్నట్లుగా చూపబడి ఉంది. శిఖరంపై భాగంలో కలశం లేక 'ధ్వజ' అను విభాగం ఉన్నది. జగ్‌మోహన పైన ఏటవాలుగా గల మెట్లు వంటి పై కప్పు ఉంది. ఈ ఆలయం వెలుపలంతా అద్భుతమైన శిల్పాలుండగా లోపలి భాగం లో మాత్రం సాదాగా శిల్ప రహితంగా ఉంది.

### వైతాళ దేవాలయం

భువనేశ్వర్ లోని వైతాళ దేవాలయం సుమారు క్రీ.శ. 775 ప్రాంతమందు నిర్మించరని కొందరు భావించగా మరి కొందరు ఇది క్రీ.శ. 9వ శతాబ్దం నందు నిర్మించబడిందని అభిప్రాయ పడుతున్నారు. ఈ దేవాలయం చాముండికి అంకితం గావింపబడింది. ఈ దేవాలయం కొంతవరకు బౌద్ధ చైత్య ఆకారాన్ని పొంది ఉంది. దీర్ఘచతురస్రాకార గర్భగృహ, ఆయతాస్ర లేక ఖాఖర

శిఖరం కలిగి ఉన్నది. గంగూలి అను వాస్తు నిపుణుడు వైతాళ దేవాలయం మహాబలి పురమందలి భీమసేన, గణేశ రథాల పోలికలతో నిర్మించబడి ఉందని భావిస్తున్నాడు. వైతాళ అను ప్రాంతమందలి కాపాలికులు అను తెగ వారు వైతాళ లేక భేతాళ శక్తుల నుంచి వరాలు పొందుటకై పూజలు చేసేవారు. అట్టి సాంప్రదాయం వల్లనే ఈ దేవాలయానికి వైతాళ దేవాలయం అని పేరు వచ్చింది. కటక్ నందలి, జైపూర్ యందలి భౌమాకార వంశ రాజులు ఈ వైతాళ దేవాలయాన్ని నిర్మించారు. పరశురామేశ్వర దేవాలయం లాగ దీనికి కూడా దేవుల్ (గర్భగృహ), 'జగ్‌మోహన' అనేది విభాగాలు ఉన్నాయి. ఇది దీర్ఘచతురస్రాకారంలో నిర్మించబడి దీని నాలుగు మూలలందు చిన్న దేవతా గృహాలు నిర్మితమై ఉన్నాయి. ఈ విభాగంలో చిత్రాలు గాని రంధ్రాల కిటికీలు గాని లేవు. కాని 'జంఘ', 'గండి' విభాగాలపై అనేక చిత్రాలు రూపొందించబడి ఉన్నాయి. జంటల చిత్రాలు గల ఒక పట్టీ వంటి విభాగం దేవాలయం చుట్టూ ఉన్నది. 'జంఘ' విభాగమందలి కుడ్య స్తంభాల మధ్య భాగమందున్న కోష్టల యందు అనేక దేవతా ప్రతిమలు, దేవతా సంబంధం కాని ప్రతిమలు ఉన్నాయి. అటువంటి వాటిలో దుర్గ, అర్ధనారీశ్వర, మహిషమర్ధని శివపార్వతి, హరిహర మొదలైనవి ముఖ్యమైనవి. దేవాలయం ముందు భాగమందలి చైత్య డిజైన్ ముఖ భాగమందు 10 చేతులు గల నటరాజ ప్రతిమ ఉన్నది. దీని కింది భాగంలో సూర్యుని ప్రతిమ ఉంది. సూర్యుడు ఏడు అశ్వాల రథం పైన పోతున్నట్లు ఇతని కిరువైపుల ఉష, ప్రత్యూష ఉన్నట్లు రథాన్ని అరుణ నడుపుతున్నట్లు చూపబడి ఉంది.

గర్భగృహ లోపలి భాగమందు చాముండేశ్వరి ప్రతిమ ఉన్నది. అంతేగాక సప్తమాతృక లైన కౌముది, ఇంద్రాణి, బ్రాహ్మి మొదలైన వారిని తామర పుష్పంపై యోగ ముద్రలో ఉన్నట్లు చూపబడి ఉన్నది. సప్తమాతృకలే గాక ధ్యాన బుద్ధుని పైన అమోఘసిద్ధుని చిత్రం, గణపతి చిత్రం గజాసుర సంహారమూర్తి చిత్రాలు కూడ ఉన్నాయి. ఈ దేవాలయం ఎరోటిక్ చిత్రాలకు కూడ ప్రసిద్ధి గాంచింది. భౌమకార రాజులు బౌద్ధమతం, తాంత్రిక్ తెగ, పశుపతి తెగల మిళితమైన ఒక మతాన్ని అనుసరించారు. కావున వారి దేవాలయాల్లో ఎరోటిక్ చిత్రాలు, అమురన్ జంటల చిత్రాలు ఎక్కువగా చిత్రించబడి ఉన్నాయి.

## ముక్తేశ్వర దేవాలయం

ఈ దేవాలయం అసలు పేరు సిద్దేశ్వర దేవాలయం. ఉత్తర భారత దేశం లోని ముఖ్యంగా భువనేశ్వర్ యందలి దేవాలయాల్లో ఇది అతి మనోహరమైంది. దీనిని క్రీ.శ. 250 యందు ఒరిస్సా రాజులు నిర్మించారని కొందరు, మరి కొందరు క్రీ.శ. 950 నందు నిర్మించబడిందని భావిస్తున్నారు. గంగూలి అనునతడు ఈ దేవాలయాన్ని గూర్చి కింది వాక్యాల్లో పొగిడాడు.

"It is a dream realised in sand stone" ఈ దేవాలయం దేవుల్, మండప (porch) అను విభాగాలు కల్గి ఉంది. తోరణ ద్వారం గల ప్రాకారం మధ్య భాగంలో దేవాలయ నిర్మాణం చేయబడింది. 34 అ. ఎత్తు మాత్రమే కలిగి ఉన్న చిన్న దేవాలయంగా ఇది ఉన్నప్పటికి ఎక్కువ అందంగా రూపొందించబడింది. ఇందలి మండప విభాగం తరవాత కాలంలో ఒరిస్సా అలయాల్లో ఏర్పడ్డ జగ్‌మోహన విభాగానికి మార్గదర్శకమని చెప్పవచ్చును. దీని మండప గోడ యందు దేవాలయం లోనికి గాలి, వెలుతురు వచ్చుటకై రంధ్రాల కిటికీలు ఉన్నాయి.

దేవుల్ లేక గర్భగృహ చతురస్రాకారంలో ఉన్నది. ఎత్తైన ఒక వేదిక ఉంది. దీని అన్ని వైపులా గల కోష్ట యందు అనేక దేవతా విగ్రహాలు ఉన్నాయి. పభాగ (base) నందు పాద, కుంభ అను విభాగాలు ఉన్నాయి. గర్భగృహపై భాగంలో ఉన్న రేఖా శిఖర (cuvelenior) మందు రాహపాగ, అనురాహపాగ కోనికాపాగ, యందు భూమి అమలకలు ఉన్నాయి. పాగాల పై భాగాలపై చైత్యా డిజైన్స్ ఉన్నాయి. విమానంపై భాగంలో అమలక శిఖరం దానిపై ధ్వజ అను విభాగాలు అత్యద్భుతంగా రూపొందించబడి ఉన్నాయి. మండప విభాగంపై భాగంలో పిదదేవుల్ (steppedroof) విమానం ఉంది. మండప లోపలి గోడల యందు అందమైన అలసకన్యల (నాయికలు) చిత్రాలు ఉన్నాయి. ఒరిస్సా చిత్రకళలో ఈ చిత్రాలు అద్భుతమైనవిగా చెప్పబడుతున్నాయి. ఈ దేవాలయం నందలి గణపతి, అతని వాహనం కలిగి ఉన్నట్లు, సప్త మాతృకలు ఒక శిశువుని తీసుకొని వెళ్లుతున్నట్లు చూపబడ్డాయి. ఇవి అతి మనోహరంగా ఉన్నాయి. మండప (జగమోహన) పై కప్పు విభాగమందు ఒరిస్సా చిత్రకళలోని అద్భుతమని చెప్పదగ్గ శిల్పాలున్నాయి. ఈ పై కప్పుపై శివ సప్త మాతృకలు, కార్తికేయ, గణపతి, వీరభద్ర, పార్వతి, నాగ, నాగీణుల శిల్పాలు మొదలైనవి ఉన్నాయి. ఫెర్గూసన్ అనునతడు "It is the gem of the orissan architecture" అని ఈ దేవాలయాన్ని గూర్చి అభిప్రాయపడుతున్నాడు. రాజేంద్రలాల్ మిత్ర అనునతడు "It is the handsomest of the Orissan temples, a charming epitome of the perfection of Orissan architecture" అన్నారు.

మలిదశకు చెందిన ఒరిస్సా దేవాలయాలు క్రీ.శ. 11వ. శతాబ్దం నుంచి 13వ శతాబ్ద మధ్య కాలానికి చెందినట్టివి. ఈ దశకు చెందిన వాటిలో రాజారాణి, లింగరాజ్, జగన్నాథ, కోణార్క్ దేవాలయాలు ముఖ్యమైనవి.

తొలి దశకు చెందిన ఒరిస్సా దేవాలయాల పభాగ ఎత్తు తక్కువగా ఉండగా మలిదశ దేవాలయాల పభాగ ఎత్తు ఎక్కువగా పెంచడం జరగింది. అంతేగాక పభాగమందలి విభాగాల సంఖ్య కూడ ఈ కాలమందు పెరిగింది.

జంఘ (కుడ్యం) ఎత్తు తొలిదశల కాలం కన్ననూ పెంచబడుటయే గాక 'తలజంఘా' 'ఉపరజంఘా' అను రెండు విభాగాలుగా కుడ్యం ఏర్పరచడే జరిగింది. ఈ రెండు విభాగాల మధ్య భాగమందు బంధర (band) లేక ఒక పట్టి వంటి విభాగం ఏర్పరచటం జరిగింది.
ఈ కాలానికి చెందిన 'గండి' లేక విమానం ఎత్తు అత్యధికంగా పెంచబడింది. తొలి దశ కాలంలో విమానం గర్భగృహ గోడ వెడల్పునలకు 3 రెట్లు ఎత్తుగా ఉండేది. కాని ఈ కాలమందు క్రమంగా 1:4, 1:5, 1:7 నిష్పత్తిలో విమానం ఎత్తు పెరగసాగింది.

దేవాలయ ముఖ్య విమానాలందు ఈ మలిదశలో, 'అంగశిఖరము' అనేవి రూపొందించే విమానం ఏర్పడింది. ఇటువంటి అంగ శిఖరాలు భువనేశ్వర్ యందలి రాజారాణి దేవాలయ శిఖరమందు ఉన్నాయి. ఈ విధానాన్ని మధ్య భారతదేశం, పశ్చిమ భారతదేశ మందలి వాస్తు నిపుణులు తమ నిర్మాణాల్లో అమలు పరచసాగారు. విమానం ప్రతివైపున గజసింహ ప్రతిమలను

ఏర్పరచెడి విధానం కూడా ఈ కాలమందు ఉండేది.

విమానంపై భాగంలో ఉన్న ఆమలక శిఖరం కింద పడకుండ కాపాడుతున్నట్లు దాని నాలుగు వైపుల దేవుల్ .నాగిణుల ప్రతిమలు ఉన్నాయి.

తొలిదశ ఒరిస్సా దేవాలయాలు అమ్ల శిఖరం పై ఆయా దేవాలయాల యందలి దేవుల్ సంబంధమైన ఝుండా లేక ధ్వజం ఉండేది.

ఈ కాలమందు 'జగ్మోహన' 'నాట్యమండప', 'భోగమండప'ముల విమానాలు 'పిద' (pidha stepped) తెగకు చెందినవిగా ఉన్నాయి.

**రాజారాణి దేవాలయం**

భువనేశ్వర్ యందలి దేవాలయాల పేర్లు చాలా వరకు ఈశ్వర అను భేదంలో అంతమగుచుండగా ఈ దేవాలయానికి అట్టి పద్ధతి లేదు. ప్రస్తుతం ఇందు దేవతా ప్రతిమ లేదు. ఈ దేవాలయం పేరును గూర్చి చరిత్రకారుల్లో గొప్ప వివాదముంది. ఒరిస్సా రాజులు, రాణులు ఈ ప్రాంతానికి విహారానికై వచ్చే వారని దాని వల్ల ఈ పేరు వచ్చిందని కొందరి అభిప్రాయం. కాని రాజుల విహార ప్రాంతమైనచో వారి ప్రత్యేక భవనాలు, భవనపు శాలలు మొదలగునవి ఇచట లేకుండుటచే ఈ దేవాలయం యొక్క పేరు పై విధంగా రాలేదని మరికొందరి అభిప్రాయం. గర్భగృహ విభాగం పురుషత్వాన్ని, జగ్మోహన విభాగం స్త్రీత్వాన్ని కళాత్మకమందు కలిగి ఉన్నందున దీనికి ఈ పేరు వచ్చిందని మరి కొందరి అభిప్రాయం. పాణిగ్రాహి అనునతడు ఈ దేవాలయం రాజరాణీయ అని పిలువబడు పసుపుపచ్చ ఇసుకరాయి (yellow sand stone)తో నిర్మించబడింది. కావున దీనికి ఈ పేరు వచ్చిందని భావిస్తున్నారు. ఈ దేవాలయం వైష్ణవ దేవాలయమని, శైవ దేవాలయమని వాదించుట కూడ ఉన్నది. పాణిగ్రాహి ఇది శైవ దేవాలయమని అనేక ఆధారాలతో నిర్ణయించినాడు.

ఈ దేవాలయం పంచరథ పద్ధతిలో నిర్మించబడి, గర్భగృహ, జగ్మోహన అను విభాగాలతో ఉంది. జగ్మోహన ద్వారానికిరువైపుల శైవ సంబంధమైన ద్వారపాలకులైన చండ, ప్రచండ అను వారు ఉన్నారు. ఈ ద్వారం కుడివైపున ద్వారపాలకుడు ఒక చేతి యందు త్రిశూలాన్ని పైకి ఎత్తుకొని ఉన్నట్లు మరి యొక చేతిలోని, త్రిశూలం భూమిపై ఆనించి ఉన్నట్లు చూపబడి ఉన్నాడు. ఇతడు పుర్రెలను హారంగా ధరించి ఉన్నాడు. జగ్మోహన ద్వారంపై భాగంలో లింటెల్ పైన యోగ ముద్రలో ఉన్న ఆశీన లకులీశుని శిల్పముంది. దేవాలయ ముఖభాగమందు శివపార్వతులు నృత్యం చేయుచున్న మూడు శిల్పాలు రూపొందించబడి ఉన్నాయి. గర్భగృహ పై భాగంలో ఉన్న విమానంనందు అంగ శిఖరాలు చూపబడి ఉన్నాయి. విమానం రేఖా (curvelenor) తెగకు చెందింది కాగా జగ్మోహన విమానం 'పిద' (pidha) తెగకు చెందింది. గర్భగృహ విమానం ఏడు తలాలు కలిగి ఉన్నట్లు అందలి భూమి అమలకులు తెలుపుచున్నాయి. ఈ ఆలయం క్రీ.శ. 11వ శతాబ్దంలో నిర్మించబడింది.

## లింగరాజ్ దేవాలయం

లింగరాజు దేవాలయం క్రీ.శ. 1000 ప్రాంతమందు నిర్మించబడిందని, క్రీ.శ. 1100 ప్రాంతమందు నిర్మించబడిందని రెండు వాదనలున్నాయి. కాని పాణిగ్రాహి ఈ దేవాలయం క్రీ.శ. 1060 ప్రాంతానికి చెందినదని అభిప్రాయపడుచున్నాడు. దక్షిణ భారతదేశంలోని తంజావూరు నందలి రాజరాజ చోళునిచే నిర్మింపబడ్డ బృహదీశ్వర దేవాలయం లాగ ఒరిస్సా యందు లింగరాజ్ దేవాలయం ప్రాముఖ్యమైనది. బృహదీశ్వర దేవాలయ విమానం లాగ దీని విమానం కూడ చాలా ఎత్తైంది. దీని ఎత్తు 180 (36.50 మీటర్లు ఆలయం ఎత్తు) అడుగుల కన్నా ఎక్కువగా ఉన్నది. ఈ విమానాన్ని అన్ని వైపుల నుంచి సుమారు 10 మైళ్ళ దూరం నుంచి చూడవచ్చు. ఈ దేవాలయం ఒక ప్రాంగణం మధ్య భాగమందు నిర్మించబడి ఉన్నది. దీని ప్రాకారం యొక్క ఉత్తర, దక్షిణ, పశ్చిమ విభాగాలందు ద్వారాలు ఉన్నాయి. ఈ దేవాలయంలో దేవుల్ (గర్భగృహ), జగ్‌మోహన (అంతరాళ), నాట్యమండప, భోగమండప అను విభాగాలను కలిగి ఉన్నది.

నాట్యమండప,.భోగమండపాలు దేవాలయ నిర్మాణ కాలమందే నిర్మింపబడలేదు. తరువాత కాలంలో వాటి నిర్మాణం జరిగింది. ముఖ్యదేవాలయమందు వాడబడిన రాళ్ళను, నాట్యమండప,, భోగలయ మందు వాడబడిన రాళ్ళను, నాట్యమండప, భోగ మండప విభాగాలందు వాడబడిన రాళ్ళ తేడాను బట్టి కూడ నాట్య, భోగ మండపాలు ముఖ్యదేవాలయం నిర్మాణం తరువాత కొంతకాలానికి కట్టబడినవని చెప్పవచ్చును.

గర్భగృహ భాగమందు ప్రతి వైపున రెండు ప్రొజెక్షన్స్ బేన్, గోడ విభాగమందు ఏర్పరచబడి ఈ దేవాలయం పంచరథ దేవాలయంగా చెప్పబడుచున్నది. పై భాగమందు 5 విడి భాగాలు ఉన్నాయి. జంఘ రెండు విభాగాలుగా రూపొందించబడి కింది విభాగం తలజంఘయని, పై విభాగం ఉపరి జంఘమని పిలువ బడుచున్నది. జంఘా కింది విభాగమందు అనేక దేవకోష్టలు ఉన్నాయి. వీటి యందు అనేక దేవతా ప్రతిమలు ప్రతిష్ఠింపబడి వాటి కిరువైపుల సింహాల ప్రతిమల నిర్మాణం చేయబడింది. జంఘపై విభాగమందు గల కోష్టల యందు అనేక స్త్రీ ప్రతిమలు ఉన్నాయి. జంఘపై భాగంలో గల 'బంధర' లేక కపోత 3 విభాగాలను కలిగి ఉన్నది. గర్భగృహపై భాగంలో ఉన్న విమానం రాహ, అనురాహ, కోనికా పాగలు గల విమానాన్ని కలిగి ఉన్నది. కోనికా పాగల యందు భూమి ఆమలకలు ఉన్నాయి. ఇవి విమానం యొక్క పది తలాలను తెలుపుచున్నాయి. విమానంపై అమ్ల శిఖరం, దానిపై ధ్వజం ఉన్నాయి. శిఖరాన్ని దోపీఛ సింహాలు రక్షించుచున్నాయి.

దీని జగ్‌మోహన కూడ పంచరథ విమానంలో నిర్మించబడింది. ఇది సుమారు 100 అ. ఎత్తు ఉన్నది. దీనిపై 'పిఢ' విమానం ఉన్నది. ఈ విమానం పై భాగమంతయు అనేక చిత్రాలు చెక్కబడి ఉన్నాయి. పిఢ విమానంపై గ్రీవ, అమ్ల శిల, కపురి, కలశ అనేడి విభాగాలు ఒక దానిపై మరొకటి ఉన్నాయి. నాట్యమండప, భోగమందిరం విమానంలో కూడా ఇదే విధంగా ఉన్నవి. భువనేశ్వర్ యందలి ఈ దేవాలయం ఖజరహో యందలి ఖందర్య మహాదేవ

దేవాలయానికి సమకాలీనమైనదిగా చెప్పబడుచున్నది. ఇది పరిణితి దశకు చెందిన దేవాలయంగా చెప్పవచ్చును.

### జగన్నాథ దేవాలయం

పూరి యందలి జగన్నాథ దేవాలయం నిర్మాణమందు లింగరాజ దేవాలయం లాగ ఉనసది న్న నిర్మాణ పద్ధతిలో పరిణతి దశను చూపెడి దేవాలయాలలో ఇది ఒకటి. ఈ దేవాలయం చాలా ప్రాచీనమైనది. కళింగ ప్రాంతాన్ని పరిపాలించిన తూర్పు గాంగ రాజులు ఈ దేవాలయం పతన దశలో ఉండుట చూసి 11వ శతాబ్దమందు మరమ్మత్తులు చేశారు. ఈ దేవాలయము దేవుల్, జగ్‌మోహన, భోగమంటప అను విభాగాలున్నాయి. భోగమంటపాన్ని క్రీ.శ. 15వ శతాబ్దం నందు పురుషోత్తమ దేవుడు అను తూర్పు గాంగారాజు నిర్మించాడు. ఈ దేవాలయ ప్రాంగణమందు (18వ శతాబ్దమందు) మరాఠులు కోనార్క్ యందలి సూర్యదేవాలయ మందలి అరుణ స్తంభానిన తెచ్చి ఇచట నాటారు. ఈ స్తంభం 34 అ. ఎత్తు 16 ముఖాలు కలిగి పై భాగమందు ఫలక కలిగి ఉన్నది.

దేవుల్ విభాగమందలి అధిష్టానం (base) 5 అ. ఎత్తు ఉన్నది. ఈ దేవాలయం పంచరథ పద్ధతిలో నిర్మించబడింది. గర్భగృహ చుట్టూ గల కుడ్యం వెలుపలి ముఖ మందు బలరామ, కాణ్వ మొదలైన వారి ప్రతిమలు గల దేవకోష్టలు ఉన్నాయి. దేవుల్ యొక్క మూడు వైపుల వామన, వరాహ, నరసింహ, పిఢ దేవుల్ నిర్మాణాలున్నాయి. జగ్‌మోహన అధిష్టానం 6 అ. ఎత్తు ఉన్నది. దీనిపై భాగంలో విమానమునని. భోగమంటప కుడ్యభాగమందు అనేక దేవతా చిత్రాలు ఉన్నాయి. అట్టి వాటిలో ఐరావతాన్ని అధిష్టించి ఉనన ఇంద్రుడు, వృషభారూఢ మూర్తి ముఖ్యమైనవి.

### సూర్య దేవాలయం

కోణార్క యందలి సూర్యదేవాలయానికే Black Pagoda అని పేరు ఉన్నది. తూర్పు గాంగ రాజైన మొదటి నరసింహదేవుని కాలమందు నిర్మించబడింది. ఈ దేవాలయం ఒక పెద్ద రథం ఆకారంలో నిర్మించబడింది. ఈ దేవాలయం ఒక పెద్ద రథం ఆకారంలో నిర్మించబడి ఉన్నది. 12 జతల చక్రాలు గల రథం లాగ ఇది ఆకారం పొంది, దీనిని 7 అశ్వాలు లాగుచున్నట్లు నిర్మించబడింది. ఈ నిర్మాణమంతయు ఒక ప్రాకారం యొక్క మధ్య యున్న ప్రాంగణం తో నిర్మించబడి ఉన్నది. ఇది విమానం లేని గర్భగృహ లేక దేవుల్, జగ్‌మోహన, నటమండప అను విభాగాలను కలిగి ఉన్నది. దీని ప్రాంగణంలో ఉన్న అరుణ స్తంభమును మరాఠులు తీసుకొని వెళ్లి పూరి యందలి జగన్నాథ దేవాలయ ప్రాంగణంలో ప్రతిష్ఠింపజేశారు. విమానం లేని దేవుల్, జగ్‌మోహన రెండూ కలిపి సూర్యుని రథ ఆకారంలో ఉన్నాయి. వీటి రెంటికి ఒక రకమైన విభాగాలు కల 'పభాగ' ఉన్నది. పభాగ కింది భాగమందు అద్భుతంగా చెక్కబడి ఉన్న ఏనుగుల వరుస ఉన్నది. అధిష్టానంపైన ఒక దానిపై మరొకటి ఉన్నట్లు రెండు వరుసలు గా చూపబడి ఉన్న కుడ్య స్తంభాల మధ్య భాగమందు మిధున జంటల చిత్రాలు ఉన్నాయి. ఈ కుడ్య స్తంభాల వరుసల పై భాగమందు అశ్వారూఢుల చిత్రల వరుస

ఉన్నది. ఈ వరుస మధ్య భాగం ఆక్రమించినట్లుగా సూర్య రథం యొక్క అద్భుతమైన పెద్ద చక్రాలు ఉన్నాయి. ఈ చక్రాలు సుమారు 10 అడుగుల వృత్తం కలిగి ఉన్నాయి. ఇవి 8 అంగుళాల మందం కలిగి, 16 ఆకులు కలిగి ఉన్నాయి. ఈ చక్రాల ఇరుసు, ఆకులపైన అనేక చిత్రాలు చెక్కబడిక ఉన్నాయి. దేవుల్ పైన ప్రస్తుతం విమానం లేదు. తొలుత విమానం ఉండేదని తరువాత పతనమైందని కొందరి అభిప్రాయం.

దీని నిర్మాణం పూర్తి కాక మునుపు ఇది భూమిలోనికి క్రుంగినదని దాని వలన విమాన నిర్మాణం చేయకయే నరసింహదేవుడు వదలి వేశాడు. పెర్సి బ్రౌన్, మరి కొందరు భావించుచున్నారు. విమానానికి సంబంధించిన కొన్ని విభాగాలు దేవాలయ పరిసర ప్రాంతంలో ఉండుట బట్టి వీరు ఈ అభిప్రాయాన్ని చెప్పుచున్నారు. జగ్‌మోహ యొక్క పభాగ, ఎంఘల పై కప్పు లలో అనేక ఎరోటిక్ భంగిమలలో ఉన్న శిల్పాలున్నాయి. నాట్యమండప అద్భుతమైన నృత్య చిత్రాలు, సంగీత కారుల చిత్రాలు కలిగి ఉన్నది. దీని ముందు భాగమందు మెట్లకు ఇరువైపుల గజసింహ చిత్రాలు రెండు ఉన్నాయి. దేవాలయ నిర్మాణం పూర్తి గావించబడి ఉన్నచో ఇది మరింత అద్భుతమైన నిర్మాణంగా ప్రఖ్యాతి పొంది ఉండేది.

## ఒరిస్సా రీతి శిల్పకళ

క్రీ.శ. 7-8 శతాబ్దాల నాటి ఉదయగిరి, ఖండగిరి, రత్నగిరి, లలితగిరి ప్రాంతాలలోని జైన శిల్పాలు ఒరిస్సా (కళింగ) తొలిదశ వాస్తు శిల్పాల రీతిని తెలుపుచున్నాయి.

తూర్పు గాంగరాజుల భువనేశ్వర్, కోణార్క, పూరి వంటి ప్రాంతాలలో క్రీ.వ. 8-13 శతాబ్దాల మధ్య కాలంలో ఒరిస్సా (కళింగ) వాస్తు కళ పెద్ద స్థాయిలో వికసించింది. ఇవి మలిదశకు చెందినవిగా చెప్పవచ్చును. శిల్ప శాస్త్రాల నియమాలకు అనుగుణంగా కోణార్కలోని సూర్యప్రతిమ, కార్తికేయ, గంగాదేవి మహిషమర్ధని శిల్పాలు రూపొందించబడి ఉన్నాయి. కానీ ఇవి సంపూర్ణ కదలిక, గాంభీర్యత సంతరించుకొని ఉన్నాయి. అమాయకత్వ ఆనంద జీవనం అందంతో కూడిన శిల్పాలు కూడా వీరి శిల్పంలో కనపడతాయి. ధర్మార్ధ కామ మోక్షాలను దృష్టిలో ఉంచుకొని శిల్పాలు రూపొందించబడి ఉన్నాయి. కావుననే ఇచట మిధున శిల్పాలు ఉన్నాయి. పూరి, కోణార్కల శిల్పాలలో ఉన్నది. కాని ఇది sensions suggestiveness మాత్రం కాదు.

ముఖలింగం ప్రాంతంలో తూర్పు గాంగుల ముక్తేశ్వరాలయం మొదలైనవి ఉన్నాయి.

పరశురామేశ్వరాలయం తొలి ఒరిసా ఆలయాలలో అందమైనది. ఇచటి ప్రతి శిల్పమూ ఏదో సమాచార, సందేశాలను ఇస్తున్నది. ఈ ఆలయ జగ్‌మోహన మూడు వైపుల గల అధిష్ఠాన భాగమంతా కోష్టాలలో అనేక దేవతా శిల్పాలున్నాయి. వీటిలో విష్ణు, శివపార్వతులు, అష్టబజ నృత్య, అర్ధనారీశ్వర, ఇంద్ర, దిక్పాలకులు, సప్తమాతృకలు మొదలైనవి ముఖ్యమైనవి. ఉత్తర కుడ్య లోని కూడులో మహేశమూర్తి (త్రిమూర్తి) శిల్పమున్నది. ఎలుక వాహనం లేని గణేశ

శిల్పం అనేక చోట్ల ఉన్నది. దేవుల్ (గర్భగృహ) దక్షిణ కుడ్యం పై వరహావతార విష్ణు శిల్పమున్నది. ఇది ఉదయగిరి (భిల్సా వద్ద ) వరాహ గుహలోని శిల్పం లాగ ఉన్నది. శివునికి భిక్ష పెట్టుచున్న అన్నపూర్ణ, శివకళ్యాణం శిల్పాలు కూడా ఈ ఆలయంలో ఉన్నాయి.

ముక్తేశ్వరాలయంలో అనేక చిన్న పరిమాణాలు గల శిల్పాలున్నాయి. కిటికీల భాగంలోని కోతులు, ఒపిక లేని నాయిక వాసక సజ్జిక తన పతి రాకకై తలుపు వెనుకగా నిలుచొని గృహ సుఖ అను రామచిలుకతో మాట్లాడుచుండుట, పలు భంగిమలలోని నాగినీలు గంధాన్ని మూల్యం, ధూపం, శంఖ తీర్థం, మకుట మొదలగనవి ఇచ్చుట ఉన్నాయి.

రాజారాణి ఆలయంలో అందమైన వరుణ, అగ్ని, యమ, నైరుతి ఇతర దిక్పాలకులు, సురాసుందరీలు, నాగినీలు ఉన్నారు. నెమలి నృత్యాన్ని చేయుట, పాదం నుండి మంజీరను తొలగించుచున్న స్త్రీ శిల్పాలు కూడా ఉన్నాయి.

లింగరాజ్ ఆలయంలో అద్భుత శిల్పాలున్నాయి. ఏకశిలా గణేశ్, దేవి నాట్యగత్తెలు, మిధున శిల్పాలు ఇచటి ముఖ్యమైన శిల్పాలు. ప్రియునికై వేచి ఉన్న స్త్రీ, తన చెలికత్తెను ప్రశ్నలతో ముంచెత్తుచుండెడి శిల్పం కూడా ఉన్నది.

వితల ఆలయంలో దక్షిన కుడ్య దేవ కోష్ట మధ్యలో చతుర్భుజ దుర్గ ఉన్నది. పశ్చిమ కుడ్య దేవ కోష్ట మధ్యలో అర్ధ నారీశ్వర శిల్పముంది. ఉత్తర కుడ్య కోష్ట మధ్యలో మహిష మర్ధని ఉంది. ఆలయ విమాన భాగంలో అనేక దేవతా ప్రతిమలున్నాయి.

తూర్పు గాంగు శిల్పి చాతుర్యం క్రీ.శ. 13వ శతాబ్దపు కోణార్క ఆలయంలో తారాస్థాయికి చేరుకున్నది. ఇది వారి నిర్మాణాల్లో గొప్పది. దీని నిర్మాతయైన నరశింహుడు చోళ రాణి రాజ సుందరి వారసుడు. చోళుల దారాసూరం, చిదంబరలోని రాధారాణి శిల్పాన్ని ఇతడు ఈ ఆలయంలో ప్రవేశపెట్టాడు. ఆలయ కింది భాగంలో చక్రాలు, విమానాన్ని ఒక శిలా రధంగా రూపొందించి, దానిని 7 అశ్వాలు లాగుచున్నట్లు చేశాడు. ఈ విభాగాలన్నింటిపై అద్భుత శిల్పాలు చెక్కబడ్డాయి. కోణార్క ఆలయం ప్రతి భాగం వివరణాత్మక అలంకారాలతో నిండుకొని ఉన్నది. జగ్‌మోహన పై భాగంలో సంగీత శిల్పాలున్నాయి. పింక్ కలర్ ఇసుక రాయిలో చెక్కబడి మొరటైన రూపాలు వీరికి ఉన్నాయి. అక్కడక్కడా మృదువైన పచ్చరాళ్ళలో అద్భుత శిల్పాలున్నాయి. తూర్పు గాంగరాజు నరశింహుని గూర్చి తెలిపెడి చారిత్రక శిల్పాలు కూడా ఇచట ఉన్నాయి. ఒక శిల్పంలో ఇతడు బాణం వేయుచున్నట్లు చూపబడి ఉన్నాడు. మరొక శిల్పంలో ఇతని మత సహనం కనపడుతుంది. ఇందు ఇతడు శ్రీ జగన్నాధ, దుర్గల ముందున్నాడు. మరొక దానిలో సాహిత్య గోష్ఠిలో ఇతడున్నాడు. ఇంకొక దానిలో అంతఃపురంలో ఊయలలో ఆనందంగా కుటుంబ జీవనాన్ని గడిపే శిల్పరూపముంది. ఒక శిల్పంలో నరశింహుడు విదేశీ రాయబారిని ఆహ్వానించి బహుమతిని అందుకొనుట ఉంది. ఇలాంటి ఇంకా ఎన్నో శిల్పాలు ఇతనిని గూర్చి తెలుపుతున్నాయి. 13వ శతాబ్దపు సంస్కృతిని తెలిపే అనేక శిల్పాలు ఇచట ఉన్నాయి.

# 28

# భారతీయ - ముస్లీం వాస్తుశిల్ప రీతి

భారతదేశంలో ప్రవేశించిన మొదటి ముస్లింలు అరబ్బులు. వీరు భవనాలేవీ నిర్మించలేదు. కాని భారతీయ వాస్తు శిల్పుల చాతుర్యాన్ని మెచ్చుకొన్నారు. వీరి చాతుర్యాన్ని గమనించిన గజనీమహమ్మద్ అనేక మంది వాస్తు శిల్పులను తన గజనీకి తీసుకొని వెళ్ళి ప్రసిద్ధిగాంచిన మసీదును నిర్మింపజేశాడు. ఇతని తరవాత ఘోరీ మహమ్మద్, కుతుబుద్దీన్, అల్తమష్ (ఇల్‌టుట్మిష్)లు క్రీ.శ. 1193-1236 మధ్య భారతదేశాన్ని ఆక్రమించారు. కుతుబుద్దీన్, అల్తమష్‌ల కాలంలో అజ్మీరు నందలి మసీదు, ఢిల్లీలోని కుతుబ్ మసీదు, మినార్ నిర్మాణాలు, బదౌని లోని కొన్ని నిర్మాణాలు నిర్మించడం జరిగింది. వీటి నిర్మాణానికి హిందూ వాస్తు శిల్పులు నియమింపబడి నందున వీటి నిర్మాణ రీతిలో హిందూ వాస్తు రీతి ప్రభావం కనపడుతుంది. కుతుబ్ మినార్‌లో పదకొండు రంధ్రాల ఆర్చీలున్నాయి. కుతుబ్‌మినార్ నిర్మాణాన్ని కుతుబుద్దీన్ ప్రారంభించి మొదటి అంతస్తును మాత్రం పూర్తి చేశాడు. ఈ నిర్మాణాన్ని అల్తమష్ పూర్తి చేశాడు. కుతుబ్‌షా అనే ప్రసిద్ధిగాంచిన కుతుబుద్దీన్ (saint) పేరు మీదుగా ఇది నిర్మింపబడింది. ఇది సుమారు 242 అడుగుల ఎత్తుంది. ఫిరోజ్ తుగ్లక్ కాలంనే దీనిపై పిడుగు మెరుపు పడి కొంత దెబ్బతింది. కాబట్టి ఫిరోజ్ తుగ్లక్ పై అంతస్తును పడగొట్టి రెండు చిన్న అంతస్తులను నిర్మించాడు. క్రీ.శ. 1503లో ఈ పై అంతస్తులు సికందర్‌లోడిచే పునర్నిర్మించబడ్డాయి. అజ్మీర్‌నందు గల 'అఢైదింకాఝోన్‌పరా' ను కూడా కుతుబుద్దీన్ నిర్మించాడు. ఈ కాలపు నిర్మాణాల్లో బదౌనిలో అల్తమష్ నిర్మించిన హజ్‌ఇషాంషి, షాంషి ఈద్గా, ఢిల్లీ లోని జామి మసీద్ ముఖ్యమైనవి.

అల్లాఉద్దీన్ ఖిల్జీ కాలంలో కూడా అనేక కోటలు, భవనాలు నిర్మింపబడ్డాయి. సిరి కోట, హజార్ సితూన్ అంతఃపురం, అలైదర్వాజా, హౌజ్ అలాయ్, హజ్‌కిఖాన్ ఈతనిచే నిర్మింపబడ్డాయి. మంగోలుల దండయాత్రలు, రాజపుత్రులు తిరుగుబాట్లు వల్ల తుగ్లక్‌ల కాలంలోని నిర్మాణాలు సాదాగా, లావుపాటివిగా ఉన్నాయి. తుగ్లకాబాద్ లోని తుగ్లక్ షా సమాధి ఈ రీతికి ముఖ్య ఉదాహరణ. ఫిరోజ్‌షా తుగ్లక్ కాలంలో అనేక నగరాలు, అంతఃపురాలు, మసీదులు, ఉద్యానవనాలు, చెరువులు, తటాకాలు నిర్మింపబడ్డాయి. అనేక పాత భవనాలు పునర్నిర్మితమైనవి. ఇతడు ఫిరోజాబాద్ నగరాన్ని నిర్మించాడు. దీని శిథిలాలు నేటి షాజహానాబాద్ దగ్గరలో ఉన్నాయి. ఫతేహాబాద్, హిస్సార్ ఫిరోజా నగరాలను నిర్మించాడు. గోమతి నది ఒడ్డున మహమ్మద్ తుగ్లక్ జ్ఞాపకార్థం జాన్‌పూర్ నగర నిర్మాణాన్ని ప్రారంభించాడు.

అంబాల జిల్లాలోని తో[ప్రాలోను, మీరట్ జిల్లాలోను ఉన్న అశోక స్తంభాలను ఢిల్లీకి తరలించాడు.

షిరోజ్‌షా తరవాత ఇతని రాజ్యంలోని [ప్రాంతీయ రాజవంశాలు తన రీతిలో నిర్మాణాలు చేయటకు కారకుడైనాడు. జాన్‌పూర్ రాజుల నిర్మాణాలు భారతీయ ముస్లీం వాస్తు శిల్పరీతికి ముఖ్య ఉదాహరణలు. సుల్తాన్ ఇ[బహీం అతాలామసీదును హుసేన్ షా జామ్-ఇ-మసీద్‌ను నిర్మించారు. లాల్‌దర్వాజా మసీదు, ఖలీన్‌ముఖ్‌లిన్‌లు కూడా ఇదే రీతికి చెందాయి. గౌర్ పాలకులు కూడా అనేక నిర్మాణాలు చేశారు. హుసేన్ షా సమాధి, బంగారు మసీదులు, కదంగసూల్‌లను సుల్తాన్ న[సత్ షా నిర్మించాడు. సికందర్‌షా పండూరాలో నిర్మించిన అదీనా మసీదు [ప్రసిద్ధి గాంచింది. గుజరాత్‌లో పాలించిన అహమ్మద్‌షా అహమదాబాద్ నగరాన్ని నిర్మించాడు. అహమదాబాద్, కాంబే, చంపానీర్, మాండుల్లో పలురకాల నిర్మాణాలు చేయబడ్డాయి. మాండులో జామి - ఇ - మసీద్ హిందోలా మహల్, జహాజ్‌మహల్, హుషాంగ్ నమాధి బాజ్‌బహదూర్, రూపమతి రాజభవనాలు ఉన్నాయి. దక్కన్ [ప్రాంతంలోని బహమనీ సుల్తానులు, విజయనగర రాజులు కూడా ఈ రీతిలోనే పలు నిర్మాణాలు చేశారు. బహమనీ సుల్తానులు గుల్బర్గాలో జామిమసీదును, దౌలతాబాద్‌లో చాంద్‌మినార్‌ను, మహమ్మద్‌గవానీ కళాశాలను, గ్వాలియర్, నర్నాల, మాహూర్ కోటలను నిర్మించారు. గుల్బర్గాలో అలాద్దీన్ హసన్‌బహదూర్‌షా, దౌద్‌షా, ఘియాజ్ ఉద్దీన్, ఫిరోజ్‌షా మొదలగువారి సమాధులు ఉన్నాయి. బీదర్ నగరాన్ని అహమ్మద్‌షా నిర్మించాడు. మూడో మహమ్మద్‌షా కాలంలో నిర్మింపబడ్డ కోట, అహమ్మద్ షా వలి సమాధి, సోలమసీదు ఈ నగరంలో ఉన్నాయి. బీజపూర్ సుల్తాను మహమ్మద్ అదిల్‌షా సమాధి వీరి వాస్తు నిర్మాణాలకు ఉదాహరణ. ఈ సమాధినే గోల్‌గుంబజ్ అంటారు. విజయనగర రాజులు [ద్రవిడరీతి ఆలయాలనే కాక భారతీయ ముస్లీం రీతిలోని లోటస్‌మహల్, గజశాల, చం[ద్రగిరి మహల్ వంటి వాటిని కూడా నిర్మించారు.

# 29

# మొగలుల వాస్తు శిల్పం

మొఘలులకు పూర్వం సాదాగను, లావుగను, ఉన్న నిర్మాణాలకు భిన్నంగా మొగలుల కాలపు నిర్మాణాలు అలంకారాలతో మృదువుగా నాజూకుగా కనపడతాయి. మొగల్ నిర్మాణాల్లో పలు వాస్తు రీతుల ప్రభావం లేక మిశ్రమం కనపడుతుంది. భారతీయ, విదేశీయమైన రీతులతో కూడిన మిశ్రమ రీతిని మొగలులు అనుసరించారు. బాబరు మొదలు అక్బరు కాలం వరకు విదేశీ ప్రభావం అగుపడినప్పటికే అక్బరు తరవాతి వారి కాలంలో మొగల్ వాస్తు రీతి భారతీయతను సంతరించుకొనుట జరిగి విదేశీ ప్రభావాన్ని దాదాపు కోల్పోయింది.

మొగల్ రాజ్య స్థాపన చేసిన బాబర్ ఆగ్రా, సిక్రి, బయానా, ధోల్‌పూర్, గ్వాలియర్, పానిపట్టు సంభాల్ మొదలగు ప్రాంతాల్లో అనేక నిర్మాణాలు చేశాడు. వీటి నిర్మాణానికి సినాన్, కాన్‌స్టాంటినోపుల్ ప్రాంతాల నుంచి వాస్తు నిపుణులను పిలిపించాడు. కాని ఇతని నిర్మాణాలు చాలావరకు శిథిలమైపోయినవి. నేడు పానిపట్టు వద్ద గల కాబూల్‌బాంగ్‌లోని మసీదు, సంభాల్స్ లోని జామేమసీద్‌లు మాత్రం నిలచి ఉన్నాయి. బాబర్ కుమారుడు హుమాయూన్ చాలా వరకు సమస్యలతో పరిపాలించాడు. అందుకే పెద్దగా నిర్మాణాలు జరుగలేదు. ఇతని కాలపు మసీదు ఒకటి హిస్సార్ జిల్లాలోని ఫతేబాదులో ఉంది. హుమామయూన్‌ను తొలగించి కొంతకాలం పరిపాలించిన సూర్ వంశీయులు గొప్ప భవన నిర్మాతలు. పంజాబ్, రోటన్, మాన్‌కోట్ కోటలు వీరి నిర్మాణాలే. ఢిల్లీలోని పురాణఖ్విల (క్విలకోహ్నా), ససారంలోని సమాధి షేర్షాసూర్ కాలానివి. సూర్ వంశాన్ని తొలగించి హుమయూన్ తిరిగి అధికార స్థాపన చేశాడు. కాని కొలది కాలంలోనే మరణించాడు. ఇతని తరవాత ఇతని కుమారుడు అక్బర్ ఢిల్లీ చక్రవర్తయ్యాడు. ఇతడు అనేక నిర్మాణాలు చేపట్టాడు. ఇతని నిర్మాణాల్లో హిందూ ముస్లీం వాస్తు రీతుల మిశ్రమరీతి కనపడుతుంది. ఇతడు సర్వమత సమానత విధానాన్ని అనుసరించుటే ఇందుకు కారణం. ఆగ్రా కోటలోని జహంగీర్‌మహల్ ఇట్టి రీతికి ముఖ్య ఉదాహరణ. హుమయూన్ సమాధి అక్బర్ కాలపు తొలి నిర్మాణంగా చెప్పవచ్చు. ఇది ఎక్కువగా పర్షియన్ రీతిలో ఉంది. కాని భారతీయ ప్రభావాన్ని కూడా కలిగి ఉంది. అక్బర్ నిర్మాణాల్లో ఫతేపూర్ సిక్రిలోని రాజభవనాలు ముఖ్యమైనవి. షేక్‌సలీంచిష్టి జ్ఞాపకార్థం ఫతేపూర్ సిక్రి నగరాన్ని అక్బర్ నిర్మించాడు. ఇచటి నిర్మాణాలలో హిందూ వాస్తు రీతుల ప్రభావం స్పష్టంగా కనపడుతుంది. జామిమసీద్, బులంద్ దర్వాజా, బీర్బల్ గృహం, సోన్‌మ్లామకాన్ (అంబర్‌రాణిగృహం), టర్కీసుల్తాన్ గృహం, ఖ్వాబ్‌ఘా, దివానీ ఖాస్ నిర్మాణాలు ఫతేపూర్ సిక్రీలో ఉన్నాయి. భారతదేశంలోని అద్భుత నిర్మాణాల్లో షేక్‌సలీంచిష్టి సమాధి, సికంద్రాలోని సమాధి ముఖ్యమైనవి. ఆగ్రాకోట నిర్మాణాన్ని కూడా అక్బర్

ప్రారంభించాడు. దీనిలో దివానీఆమ్, దివానీఖాస్, జహంగీర్ మహల్ అను భవనాలను కూడా నిర్మించాడు. పై నిర్మాణాలలో బులంద్ దర్వాజా ఫతేపూర్ సిక్రికి అందాన్ని తెచ్చుచున్నది. ఇది 176 అడుగుల ఎత్తున్నది. ఫతేపూర్ సిక్రిలోని దివానీఖాస్ విభాగాన్నే ఇబదత్ ఖానా అంటారు. రాతిలోని అద్భుతమే ఫతేపూర్ సిక్రి అని కొందరి అభిప్రాయం.

అక్బర్ తరువాత మొగల్ చక్రవర్తయిన జహంగీర్ అక్బరుకు భిన్నమైన రీతిలో కళాపోషణ చేశాడు. కాని ఇతడు వాస్తుకన్నా చిత్రలేఖనానికి ప్రాధాన్యతను ఇచ్చాడు. కడకు తన తండ్రి సమాధికి domeను కూడా పూర్తి చేయలేదు. కాని ఇతని రాణి నూర్జహాన్ తన తండ్రి ఇత్మదుద్దౌలా జ్ఞాపకార్థం ఒక సమాధిని నిర్మింపజేసింది. ఇది పాలరాతి నిర్మాణం. నూర్జహాన్ లాహోర్ దగ్గరలో రావినది ఒడ్డున జహంగీర్ సమాధిని కూడా నిర్మింపజేసింది. షాజహాన్ కూడా జహంగీర్ జ్ఞాపకార్థం ఒక నిర్మాణం చేశాడు. జహంగీర్, నూర్జహాన్, అసఫ్ఖాన్ల సమాధులను రసపుత్రులు నాశనం చేశారు.

మొగల్ చక్రవర్తులలో షాజహాన్ గొప్ప వాస్తు శిల్ప కళాపోషకుడు. ఢిల్లీ కోటలోని దివానీఆమ్, దివానీ ఖాస్ నిర్మాణాలను, జామి మసీద్ (జుమ్మామసీద్), మోతీమసీద్, తాజ్ మహల్ లను నిర్మించినవాడు ఇతడే. దివానీఖాస్ భూలోక స్వర్గంగా నిపుణులు వర్ణించారు. షాజహాన్ నిర్మాణాలలో తాజ్ మహల్ ప్రపంచ ప్రసిద్ధి గాంచింది. ఇది పాలరాతి నిర్మాణం. తన భార్య అర్జుమంద్ బాను బేగం జ్ఞాపకార్థం దీనిని నిర్మించాడు. దీని నిర్మాణానికి షాజహాన్ పర్షియా, అరేబియా, టర్కీ, ఇటలీ మొదలగు ప్రాంతాలనుంచి నిపుణులను పిలిపించాడు. ఉస్తాద్ ఈశా నాయకత్వంలో దీని నిర్మాణం సాగినట్లు తెలియుచున్నది. దీనిని పూర్తి చేయుటకు 22 సంవత్సరాలు, 3 కోట్ల ధనం ఖర్చయినట్లు తెలియుచున్నది. షాజహాన్ నిర్మాణాలలో నెమలి సింహాసనం కూడా ముఖ్యమైనది. ఇది వజ్ర వైఢూర్యాలతో పొదగబడిన బంగారు సింహాసనం. దీనినే తరువాతి కాలంలో నాదిర్షా తన దండయాత్ర కాలంలో పర్షియాకు తరలించుకొని వెళ్ళాడు. ఇది శిథిలమై పోయి నేడు దీని ముక్కలతో చేయబడ్డ కుర్చీవంటిది టెహరాన్ మ్యూజియంలో ఉన్నది. షాజహాన్ తరువాత మొగల్ చక్రవర్తయిన ఔరంగజేబు వాస్తు శిల్ప కళలపై శ్రద్ధలేనివాడు. ఇతని తరువాతి వారు బలహీనులు. కావుననే షాజహాన్ తరువాత మొగల్ వాస్తురీతి ఆగిపోయిందని చెప్పవచ్చును. ఢిల్లీ కోటలోని చిన్న మసీదు, బెనారస్ మసీదు, లాహోర్ లోని బాద్ షాహి మసీదులు మాత్రమే ఔరంగజేబ్ కాలంలో నిర్మింపబడ్డాయి. మొగలుల కాలంలో బీజాపూర్, గోల్కొండ సుల్తానులు కూడా పలు నిర్మాణాలు చేశారు. బీజాపూర్ లోని ఒకటవ అదిల్ షా యొక్క జామి మసీదు, రెండవ అదిల్ షా సమాధి, రాజ భవనాలైన గగన్ మహల్, అసార్ మహల్ ఉన్నాయి. ఏడంతస్తుల సత్ మంజిల్, మిథారిమహల్ ద్వారాలు హిందూ, ముస్లిం వాస్తురీతిని తెలుపుచున్నాయి. గోల్కొండలో క్రీ.శ. 1625లో నిర్మించిన కులీ కుతుబ్ షా సమాధి వారి వాస్తు శిల్ప కళా నిదర్శనంగా చెప్పవచ్చును.

# 30

# ఆంగ్లేయుల పాలనాకాలపు వాస్తుశిల్పం

మొగలుల కాలంలో వాస్తు శిల్పకళలు తారా స్థాయికి చేరుకొన్నాయి. కాని వీరి పతనం తరవాత, ముఖ్యంగా ఔరంగజేబ్ మరణం, నాదిర్షా దండయాత్రల తరువాత వైభవోపేతమైన వీరి వాస్తు, శిల్పకళలు పతనమగుట ప్రారంభమయ్యినింది. మొగల్ వాస్తు శిల్పం పతనానికి రాజపోషణ లేక పోవుటే ముఖ్య కారణం. మొగలుల తరవాత అధికార స్థాపన చేసిన ఆంగ్లేయులు కళలపై శ్రద్ధ కనపరచలేదు. వ్యాపారులుగా వచ్చి అధికార స్థాపనకై ప్రయత్నించి వలసాధిపత్యాని ఏర్పరచుకొన్న వీరికి దేశాన్ని ఆర్థికంగా దేచుకోవడంలోనే శ్రద్ధ ఉండేది. మొఘలులు మొదలగు వారి లాగ భారతీయ స్రవంతిలో వీరు కలసి పోవుటకు బదులు ఉన్నత జాతీయతా భావంతో వలస పాలనా దృష్టితో పరిపాలించారు. కాని భారతీయ రాజులు, సంస్థానాధిపతులు మధ్యయుగపు వాస్తు శిల్ప కళలను పోషిస్తున్నారు. కాని కాలక్రమంలో వీరు కూడా పాశ్చాత్య వాస్తు శిల్ప రీతుల ప్రభావానికి గురయ్యారు. పారిశ్రామిక విప్లవం ద్వారా అనేక కళాఖండాలు యంత్రాల్లో పాశ్చాత్య దేశీయులు తయారు చేయటం కూడా ప్రారంభమగుట వలన తక్కువ ధరకు యంత్ర తయారీ కళాఖండాలు లభించసాగింది. దీంతో స్వదేశీ కళాకారులు ఉపాధి కోల్పోవుటే గాక తమ వృత్తులను వదులు కొనసాగారు. దీంతో స్వదేశీ కళ పతనమైంది. ఆంగ్ల ప్రభుత్వం పాశ్చాత్య కళనే ఆదరించటం వల్ల దేశమందు ఈ నూతన కళ వ్యాప్తి చెందసాగింది. ఈ రీతి భారతీయ వాస్తు శిల్ప రీతులపై గొప్ప ప్రభావాన్ని చూపింది. కాని భారతీయ ఆంగ్ల రీతుల మిశ్రమ కళ పూర్వపు వైభవోపేత కళారీతి కన్ననూ అధమ స్థాయికి చెందింది. ఆంగ్లేయుల కాలంలో రూపొందిన కళలో సాంకేతిక నైపుణ్య లోపం, కల్పనాశక్తి లోపం, పతన దశ పాశ్చాత్య ప్రభావాలు కనపడతాయి.

పాశ్చాత్య ప్రభావంతో కూడిన నిర్మాణాల్లో మేజర్ జనరల్ క్లాడ్ మార్టిన్ లక్నోలో కట్టించిన కాన్‌స్టాంటియా భవనం మొదటిదిగా చెప్పవచ్చు. ఇది కొంతవరకు ఔద్‌లోని పల్లాడియన్ వాస్తు రీతికి దగ్గరగా ఉన్నప్పటికీ పాశ్చాత్య ప్రభావాన్ని కలిగి ఉంది. క్రీ.శ. 18, 19 వ శతాబ్దాల్లో అనేక నిర్మాణాలు చేశారు. ఇవి పలు నగరాల్లో ఉన్నాయి. వ్యాపార అవసరాల రీత్యాను, పాలనా అవసరాల కొరకు, మత వ్యాప్తి కొరకు ఈ నిర్మాణాలు ప్రధానంగా చేయబడ్డాయి. వ్యాపార అవసరాల కొరకు నిర్మింపబడ్డ వాటిలో ఫోర్ట్ సెయింట్ జార్జ్, ఫోర్ట్ విలియం ఫోర్ట్ డేవిడ్ కోటలు ముఖ్యమైనవి. ఆంగ్లేయుల నిర్మాణాలు చాలా వరకు పాలనా అవసరాలకు నిర్మింపబడ్డ ప్రభుత్వ భవనాలే అధికం. ఇవి అధికంగా ఇంగ్లాండులోని నాటి వాస్తు శిల్పాల రీతిని కలిగి ఉన్నాయి. ఉదాహరణకు కలకత్తాలోని సెయింట్ జాన్స్ చర్చ్, గవర్నమెంట్ హౌస్, మొదటి దాన్ని 1787 లో నిర్మించారు. దీన్ని లెఫ్టినెంట్ ఆగ్ రూపొందించాడు. ఇది

ఇంగ్లాండులోని వాల్‌బ్రూక్ యందలి సెయింట్ స్టీఫెన్స్ చర్చిని పోలి ఉన్నది. రెండో దాన్ని 1802 లో నిర్మించారు. దీన్ని లార్డ్ వెల్లస్లీ, కెప్టెన్ చార్లెస్ వేయట్, బెంగాలు ఇంజనీర్ల కృషి మేరకు రూపొందింది. ఇది ఇంగ్లాండ్‌లోని డెర్బీషైర్ యందలి కెండెల్‌స్టన్ హాల్ లాగ ఉంది.

ఆంగ్లేయుల రీతిలో నిర్మాణాలు ఒకవైపు జరుగుచున్న కాలంలోనే పందొమ్మిదో శతాబ్ద మధ్య కాలంలోనే పందొమ్మిదవ శతాబ్ద మధ్యకాలంలో ఆంగ్ల వ్యతిరేక వాతావరణంలో భారతీయ వాస్తు రీతి పునర్వికాసం కొరకు ప్రయత్నం జరిగింది. కాని వీటిలో పాశ్చాత్య ప్రభావం మాత్రం పూర్తిగా పోలేదు. ఈ రీతిలో నిర్మాణాలు సాగించిన వారిలో F.S. గ్రౌసే, H. ఇర్విన్, సర్ స్వింటన్ జాకబ్, R.F చిషం, G. విటెట్ ముఖ్యులు. జాకబ్ పంజాబులో అనేక భవనాలు నిర్మించాడు. జైపూర్‌లోని మ్యూజియం భవనం రాజపుత్ర రీతితో కూడిన ఆధునిక రీతి భవంతి యని చెప్పవచ్చును. చిషం, ఇర్విన్‌లు మద్రాస్ ప్రాంతంలో హిందూ సరాసినిక్ రీతిని ప్రవేశపెట్టారు. పంజాబులో సర్దార్‌రాంసింగ్ సిక్కురీతిలో కూడిన భవంతులు నిర్మింపజేశారు. లాహోర్‌లో సెంట్రల్ మ్యూజియం, సెనేట్ హౌస్‌లు నిర్మింపబడ్డాయి. విటెట్ గేట్‌వే ఆఫ్ ఇండియా డిజైన్‌ను, బాంబేలోని ప్రిన్స్ ఆఫ్ వేల్స్ మ్యూజియం భవనాన్ని రూపొందిచాడు. పై భవనాలన్నీ భారతీయ వాస్తు రీతిని, ఆధునిక అవసరాలను తీర్చేది విధానాన్ని తెలుపుచున్నది. ఈ రీతి ఇరవయ్యవ శతాబ్దంలో మరింత వృద్ధి చెందింది. ఆంగ్లేయులు కలకత్తానుంచి తమ రాజధానిని ఢిల్లీకి మార్చాలని నిర్ణయించుకొన్న సందర్భంలో వారు ఢిల్లీలోని వాస్తు రీతులను అధ్యయనం చేశారు. ఈ వివరాలు గోర్డెన్ సాండర్సన్ " ఆర్కియాలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా" అను గ్రంథంలో ఉన్నాయి. 1906 లో కలకత్తాయందు విక్టోరియా మెమోరియల్ హాల్ నిర్మింపబడ్డాయి. ఇది 1921లో పూర్తయింది. దీన్ని సర్‌విలియం ఎమర్సన్ రూపొందించాడు. ఇది తాజ్‌మహల్‌కు వాడబడిన మక్రానాపాల రాతితో నిర్మింపబడింది. సర్ ఎడ్వార్డ్ ల్యూటైన్స్, సర్ ఎడ్వార్డ్ బేకర్‌లు డిజైన్ చేసిన ఢిల్లీ నగరం 1930 లో ప్రారంభించబడింది. ఇందలి నిర్మాణాలు భారతీయతతో కూడిన పాశ్చాత్య ఆధునిక ప్రభావం గల నిర్మాణాలుగా చెప్పవచ్చు. కాని బ్రిటిష్ వారి కాలపు నిర్మాణాలన్నీ వాస్తు శిల్ప పతన దశను తెలుపుతున్నాయి. ఈ పతనం ఒక విధంగా మొగలుల ఆఖరు దశలోనే ప్రారంభమైందని చెప్పవచ్చును. 1711లో ఔరంగజేబ్ కుమార్తె జీనత్ ఉన్నీసాబేగం ఢిల్లీలోని దర్యాగంజ్‌లో నిర్మించిన 'జీనత్‌ఉల్‌మసీద్', 1751లో నవాబ్ కుద్‌సియా బేగం ఢిల్లీలో నిర్మించిన 'సునేహరిమసీదు', మీర్జాముఖయ్యం అబ్దుల్ మన్సూర్‌ఖాన్ ఢిల్లీలో నిర్మించిన సఫ్దర్‌జంగ్ సమాధి ఈ పతన దశకు చెందినవిగా చెప్పవచ్చు.

వలసరాజ్య స్థానకులైన బ్రిటిష్ వారు, పతనమగుచున్న మొఘల్ రాజ కుటుంబీకులు నిర్మించినవే గాక పలు ప్రాంతాల్లోని రాజవంశీయులు, సంస్థానాధిపతులు, కూడా కట్టించిన భవనాలు అనేకం ఉన్నాయి. మొగల్ పతన దశ వాస్తు రీతిని ఇతర రీతుల మిశ్రమాన్ని ఇవి ఉన్నాయి.

మొగల్ రాజ్య పతనం తరవాత లక్నో రాజధానిగా ఔద్ రాజ్యం ఉద్భవించింది. వీరి కాలంలో మొగలుల వైభోవేపేత కళల అభివృద్ధికై ప్రయత్నమును జరిగినప్పటికి ఆర్థిక ఇబ్బందులు, ఊహా లోపాల వలన గొప్ప నిర్మాణాలు ఏర్పడలేదు. కాని మంచి ఇటుక నిర్మాణాలు, చిత్రలేఖనాలు రూపొందింపబడ్డాయి. ఔద్ రీతిలో రెండు తెగలు కనపడతాయి. మొదటి రీతివి మొఘల్ రీతిలో

మితిమీరిన అలంకారాలను కలిగి ఉన్నాయి. ఢిల్లీలోని సఫ్దర్‌జంగ్ సమాధి, ఇమామ్‌వాడా, రూమిదర్వాజా ఈ మొదటి రీతికి చెందినవిగా చెప్పవచ్చును. రెండో రీతివి పందొమ్మిదవ శతాబ్ది ఆరంభంలో రూపొందిపబడినవని చెప్పవచ్చును. వీటినే భారతీయతతో కూడిన 'పల్లాడియన్' రీతి నిర్మాణాలని పిలుస్తారు. ఈ కాలంలోనే 'కాన్‌స్టాంటియా' నిర్మింపబడింది. ఔద్ నవాబులు ఈ రీతిలో పలు నిర్మాణాలు చేశారు. ఇవి భారతీయ పాశ్చాత్య రీతులతో ఉన్నాయి. ఈ మిశ్రమ రీతి నిర్మాణాల ముఖ్యంగా నాసిరుద్దీన్ హైదర్ (1827-1837), వజీద్ అలీఖాన్‌ల కాలంలో రూపొందించబడ్డాయి. వీటిలో ఛత్తర్‌మంజిల్‌లు, సికందరాబాగ్ ద్వారం, కైజర్‌బాగ్‌లోని చౌలఖ దర్వాజా, కైజర్ బాగ్, రోషన్ వాలి కోఠి, బేగం కోఠి ముఖ్యమైనవి. ఇవన్నియూ భారతీయ పాశ్చాత్య రీతుల మిశ్రమ రీతితో నిర్మింపబడి ఉన్నాయి.

బెంగాల్ ప్రాంతంలో కూడా అనేక భవనాలు నిర్మింపబడ్డాయి. ఔరంగజేబ్ మరణం తరవాత ముర్షిదాబాద్ రాజధానిగా బెంగాల్ స్వతంత్రమయ్యింది. మొఘల్ వాస్తు శిల్ప ప్రభావం బెంగాల్ కళపై ఉండినప్పటికీ ప్రాంతీయమైన సాంప్రదాయకళపై ఉండినప్పటికీ ప్రాంతీయమైన సాంప్రదాయకళ ఎక్కువగా వాడుకలో ఉన్నది. మొఘల్ రీతిని అనుసరించుటకు చేసిన ప్రయత్నాలకు ముఖ్య ఉదాహరణ 1723లో ముర్షిదాబాద్ యందు నిర్మింపబడిన 'కత్రామసీదు' ముఖ్యమైనది.

పంజాబు నిర్మాణాల్లో కూడా మొఘల్ రీతి ప్రభావం కనపడుతుంది. కాని పంజాబు సిక్కుల మత నిర్మాణాలు మాత్రం కొంత స్వయం రీతిని కలిగి ఉన్నాయి. ఇట్టి వాటిలో స్వర్ణదేవాలయం ముఖ్యమైనది. ఇది అమృతసర్‌లో ఉన్నది. క్రీ.శ. 1764లో ఇది నిర్మించబడింది. ఒక పెద్ద తటాకం మధ్య ఇది నిర్మించబడి ఉన్నది. మొఘల్ రీతి ప్రభావం గల సిక్కు రీతికి ఇది ఒక ముఖ్య ఉదాహరణ.

రాజస్థాన్- వాస్తు శిల్ప రీతి పై కూడ మొగల్ రీతి గొప్ప ప్రభావాన్ని చూపింది. ఈ మొగల్ పతనానంతర రీతి రాజస్థాన్‌లోనే గాక మధ్యప్రదేశ్ వాస్తు శిల్పంపై కూడా ప్రభావం చూపింది. ఈ రసపుత్ర రీతి పదహారు, పదిహేడు శతాబ్దాల్లో నిర్మింపబడ్డ బికనీర్, జోద్‌పూర్, జైసాల్మీర్, ఉదయపూర్, ఒర్ఛ, దతియ, అంబర్‌లలోని రాజభవనాలో కనపడుతుంది. 18వ శతాబ్దంలో మహారాజాజైసింగ్ అందమైన జైపూర్ నగరాన్ని స్థాపించాడు. అంతేగాక భరత్‌పూర్; దిగ్ రాజభవనాలను నిర్మించాడు.

ఈ కాలంలో అనేక హిందూ దేవాలయాలు కూడా నిర్మింపబడ్డాయి. బెంగాల్‌లో సాంప్రదాయబద్ధ రీతిలో దేవాలయాల నిర్మాణం జరిగింది. బెంగాల్ దేవాలయాను ఛల, బాంగ్లా, రత్న, అష్టముఖ, దేవుల్, మఠ రీతులకు చెందినవిగా ఆరు విభాగాలుగా చేయవచ్చును. బుర్ద్వాన్ జిల్లాలోని గరుమ్ ప్రాంత దేవాలయం, బారానగర్, నటోర్ దేవాలయాలు బెంగాల్‌లోని ఆలయాలకు ముఖ్య ఉదాహరణలుగా చెప్పవచ్చును.

# ఆధార, ఉపయుక్త గ్రంథాలు


| | |
|---|---|
| Brown, Percy | Indian Architecture (Buddhist and Hindu periods), Bombay, 1959. |
| | Indian Architecture, The Islamic Period, Bombay, 1959. |
| Coomaraswamy, A.K. | The History of Indian and Indonesian Art. |
| Fergusson, James | The History of the Indian and Eastern Architecture, two volumes, New Delhi, 1967 |
| Soundara Rajan, K.V. | The Indian Temple Styles: The Personality of Hindu. Architecture, New Delhi, 1972 |
| | Architecture of the Early Hindu Temples of Andhra Pradesh, 1965 The Art of South India, Tamilnadu, Kerala, Delhi 1978. |
| Zimmer, H. | The Art of Indian Asia, two volumes, 1955 |
| Rama Rao, M. | The Early Chalukyan Temples of Andhra Desa, Hyderabad, 1965. |
| " | The Eastern chalkyan Tempkef of Andhra Desa, Hyderabad, 1964. |
| " | Select Kakatiya Temples, Tiru pathi Select Temples of Kalinga, |
| " | Select Temples of Andhradesa, Hyderabad,1965. |
| " | Temples of Kalilnga, |
| Srinivasan, K.R. | Temples of South India, New Delhi, 1985. |
| Krishna Deva | Temples of North India, New Delhi, 1985. |
| Craven, Roy C. | A Concise History of Indian Art New Yark, 1976. |
| Kameswara Rao, V. | Select Vijayanagara Temples of Rayalaseema, Hyderabad, 1976. |
| " | The Lepakshi Temple, Tirupati, 1982. |
| " | Temples in and around Tirupati, Tirupati, 1986 |
| ,, | లేపాక్షి దేవాలయం, తిరుపతి, 1987 |
| Gopala Reddy, Y | The Ghanapur Group of Temples, Hyderabad, 1985. |
| " | The Kakatiyan Temples, in Nagpur University Journal, Vol. xv. |
| Rea, A | The Pallava Architecture. |
| " | The Chalukyan Architecture. |
| Cousens, H. | The Chalukyan Architecture of the Kanarese Districts, Archaeological Survey of India, Vol XLII, Calcutta, 1926 |
| Frederic, Louis | Indian Temple Sculpture, London, 1959 |
| Kramarisch, S. | The Art of India, 1954. |
| " | The Hindu Temple, 1946. |
| Rowland, B. | Religious Art East and West, 1961. |
| " | The Art and Architecture of India 'Buddhist, Hindu, Jain, 1967 |
| Longhurst, A.H. | Pallava Architecture, Memoirs of the Archaeological Survey of India, No. 17,33,40. |
| Sarasvati, S.K. | A Survey of Indian Sculpture, New Delhi, 1975. |
| Fergusson J.&BurgessJ. | Cave Temples of India |

| | |
|---|---|
| D. Subramanyam Reddy | The Sculptural Wealth at Mallam, Nellore, 1984. |
| " | ఆంధ్ర గుహాలయాలు, కావలి, 1988. |
| Shah, U.P. | Studies in Jaina Art, 1955. |
| Cunningham, Sir A. | The stupa of Barhut, 1879. |
| Ray, N.R. | Maurya and Sunga Art, 1945 |
| Barrett, D.E. | Sculptures from Amaravati in the British Museum, 1954 |
| Sivaramamurthi, C. | Amaravati Sculptures in the Madras Government Museum, Bulletin of the Madras Govt. Museum, m.s; iv, 1956 |
| Marshall, Sir John | The Buddhist Art of Gandhara, 1960 |
| Chandra, P. | A Guide to the Elephanta caves, 1962 |
| Gangoly, O.C. | The Art of the Rashtrakutas, 1958. |
| " | The Art of the Pallavas, 1957. |
| Balasubrahmanyam, S.R. | Early Chola Temples, 1971. |
| " | Middle Chola Temples, 1975 |
| " | Late Chola Temples, |
| Panigrahi, K.C. | Archaeological Remains at Bhuvaneswar, 1961 |
| Gupta, R.S.& Mahaja,B.D. | Ajanta, Ellora and Aurangabad Caves, Bombay, 1963 |
| Burgess, J. | Ellore Cave Temples and the Brahmanical and Jaina caves in Western India. |
| Marshall, Sir J.H. | Mohenjodaro and the Indus Civilization, 3 vols., LOndon, 1931. |
| Mackay, E. | The Indus Civilization, London, 1935. |
| Marshall, J.H. | Guide to Sanchi, Calcutta, 1918 |
| " | Monuments of Sanehi, 1913-14 |
| Beal, S. | Some Remarks on the Great Stupa Tope at Sanchi, 1870 |
| Samita Gupta | Architecture and the Raj: Western Deccan, 1700-1900. |
| Wanchop, S.R. | The Buddhist Cave Temples of India. |
| Meister, Michael W. | Encyclopaedia of Indian Temple Architecture: South India. |
| Havell, E.B. | Indian Architecture through the Ages. |
| Ahmad, M. | Khajuraho. |
| Ganguly, M.M | Orissa and HerRemains. |
| Moris Jan& Winchester Simon | Stones of Empire: The Buildings of the Raj. |
| Subramanian, K.S. | Buddhist Remains in South India and Early Andhra History. |
| Nath, R | Elements of Indian Art & Architecture. |
| Ratnagar, Shereen | Encounters: The Westerly Trase of the Harappa Civilization. |
| Ramanayya, N. Venkata | An Essay on the Origin of the South Indian Temple. |
| Hargreaves, H. | Gandhara Sculpture. |
| Sinha, B.C. | Glorious Art of the Sanga Age. |
| Longhurst, A.H. | Hampi Ruins. |
| Havell, E.B. | Indian Sculpture and Paintings. |
| Narasimhachar, R. | The Kesava Temple at Somnathapur. |
| " | The Kesava Temple of Belur. |
| Bishan Swarup | Konarka |
| Gupta, S.P. | The Roots of Indian Art. |

| | |
|---|---|
| Yazdani, Ghulam | The Temples at Palampet |
| Mahapatra, Ramesh Prasad | Udayagiri and Khandagiri Caves |
| Seely, John B. | The wonders of Elora |
| Basham, A.L. | A Cultural HIstory of India |
| O'Flaherty, G. Machell& C. Berkson | Elephefnta the cave of Siva.aj |
| Krishnamurthy, K. | The Gandhara Sculptures. |
| Prasad, Ishwari | A shorth History of Muslim rule in India, Allahabad, 1933. |
| Srivastava, A.L. | The Mughal Empire (1526-1803 A.P.), Agra, 1970. |
| " | Medieval Indian Culture, Agra, 1971. |
| Husain, Yusuf | Glimpses of Medieval Indian Culture, Bombay, 1962. |
| Sarkar, H.&Nainar S.P. | Amaravati, New Delhi, 1980 |
| Boothalingam | Movement in Stones: Early Chola Temples. |
| Raychoudhary, S.C. | Social, Cultural and Economic History of India (Modern Times), Delhi, 1987. |